

శ్రీ షత్స్వగదేవతాయై నమః

శ్రీ

# దేవీ భాగవతము

---

శా. శ్రీయున్ బార్వతియున్ సరస్వతియు స్వాశీర్లేశసంజాత లౌ
[illegible]గాత్రుల్ హరిరుద్రనీరజభవాద్యాదిత్యసంఘమ్ము లే
మాయాతీతకు నే జగజ్జనని కే మాతా స్వరూపాఢ్య కే
ధ్యేయప్రాభవ కట్టి శక్తి సతి భక్తిన్ గొల్తు మిష్టాప్తికిన్. ౧

వ. ఇట్లు, ౨

ఉ. అంబకు మ్రొక్కి మీఁద జలజాంబకులన్ గొని యాడి యంత హే
రంబుని సన్నుతించి గుణరాసుల మూర్తుల భార్యలన్ గృపా
లంబితచిత్తులన్ దగఁదలంచి యిహమ్మునఁ బరమ్ము నెంచి వం
శంబు తరింపఁజేయ ననిశంబు మనంబునఁ గాంచి యంతటన్. ౩

వ. అష్టాదశమహాపురాణమ్ముల యందుఁ బంచమం బగు దేవీ భాగవతంబు దెనిఁగింప నారంభించి శిష్టాచారంబగు కతన మామా వంశమ్ము లొక్కింత చెప్పుచు నాబాల్యప్రవర్తమానం బగు నస్మదీయోదంతంబు గొండొక విస్తరించెదము. ౪

తిరుపతిశాస్త్రి వంశము

సీ. సతతాగ్నిహోత్రదీక్షాశాలి ధన్యుఁ డం
తర్వేది యెవని ముత్తాతతాత
యెవని తాతకుఁ దాత యాశేషు విద్యలఁ
బాటవమ్మున మించు పానకాలు
చదువులైఁ దండ్రితో సముఁడు వేంకటజోగి
తతకీర్తి యెవ్వాని తాతతండ్రి
సాంగవేదాధ్యేత యనఘచర్యుండు సుం
దరరాముఁ డెవ్వాని తండ్రి తండ్రి
గీ. సర్వకర్మస్వతంత్రుండు శాస్త్రవేత్త
యనఘుఁడు త్రియామయుఁడు వేంకటావధాని
యెవనిజనకుండు శేషమ యెవని తల్లి
మూగు రన్న లెవనికిఁ దమ్ము డొకండు. ౫

సీ. హారితసగోత్రంబు యాజుషశాఖ ది
వాకరవంశ మెవ్వాని కలరు
నుప్పలూర్యన్వయుఁడు రామజోగి సి
ద్ధాంతివర్యుండు మాతామహుండు
జనకుండు శంకరశాస్త్రి సుబ్బమ తల్లి
సూర్యప్రకాశుండు సోదరుండు

గాఁ గలసాధ్వి వేంకటలక్ష్మి యనఘ చా
వలివంశజాత యెవ్వానితరుణి

గీ. గౌతమీమండలాంతరకలిత మెండ
గండియను గ్రామ మెవ్వాని కాఁపురమ్ము
నతఁడ వెలనాఁటివాఁడను వితతయశుఁడఁ
బేరు తిరుపతి పండితులార! నాకు * ౬

వేంకటశాస్త్రి వంశము

శా. భూమిన్ బ్రాహ్మణశాఖలం దొకటియై పొల్పొందు నెంతేని నా
రామద్రావిడశాఖ, దానఁ గవితారంభప్రియంభావుకం
బై మా వంశము వొల్చు యాజుషసుశాఖాంతర్గతంబై సదా
రామంబై తెగఁబెంపులేక తగు భారద్వాజగోత్రమ్మునన్. ౭

గీ. అందుఁబెక్కు మహామహు లవతరించి
పేరు గాంచిరి గుణరత్నపేటులనఁగ
దనరి రవ్వారిలోన ముత్తాత లగుచుఁ
గామయాన్నయనరసయ ఘనులు నాకు. ౮

*పాఠాంతరము.

సీ. హరిదశ్వపూజాపరాయణత్వప్రసం • గమువాఁడు తండ్రి వేంకటవధాని
అన్న మెన్నం డేరికైన లేదనని యు • త్తమురాలు తల్లి శేషమ సుసాధ్వి
ఆజన్మధర్మవిద్యధ్యాపకత్వ నిం • పగువాఁడు గురువు బ్రహ్మయ్యశాస్త్రి
గోచి పెట్టకమున్న కోమలకవిత చె • ప్పినవాఁడు సహపాఠి వేంకటకవి

తే. గీ. లలితగుణనిధి వేంకటలక్ష్మిపత్ని
కలితకవితావిలాసిని వలపుసాని
యుండు గ్రామంబు జల్లిలో నెండగండి
పేరు తిరుపతి పండితులార! నాకు ॥

వ. గౌతమీమండలమ్మునఁ దుల్యాతటమునం దనరు కడియ మ్మను గ్రామమ్మున వసించు మూర్తిత్రయమ్మునుం బోని యమ్మువ్వ రందు, ౯

సీ. పెద్దకవీంద్రుఁడై పేరుచెందినవాఁడు
పిన్నముత్తాత నరసన్నగారు
ప్రతి లేని సంపత్తిఁ బరిఢవిల్లినవాఁడు
తాత వెంకన్న విఖ్యాతికరుఁడు
కామయమనుమఁడు రామాంబకొమరుండు
తండ్రి కామయ్య సత్య నిరతుండు
తదనుగుణప్రవర్తన గల్గి వర్తించు
సాధ్వి చంద్రమ్మ మజ్జనని యేను

గీ. వేంకటేశుండ లక్ష్మి నా వెలఁది కులవి
ధమ్ములెల్లను బిన్నముత్తాత తనదు
గ్రంథముల విస్తరించె నాకన్న నింటి
పే రెఱుఁగఁ జెప్పెదను జెళ్ళపిళ్ళవారు. ౧౦

మ. అనఘుండై మదనాభిరామనృపకన్యాచిత్రచారిత్రమున్
జనసుత్యంబగు వేంకటేశ్వరవిలాసంబుఁ దగఁ జెప్పి రా
మున కర్పించి పరంబు గన్నమహితుం డుమ్మాటికిం గొల్తు నా
పినముత్తాత నగణ్యపుణ్యవిభవాబ్ధి న్నారసింహాఖ్యునిన్. ౧౧

వ. తిరుపతివేంకటేశ్వరుల మైన యీ మేము బాల్యమ్మునన పరదేవతా నిరుపాధికకరుణాభరణకారణంబగు కవితావైభవమ్మునం బ్రబలి చిటిపొటి పద్యమ్ముల వల్లికొనుచు వేర్వేఱ ననేకగ్రామమ్ముల ననేక గురుసాన్నిధ్యమ్మున సాహితీసంపాదనం బొనర్చికొని, ౧౨

గీ. తెలివియును దేటయును బిక్కబలిమి కలిగి
చెలఁగియును నిష్ఫలుండగు చీకుపగిది
డంబు మీఱియు హాస్యాస్పదంబ కాదె
శబ్దశాస్త్రవిహీనుని సరసకవిత. ౧౩

వ. అని యెంచికొని తచ్ఛాస్త్రాభ్యాససమాదృతాంతరులమై కడియెద్ద యనునొక చిఱుతగ్రామమ్మున వసియించు పతంజలింబోని వాని ననఘచరిత్రు నాపస్తంబసూత్రు లోహితసగోత్రుఁ బాపమాంబాగర్భశుక్తిముక్తాయమాను వీరనపుత్రు పుల్లయార్య వేంకటార్య దుర్గయార్య భ్రాతృత్రితయానుజన్ము నన్నపూర్ణాసతిచిత్తజన్ము, ౧౪

శా. స్వర్లీలారమణీమణీవినుతదివ్యధ్యానధన్యుండు ప్రా
తర్గ్లీసదనాభిరామహృదయాంత స్తంభితశ్రీశుఁ డం
తర్గ్లస్వీకృతవేదశాస్త్రవివిధార్థజ్ఞానసంధానుఁడా
చర్లబ్రహ్మసుధీశ్వరుల్ విని మదిన్ సంతోషమొంతేఁదగన్, ౧౫

వ. ప్రత్యేకంబ దైవవశమ్మునఁ దత్సన్నిధిం గలసి గురుకులవాసంబు సేయుచు సవయస్కత్వమ్మును సమానబుద్ధిమత్తయుం గలుగు కతన నిద్దఱమయ్యు నొక్కనిపగిది సహాధ్యాయిత్వమ్మునం బొదలుచు నైదువత్సరమ్ముల కా భాష్యంబుఁబఠించి, తన్మధ్యకాలంబునన కాళీసహస్రధాతురత్నాకరవీథీనాటకశుకరంభాసంవాదాదికమ్ము లగు సంస్కృత గ్రంథమ్ములు రచియించియుఁ, దత్తద్దూరదేశమ్ముల కరిగి శతావధానాష్టావధానాదికంబు లొనర్చి తత్తన్నృపమణుల చేఁ గనత్కనకభూషణనాగమంటపారోహణాది సమ్మానమ్ములును జయపత్రమ్ములును తత్సూచకంబులగు బంగరు బిరుదమ్ములును నంది, పదంపడి గురుసాన్నిధ్యమ్ము విడిచి, యాంధ్ర

కవితాకుతూహలం బుప్పతిలఁ దత్సాధకమ్ములగు భారతాదుల
నరసి శ్రవణానందం బను నొకకల్పితప్రబంధమ్ము రచియించి,
యంతం దనివి సనక యెద్దియేని యొక మహాపురాణా౦ బాంధ్రీక
రింప నుంకించు మాకు, ౧౭

క. యోగము మంచిదనుచు వే
తే గొణఁగఁగ నేల వ్యాసఋషిరచితంబై
యోగమ మనఁదగు దేవీ
భాగవతము తెలుఁగుసేయు భాగ్యము గలిగెన్. ౧౮

క. ఎన్ని పురాణమ్ములఁ దా
మన్నియు నాంధ్రీకరించి, యనుకంపను గా
కున్నన్ దీనిన్ విడుతురె ?
సన్నుయభక్త్యాదికవిజనమ్ములు మాకున్. ౧౯

వ. "ఇది వ్యాసుం డొనరింపలే దనియు శ్రీకృష్ణున్ బ్రశంసించు న
య్యదియేతత్కృత"మంద్రుఁగొంద; ఱెటులేనాఁగాక మాకేమి? భా
గ్యదమున్ ముక్తిద మంచు దీనిఁదెలుఁగుం గావింతు ముద్వద్ధయా
స్పదుల న్నాకుజబాదరాయణుల విశ్వస్తుత్యులన్ గొల్చుచున్.

ఉ. వ్యాసుఁ డొనర్చినట్టి యల భారత మన్యపురాణజాలమున్
రోసినమీఁద దీనిఁ దగ రోసితిరేనిఁ గవిత్వశైలి యొం
డై సరివచ్చు వేఱొకటి యన్యకృతం బని తోఁచుఁ గాని యా
వ్యాసునిశైలిగా దిది మహాకవివేద్యము గాక యుండునే. ౨౦

వ. అని యేతత్పురాణరత్నం బాంధ్రీకరించుచు నధునాతనభవిష్య
న్మహాకవులం గూర్చి, ౨౧

గీ. ఎచ్చటేనియుఁ దప్పుండు నేరికైన,
ధర్మమే ; భ్రాంతి పురుషుల ధర్మమగుటఁ
ఒటకు డెబ్బదిపదోకొండు తొటుకు లుండు
వారు వీరను నొకతీరువారు గారు. ౨౨

గీ. భారతాదులలో యతిభ్రంశమాది
యైనదోషమ్ములును గల ; నంతమాత్ర
వారిపాండిత్యమునకు లోపమ్ము రాదు;
భ్రాంతి గడవంగ శక్యమే ? బ్రహ్మకైన. ౨౩

క. కోవిదులమంచుఁ గొందఱు
దేవానాంప్రియులు దమకుఁ దెలియక గుణమున్
గావింతురు దోషముగా
భావించి కనంగ రాదె ! భారతమెల్లన్. ౨౪

గీ. కేవలగ్రామ్యపదముల సేవగించి
జనులు వాడెడిపదములు సమ్మతములు,
"కలవు లే" నని పెనఁగ శక్యంబె? భార
తాదులను లేని పదములు నవనిఁగలవె? ౨౫

క. వ్యాకరణ మొక్కత్రోవ, మ
హాకవు లొకత్రోవ, కోశ మఖిల మ్మొక త్రో
వై కనుపట్టెడి, నీ భా
షాకావ్యమ్ములను దఱచు చదివిన కొలఁదిన్. ౨౬

క. కేవలసంస్కృతమార్యా
ద్రావిడులును కేవలాంధ్రతత్పరులును గా

కేవార లుభయభాషా
కోవిదు లవ్వారు దీనిగురువులు జగతిన్. ౨౭

ఉ. భారత సారవేదు లగు పండితు లిందలి దోషముల్ గుణ
భారసి నిశ్చయింపఁ గల; రన్యుల కిందలి సుప్రయోగవా
గ్ధోరణు లన్యథాగతినిఁ దోఁపకమానవు; వేయునేల! సా
ధారణు లీకృతిందప్రమునఁ దప్పులు పట్టక యుండు టొప్పగున్. ౨౮

ఉ. భారత మాంధ్రసత్కవులపాలిఁటి వేదము దాన నుండు వా
గ్ధోరణులెట్టివైన నవి తోఁప్రియఁగ రానివి "తప్పు" లంచు సా
ధారణరీతిగాఁ గుకవితండము లాడు ప్రయోగజాల మా
భారతమందుఁ గన్పడెడిఁ బండితు లయ్యవి స్వీకరింపరే ? ౨౯

ఉ. తా నొకకట్టు చేసి యది దాఁటెను నన్నయ కొన్నిచోట్ల; నా
పైని స్వతంత్రుఁడై తనదుపాండితి చూపెను దిక్కయజ్వ ; యా
పై నొకకొంతసాహసము పన్ని రచించెను నెఱ్ఱనార్యుఁ ; డే
మైనను భారతమ్మునకు నంజలి సేయక తీర దేరికిన్. ౩౦

ఉ. మూఁగురియందు నన్నయ సమున్నతుఁడై కడు లక్షణంపుఁ బ్రో
వై గుదిగూర్చునేర్పుగలఁడై తగు ; నించుక కేమి యజ్వయున్
లోఁగక యాతనిం జెనయు; న్యూనుఁ డనం దగఁడెఱ్ఱనార్యుఁ డా
తే గడుసుందనమ్ము గలఁ డిర్వురకున్ సరివచ్చు నన్నిఁటన్. ౩౧

మ. "అసిధారావ్రత మూని తిక్కన కవిత్వారంభమును జేసె" నం
చు సడిన్ విందుమ కాని, నన్నయక యీస్తోత్రమ్ము చెల్లున్ గడున్
రసవంతమ్మగుఁగాక శబ్దములచంద మ్మెన్నియో దోసముల్
పొసఁగున్ నన్నయకన్నఁదిక్కనకు; నల్పుండౌనె? తన్మాత్రలోన్.

గీ. నన్నయకుఁదక్క నేఁటిదన్కను గవీంద్రు
లకట! శకటరేఫము యతులందుఁ బ్రాస
ములను రేఫమ్ముతోడను గలుపుచుందు
రెవనిశక్యము ? తిక్కనయే భ్రమించె. 33

ఉ. అప్పకవీంద్రుఁడున్ మఱియు నంతకుఁ బూర్వులు నవ్యులున్ గృతుల్
సెప్పిరి భారతమ్మున విశేషములం దిలకించి; వారి క
గ్గప్పి విశేషముల్ శతము గన్పడుచున్నవి భారతమ్మునం
దిప్పటికిన్; సముద్రమున నెవ్వఁడు పారము నిర్ణయించెడిన్? 34

చ. తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది గ్రాహ్యమంచుఁ బె
ద్దలు కొనియాడుభారతము తప్పన శక్యము గాదు ; దానిలోఁ
గలిగిన లక్ష్యభేదములు కాదన కాదృతి సంగ్రహించి ని
శ్చలగతి నిదం గూర్చెదరు చక్కఁగఁ బర్వతివేంకటేశ్వరుల్. 35

చ. ఒకటికి నొండుగ్రంథమున కుండు విరోధము దానికేమి ? వ్యా
సకృతములైన పొత్తములె సైఁప వొకం డొకండున్; మఱింత యే
టికి నొకపొత్తమేనియుఁ బఠించిన దానికి దానికే లగిం
పక పెఱరీతి గల్గు నది బ్రహ్మకునైన లగింప శక్యమే? 36

వ. అని నొక్కి వక్కాణించి. 37

క. నన్నయకుఁ దిక్కనకు నె
ఱ్ఱన్నకుఁ బోతన్నకున్ మహాకవులని మా
కన్న నుతిగన్న యితరుల
కు న్నతుల న్నించి వేఁడుకొందుము పేర్మిన్. 38

క. మును పోతన భాగవత
మ్మును దెనుఁ గొనరించి రాజముఖ్యుల కిడి త

ద్ధనమును గొనకే శిష్యరా
మున కిడి తత్కృపను భుక్తిముక్తులు గొనిరో. ౩౯

వ. కావున, ౪౦

కం. గురువే బ్రహ్మయు విష్ణువు
గురువే దైవంబు శివుఁడు గురువె పరుండౌ
పరమామ్నాయము చెప్పున
గురువునకే దీని నిచ్చికొందుము కృతిగా. ౪౧

వ. అదియునుంగాక, ౪౨

సీ. అ ఇ ఉణ్ మొదలు గాఁగ నాభాష్యపర్యంత
మే మహామహుఁడు మాకిచ్చె విద్య
కన్నసంతానమ్ముకన్న నెక్కుడుగాఁగ
నే దయాళుండు మమ్మాదరించె
పెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి
యే గుణనిధి మమ్ము బాగు చేసె
తిండికై యిల్లిల్లు దిరుగ నీయక యన్న
మే యన్నదాత మాకింట నిడియె

గీ. సకలదిగ్దేశరాజన్య సభలయందు
డంబు మీఱ శతావధానం బొనర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె
నట్టిగురునకుఁ గృతి యిచ్చు టర్హమ కద! ౪౩

వ. అని యమ్మహానుభావునకు నభ్యుదయపరంపరాభివృద్ధిగా నే
మాంధ్రీకరింపం బోవు దేవీభాగవతంబునకుఁ గథాక్రమంబు :—



## గ్రంథారంభము.

తే. గీ. సర్వచైతన్యరూపయు సర్వమునకు
నాదిభూతయు నగు విద్య యస్మదీయ
హృదయమున నిల్చి తను జపియించువాండ్ర
బుద్ధి ననయముఁ బ్రేరేపి ప్రోచుఁగాక. ౧

శా. సూతుం గన్గొని శౌనకుం డను; మునీశుం ద్వైనవ్యాసుండు ప్ర
ఖ్యాతిం జెందఁ బురాణముల్ మును రహస్యమ్ముల్ వెలింజేసి యెం
తో తాత్పర్యముతోడ నిన్ను మతిమంతుం గా విచారించి యా
యా తంత్రమ్ములు నూఱిపోసె భవదీయాదృష్ట మింతింతయే? ౨

క. ఈవఁట చెప్పెడివాఁడవు;
పావను లీమునులు వినెడివారఁట; క్షేత్రం
బీ విధికిఁ దగిన దగునఁట;
కేవల మిదియెల్ల మా సుకృత మనఁ దగదే? 3

ఉ. కావునఁ బుణ్యదం బగు నొకానొక మంచి పురాణసంహితన్
నీ వలనన్ గ్రహింపఁగ మునిప్రకరం బిది గోరుచున్న దీ
భూవలయమ్మునన్ దగినపుట్టువు పుట్టియు నిట్టిగోష్ఠికిన్
భావముఁ జొన్ప నేరని యభాగ్యులజన్మ మదేల కాల్పనే? ౪

గీ. జిహ్వ కెలమి షడ్రసముల చేతఁ దృప్తి
యగునటులు, గర్ణములకు దివ్యప్రభావ
భాగవతవాక్యపరిపాటివలనఁ గాక
కల్గునే ? తృప్తి వేరొండు కతలవలన. ౫

ఆ. వె. చెవులు లేనియట్టి చిలువలు సయితము
సౌఖ్య మనుచు శబ్దసరణి వినఁగఁ
జెవులు గలిగి వినని చెనఁటుల కర్ణరం
ధ్రముల కేమి ఫలము ? విమలచరిత ! ౬

క. కాన నోకానోక పుణ్యక
థానిగమము వినఁ గడంగెదము ; సజ్జను లే
దేని యుపాయాంతరముఁ
బూని కదా ? కాలనియతిఁ బుచ్చుట యెందుఁ ? ౭

వ. మఱియు మూర్ఖులు దుర్వ్యసనమ్ములం దవులుదురు ; పండితులు శాస్త్రచింతనమ్ములఁ బ్రవర్తింతురు; రట్టిశాస్త్రములు సత్త్వరజస్తమోరూపమ్ములును వాదప్రధానమ్ములును నర్థవాదమ్ములును నగాథంబులును నై యున్నవి. అందు వేదాంతంబు సాత్త్వికంబు, మీమాంస రాజసంబు, న్యాయంబు తామసంబు. ౮

క॥ మున్ను ప్రసంగవశమ్మున
నెన్నియొ సత్కథలు సెప్పునెడ భాగవతం
బున్నది యటంచుఁ జెప్పితి
వన్నా ! యద్దాని మాకు నానతి యీవే. ౯

క. విన్నారము మును నీవల
న న్నానాసంగతుల ననంతముగా నో

యన్నా! తృప్తిం జెందక
యున్నారము; దీనఁ దృప్తి నొనరింపఁగదే. ౧౦

గీ॥ అమృతపానమ్ముచేఁ దృప్తి నందనట్టి
యమరులునుబోలె నున్నార; మమృతపాన
మునఁ దటస్థముగాని యా ముక్తిపదము,
భాగవతకథామృతమునఁ బడయ వచ్చు. ౧౧

ఉ. జన్మము లెన్నియో నమృతసార నిమిత్త మొనర్చియుంటి; మా
జన్మము లిచ్చునట్టి ఫలసంపద స్వర్గము; యద్ది నిత్యమై
యున్నది కాదు; నిత్యమయి యొప్పెడిముక్తి నొసంగఁ జాలు న
త్యున్నత మైన భాగవతయుక్తులచేఁ దనియింపవే మమున్. ౧౨

క. వినిపింపుమయ్య మాకున్
మునులకు నిర్వ్యాజముగఁ బ్రమోదమునై నో
యనఘా! దీర్ఘాయుష్మ
త్తను గొని వర్ధిల్లుమయ్య తద్జ్ఞుల కరుణన్. ౧౩

వ. అని వినయమ్మునఁ బల్కు శౌనకుంగని సూతుండిట్లనియె. ౧౪

ఉ. నేనె మహాత్ముఁడన్, మఱియు నేనె కృతార్థుఁడ, నేనెపూజ్యుఁడన్,
నేనె మునీంద్రసమ్మతుఁడ, నేనె బుధేంద్రుఁడ, నుత్తమోత్తముం
డైన మహామునీశ్వరుఁడు వ్యాసుఁ డొనర్చిన యట్టి దీని మీ
కేను వచించువాఁడనఁట! యేమనుకొందును నాయదృష్టమున్.

శా. శ్రీవాణీధవముఖ్యనిర్జరశిరస్సేవ్యంబు మౌనీంద్రచి
త్తావాసంబు ముముక్షుయోగిజనకామ్యంబైన తత్పాదరా

జీవం బాత్మను బాదుకొల్పి, రసపుంజీభూతమై యొప్పు నీ
దేవీభాగవతంబు నాయెఱుంగు రీతి న్నీకు వాక్రుచ్చెదన్. ౧౩

సీ. ఏదేవి విద్యయం చెల్లవేదమ్ములు
తేపతేపకు సన్నుతించుచుండు
నేయమ్మ తన్నాశ్రయించు వారల సంసృ
తిక్లేశపాశంబుఁ దెరలఁ జేయు
నేతల్లి తనకునై చేతులొగ్గినవారి
చిత్తాంబుజములందుఁ జెలఁగియుండు
నేమాత సర్వమౌనీంద్రసంభావనా
పాత్రీకృతాంఘ్రియై ప్రబలుచుండు

గీ. నే జనని జగములనెల్ల సృష్టిఁజేసి
ప్రోచి సమయించుచుండు నా పుణ్యరాశి
యైన పరశక్తి కరుణాకటాక్షములను
జిలికి నను బుద్ధిమంతునిఁ జేయుఁగాత. ౧౪

చ. ప్రళయమునన్ విధాతృనకుఁ బంకజనాభునినాభి, వానికిన్
జిలువలఱేఁడు, నాతనికి నీరధియున్ శరణంబు; లట్టిచో
జలనిధి కాస్పదంబు పరశక్తియ కా యని నిశ్చయించి, యం
జలి ఘటియింతు సర్వమయశక్తిసమేతకు లోకమాతకున్. ౧౫

ఉ. యోగపునిద్ర నొప్పు పురుషోత్తము నాభిసరోజమందుఁ బెం
పౌ గతి నుండి ధాత పరమాతురుఁడై "జగదంబ! దేవి! నీ
వే గతి" యంచు నే జగదధీశ్వరికిం బ్రణమిల్లె నీ మహా
భాగవతమ్ము నా జననిపట్టునఁ దెల్పెద నాలకింపుఁడీ. ౧౬

## స్కంథ సంఖ్యా వివరము

క. ఈ దేవీభాగవతం,
బాదిపురాణములకెల్ల నత్యుత్తమ; మ
ష్టాదశసహస్రపద్యము
లాదియు నాతమ్ము దీప నారసి చూడన్. ౨౦

మఱియును బండ్రెండు స్కంధమ్ములును మూడువందల పదు నెన్మిది యధ్యాయమ్ములును గలిగి యొప్పుచుండు; నందుఁ బ్రథమ స్కంధమ్మునం దిరువదియు, ద్వితీయమ్మునఁ బండ్రెండును, దృతీయమ్మున ముప్పదియుఁ, జతుర్థమ్మునఁ బంచవింశతియుఁ, బంచమమ్మున ముప్పదియైదును, షష్ఠమ్మున ముప్పదియొకటియు, సప్తమమ్మున నలువదియు, నష్టమమ్మున నిరువదినాల్గును, నవమమ్మున నేఁబదియు, దశమమ్మునఁ బదమూఁడును, నేకాదశమ్మున నిరువది నాల్గును ద్వాదశమ్మునఁ బదునాల్గును, నధ్యాయమ్ములు గలవు. సర్గ ప్రతిసర్గ వంశ మన్వంతర వంశానుచరితమ్ములను నీపంచలక్షణమ్ములుం గలయది పురాణంబు నాఁబరగు, నిందు సత్వరజస్తమస్స్వరూపిణు లగు మహాలక్ష్మీ సరస్వతీ కాళికల జన్మప్రకారంబు సర్గమ్ము నాఁ బడు. పాలనోత్పత్తినాశమ్ములకై హరి విరించి రుద్రుల సముత్పత్తి ప్రతిసర్గమ్ము నాఁబడు. సూర్యచంద్రవంశోద్భవు లగు రాజులచరిత్రమ్ములును, హిరణ్యకశిప్వాదిరాక్షసుల జన్మప్రకారమ్మును వంశమ్ము నాఁబడు. స్వాయంభువాదిమనుకథా వర్ణనమ్మును వారల కాలనియమమ్మును మన్వంతరమ్ము నాఁబడు. వారల వంశానుక్రమణిక వంశానుచరితంబు నాఁబడు. సపాద లక్షగ్రంథయుక్తమ్మును వేదసమ్మితమ్మును నగు భారతం బితిహాసమ్ముగాని పురాణమ్ము గాదని చెప్ప సూతుం గాంచి శౌన

కుండు తత్తత్పురాణమ్ములును బద్యసంఖ్యయుఁ గర్తృవివేచన
మ్మును దెలుపు మని మఱియును, ౨౧

సీ. కలికాలభయసమాకలితులమై యున్న
మమ్ముఁ గాంచి విరించి మానస మగు
చక్ర మొం డిచ్చి "యీచక్రనేమికిని శై
థిల్య మెచ్చోట నాదేశ మతిప
విత్ర మచ్చోటఁ గలిభీతి లే" దని చెప్పి
చనియె నంతట నేము చక్రముఁ గొని
సకలదేశమ్ములు సంచార మొనరింప
నిచ్చోట నా నేమి విచ్చి పోయె

గీ. నది నిమిత్తమ్ముగా నైమిశాఖ్య మయ్యె
నయ్య! యీక్షేత్రరాజ మత్యంతపావ
నంబు యోగ్యతరంబు దివ్యంబు దానఁ
జేసికాదె? మే మిచట వసించుటయును. ౨౨

గీ. చేసినారము కలిభీతిఁజేసి మేము
జన్నములు పెక్కు పశుహింస సలుపకుండఁ
గృతయుగము వచ్చుదనుక నీ క్షేత్రమంద
పుణ్యగోష్ఠినిఁ గాలంబుఁ బుచ్చ వలయు. ౨౩

శా. వ్యాపారమ్ములులేవు మాకు; వినఁగా నాసక్తియున్ మెండు; నీ
వా? పాండిత్యము గల్గుపుణ్యుఁడ; వగణ్యం బైన మాపుణ్యరే
ఖాపారీణత లభ్యమైతివి; జగద్గణ్యంబు పుణ్యంబు సం
తాపధ్వాంతహారంబు భాగవతముల్ మాకుం గటాక్షింపవే!

ఆ. వె. వ్యాసమునికృతంబు సతిపవిత్రంబు మ
నోహరంబు పాపనోదనంబు
కామదంబు నైన కథ యొంత వినినను
జెవికిఁ దృప్తిగలుగు చెనఁటి కలఁడె! ౨౭

క. సకలగుణములకుఁ బాత్రం
బకలంకం బఘవినాశ మఖిలజగన్మా
తృకచిత్రచరిత్రం బో
పికఁ గొలఁదిఁ సూత! మాకు వినిపింపఁ గదే! ౨౮

క. అనిన విని సూతుఁడిట్లను
మునులారా! వినుఁడు వ్యాసమునిచంద్రుఁడు నా
కు నెఱిఁగించిన విధమున
వినిపించెద నా యెఱుంగు విధమున మీకున్. ౨౯

పురాణసంఖ్యాకథనము

వ. మాదిద్వయ బును భాదిద్వయమ్మును బాదిత్రయమ్మును వాది చతుష్టయమ్మును ననాషలింగకూర్మస్కాందములును గలసి పురాణమ్ములు పదునెన్మిది. అందు మాత్స్యమ్మున బదునాల్గువేలును, మార్కండేయమ్మునన్ దొమ్మిదివేలును, భవిష్యమ్మునన్ బదునాల్గువేల నైదువందలును, భాగవతమ్మునన్ బదునెన్మిది వేలును, బ్రహ్మపురాణమ్మునన్ బదివేలును, బ్రహ్మాండమ్మునన్ బన్నెండువేలును, బ్రహ్మకైవర్తమ్మునన్ బదునెన్మిది వేలును, వామనంబునన్ బదివేలును, వాయవ్యమ్మునన్ బదునాల్గువేల యాఱువందలును, వైష్ణవంబునన్ బదు మూఁడువేలును, నారదమ్మున నిరువదియైదువేలును, వారాహ

ి నిరువదినాల్గువేలును, నగ్నిపురాణమ్మునఁ బదియాఱు
ను, బాద్మమ్మున నేఁబదియైదువేలును, లింగమ్మునఁ బది
దువేలును, గారుడమ్మున నేకోనవింశతిసహస్రమ్ములును,
మ్మున సప్తదశసహస్రమ్ములును, స్కాందమ్మున నేకాశీతి
స్రమ్ములును గలవు. సనత్కుమారమును నారసింహమ్మును
యమ్మును శైవంబును దౌర్వాసనంబునుం గాపిలంబును
వంబును నౌశనసంబును వారుణంబును గాలికంబును సాంబ
సౌరంబును నాదిత్యంబును మాహేశ్వరంబును మారీచం
భార్గవంబును భాగవతంబును వాసిష్ఠంబు నను నివి యుప
ణంబులు. సాత్యవతేయుం డష్టాదశమహాపురాణమ్ముల
నుంచి పిదపం దదుపబృంహితం బగు భారతంబు రచియించె.
మన్వంతరమ్మునఁ బ్రతిద్వాపరయుగమ్మున నారాయణుండు
సస్వరూపమ్ముచే నల్పాయుష్కులును నల్పబుద్ధులు నగు
పురులకొఱకు వేదంబులు విభజించి స్త్రీశూద్రద్విజబంధువు
వేదమ్ములు శ్రవణార్హమ్ములుగామిం జేసి యాపురాణ
ములు రచియించుచుండు నని చెప్పి మఱియును, ౨౮

గీ. ఆఱు మన్వంతరములు మున్నరిగె నేడ
వది జరుగుచుండె నిదియ నైవస్వతంబు
ఇరువదియు నేడు జరిగె ద్వాపరయుగమ్ము
లిరువదియెనిమిదవ దిది యెఱుఁగుఁడయ్య. ౨౯

కం. ఇరువదియేడ్గురు వ్యాసులు
పురాణములు సేసి రిట్లు పూర్వం బన్న

ర్గురు వగు సాత్యవతేయుం
డిరువదియెన్మిదవవ్యాసుఁ డీక నిటమీఁదన్. 30

వ. ఇరువదితొమ్మిదవ ద్వాపరయుగమ్మున ద్రోణపుత్రుం డగు నశ్వత్థామ వ్యాసుండు కాఁగలఁ డని చెప్పు సూతుం గాంచి శౌనకుం డిట్లనియె. 31

చ. ఇరువదియేడు ద్వాపరము లేగె నటంటివి ; మున్నొకొక్కద్వాపరయుగమందు నొక్కొకఁడు వ్యాసుఁడు పుట్టెనఁటంటి; వార లెవ్వరో ? మఱి యేపురాణను లవారణకారుణికత్వ మొప్పఁ జెప్పిరో ? వివరింపవే వినఁగ వేడుక గల్గెడి రామహర్షణీ ! 32

క. అను మునుల రోమహర్షణ
తనయుఁడు గడు భక్తియుక్తితాత్పర్యములన్
గనుఁగొని పల్కెను వ్యాసుల
వినిపించెద వినుఁడటంచు వేడుక మెఱయన్. 33

వ. ప్రథమద్వాపరమ్మున వేదములు స్వాయంభువుచే వ్యస్తంబులయ్యె; ద్వితీయద్వాపరమ్మునఁ బ్రజాపతి యా వ్యాసకార్యం బొనరించె; నట్లు తృతీయమ్మున శుక్రుండును, జతుర్థమ్మున బృహస్పతియుఁ, బంచమమ్మున సూర్యుండును, షష్ఠమ్మున మృత్యుదేవతయు, సప్తమమ్మున దేవేంద్రుండును, నష్టమమ్మున వసిష్ఠుండును నవమమ్మున సారస్వతుండును, దశమమ్మునఁ ద్రిధాముండును, నేకాదశమ్మునఁ ద్రివృషుండును, ద్వాదశమ్మున భరద్వాజుండును, త్రయోదశమ్మున నాకాశమ్మును, జతుర్దశమ్మున ధర్మమ్మును, బంచదశమ్మునఁ ద్రయ్యారుణియు, షోడశమ్మున ధనంజయుం

మ్మున నిరువదినాల్గువేలును, నగ్నిపురాణమ్మునఁ బదియాఱు వేలును, బాద్మమ్మున నేఁబదియైదువేలును, లింగమ్మునఁ బదు నొకండువేలును, గారుడమ్మున నేకోనవింశతిసహస్రమ్ములును, కూర్మమ్మున సప్తదశసహస్రమ్ములును, స్కాందమ్మున నేకాశీతి సహస్రమ్ములును గలవు. సనత్కుమారమును నారసింహమ్మును నారదీయమ్మును శైవంబును దౌర్వాససంబునుఁ గాపిలంబును మానవంబును నౌశనసంబును వారుణంబును గాలికంబును సాంబ బును సౌరంబును నాదిత్యంబును మాహేశ్వరంబును మారీచం బును భార్గవంబును భాగవతంబును వాసిష్ఠంబు నను నివి యుప పురాణంబులు. సాత్యవతేయుం డష్టాదశమహాపురాణమ్ముల రచియించి పిదపఁ దదుపబృంహితం బగు భారతంబు రచియించె. ప్రతిమన్వంతరమ్మునఁ బ్రతిద్వాపరయుగమ్మున నారాయణుండు వ్యాసస్వరూపమ్ముచే నల్పాయుష్కులును నల్పబుద్ధులు నగు భూసురులకొఱకు వేదంబులు విభజించి స్త్రీశూద్రద్విజబంధువు లకు వేదమ్ములు శ్రవణార్హమ్ములుగాఁ జేసి యీపురాణ మ్ములు రచియించుచుండు నని చెప్పి మఱియును, ౨౮

గీ. ఆఱు మన్వంతరములు మున్నరిగె నేడ
వది జరుగుచుండె నిదియ వైవస్వతంబు
ఇరువదియు నేడు జరిగె ద్వాపరయుగమ్ము
లిరువదియెనిమిదవ దిది యెఱుఁగుఁడయ్య. ౨౯

క. ఇరువదియేడ్గురు వ్యాసులు
పురాణములు సేసి రిట్లు పూర్వం బస్మ

స్తుత వగు సాత్త్వతేయుం
డిరువదియెన్మిదవవ్యాసుఁ డిట నిటమీఁదన్. 30

వ. ఇరువదితొమ్మిదవ ద్వాపరయుగమ్మున ద్రోణపుత్త్రుం డగు నశ్వత్థామ వ్యాసుఁడు కాఁగలఁ డని చెప్ప సూతుం గాంచి శౌనకుం డిట్లనియె. 31

చ. ఇరువదియేడు ద్వాపరము లేగె నటంటివి ; మున్నొకొక్క ద్వా
పరయుగమందు నొక్కొకఁడు వ్యాసుఁడు పుట్టెనఁటంటివి; వార లె
వ్వరో ? మఱి యేపురాణము లవారణకారుణికత్వ మొప్పఁ జె
ప్పిరో ? వివరింపవే వినఁగ వేడుక గల్గెడి రోమహర్షణీ ! 32

క. అను మునుల రోమహర్షణ
తనయుఁడు గడు భక్తి యుక్తి తాత్పర్యములన్
గనుఁగొని పల్కెను వ్యాసుల
వినిపించెద వినుఁడటంచు వేడుక మెఱయన్. 33

వ. ప్రథమద్వాపరమ్మున వేదములు స్వాయంభువుచే వ్యస్తంబులయ్యె; ద్వితీయద్వాపరమ్మునఁ బ్రజాపతి యా వ్యాసకార్యం బొనరించె; నట్లు తృతీయమ్మున శుక్రుండును, జతుర్థమ్మున బృహస్పతియుఁ, బంచమమ్మున సూర్యుండును, షష్ఠమ్మున మృత్యుదేవతయు, సప్తమమ్మున దేవేంద్రుండును, నష్టమమ్మున వసిష్ఠుండును నవమమ్మున సారస్వతుండును, దశమమ్మునఁ ద్రిధాముండును, నేకాదశమ్మునఁ ద్రివృషుండును, ద్వాదశమ్మున భరద్వాజుండును, త్రయోదశమ్మున నాకాశమ్మును, జతుర్దశమ్మున ధర్మమ్మును, బంచదశమ్మునఁ ద్రయ్యారుణియు, షోడశమ్మున ధనంజయుం

డును, సప్తదశమ్మున మేధాతిథియు, నష్టాదశమ్మున వ్రతియు, నేకోనవింశమ్మున నత్రియు, వింశమ్మున గౌతముండును, నేక వింశమ్మున హర్యాత్మయు, ద్వావింశమ్మున వేనుండును, త్రయో వింశమ్మున వాజిశ్రవుండును, జతుర్వింశమ్మున నాముష్యాయణుం డగు సోముండునుఁ, బంచవింశమ్మునఁ దృణబిందువును, షడ్వింశమ్మున భార్గవుండును, సప్తవింశమ్మున జాతుకర్ణుండును, నష్టా వింశద్వాపరమ్మున నస్మద్గురుండగు సాత్యవతేయుండును, వేదం బులు విభజించి పురాణంబులు రచియించి రని చెప్పి మఱియు నిట్లనియె. 34

క. పారాశర్యమునీంద్రుఁడ
పారకృపారసము జనులపైఁ గల్గినవాఁ
డై రచియించెఁ బురాణము
లారయ నవి యన్నియును బదాంబుధు లార్యా, 35

సీ. జగదధీశ్వరిరూపు సారెసారెకుఁ జూపు
పరమాంజనము దేవిభాగవతము
ముక్తికాంతను దార్చు మూలమంత్రము నేర్చు
ప్రౌఢదూతిక దేవిభాగవతము
కామితమ్ము లొసంగఁ గల్పద్రుమ మనంగఁ
బ్రథితమైనది దేవిభాగవతము
దోషమ్ములను దుంపతోఁ గూడఁ దెగఁద్రెంప
వాఁడిగుద్దలి దేవిభాగవతము

గీ. పఠనపాఠన యోగ్యంబు భాగవతము
పరమమునులకు సేవ్యంబు భాగవతము

ఆగమాఖిలసారంబు భాగవతము
భారతికిఁ బ్రాణతుల్యంబు భాగవతము. ౩౬

చ. అరణి జనించినాఁడు, తనయంతన విద్యల నేర్చినాఁడు, సం
సరణము రోసినాఁడు, మునిసమ్మతుఁ డంచు శుకుం గుమారు దు
స్తరనియమాధికుండయిన సాత్యవతేయుఁడు బుద్ధి నెంచి య
ప్పరమునకుఁ జదివించె రసవంతము భాగవతప్రబంధముఁ. ౩౭

క. కొడుకునకుఁ జెప్పునప్పుడు
గడు భక్తిశ్రద్ధ లలరఁగాఁ గై కొంటేఁ
"గుడుచుట యల్లునిఁ గలిసియుఁ
గొడుకుఁ గలిసి చదు" వని యనుకొనుటలు వినరే?. ౩౮

మ. శుకుఁ డీ భాగవతామరాగమఫలౌత్సుక్యంబుచేఁ దండ్రి పా
పకుఁడై తా నుపదేశ మీఁగ బహుళోపాఖ్యానకర్ణాతిరం
జకమై యొప్పెడి దీని నిచ్చఁ గొని సంసారాంబుధిం దాఁటెఁ; దే
వి కథాసారముఁ గ్రోలియుఁ భవభయాబ్ధిం మున్గువారుందురే?

శా. పాపాత్ముండగుఁగాక, కేవల కులభ్రష్టాత్ముఁడౌఁగాక, శు
ద్ధాపాత్రుండగుఁగాక, యెట్టిఁడయినన్ వ్యాజమ్ముచేనైనఁ దా
నీ పౌరాణకథాసుధం గొని యిహాదృష్టమ్ములన్ గాంచి దు
ష్ప్రాపంబై తనరారు నా భగవతీసాయుజ్యముం జెందెడిన్. ౪౦

చ. పలుకులు వేయునేల? యొకపల్కు వచించెద; నెవ్వఁడేని స
త్ఫలగతి నొప్పు నీ పరమభాగవతంబు వినంగలాఁడొ, వాఁ
డలఘుఁడు; వానిచిత్తనిలయమ్మునఁ గాఁపురముండుఁ బేర్మితో
జలజభవాదులున్ గనఁగఁజాలని యా జగదంబ నిచ్చలున్.

చ. తెలివియుఁ దేటయున్ గలుగు దేహముగల్గియు, నెక్కుడైన స
త్ఫలములొసంగు నిప్పరమభాగవతంబు లభించియున్, వృథా
కలనలఁ గాలమున్ గడపు కష్టపుజన్మము గల్గునట్టి మూ
ఢులు విధివంచితుల్ గడుఁగఠోరులు గష్టులు దుష్టులిమ్మహిన్. ౪౨

చ. కటకట! పాపపుంగతలు కర్ణములొగ్గి గ్రహించు రాగలం
పటు లిటువంటి సత్కథల భావముఁ జొన్పుట కిచ్చగింప; రు
త్కట మగు పంకమున్ గని ముదంబు మదిన్ గను గ్రామసూకరం
బెటువలె నిచ్చగించు? సుఖహేతుకమై తగు మంచిగంధమున్. ౪3

వ్యాసుండు తపంబొనర్చుట

క. అని పల్కు పల్కులన్ విని
మును లిట్లని; రరణియందుఁ బుట్టెను శుకుఁ డం
చునుఁ జెప్పితి వాతఁడు వ్యా
సున కెట్లు తనూజుఁడాయె సూతా! చెపుమా. ౪౪

గీ. శుకుఁ డయోనిజుఁ డంటి వీ వకట! గర్భ
యోగి గా మేము మును వింటి మో మహాత్మ!
గర్భగతున కయోని సందర్భ మెట్లు
తెలిపి యీ సందియము మాకుఁ దీర్పవలదె? ౪౫

సీ. అని పల్కు మౌనులఁ గని సూతుఁ డిట్లను
మునులార! వినుఁడు శుకునిచరితము
రమణ వ్యాసుండు సరస్వతీతటమునం
దుగ్రతపంబున నుండి యచటఁ

గలవింకదంపతుల్ గలిసి పిల్లలనోటి
కాహారమందిచ్చి యవి భుజించు
చందమ్ముఁ గనకు మోదమందుట వీక్షించి
మనమునఁ గామంబు పెనఁగొనంగ

గీ. బళిర ! సంతానమందుఁ బక్షులకుఁ గూడ
నింత ప్రేమాతిశయ మున్న దింక మనుజు
లైన వారల కుండుట యబ్బురంబె !
యనుచు సంతానచింతాకులాత్ముఁడగుచు. ౪౬

ఉ. సుందరి చేయునట్టి గడుసుందనపుం బలు ముద్దుసుద్దు లం
దంద ముదంబు నింపఁగ రసాంబుధి నోలల నాడవచ్చు ; నా
నంద మొసంగఁ జాలు, తగునందనులన్ బడయంగ వచ్చు ; ను
ర్వీం దలపోసి చూచినను బెండిలికిన్ సమ మొందు గల్గునే ? ౪౭

ఆ. వె. కొడుకు గల్గెనేనిఁ గొడుకునకును బెండ్లిఁ
జేసి కాఁపురమ్ముఁ జేయుచున్న
ముగుదయైన యట్టి ముద్దులకోడలి
మొగముఁ గనుటకన్న ముదము కలదె ? ౪౮

సీ. వార్ధకావస్థ సంప్రాప్తమైనను సతి
శ్రద్ధాళుఁడై పరిచర్య సేయు
ధనము సంపాదించి తగువస్తువులు తెచ్చి
తనకిచ్చి మిగుల సంతసమొనర్చు
మృతిఁజెందినను బరగతికి సాధనమైన
ప్రేతకార్యమొనర్చి ప్రీతి నించు

గయకు నేగి పితృసద్గతికినై విష్ణుపా
దంబుపైఁ బిండదానంబు సలుపు

గీ. సుతులఁ గనకున్నఁ బరలోకగతులు సున్న
పుత్రగాత్ర పరిష్వంగమున జనించు
సుఖముకన్నను వేఱొండు సుఖము లేదు
కానఁ దగునట్టి బుత్రులఁ గాంచవలదె? ౪౯

చ. కొడుకులు లేనివాఁడు తనకున్ మృతికాలము సంభవించిన
ప్పుడు తనద్రవ్యమున్ గృహము భూమియు నేమయి పోవునొక్కో యె
వ్వఁ డపహరించునో యనెడిభ్రాంతి వహించి తనంతఁ దాన పె
క్కుడుమలఁ జెందుఁ గానఁ గొడు కేర్పడి యుండుట ముఖ్య మేరికిన్.

క. అని బహువిధములఁ జింతిలి
తనయునకై తపము సేయుతలఁపున ద్వైపా
యనమునిచంద్రుఁడు సనె హే
మనగాగ్రప్రథితసానుమండలమునకున్. ౫౧

శా. ఏ దేవుం గొనియాడుదున్ మఱియు నే నే దేవుఁ బ్రార్థింతు నా
కే దేవుండు ప్రసన్నుఁడౌనొకొ మనోభీష్టంబు నే దేవుఁ డా
పాదింపం గలఁడో! యటంచు మది సంభావించుచున్నంతలో
నా దివ్యాత్మునిఁ జూడ నారదుఁడు నిర్వ్యాజస్థితిన్ వచ్చినన్ ౫౨

ఉ. వచ్చినవానిఁ గాంచి మునివల్లభుఁ డల్లన లేచి మ్రొక్కి యో
సచ్చరితా! మనమ్మున విచార మొకం డొనరించుచుంటి; నీ
విచ్చటి కేగుదెంచుట త దీప్సితసిద్ధికి ముఖ్యకారణం
బిచ్చఁ జరించు సన్మును లహేతుకజాతదయామయుల్ గదా! ౫౩

క. అను పలుకులు విని నారదుఁ
డను, సకలము నెఱుగునట్టి యనఘుండవు నీ
కు నసాధ్యం బొం డుండునె ?
యనుమానం బేల తెల్పుమన నతఁడనియెన్. ౯౪

చ. "కొడుకులు లేక యున్నఁ దనకుం బరలోకము సున్న" యంచుఁజె
ప్పెడి వచనంబులన్ జెవిని బెట్టిన దాదిగ నాకు లోనఁ దుం
దుడుకు జనించెఁ గావున సుతుం గన నెవ్వని వేఁడుకొందు నె
వ్వఁడొసఁగువాఁడు తెల్పు మటువంటి మహాత్ముని నాకు నారదా !

వ. అని తనకు శరణాగతుం డగుసాత్యవతేయుం గాంచి నారదుండిట్ల
ను; నీ యడిగిన యర్థమ్ము దెలిసికొనువాఁడై మున్ను మజ్జనకుం
డగు విరించి విష్ణులోకమ్మునకుం జని, ౯౬

సీ. కోటిసూర్యులకాంతి గోటమీటఁగఁ జాలు
డాబు జిమ్మెడి కౌస్తుభంబువాని
శంఖచక్రగదాది సాధనమ్ములు దాల్చి
హావణించు నాల్గు బాహువులవాని
నీలనీరదసమ శ్రీలీలఁ దగుమేని
పై నొప్పు బంగారు వలువవాని
నిందిరానీలవిలాస మినుమడింపఁగఁ జాలు
హెచ్చుగల్గిన పుట్టుమచ్చవాని

గీ. కలుము లీనెడి కందోయి గలుగువాని
నెల్ల లోకమ్ములును లోన నిముడువాని
ధ్యాననిశ్చల మైన హృదయమువాని
విష్ణుఁ బొడఁగాంచి తా నిట్లు విన్నవించె. ౯౭

—* విష్ణువు బ్రహ్మకు దేవీ మహాత్త్వంబు చెప్పుట *—

సీ. నీ యాజ్ఞ చేఁగదా ! నే సృజింతు జగమ్ము
హరియించుఁ బ్రళయమ్మునందు శివుఁడు
నీ యాజ్ఞ చేఁగదా ! నీరేజబాంధవుం
డుదయాస్తమయముల నొందుచుండు
నీ యాజ్ఞ చేఁగదా ! వాయుదేవుఁడు సుఖా
సుఖరీతిఁ దనశక్తిఁ జూపుచుండు
నీ యాజ్ఞ చేఁగదా ! యా యగ్ని వెల్గుఁ బ
ర్జన్యదేవుండు వర్షంబు గురిసియు

గీ. నీవె సర్వోత్తముఁడవు సర్వేశ్వరుఁడవు
సర్వభూతమయుండవు సర్వశక్తి
వట్టి నీ విట్టి ధ్యానసమాధి నుంటి
వెవఁడు సంసేవ్యుఁడో తెల్పవే మహాత్మ ! గీ

గీ. నీకు బరుఁడున్న వాఁడని నే నెఱుఁగ
నీకు శరణాగతుఁడ నైతి నీ కృపార
సమ్ము నాపయిఁ జిలికి యా సందియమ్ముఁ
బాపవే ! భక్తులకును గోప్యములు గలవె ! గీ

క. అని పలుకు సరసిజాసనుఁ
గని విష్ణుం డను మనమ్ముఁ గడు నిశ్చలతన్
గనఁజేసి సావధానత
వినుమా ! నా పల్కు-పల్కు- విధము కుమారా ! ౯౦

ఉ. ఈవు సృజింతువంచు, మఱి యేఁ గరుణించి భరింతునంచు గౌ
రీవిభుఁ డాగ్రహమ్మున హరించునటంచు, జనుల్ వచింతు ; రీ

త్రోవలు తప్పుత్రోవలు ; బుధుల్ "మనలన్ సృజియించె నొక్క తే
జోవతి యాదిశక్తి" యనుచున్ వచియింతురు కాదె పుత్రికా !

క. మృడునకుఁ దామసి తాఁ దో
డ్పడె ; రాజసి నీకుఁ దోడుపడె ; సాత్త్వికి తో
డ్పడె నా ; కటుగాకుండినఁ
గొడుకా ! యొకగవ్వకైనఁ గొఱగాము సుమీ ! ౬౨

సీ. పరతంత్రతను జెంది ఫణిరాజశయ్యపై
శయనింతు శక్తి ప్రసాదముననె
ఆరామముల విహారార్థంబు లక్ష్మితోఁ
జరియింతు శక్తి ప్రసాదముననె
సతతంబును దపంబు వితతంబు గాఁగఁ బా
సంగింతు శక్తి ప్రసాదముననె
పొగరుపట్టిన రాక్షసగణమ్ములనుఁ బట్టి
చంపుదు శక్తి ప్రసాదముననె

గీ. నాఁడు మధుకైటభులను దానవులతోడ
నైదువేలేండ్లు సంగ్రామ మాచరించి
జయము గైకొంటి శక్తిప్రసాదముననె
యెఱిఁగి యెఱిఁగి నన్నడుగఁగ నేల ! పుత్ర ౬3

మ. సిరిసాంగత్యముఁ గోలుపోయి, సుఖముల్ చేసేఁత వర్జించి, సూ
కరకూర్మాంబుచరాదితుచ్ఛకలుషాకారమ్ములన్ దాల్చి, సం
గరముల్ సల్పుచు బాములన్ బడుచు నజ్ఞానాబ్ధి నోలాడఁగాఁ,
బరతంత్రుండను గాకయున్న నదె నాపారబ్ధమా ? పుత్రికా !

చ. మును పోకనాఁడు నాదుశిరముల్ హరియించె ధనుర్గుణంబు దా
నినిఁ గని నీవ యప్డు తగునేరుపు గల్గిన దేవశిల్పివ
ర్యునిఁ బిలిపించి యొక్కతురగోత్తమశీర్షముఁ గూరిపించి తి
య్యనువున నే హయాననుఁడ నైతి నెఱుంగవె? పద్మసంభవా!

గీ. కాన నేను స్వతంత్రుఁడఁ గాను శక్త్య
ధీనుఁడను శక్తిసేవనాధీనమతిని
శక్తికన్నను వేఱొండు జగములందుఁ
బరము గలదని పలుక నా తరము గాదు. ౬౬

చ. అనుచు విరించికిన్ సరసిజాక్షుఁడు దెల్పెను; దాని నాకు న
య్యనఘుఁడు దెల్పినాఁడు; జగదంబికయై పరతంత్ర గాక యుం
డిన పరదేవతన్ హృదయ నీరజమందు వసింపఁజేసి, పే
ర్కొనఁ గదవయ్య! కోర్కె సమకూడు నదెట్టిది యైన సన్మునీ!

క. అను నారదువచనము విని
యనుమానం బుడిగి శక్తి యగుఁ బరదైవం
బని తపము చేసె వ్యాసుఁ డ
నిన సూతుంగాంచి యిట్లనిరి మును లెల్లన్. ౬౭

—* హయగ్రీవతార ఘట్టము *—

ఉ. ఆగమవేద్యుఁ డైన పరమాత్ముశిరమ్మున కేలగల్గె నీ
యోగము దాని కెట్లతికిరో తురగానన మీకథావిధం
బే గతి నమ్మువార మిది యెల్ల నసంశయరీతిఁ దెల్ప నీ
వే గతి, దెల్పవే యనుమునీంద్రులఁ గన్గొని సూతుఁ డిట్లనున్.

సీ. మును రక్కసులతోడ దనుజారి పదివేల
సంవత్సరమ్ములు సంయుగమ్ము

చేసి పరిశ్రాంతిఁ జెంది సజ్యంబగు
ధనురగ్రము నవలంబనముఁ జేసి
కొని తానొకఁట నిద్రఁ గొనియున్న తఱి దేవ
తలు యజ్ఞమొనరింపఁ దలఁచి విష్ణు
లోకమ్ములోఁ బద్మలోచనుఁ గానక
యోగమ్ముచే నున్న యునికి నెఱిఁగి

గీ. వచ్చి నిద్రావశుం డైన వానిఁగాంచి
చేయునది లేక యూరక చింతసేయ
వారిఁ గరుణించి వాగీశు వలను చూచి
పార్వతీపతి దెల్పె నుపాయ మొకటి. ౭౦

శా. కీటంబుల్ సృజియింపు మీ వొకఁడు పంకేజాసనా! యీధను
ష్కోటిన్ భిన్నముఁ జేయఁజాలు నది ; తత్కోట్యగ్ర ముచ్ఛిన్నమై
మీటుల్ మీదికి ; దాన నీతఁడును దా మేల్కాంచు ; దాన న్నిరా
ఘాటం బౌ మఖ, మన్న మంచిదని వేడ్కన్ ధాత సృష్టించినన్.

క. పుట్టించిన ధాతన్ గని
నెట్టన నా కీట మిట్లనియె నో దేవా!
యెట్టు లొనరింతు నీపని
కట్టా! కడుఁ బాతకంబు గాదే నాకున్. ౭౧

శా. తల్లిన్ బిడ్డలఁ బాయఁజేయుటయు, నిద్రాభంగమున్, భర్తతో
నిల్లాలిన్ విడఁదీయఁ బూనుటయు, దుష్కృత్యప్రవృత్తిన్ గథా
సల్లాపమ్ముల కంతరాయకృతులన్ సంధించుటల్, తుల్యమై
చెల్లున్ నిక్కము బ్రహ్మహత్య ; కిది నాచేఁ జేయఁగాఁ జేతురే ?

క. ఇటు లొనరించిన నాకుం
గటకట ! పాతకము తక్కఁ గలదే ఫలమొ
క్కటి, దెల్పెద లాభము లే
కిటువంటి పనుల నొనర్తురే ? యెందైనన్. ౭౪

క. అని కటకటఁ బడు పురువున్
గని యిట్లనె ధాతయున్ మఖంబున నీ క
ష్టనఁ జేసెద మిది మొదలుగ
ననలహుతము కాని యప్పదార్థంబెల్లన్. ౭౫

క. నావుడు వమ్రియు సంతో
షావిర్భావంబు వొదల నావింటికొనన్
వేవేగఁగొఱికె. ధనలో
భావిష్టు లొనర్పరాని యఘములు కలవే ! ౭౬

శా. దానన్ నాదమొకండు పిక్కటిలెఁ, బాతాళంబుఘూర్ణిల్లె ; నా
శానాగమ్ములు సంచలించె ; ధరణీచక్రంబు కంపించె ; గో
త్రానీకంబు వడంకె ; నుష్ణకిరణుం డస్తంగతించె ; న్నభ
స్థానం బల్లల నాడె ; దిక్కులు ప్రతిధ్వానమ్ములన్ గర్జిలెన్.

గీ. వింటికొన తాఁకుచేత న విష్ణుదేవు
శిర మెగిరిపోయె దాన నిర్జరులు భీతి
చెంది యుత్సాహములు దక్కి చేవవీడి
చేయునది లేక మదిఁ జింత చేసిరిట్లు. ౭౮

గీ. ఈవె సర్వోత్తరుఁడవు సర్వేశ్వరుండ
వీ వభేద్యుండ వఖిలలోకైకకర్త

నీవె భర్తవు సంహర్త నీవె కావె
నీకు నింతటి గతి గల్గెనే మహాత్మ! ౨౯

గీ. యక్షరాక్షస దైత్యుల యందు నీకు
నిట్టి యపకార మొనరింప నెవ్వఁడోపు?
దిక్కుమాలిన యట్టి యీ దేవసంచ
యం బొనర్చిన పాపకర్మంబు కాక. ౩౦

గీ. మాయకుఁ బరుఁడ వైన నీ మస్తకంబు
మాయ హరియించె నన్న నమ్మఁ దగునయ్య?
యంచు నేమేమొ విలపించు నమరవరుల
కిట్టులనియె బృహస్పతి యెసకమెసఁగ. ౩౧

గీ. తగు నుపాయమ్ము యోజింపఁ దగును గాక
వ్యర్థముగఁ జింతఁ జేసిన ఫలముకలదె?
మన మొనర్చు నుపాయంబు మంచి దగును
దైవతంత్రమ్ము దానికిఁ దవిలెనేని. ౩౨

వ. అనిన నింద్రుం డిట్లనియె. ౩౩

గీ. దేవతలు సూచు చుండఁగా దేవదేవు
శిరము నిష్కారణమ్ముగాఁ జెదరిపోయె
పౌరుషమ్మున సిద్ధించు పనులు కలవె?
దైవబలము బలమ్ముగాఁ దలఁప వలయు. ౩౪

వ. అనిన విరించి యిట్లనియె. ౩౫

చ. శివునకు లింగపాతము, శచీపతికిన్ భగలబ్ధి, యేను నా
భవుని కతమ్మునన్ దలకుఁ బాయుటయుం, దలపోసి చూడఁ, గా

లవశము కాక వేఱొక బలమ్ము గిలమ్మును గల్గునే? సమ
స్తవిధములన్ సుఖమ్ము గొనసాగునె సంసృతి నీదువారికిన్? ౬౬

ఉ. ఈ సకలంబు తాన యయి యే జగదీశ్వరి వెల్గుచుండుఁ దా
నే సృజియించి తాన భరియించియుఁ దాన హరించు నే కృపా
భాసురశీల యాపరమపావని నా జగదంబ నా భవ
త్రాసహరన్ భజించిన ముదమ్ము లొసంగక మిన్నకుండునే? ౬౭

వ. అని మఱియును. ౬౮

క. ఆ జగదంబ నుతింపం
గాఁజాలము మన మటంచుఁ గడువేగముగా
రాజీవభవుం డాగమ
రాజిం బిలిపించి వేడ్క రాజిల్లంగన్. ౬౯

క. నుతియింపుఁ డాదిశక్తిని
శ్రుతులారా! మీర తెలిమి చొప్పడ నని యా
నతి యిచ్చిన నది గైకొని
శ్రుతిసతు లిట్లని నుతింపఁ జొచ్చిరి కడఁకన్. ౭౦

ఉ. తల్లి! జగత్త్రయీభరణదక్షకటాక్ష కలావిలాస! యు
త్ఫుల్లసముల్లసత్కమలతుల్యముఖీ! ప్రకృతిస్వరూపిణీ!
పల్లవపాణి! నిత్యశివభాగ్యవిధాయిని! సర్వరూపసం
వేల్లితదేహ! దివ్యపదవీపరిభాసిని! మత్తకాశినీ! ౭౧

గీ. భూతములకెల్ల నాధార భూమివైతి
ప్రాణవంతులకెల్లను బ్రాణమైతి
ధీముఖాకారములచేత దీప్తిగంటి
వంబ! గాయత్రికిని వాచ్య మైతి వీవ. ౭౨

ఉ. పాపహరంబు సర్వపరిపాలనశౌండ మకాండసత్కృపా
దీపిత ముత్తమోత్తమము దివ్య మఖండ మజాండనిర్మితి
ప్రాపక మాద్య మాగమనివాస మనంతవిలాస మైన నీ
రూపు పితామహాదులు నిరూపణఁ జేయఁగ లేరు శాంకరీ. ౬౩

చ. సకలముఁ జేయు నిచ్చఁ గొని సారససంభవముఖ్యదేవతా
నికరము మున్నుగాఁ దగ జనింపగఁ జేసి తటస్థవై సమ
స్తకృతులు వీరిచేతఁ గొనసాఁగఁగఁ జేయుచునుందు; వంతె కా
క, కలవె నీకు సంసరణ కష్టసుఖమ్ము లొకించు కేనియున్ ? ౬౪

శా. నీ నామమ్ములు లెక్కపెట్టుటకుఁ గానీ నీదు రూపం బొకిం
తేనిన్ వర్ణనఁ జేయఁ బూనుటకుఁ గానీ లేఁ డొకండేని; యొం
దేనిన్ ద్వచ్చరితంబు దెల్పుటకునై యెవ్వాఁ డగుం దేవి ? కు
ల్యానీరమ్మును దాఁట భీతి పడువాఁ డంభోనిధిం దాఁటునే ? ౬౫

గీ. నీదు విభవంబు దేవతానికరమందు
నొక్కఁడేనియు నెఱుఁగమి నిక్క మంబ !
నీవ సకలంబునకు నియంత్రి వనుచు పట్ల
నేము సాక్ష్యమొసంగి జయింపఁ గలము. ౬౬

ఆ. వె. ఆస్థ లేనిదాన వయ్యును సకలంబుఁ
జేయుచుందు వనెడి చిత్రచరిత
మంబ ! నీక తెలియ దన్నచో మాబోఁటి
జడమతుల కెఱుంగఁ బడుట యెట్లు ? ౬౭

ఉ. ఈ దురవస్థ మాధవున కీ గతి నబ్బుట కేమి హేతు వం
బా ! దయ మాలి నీవు పరిపాలన సేయ కుపేక్షఁ జేసితో ?

నీదెస నెద్దియేని యవినీతి యొనర్చెనో ? లేక పూర్వసం
పాదితపాపకర్మపరిపాకమొ ? శక్తి పరీక్ష సేయుటో ? ౯౮

ఉ. లేక దురాగ్రహమ్మున నిలింపు లొనర్చెడి పాతకమ్ము లీ
వీ కమలాక్షునం దిడితొ ? యీతని గర్వ మడంపఁబూనితో ?
కాక సురారు లిట్టి వరకాంక్షఁ దపం బొనరించి యుండిరో ?
కా కితఁ డీగతిన్ బొగులఁగాఁ గను నిచ్చ జనించెనో మదిన్ ? ౯౯

ఉ. "ఐదువ లందు నాకు సమమైన యదృష్టవిశేష మెచ్చటన్
లే" దని విష్ణుదేవు నల నీరధిపుత్రికి సమ్రభావ మా
పాదనఁ జేయఁ బూనితివొ ? భక్తుల యం దిటువంటి నిగ్రహా
హ్లాదము పూన మంచి దగునా ? తగునా మగనాలివంచనల్ ?

గీ. ఇతని శిర మేడ కేగెనో యెఱుఁగ రాదు
ప్రాణము లొసంగుటకు నుపాయమ్ముఁ గాన
మంబ ! యీతని బ్రతికించి యమరవరులఁ
గరుణ నీక్షించి లచ్చిసంకటము తీర్పు. ౧౦౧

గీ. అనుచు నుతియించు వేదమ్ము లందుఁ గరుణ
కలిగి జగదంబ పలికె నాకాశకలన
వినుఁడు సురలార ! వేదముల్ విన్నవించు
విన్నపం బాదరించి ప్రసన్ననైతి. ౧౦౨

క. ఈ నిగమస్తవ మెవ్వం
డేని వినిన వాని కేన యిచ్చెదఁ దగు వి
జ్ఞానమ్మును దీర్ఘాయువు
నానంద మఖండ మైన యైశ్వర్యంబున్. ౧౦౩

గీ. ఇతనిశిర మూడిపోవుట కేమిహేతు
వన్న సురలార ! చెప్పెద నాలకింపుఁ
డహహా ! కారణహీన కార్యములు గలవె ?
సారవేత్తల కెందు సంసారమందు. ౧౦౪

మ. ఒకనాఁ డీతఁడు కేళికాసదనమం దున్నట్టి వారాశి పు
త్త్రికమోముం గని నవ్వె; నవ్వుటయు నారీరత్న మా లక్ష్మి "యే
మి కతంబో యితఁ డిట్లొనర్చుటకు, నేమీ ! నామొగం బంతఁగా
వికృతాకారము చెందెనే" యనుచుఁదా వేమాఱు, జింతించుచున్,

శా. నాకన్నన్ మఱియొక్క చక్కనగు కన్యన్ జూచి మోహించెనో?
కాకున్నన్ నినుఁ జూడకున్న దినముల్ కల్పమ్ములౌఁ జుమ్మి నా
కో కల్యాణి ! యటంచుఁబల్కు నితఁడో హో ! యింతమొగ్గించునే !
సీ ! కాంతుం డఁట ! యెగ్గొసర్చె నఁట ! తత్క్షేమంబు గామింతునే?

క. అని తామసమునఁ దనకాం
తుని శీర్షం బబ్ధిఁ బడఁగఁ దుడుకుమెయి శపిం
చెను ; సవతిపోరుకన్నను
దనపతి మృతి కొంత సౌఖ్యదము మానినికిన్. ౧౦౭

సీ. దయమాలి ప్రియుతోడఁ దప్పుఁ జేసియు నబ
ద్ధమ్ము లాడుట యాఁడుదానిసొమ్ము
ప్రాణమ్మునకు గడ్డిపరకంత వెలయైనఁ
దలఁపకుండుట యాఁడుదానిసొమ్ము
అత్యంతలోభమ్ము నంది యూరక మార్ఖ్య
మూని యుండుట యాఁడుదానిసొమ్ము

అవమానమునకు లోనై దురాచార ప
ద్ధతి వహించుట యేఁడుదానిసొమ్ము

గీ. కష్టసంసారమునకు లోఁగా నోనర్చి
దాఁట నీకుండు టది యేఁడుదానిసొమ్ము
లేనిపోని విలాసమ్ములూని మోక్ష
దశను జెడఁగొట్టు టది యేఁడుదానిసొమ్ము. ౧౦౮

సీ. ఆ శాపవశమునఁ గేశవు శిరమున
కిట్టి దుర్దశ మూఁడె నిదియుఁగాక
మును హయగ్రీవుఁడన్ దనుజుండు గడు నిష్ఠ
చే సరస్వతియొడ్డుఁ జేరి తపము
నాచరించె మదర్థమై వేయిసంవత్స
రములు సమస్తభోగములు వీడి
యతని కేఁ దామస మగు రూపము ధరించి
ప్రత్యక్ష మగుటయు బహువిధముల

గీ. సన్నుతించి ప్రసన్నయై యున్న నన్నుఁ
గాంచి "యెవ్వారిచేనైనఁ గానిచావు
బొరయ కుండెడి రీతిని వర మొసంగు"
మనుచు నవ్వానితోడ నిట్లంటి నేను. ౧౦౯

గీ. పుట్టు జంతువు లెల్లను గిట్టుటయును
గిట్టు జంతువు లెల్లను బుట్టుటయును
పరమధర్మంబు వేఱొండు వరముఁ గోరు
మిచ్చెద నటన్న రక్కసుం డిట్టు లనియె. ౧౧౦

క. ఏను హయగ్రీవుఁడను
గాన హయగ్రీవు చేతఁగాని యొరుల చేఁ
బ్రాణములు వీడ కుండం
గా నిమ్మన నట్టివరము కరుణ నొసఁగితిన్. ౧౧౧

వాఁడిపు డెల్లలోకము లవారణ రీతిని బీడఁ బెట్టుచు
న్నాఁ డీక వానిఁ జంపుటకు నాథుఁ డొకండయినన్ జగత్త్రియిన్
లేఁ డటుగాన మీరు తగునేర్పున వాజిశిరమ్ముఁ దెచ్చి మా
ఱాడక యీ రమాధవు హయాననుఁగా నొనరింపఁగాఁదగున్.

క అటు చేసిన నీతం డ
క్కుటిలుని హరియించు మీకుఁ గోర్కె ఫలించున్
దటుకున నొనరుపుఁడని యా
తట నంతర్ధానమందెఁ దజ్జనని వెసన్. ౧౧౩

గీ. పిదప సురలెల్ల దేవశిల్పివరుఁగోర
నతఁ డరుగుదెంచి యసికృత్తమైన వాజి
శిరము గైకొని నేర్పున హరికి నతికె
నీ విధమ్మున హరి హయగ్రీవుఁ డయ్యె. ౧౧౪

గీ. ఈ హయగ్రీవుఁ డా రాక్షసేంద్రుఁ జంపె
దానిచే లోకములు ప్రమోదమ్ముఁగాంచె
నిట్టి శుభ చరితము వినునట్టివారి
కతులితైశ్వర్యములు గల్గు నఘము లడఁగు. ౧౧౫

## —• మధుకైటభోత్పత్తి •—

క. అన విని మధుకైటభులను
దనుజులు గల రంటి వట్టి దనుజుల జన్మం

బును మరణంబును వినియెద
మనఘా ! నీవంటియోగ్యుఁ డబ్బునె మాకున్ ? ౧౧౬

గీ. విషము దుర్జనుఁడును నొక విధమువారు
సుధయుఁ బండితుఁడును నొకవిధము వారు
బుధులు దొరకినయప్డు సత్కథలు వినని
వార లెల్లరుఁ బశువుల వంటివారు. ౧౧౭

క. అశనమ్మును నిధువనమును
బశువులకును మనుజులకు స్వభావ గుణమ్ముల్
పశువులకన్నను మనుజులు
ప్రశస్తతను గనుట తెలివిఁ బడయుటఁగాదే ? ౧౧౮

గీ. వేదశాస్త్రాదిగోష్ఠి సాత్త్వికి యనఁబడు
సరససాహిత్యగోష్ఠి రాజసి యనఁబడు
ససమయుద్ధాదిగోష్ఠి తామసియనఁబడు
నందుఁ బుణ్యులు సాత్త్వికి యందు నుందు్రు. ౧౧౯

వ. అట్టి సత్త్వగోష్ఠియు నుత్తమమధ్యమాధమ భేదమ్మున మూఁడు విధమ్ము, లందు త్తమంబు ముక్తిసాధనంబును, మధ్యమంబు స్వర్గప్రాప్తి సాధనంబును, నధమంబు భోగసాధనంబు నై తనరు. అట్ల పాణిగృహీతియం దుపచరించునది యుత్తమ రజోగోష్ఠియుఁ బాణిగృహీతయం దుపచరించునది మధ్యమంబును బరోఢ యందుపచరించునది యధమంబు నాఁ బరఁగు ; దుష్టశిక్షానిమిత్తం బగు యుద్ధం బుత్తమ తమోగోష్ఠియు దాయాదభాగనిమిత్తం బగునది మధ్యమంబును నిర్నిమిత్తం బగునది యధమంబును నగుం గావున మోక్షప్రదంబులగు పురాణగాథలు వినుటకన్న నొండు శుభంబుండునే ? యను మునివరులంగాంచి సూతుం డిట్లనియె.

సీ. పాలమున్నీటి లోపల శేషశయ్యపై
వెన్నుండు నిద్రించుచున్న కాల
మునఁ గర్ణమలమువలన నిద్ద అన్నద
మ్ములరీతిగా రక్కసులు జనించి
జలధి లోపలఁ గ్రీడ సల్పుచు నచట న
ల్గడల ఘూర్ణిల్లు న క్కడలిఁజూచి
ఆధార మొండు లే కాధేయ ముండునే?
యనిమిత్తమైన కార్యములు గలవె?

గీ. యనుచుఁ దమ జన్మమునకు శంకాకులత్వ
మంది చింతిల్లి యాశ్చర్య మంది మోద
మంది యేమియుఁ దోఁచని యట్టియెడల
గైటభుఁడు సెప్పె మధువుతోఁ గారణంబు. ౧౨౧

క. వననిధిగాని మనముగా
ని నిమిత్తము లేక యుండనేర్తుమె? మనకుఁ
వననిధికిని నాధారం
బనఘా! యొకశక్తి యున్నదని యెఱుఁగవొకో? ౧౨౨

వ. అను నవసరమున నాకసంబు నుండి యొక్క వాగ్బీజం బుద్భవింప నయ్యది గైకొని వారిరువురు దృఢమ్ముగ జపించుచుండ గగనంబున నొక మెఱుపు మెఱసినట్లయ్యె. దైత్యు లద్దానిం గాంచి విధిగా నియ్యది దేవీతేజం బని నిశ్చయించి య మ్మంత్రంబు మహామంత్రంబుగా భావించి జితేంద్రియులై యాహారంబు వర్జించి యొక వేయి వత్సరంబులు తపంబు సల్పుటయు, ౧౨౩

క. వారల ఘోరతపం బెద
నారసి కరుణించి యంబ యశరీరిణియై

“ కోరుకొనుఁడు వర ” మన న
వ్వారును స్వేచ్ఛామరణము వాంఛించుటయున్, ౧౨౪

క. మెచ్చితి నెద మీ తపమున
కిచ్చితి భవదీప్సితంబు నిటమీఁదన్ మీ
రెచ్చోఁ బోయినఁ బోవుఁడు
హెచ్చు గలుగుఁ గాని దైన్య మెనయదు మిమ్మున్.

క. అని చెప్పి యా పరాంబిక
చనిన పిదప జలమునందు చరియించుచు బ్రి
హ్మను గని యొకప్డు యుద్ధం
బునకున్ రా రమ్మటనిరి పొగరు మిగులఁగన్. ౧౨౫.

గీ. యుద్ధ మొసరింపఁ జాలక యున్న వీర
భోగ్యమగు నీరజాసనమునకుఁ దగవు
కాన నాసనము డిగి యొందేనిఁ బొమ్ము
లేక యున్న యుద్ధమునకు లేచిరమ్ము. ౧౨౬

క. అని దనుజులు వలుకుటయును
వనజాసనుఁడంత భీతివడి యోగసమా
ధినిఁ జెంది యున్న విష్ణుని
గని యిట్లని మొట్టపెట్టె గద్గదగళుఁడై. ౧౨౭

సీ. రాకాసులకునై యనేకావతారముల్
మేల్మిఁ దాల్చినతండ్రి! మేలుకొనుము
సృష్టిస్థితిలయ ప్రసిద్ధిచేఁ దనరారు
లీల గల్గినతండ్రి! మేలుకొనుము

ఆర్తులైనట్టి భక్తాగ్రగణ్యులఁ బ్రోవ
జాలి బూనినతండ్రి! మేలుకొనుము
సాత్త్వికంబైన తేజంబుచేతనె దుర్జ
నాళిఁ దుంచెడి తండ్రి! మేలుకొనుము
గీ. శంఖచక్రగదా ముఖ సాధనములు
కేలదాల్చిన నా తండ్రి! మేలుకొనుము
దుర్దమంబగు నిక్కట్టు దొలఁచు నేర్పు
చాలఁగల్గిన నా తండ్రి! మేలుకొనుము. ౧౨౯

క. చంపెద మంచు నిరువురు ని
లింపారులు మీఁదఁ బడిరి; లే లెమ్ము; కటా
క్షింపుము కాపితునను, నను
కంపాకంపిత రసానుగతహృదయుఁడవై. ౧౩౦

—* బ్రహ్మ యోగనిద్రను స్తుతించుట *—

క. అనుచు నుతియించినను మే
ల్కనని జనకుపాటుఁ జూచి కార్యము లేదం
చును యోగనిద్ర నిట్లని
కొనియాడఁ దొడంగె మేలుకొలుపు మటంచున్. ౧౩౧

ఉ. అంబ! జగత్త్రయమ్మునకు నాదివి నీ వని నాకు వేదవా
క్యంబులు సెప్పె నిక్క; మటుగాని యెడన్, సచరాచరస్వరూ
పంబగు నెల్లలోకమును బాలనసేయు మహామహుండు ప
ద్మాంబకుఁడిట్లు నీకు వశుఁడై సుఖసుప్తి మునింగిపోవునే? ౧౩౨

ఉ. దానవు లిత్తఱిన్ మిగులఁ దత్తరపాటొనరించుచున్నవా
రే నిఁక వారిబాధల సహింపఁగలే నటుగాన నాకు నీ

దానవవైరిచే నభయదాన మొసంగఁగఁ జేయుమమ్మ; లే
దా, ననుబాధలం బొనుపు దానవయుగ్మము నడ్డగింపుమా. ౧౩౩

ఉ. నీ వశమై తనర్చు నితనిం గని డగ్గఱి మేలుకొల్ప సౌ
ఖ్యావహమైన లచ్చియు ననర్హ గదా! జగదంబ! నీదు లీ
లా విభవంబు లెల్లెడ నలంఘ్యము లేరికిఁగాని యన్నచోఁ,
గేవల మస్మదాదుల నకించనులం గణియింప నేటికిన్. ౧౩౪

ఉ. వారు మహాప్రసిద్ధి గలవారు జగద్గణనీయవైభవుల్
వారు పురాకృతంబు గలవారలవారిల వేఱటుంగ నె
వ్వారు భవద్వరాంఘ్రియుగవారిరుహభ్రమరాయమాణు లె
వ్వారు భవామయాపహభవద్భవితవ్యకటాక్షవీక్షితుల్. ౧౩౫

ఉ. ఎక్కడ డాఁగె నా తెలివి? యేమయిపోయె శుభప్రవృత్తి? యిం
కెక్కడఁ జొచ్చె నా గుణము? లీ హరి యీ గతి నిద్రనొందె న
మ్మక్క! భవద్విలాసకల లక్కజముల్ జననీ! జగమ్ములో
నొక్కతె వీవు దక్క మఱి యొండొరు లిట్టిసమర్థులుండిరే? ౧౩౬

ఉ. మొట్టమొదల్ జగమ్ముల సముద్ధతిఁ బ్రోవుమటంచు నీతనిన్
బుట్టఁగఁ జేసి యప్పనినిఁ బూని చరించుచు నున్న వానిఁ జైఁ
గట్టిఁడివై కదమ్మ కడకంటను జూడఁగ నియ్యకొంటి; నీ
కెట్టిలు దోఁచునో యటుల యేర్పడఁ జేసెద; వడ్డువారమే? ౧౩౭

గీ. పుట్టఁ జేసిన యట్టి నన్ గిట్టఁ జేయ
నిచ్చయే నీకు లేకున్న నిట్టి రక్క
సుల సృజింపఁగ నేల? భీతిలెడి నన్నుఁ
గని హసించుటకై యేమొ జనని చెప్పుమ. ౧౩౮

నీ చరితంబు నే నెఱుఁగనే? జగమెల్ల సృజించి పెంచి సంకోచము లేక చంపఁ దొరకొందువు; నీ కెటు నన్ను మాత్రముం గాచుట కిచ్చవుట్టు? మృతి గల్గఁగఁ జేసిన నీవ చేయు, మీ నీచులు చంపిరేని గడు నిందకుఁ బాత్రుఁడ నౌదుఁదల్లిరో! ౧౩౯

అమ్మరో! లెమ్ము వేగమె మహాద్భుతమై తనరారు నీ స్వరూపమ్ము ధరించి నన్నయిపఁ బట్టి వధింపుము; లేకయున్న నన్నిమ్మెయి బాధలం జొనుపు నిక్కటిలాత్ముల నైనఁ జంపు; కష్టమ్మునకోర్వఁజాల; నకటా! హరినైన ననుమేలుకొల్పుమా.

క. అని నుతియించెడి వనజా
సనుపైఁ గరుణించి, నిద్ర చనె సరసీజా
క్షుని విడిచి; సరసిజవిలో
చనుఁడును మేల్కాంచె, ధాత సంతసపడఁగన్. ౧౪౧

—* శక్తిస్వరూప కథనము *—

క. అన విని మును లిట్లని రో
యనఘా! మా కొక్క సందియము కల్గెను; దా
నిని వినిపించెద; మది నీ
వినుగంత యెఱుఁగఁ జెప్పవే దయమీఱన్. ౧౪౨

గీ. హరిహర బ్రహ్మ లనఁగ మూఁగురు మహాత్ము
లం దొకఁడు పెంచు నొకఁడు లయం బొనర్చు
నొకఁడు సృజియించుఁ గాని యం దుత్తముండు
హరి సమర్థుండు సర్వ కార్యములయందు. ౧౪౩

గీ. అట్టి హరి యోగనిద్రచేఁ గట్టువడిన
యప్పు డాతని శక్తియు నతని తేజ

మెచటి కేగెను ? శక్తికి నితనికన్న
నెక్కుడగు శక్తి కల్గుటయేల ? చెప్పుము. ౧౪౪

గీ. నారదాది మహాత్ము లందఱును మాకు
హరియె కారణకారణం బనుచుఁ జెప్పి
రీవు మాత్రము శక్తియా చెఱుఁగఁ జెప్పి
తెద్దియో నిక్కువంబు మాకెఱుఁగ రాదు. ౧౪౫

వ. అనిన విని సూతుండిట్లను. మునీంద్రులారా! మీ యడిగిన యర్థంబు సావధానమనస్కులరై యాలకింపుఁడు. మహామతి గోచరంబగు నీవిషయంబున బ్రహ్మపుత్రులగు నారదాదులును మోహమ్మునం జేసి దురవగాహంబగు శక్తిప్రభావం బెఱుఁగలేక జనార్దనుండు పరుండనియు సర్వకర్త యనియు సకలాగమవేద్యుం డనియు భ్రమించుచున్నవారు. ౧౪౬

ఉ. అంగజవైరి సర్వహృదయంగమచిత్రచరిత్రుఁ డద్రిజా
లింగితమూర్తి మూర్తిపరిలిప్తవిభూతి విభూతిదాత త్రి
య్యంగనకుం బ్రియుండు రజతాచలవాసుఁడు శంకరుండు మా
కుం గులదైవ మంచు మఱికొందఱు సేవ యొనర్తు రెంతయున్.

ఉ. కొందఱు సూర్యుఁ డంచు మఱికొందఱు పావకుఁడంచుఁ గొందఱా
యిందుఁడటంచుఁ గొందఱు సురేంద్రుఁడటంచు నబింద్రుఁడంచుఁ బే
ర్కొందురు; కొంద ‘ఱయ్యదియొకో’ యని సందియమందుచుందు రీ
చందమునన్ జగంబు పలుచాయల మాయలలోన మున్గెడిన్.

గీ. “ఎవఁ డెవనిఁగాని సేవించు నేమి కొదవ ?
సకల నదులును జలధికిఁ జను తెఱఁగున

సర్వదేవనమస్కృతుల్ సరసిజాక్షు
నంద పర్యాప్తము లటంచు" గొంద ఱండ్రు. ౧౪౯

వ. కొందఱు ప్రత్యక్షానుమానోపమానంబులనియుఁ గొందఱు ప్రత్యక్షానుమానోపమానశబ్దంబులనియుఁ గొందఱు ప్రత్యక్షానుమానోపమానశబ్దార్థాపత్తులనియుఁ బ్రమాణంబులు సెప్పుదురు. పౌరాణికులు మాత్రము సాక్షియు నైతిహ్యమ్మునుంగలియఁ బ్రమాణంబు లేడని యొప్పుదురు. తత్తత్ప్రమాణాగోచరంబై యొప్పునది పరశక్తియ కాని వేఱొండు కాదు. అమ్మహాశక్తి యంచు సృష్టిరూపమ్మునను విష్ణునందుఁ బాలనరూపమ్మునను శివునియందు సంహారరూపమ్మునను సూర్యునియందు దీప్తిస్వరూపమ్మును వాయువునందుఁ బ్రేరణస్వరూపమ్మునను వహ్నియందు దాహకతారూపమ్మునను వెలుంగుచుండు. ౧౫౦

ఉ. శక్తివిహీనుఁ డేపనికిఁ జాలఁడు ; శక్తియ సర్వభూతసం
సక్తతఁ జెంది సర్వకృతిసాధనమై తనరారుచుండు ; నా
శక్తియ ముక్తికారణము ; శక్తియ సర్వము ; శక్తి లేనిచో
శక్తులు గారు రుద్రహరిసారససంభవముఖ్యనిర్జరుల్ ౧౫౧

గీ. అమ్మహాశక్తి సగుణయు నగుణయునై నన
రెండుదెఱఁగులఁ దనరారుచుండు ; నందు
రాగులకు సగుణ సేవ్య ; విరాగులకును
నిర్గుణాత్మిక సేవ్య ; మునివరులార ! ౧౫౨

క. ఈ కలికాలమునందు న
నేకు లనేకులను గొల్చి యిహాముం బరముఁ

బోకడఁ బెట్టుదు, రల దే
వీకారుణ్యమ్ముఁ గాంచువిధము నెఱుఁగమిఁ౯. ౧౫౩

ఉ. వేయి కదుక్తు లేల ? యిఁక విష్ణువు గిష్ణు వటంచుఁ జెప్పుబల్
మాయలమారిపండితుల మాటలు నమ్మక, సర్వశక్తియై,
మాయకు లోను గాక, పరమప్రణుత ప్రథితప్రభావసు
శ్రీయుత యైన య జ్జనని సేవయె పావన మంచు నెంచుఁడీ. ౧౫౪

క. హరికతన విరించియు న
వ్విరించి కడ నారదుఁడును, విని రియ్యది; మ
ద్గురునకు న మ్మునిచెప్పె౯
గురుఁడిది యెఱిఁగించె నాకుఁ గోవిదులారా. ౧౫౫

క. ఆ శక్తి యనుగ్రహమునఁ
గేశవుఁ డటు మేలు కాంచి కెలన సభయబ్జా
నాశున్ గై తగువిధిఁ గని
పేశలఫణితి నిటు పల్కెఁ బ్రేమదలిర్ప౯. ౧౫౬

క. తపమును మాని యిచటి కే
నెపమున వచ్చితివి వత్స! నీ మనమిట్టుల్
దపియింప నేమి హేతువు
సెపుమా యన ధాత యిట్లు చెప్పెఁ దొడఁగ౯. ౧౫౭

క. భవదీయకర్ణమల సం
భవులై మధుకైటభు లనఁ బరఁగెడి రక్షః
ప్రవరులు ననుఁ జంపెద మని
బవరమునకుఁ బిల్చి రిఁకఁ దపం బెటు తండ్రీ! ౧౫౮

—* మధుకైటభ యుద్ధము *—

వ. ఇవ్విధంబునఁ గుయి వెట్టుటయు జలజలోచనుండు, ౧౫౯

క. భయపడఁగ నేల ? కడు దు
ర్జయు లగు దానవుల నెల్లఁ జంపెడి నాచే
వ యెఱుఁగవె ? యను నాలోఁ
బయిఁ బడి ర ద్దనుజవరులు పద్మజు నొంపన్. ౧౬౦

ఉ. వచ్చి విరించిఁ గాంచి "నినుఁ బట్టఁగ లేమని పాఱి వచ్చి తీ
వెచ్చట డాఁగినన్ విడుతుమే ? నినుఁ గావఁగ నీతఁ డోపునే ?
చచ్చెడివాఁడ వొక్కఁడవె చావక యీతనిఁ గూడఁ జంపఁగా
వచ్చినవాఁడ ; వింతగుణవంతులు లోకమునందుఁ గల్గిరే ; ౧౬౧

ఉ. చేసితిఁ బాఱిపోక యని సేయుము వీరుఁడవేని ; లేక మీ
దాసుఁడ నంచుఁ బల్కుము ; వృథావచనంబుల లాభమేమి? "యం
చా సురవైరు లిర్వురు రయమ్మునఁ బైఁ బడినంతఁ, గేశవుం
డోసరిలంగ నెంచు కమలోద్భవు వెన్కకుఁ జేర్చి యిట్లనున్.

ఉ. క్రిందను మీఁదనుం గనక పేర్చిలెద రింత మదంబు హెచ్చెనే ?
తొందర మానుఁ డిప్పుడ కుతూహలము న్నెఱవేర్తు రం డటం
చుం దలపడ్డ దానికి ససూయమెయిం గని యమ్మధుండు గో
విందుని మాఱ్కొనెన్ సమరభీకర బాహుబలాభిశోభియై. ౧౬౩

గీ. అంబ యాకసమందుండి యరయుచుండ
నంచ రౌ తంబునిధినుండి కాంచుచుండ
హరియు న య్యమరారియు నటిముటిగఁ బె
నంగ సాఁగిరి సంద్రదంబు పొంగి పోరల. ౧౬౪

గీ. బాహుయుద్ధంబుచేఁ గొంత బడలి యున్న
యన్న వారించి కైటభుం డసమభుజబ
లంబు దీపింప మల్లయుద్ధం బొనర్ప
దలపడియె ధాతమది కొంత తల్లడిలఁగ. ౧౬౫

ఉ. అన్నయుఁ దమ్ముఁడుం గలసి యా హరి నాహవకేళి బాహుగ
ర్వోన్నతి మార్కొనన్, జలధు లూరక తల్లడిలంగ సాఁగె; ని
ర్విన్నఁగ రాని విక్రమము సేఁబదివందల యేండ్లు సూప నా
పన్నగశాయికిన్ మిగుల భారముదోఁచెఁ గ్రమక్రమమ్మునన్.

క. ఏదియుఁ దోఁచక కడుఁ బెం
పేది ముదముఁ దక్కి యెట్టు లీ రక్కసులన్
బాధింతు నిచట నిఁక ది
క్కేది ! యనుచుఁ జింత సేయు నెష నాతనితోన్. ౧౬౭

వ. ఉక్కుమిగిలి రక్కసు లిట్లనిరి. ౧౬౮

చ. బవరము సేయఁ బూనుటకు బాహుబలం బుడివోయెనేనిఁ జో
పు విడిచి 'మీకు దాసుఁడను బ్రోవు' మటంచును బల్కు; మట్టి ప
లుకవిధికి నొప్పవేని, నినుఁగూల్చి, యనంతరముం దుఁ బాక[illegible]
ద్భవుఁ గడతేర్తు మన్న బెడిదంబునకున్ హరి సామమొప్పగన్.

క. అలసినవారల మిక్కిలి
సొలసినవారలను భీతిఁ జొక్కినవారిన్
దలఁకి యిలఁ బడినవారిన్
దలపడ రిది వీరవరులధర్మము యెంచన్. ౧౭౦

చ. అదియును గాక మీ రిరువు రాటను నేనొకరుండ నిట మీ
రదనుఁ బరిశ్రమాపహరణార్థముగా దొరకొంటి నేనునున్

గదన మొన ర్తు నొక్క తుటికాలము దన్కను విశ్రమించి ; యం
తదనుక నోపుఁడీ ! కదనధర్మము మర్మము మీరెఱుంగరే ?

చ. అనుదనుజారిపల్కు విని యద్దనుజుల్ తగ విశ్రమింపు మం
చును సమరంబు మాని యొకచోటను దాము విశ్రమించి ; ' రి
ప్ధనుజులు శక్తిదత్తవరదర్పితు ' లం చొగి దివ్యదృష్టిచే
త నతఁ డెఱింగి " చేసితి వృథారణ మేమి యుపాయమియ్యెడన్,

క. వీరలు స్వేచ్ఛామరణము
గోరి వరంబంది యున్న కుమతులు ప్రాణం
బేరికినైనను జేఁదే ?
వీరికి మృతి యెట్టు " లనుచు విహ్వలమతియై. ౧౭౩

ఆ. వె. ఎట్టి రోగియేని యెట్టి యాపన్నుండు
నేని యెట్టి రిక్తుఁడేని బ్రదుకు
నాస సేయుఁగాని, యాసింపఁ డెంతటి
మందుఁడేని తాను మ్రిందు తెలవు. ౧౭౪

వ. ఇట్లు, ౧౭౫

క. సారెకుఁ జింతిలి " దేవీ
కారుణ్యము లేక వీరిఁ గడతేర్పఁగ రా
దేరికి " నంచును సద్దను
జారి నుతింపం దొడంగె నజ్జగదంబన్. ౧౭౬

చ. జనని ! జగద్విరోధిజనసంహరణప్రవణ ప్రభావ ! మో
హిని ! పరతత్త్వరూపిణి ! మహేశ్వరి ! కామితదాయినీ ! జగ
జ్జననవిధాయినీ ! సతతజాగరిణీ ! కరుణానుసారిణీ !
నిను నుతియింపనేరఁ గరుణింపుము నింపుము కూర్మి నాపయిన్

క. నీ విచ్చిన వరమునఁ గడుఁ
గావరముం జెంది యనికిఁ గాల్ద్రవ్వి రి త
ల్లీ! వీ రిరువు రోకరుఁడను
నే వాఁడిమి చూప నేర్తునే? వీరలపై. ౧౭౮

క. ఈయెడ వీరల జంపు ను
పాయము వేఁడొందు నీ సహాయము దక్కన్
నా యెఱిఁగినంతలో లే
దో యమ్మా! యూరకుంట యుక్తమె? సిరుల్. ౧౭౯

గీ. ఈ వృపేక్ష యొనర్చిన నిపుడ నన్నుఁ
బట్టి చంపెదరమ్మ! యీ పాపకర్ము
లనుచు విలపించుహరిఁ గాంచి యంబ పలికెఁ
జిఱునగవు నెమ్మొగమ్మునఁ జెంగలింప. ౧౮౦

క. "నా మాయచేతఁ గప్పెద
నీ మానవ భక్షకుల జయింపు" మనుడు సం
గ్రామమున కభిముఖుండగు
దామోదరుఁ గాంచి మిగుల దర్పమెలర్పన్. ౧౮౧

'జయముఁబరాజయమ్ము సహజమ్ములుశూరులకున్ బరాజయో
దయమునకున్ గృశింపకుము; దానవులెందఱినేని మున్ బరా
జయమున ముంపవే! జయము శాశ్వతమే?' యనిపల్కు దానవ
ద్వయిఁగని మాధవుం డనుగతప్రణతప్రథితప్రతాపుఁడై. ౧౮౨

క. కడుఁ గర్కశ మగుగతి నె
క్కుడు కోపము గదుర నెదురుకొని ధీరత్వం

బడరంగ దనుజులం బిడికిటం
బొడిచిన నప్పాంసుపునడియుం బొగరుమిగులంగన్. ౧౮౩

క. ఒక్కమ్మడి నా నిరువురు
రక్కసు లార్పులు సెలంగ రక్తము తోడ్తోం
గ్రక్కుచు స్రుక్కంగ నెక్కొని
యక్కమలాక్షుని యురంబు నదరన్ బొడువన్. ౧౮౪

వ. హరియును మరలన్ బొడిచె నిట్లు పరస్పరజయేచ్ఛం గొంతవడి సంకులంబగు సంగరంబు ప్రవర్తిల్లుటయు. ౧౮౫

క. ఘామ్మునం నెత్తురు గ్రమ్మంగ
సామ్మసిలి రమాధవుండు చూడ్కుల దీన
త్వమ్ము గదురంగాం దన కూ
ర్ధ్వమ్మునం గనుపట్టుదేవి బావనిం గాంచెన్. ౧౮౬

ఉ. చూచినయంత నా త్రిపురసుందరి లో దయమీఱ, మారనా
రాచములో యనందగు నరాళకటాక్షపరంపరన్ దమి
స్రాచరయుగ్మముల్ బొదువ రక్తిమెయిన్ దనుజన్ము లా యమం
జూచుచుం గామబాణముల సొక్కిరి తక్కిరి యుద్ధపద్ధతిన్. ౧౮౭

శా. ఆ మందస్మిత మా కటాక్షవిభవం బా భావ మాహావ మా
గోమునోమ్మును బ్రేమ మీఱం గని సంకోచించుచున్ గామసం
గ్రామార్థంబు ప్రయత్నముల్ సలుపు రక్షస్సావ్యములన్ మాధవుం
డామోదమ్మునం జేరి యిట్లనియె ధైర్యస్థైర్యసంపన్నుండై. ౧౮౮

ఉ. ఎందఱినేని మున్ను దనుజేంద్రులం జూచితింగాని మిమ్ము బో
లం దగువార లే రణకలావిభవమ్మున ? మీ రణంబు నా

డెందమునందు మోదము ఘటింపఁగఁ జేసె; భవన్మనోరథం
బుం దెలియంగఁజేయుఁడది పూర్తి యొనర్తునటన్న రక్కసుల్,

తే. గీ. అమ్మహామాయచే మోహితాత్ములైన
కారణంబున నభిమాన శూరులగుచుఁ
గల్లఁ గపటంబు నెఱుఁగక కంజనేత్రు
నీసడించుచు దరహాస మినుమడింప, ౧౯౦

గీ. నిన్నడుగువారమే మేము? నీవు మాకు
దాతవే? చాలు నింత యాతరము లేదె?
వలసె నేనియుఁ గోరుకొ మ్మెలమి మేమ
వరము నీకిచ్చెదము నాఁగ హరియు నెఱిఁగి, ౧౯౧

క. ఏఁ గోరినవర మొసఁగెద
రాఁగా? నాయుద్ధ మాత యానందము మీ
కీఁగలిగెనేని వధ్యులు
గాఁగోరెద ననుచు వాండ్రు కళవళపడుచున్, ౧౯౨

వ. కొండొక చింతించి, ౧౯౩

గీ. సత్యపరిపాలనమ్మును సలిపెదేని
మాకు వర మిచ్చెద నటన్న మాటదలఁచి
జలము లేని విశాలదేశమున మమ్ము
నొంపు మట్లైన నీకు వధ్యులము మేము. ౧౯౪

క. అని దనుజులువల్కినన
వ్వనజాక్షుం డట్ల సేయువాఁడై నగి య

మ్మనుజాశనుల వధింపఁగఁ
దన యూరులు పెంచి "రండు దానవు" లనుచున్,

వ. వారును దదధికంబుగ శరీరమ్ము పెనిచిన, ౧౯౬

క. అసురారి యూరువులు ర
క్కసు లంగము లిట్లు పెనుపఁగాఁ దుదకా రా
క్షసుల శరీరమునకు వె
క్కస మయ్యెఁ దదూరువు లధికము లగుకతనన్. ౧౯౭

వ. అంత, ౧౯౮

క. తన యూరుభాగమును జెం
దిన హరియును వారలన్ వధింపఁగఁ జక్రం
బును దలఁచిన నది వైళమ
దనుజన్ములఁ బ్రాణములకుఁ దక్కన్ జేసెన్. ౧౯౯

ఆ. వె. వారిమెదడు జలధివారిలోఁ బడి పెద్ద
తిప్ప యయ్యె వసుమతికిని నాఁడు
మొదలు 'మేదిని' యనుపదము తటస్థించెఁ
దాన మన్ను తినఁగ రానిదయ్యె. ౨౦౦

గీ. నాయెఱిఁగినంత మీకు విన్నపము చేసి
కొంటి సగుణయొ లేక నిర్గుణయొ సేవ
నీయ పరశక్తియే యింత నిజము నిజము
వేదశాస్త్రంబు లియ్యెడ విశ్రుతములు. ౨౦౧

—* వ్యాసునకు హరుఁడు ప్రత్యక్షమగుట. *—

క. అని చెప్పిన సూతుం గని
మును లిట్లని రట్లు వ్యాసమునిచంద్రుఁడు హే
మనగమునకుఁ దపమునకై
చనె నని చెప్పియును దత్ప్రసంగవశమునన్. ౨౦౨

గీ. ఇతరకథ లెన్నియో చెప్పి తీవు మాకు
మొదటివృత్తాంత మది తుదముట్టదయ్యె
నదియ మా కెఱిఁగింపవే యనెడి మునుల
కిట్లనియె సూతుఁ డాదరం బెసక మెసఁగ. ౨౦౩

సీ. అట్లు హేమనగమ్మునందలి కర్ణికా
ర వనమ్మునందు నారదుఁడు మున్ను
తనకుఁ జెప్పిన మంత్రమును జపించుచుఁ "పంచ
భూత వీర్యుండగు పుత్రుఁ డుద్భ
వింపఁగావలె" నంచు వేదాంతవేద్యయై
తనరుశక్తిని జిత్తమునఁ దలంచి
శతవత్సరమ్ము లశనము వర్జించి త
పం బొనర్చుచునున్న వ్యాసమునికి

గీ. కెంజడలు గట్టె శిరము, శుష్కీభవించెఁ
దనువు, కంపించె భూనభోంతరము లెల్ల
దాన నింద్రుఁడు భయమంది తాను సురలు
శివునిపాలికిఁ జని యిట్లు చెప్పికొనిరి. ౨౦౪

గీ. దేవ! దేవేశ! సత్యవతీ సుతుండు
తప మొనర్చుచు నుండె వత్సరములొక్క

నూఱు గతియించె దానఁ దుందుడుకు పుట్టెఁ
బ్రోవవే! యన నమ్మహాదేవుఁ డనియె. ౨౦౫

గీ. తాపసుల కపచారముల్ దలఁప రాదు
వార లోరులను భాధించువారు కారు
ఇమ్ముని సుతార్థియై నన్ను నెడఁద శక్తి
సంయుతుని నిల్పి జపియించు జంభభేది! ౨౦౬

వ. అని చెప్పి యద్దేవుండు సశక్తికుం డగుచు మునికిఁ బ్రత్యక్షమై యతని మనోరథంబు సఫలంబుగా వరం బొసంగినఁ గృష్ణద్వైపాయనుం డయ్యనఘునకు నమస్కరించి తదాజ్ఞ వడసి స్వాశ్రమంబున కరిగి, ౨౦౭

మ. అరణిం దెచ్చి మథించి యగ్నికయి యం దావిర్భవం బందున
గ్నిరుచిం గాంచి యెసంగు తేజమున వీనింబోలు పుత్త్రుక్ యశ
స్కరు నే నేగతిఁ గాంచువాఁడ? సుతసంస్కారమ్ము గావించున
య్యరణుల్ యోగ్యత గల్గుకామినులు నా కాభాగ్య మిప్పున్న దే!

వ. అని మఱియును, ౨౦౯

సీ. తనయిచ్చుఁ బోవుజంత్రిపుముద్దుకీల్బొమ్మ
విందుగాఁ దగు చేఁదు వేముచెట్టు
అనుమానములకుఁ గట్టనికొంప ప్రక్కలో
నొఱపు నించెడి వాఁడికఱకుటమ్ము
పొల్లుగాఁ బున్నెముల్ జల్లించుజల్లెడ
భ్రాంతి పుట్టించు నబ్రింపుమందు
పెనుదోషములకుఁ బెట్టినపేరు దుఃఖంబు
సౌఖ్యమ్ముగాఁ జూపఁజాలువిద్య

గీ. కాలిసంకెల బొంకులకాలయంబు
మచ్చికఘటించుపాము కామములదీము
కోపములపాఁపు మిత్తిగెకొన్నరూపు
గాదె కామిని; యిట్టిసంగాత మేల ? ౨౧౦

గీ. అనుచుఁ జింతించుచున్న యావ్యాసమునికిఁ
గన్పడె ఘృతాచి గగనభాగమ్మునందు;
దానిఁ గనుఁగొన్నమాత్రన గాననయ్యె
మదనుఁడును గోపఘూర్ణితవదనుఁడగుచు, ౨౧౧

క. కనుఁగొని యయ్యది తనువం
చనఁ జేయఁగ వచ్చినదని సందియపడి కా
మునిబారిఁ బడియుఁ గసుగం
దని తెలివికతమున నిట్లు తలపోసె మదిన్. ౨౧౨

ఆ. వె. ధర్మచింత సేయుతఱి నేలవచ్చె నీ
కలికిమిన్న ? వచ్చుఁగాక దీనిఁ
గొని సుఖింపరాదె ? కొనిసుఖించిన మునుల్
నవ్వకుందు రెట్లు నన్నుఁ జూచి ? ౨౧౩

గీ. నగిన నేమగు ? నీకాంత నాకనంత
సుఖ మొసఁగి మది నాపయిఁ జొనుపునొక్కొ ?
మును పురూరవు నూర్వశీవనితవిధము
చేసి వలవంతలకుఁ బాలు సేయునొక్కొ ? ౨౧౪

క. అని వ్యాసుఁడు చింతాకుల
మనస్కుఁడయ్యె నన మానిమణులెల్లరు సూ
తునిఁగాంచి యప్పురూరవుఁ
డన నెవ్వఁడు తెల్పుమనిన నతఁ డిట్లనియెన్. ౨౧౫

—* బుధోత్పత్తి *—

ఆ. వె. కలదు తార యనెడికామిని యలబృహ
స్పతికి దార గుణవిచారదూర
విజితమారదార విపులకటీభార
కడునుదార చారుకాంతిపూర. ౨౧౭

క. ఆరామ యొక్కదినమునఁ
దారాపతియింటి కరుగ దానియొయ్యారం
బారసి యారసికాగ్రణి
మారశిలీముఖవిదార్యమాణుం డయ్యెన్. ౨౧౮

క. ఆకాంత తమీకాంతుని
యాకారముఁ గాంచి విస్మితాంతరయై యు
ద్రేకంబుఁగొని యుఁగోన
నా కాముని బారిఁ బడియెనట యేమందున్ ! ౨౧౯

మ. ఇటు లన్యోన్యమనోనురాగములపెం పేపార నాతారయున్
గుటిలాత్ముండగు చంద్రుఁడున్ గలిసి కోర్కుల్ మిన్నుముట్టంగ లం
పటులై సౌఖ్యము సోలుచుండి రఁట ! చెప్పన్ శక్యమే దైవసం
ఘటనానైపుణి,యాతఁడయ్యదియు! యక్కంజాక్షి యేయాతఁడో!

గీ. ఇటు లనేకదినమ్ము లయ్యెందునింట
నుండి రాకున్న గురుఁడు నయ్యువిదకొఱకు
శిష్యు నొక్కని నంపె దేశికునియాజ్ఞ
వాఁడు దెల్పిన వినదయ్యె వారిజాక్షి. ౨౨౦

వ. పిదప నయ్యంతేవాసి గురుసమీపమ్మునకుం జని సకల వృత్తాం
తమ్ము నెఱింగించుటయు బృహస్పతి చింతాకులుండై మఱియొకరు
నింకొకరు వేఱొకరు నంపియుంపి విసివివిసివి తుదకు రోషారుణి
తాక్షుండగుచుఁ జంద్రుపాలికిం జని తన్నుం గాంచి మదమ్మున నగు
నతని కిట్లనియె. ౧౨౧

శా. ఔరా! చంద్ర! వివేకహీన! గురుభార్యన్ జైకొనన్ జెల్లునే?
యీరామన్ మరుకేళి కాసపడిగా కిట్టెట్లు నీవుంచితో
రీ! రాత్రించర! యూరకే గృహమునం దీయింతిఁబోషింతువే?
మేరన్ మీఱితివీకు నేఁడు యముఁడున్ జామిన్మౌ, శాస్త్రజ్ఞులుండా!

గీ. బ్రాహ్మణునిఁ జంపువాఁడును కల్దాగువాఁడు
కనకహారియు గురుకాంతఁ గవయువాఁడు
వీరలును వీరితోఁ జెల్మిఁ గోరువాఁడు
గలసి పంచమహాపాతకులు దలాప. ౧౨౩

ఉ. కావున నిట్టిపాతకికిఁ గల్గునె స్వర్గనివాస, మోరిచం
ద్రా! విడు మీవెలంది, గురుదారయుఁ దల్లియు నొక్కరూప కా
దే! వివరించి చూడుము మదిన్, మతిమంతుఁడ వీ తెలుంగనే?
దేవతలెల్ల నవ్వరె? విధింపరె శిక్ష నిలింపభర్తయున్? ౧౨౪

వ. అని కోపోద్రేకంబునం బల్కు దేవమంత్రిం గని చంద్రుండు సల్లాప
నిట్లనియె. ౧౨౫

ఉ. కోపము బ్రాహ్మణోత్తములకున్ దగునే? యిదె తేపొ మాపొ తా
నే పయనంబు సేయఁగల దిప్పుడె యంచొక ధర్మశాస్త్రమా?
కాఁపురముండునే! యిచటఁ, గాఁపుర మున్నను లోపమా! మన
స్తాపము చెందనేటికి? బుధప్రవరత్వ మదెల్లఁబోల్లుగన్. ౧౨౬

క. వనిత పరపురుషుఁ గలిసియు
అనఘ యగు రజఃప్రసక్తి; నగ్రజుఁ డఘముం
బొనరించి నైదికకర్మం
బున శుద్ధుండగు; నటంచు మును నీ వనవే? ౨౨౭

వ. అని సయుక్తికమ్ముగాఁ బల్కు-శిష్యునికి మాఱాడం జాలమి మన
మ్మున విషాదంబు పెనఁగొనంగ నిజగృహమ్మునకుం జని కొన్ని
దినమ్ములు ప్రతీక్షించి భార్య రాకుంటకుఁ జింతాక్రాంతుండై
మదనపీడితుండై మరల శిష్యునిపాలికిం జనునెడ ద్వారికునిచే
నివారింపఁ బడి కన్నుల విన్నదనంబు వొడమఁ గోపాటోపంబు
దీపింప నెలుఁగెత్తి యిట్లనియె. ౨౨౮

ఉ. ఓరి! దురాత్మ! యెంతటి దురాచరణం బొడిగట్టినావురా!
దారను చూడనేగు నను ద్వారమునం దొకఁ డాఁగువాఁడె? నా
నీరజనేత్రి నా యతివ నీకు స్వతంత్రమె? నాకు దూరమే?
ధీరవినింద్య నిన్నుఁ గడతేర్చెద శాపమొసంగి నావుడున్. ౨౨౯

చ. వెలఁది వెలంది యంచుఁ బలవించెదవేల! సమస్తలక్షణం
బులు గల యీనెలంత నినుబోటి దరిద్రునియింట నుండ రా
వలయునె? యింతి కావలసివచ్చిన నీ కెనమైన బోటితోఁ
గలిసి సుఖింపు, మీ జలజగంధినిఁ గూడి సుఖింప నేర్తువే? ౨౩౦

క. చదివితివి సకలవిద్యలు
మదనాగమ మీ వొకింత మదినెఱుఁగవయో!
ముదిత తగువానిఁబొందున్
వదలున్ దూరమునఁ దగనివాఁడగు నేనిన్ ౨౩౧

ఉ. ఇంత విచార మేల? విను మే బహుభాషలవాఁడఁ గాను ; నీ
యింతి నొసంగ ; నీవిఁక యథేచ్ఛఁ జనం దగుఁ ; గామబాధిత
స్వాంతుఁడవైన నీ వొసఁగుశాపము నన్ దగులంగఁ బోదు కా
నంతయు ; నీకుఁ జేయఁదగునంతయుఁ జేయుము పొమ్ము నాపురిన్ ;

వ. గురుండు చేయునది లేక యింద్రపాలికిన్ జనుటయు, ౨౩౩

ఉ. వచ్చిన దేవమంత్రిముఖువైఖరి వేఱొకరీతిఁ దోఁపఁగా
నెచ్చట నేయుపద్రవము నెవ్వరిచే నితఁడొందె నొక్కొ? యా
చచ్చపు భక్తిమై నతని నర్చితుఁ జేసి మహాత్మ! యెంతయున్
సచ్చరితుండ వీ విటు విచారము నొందఁగ నేల చెప్పుమా.

గీ. నాకు గురువైన నీకు బన్నం బొనర్పఁ
గా నెవఁడు సాహసించె! నవ్వానిఁ జెప్పు ;
మీక్షణము సంహరించెద ; నిందు నాకు
హరిహరబ్రహ్మలును బాస టగుట ధ్రువము. ౨౩౪

క. అన గురుఁడిట్లను నా భా
ర్యను జంద్రుం డపహరించె నకటా! బతిమా
లిన 'నీను పొమ్ము పొ' మ్మని
యెను నా గృహిణీలలామ నిప్పింపఁగదే. ౨౩౫

సీ. అంగనామణి లేని యాశ్రమంబు శ్రమంబు
భార్య లేకున్న సంపత్తి మిత్తి
అర్ధాంగి పెట్టని యన్నంబు సున్నంబు
సహధర్మిణికిఁ గాని శయ్య కొయ్య
గృహిణి పొందిక లేని కేలిక తేలిక
యిల్లాలు లేకున్న యిల్లు ముల్లు

సహచారిణికిఁగాని సంగంబు భంగంబు
సతిచేతఁ బెరుఁగని సుతులు మృతులు

గీ. తెల్పుఁడవు గాన నీతోడఁ జెప్పికొంటి
నా తలోదరి నిప్పించి నా మనోర
థమ్ము నీడేర్పు; మీరీతిఁ దలఁపవేని
సన్న్యసించెదఁగాని సంసారమొల్ల. ౨౩౭

చ. అని వచటన్ మునుంగు గురు "నాతురతం గననేటికయ్య? యా
వెను నొకయింతలోన విడిపించెదఁ, గాదని చంద్రుఁ డెంతయున్
విసిక బలాత్కరించినఁ బవిం జవిఁజూపి మదం బడంతు దు
ర్జనుఁ [illegible] సల్పెసహో" యని చింతనొందుచున్;

వ. వస్త్రన్నం బుపదేశించి దూతం బుచ్చుటయు వాఁడు శశిపాలికిం
జని, ౨౩౮

సీ. కన్నసంతానంబుకన్న నెక్కుడుగార
వించి పెంచుటయైన నెంచవైతి
గురుభార్య తల్లి కెక్కుడటంచు వచియించు
ధర్మశాస్త్రంబైనఁ దలఁపవైతి
మునులకెల్లను శిరోభూషణం బగుతండ్రి
పరువాక్కింతైనఁ గాపాడవైతి
సరిగాఁ జదువుకొన్న సహపాఠులగు మాదృ
శుల ప్రతిష్ఠలనైనఁ జూడవైతి

గీ. ధర్మవిదుఁడవు నీతిశాస్త్రజ్ఞమతివి
రాజవు కలానిధివి ద్విజరాజటన్న

యశము గైకొన్న మేటి వయ్యయ్యో! చంద్ర!
గురుకళత్రంబుతోఁ బొందుఁ గోరఁదగునె? ౨౮౦

క. ఇరువది యెనమండ్రు తలో
దరులుండఁగ మేనకాది ధనకామిను లు
ద్ధుర యౌవనవతు లుండఁగ
దొరకెనె గురుకాంత నీకుఁ? దోయజవైరీ! ౨౮౧

క. నీవంటి తెలివి గలిగిన
కోవిదుఁ డిటువంటి పనులకుఁ జొరఁబడఁగా
నేవాఁడు సంశయించును?
నీ వెఱుఁగవె, ధర్మనియతి నిలుచునె యంకా? ౨౮౨

క. పలుమాట లేల దేశిక
కళత్రమును విడిచి పెట్టఁగాఁ దగు, మనకుఁ
గలహమ్ము పాడియగునే?
కలహమునకుఁ గాంత ముఖ్యకారణమకటా! ౨౮౩

క. తనపడఁతి నొకరుఁడంటఁ
దనకుఁ మన మెట్లు పొగులుఁ దా నన్యసతిఁ
గొన వాని మనము నట్లే
యనుకొనఁదగు భార్య గోప్యయగు నెల్లరికిఁ. ౨౮౪

క. అని పలుకు మనివె నీతోఁ
దన పలుకులుగా బలారి తగ ననఁ జంద్రుం
డనుమానింపక దూతం
గని యిట్లనెఁ గనుల నగ్ని కణములు రాలన్. ౨౮౫

పరులకు బుద్ధులం గఱపవచ్చునుగాక, మఱేమి? కోడియై
పరమ పతివ్రతఁ దపసి భార్యను బట్టిననాఁడు బుద్ధిఁ జె
ప్పిరె తన కెవ్వరేనిఁ? దన వెఱ్ఱి తనుఁ మఱపించుఁగాక, యొం
డొరు మఱపింప నేర్చునె; యహో! బలవైరియుఁ జెప్పనంపెనే!

క. గురుభార్య తల్లి యనెడి ప్ర
కరణమ్మున భ్రాతృభార్యఁ గవయుట వేశ్యా
తరుణిం గూడుట యని తన
గురువునకుఁ జెప్పె నేమొకో! ధర్మమ్ముల్. ౨౮౭

గీ. ఔఁగదా! యెల్లవారు బృహస్పతి ప్ర
ణీతమగు ధర్మశాస్త్రమ్ము నూఁతఁ గొనుట
అతఁడ చెప్పఁడె "తనకుఁ దానయి వలచిన
తరుణి గవఁ గూడకున్నఁ బాతకమటంచు. ౨౮౮

గీ. బలవిహీనుని కన్యని భార్య యంచుఁ
దన కళత్రం బటంచు భేదంబు గాని
సొగసు గలదెల్లఁ దనచేతి సొమ్ము కాక
బలము గలిగిన వాని కేర్పాటు కలదె? ౨౮౯

క. ఈ గుబ్బెత నాయందను
రాగాతిశయమ్ము మై భరంబిడె నిఁక నే
నేగతి విడిచెద ధర్మం
బేగతి నొప్పికొను న్యాయ మేగతిఁ జెల్లుఁ? ౨౯౦

క. న్యాయంబు విడిచి యీ యొల
ప్రాయంపుం గుబ్బలాఁడి వదలిన నన్నుఁ

బాయుటయ తక్కఁ దన్నుం
జీ యని రోయక సుఖింపఁజేయునె చెపుమా ? ౨౫౧

గీ. సోదరుని భార్యఁ దాఁ గూడు టెంది గాఁగ
సీతలోదరి కెంతయు నేవ మొదవె
నేమి లాభమ్ము గురునియం దీవెలంది
మనము రమియింప దెందు కీ మమత తనకు ? ౨౫౨

గీ. పలుపలుకు లాడ నేల ? యీ పలుకు వినుము
దీనికై ప్రాణములకైనఁ దెగుదుఁగాని
యొండుఁ దలఁప నటంచుఁ జంద్రుఁడు సెప్పె
ననుచు నీరాజుతోఁ జెప్పికొనుము పొమ్ము. ౨౫౩

చ. అనుటయు దేవదూత చని యంతయు నింద్రునకుణ్ వచించె దా
నిని విని " చంద్రుఁ డింతటి పనిణ్ బొనరించియు నింత సాహసం
బొనరుప నెంచినాఁడె " యని యుద్ధురకోపవిఘూర్ణమానసలోఁ
చనుఁడయి చంద్రునిం బొదువ సన్నహనం బొనరించె సైన్యముఁణ్.

క. శీతాంశునకును నింద్రున
కీ తీరుగఁ బోరుగలుగ నిజ్యాహితుఁ డా
దైతేయగురుఁడు శిష్య
వ్రాతముతోఁ దోడుపడెఁ గువలయ హితునకుణ్.

క. గురువైరి శుక్రుఁ డింద్రుని
బురికొల్పెఁగదా ! యటంచుఁ బురవైరి కృపా
కరమతి గురుపక్షమునం
దురముణ్ బొనరింపవచ్చె దుస్సహశక్తిణ్. ౨౫౬

గీ. వారలకు వీరలకుఁ బోరు ఘోరమయ్యె;
సంచలించెను సర్వ ప్రపంచములును
హంస వాహనారూఢుఁడై యజుఁడు వచ్చెఁ
బోరు వారించి కార్యంబు పొసఁగఁజేయ. ౨౫౭

క. పదఁపడి చంద్రుని గనుఁగొని
" వదలుము గురుభార్య, నట్లు వదలవ యేనిన్
మద మడఁగించెదఁ జుమ్మా
గదాధరునితోడఁ జెప్పి కమలారాతీ! " ౨౫౮

అని శుక్రునిం బిలిచి, ౨౫౯

క. తగునె బృహస్పతిపైఁ గల
పగచేఁ జంద్రునకుఁ దోడుపడి యిప్పట్లన్
బగదీర్చుట? యిది విని రో
మగనిన్ విడనాడ దే రమణి వ్యాజమునన్? ౨౬౦

క. అని చెప్పిన శుక్రుఁడు " నీ
జనకుఁడు నన్ గోరె గురుని జాయను వదలన్
జనుఁ, దాత కూడఁ జెప్పెడి "
నన విడిచెన్ గురుని పత్ని నంతర్వత్నిన్. ౨౬౧

ఆ. వె. చంద్రముక్త యైనసతిఁ గొని యా బృహ
స్పతి గృహమ్ముఁ జేరి సంతసించె
శంకరాది సురలు చనిరి యథేచ్ఛను;
గొమరుఁ గనియె నంత గురుని భార్య. ౨౬౨

ఆ. వె. గురుఁడు మోదమంది కొమరునకును జాత
కర్మ మాచరింపఁ గడఁగుటయును

నా యుదంత మంత నాలించి కీలెంచి
శీతకిరణుఁ డొక్కదూత నంపె. ౨౬౩

వ. దూతయు బృహస్పతి పాలికిఁ జని చంద్రు వచనమ్ములుగా
నిట్లనియె. ౨౬౪

గీ. వీఁడు నీదుకుమారుండు గాఁడు మామ
కీన తేజోభవుం డట్టి వీని కెట్లు
జాతకర్మాదికంబును సల్పితీ వ
టంచుఁ బల్కెనఁ దా నిట్టులనియె గురుఁడు. ౨౬౫

గీ. నా తనూజుండు వీఁడు చిహ్నముల చేత
గాని రూపమ్ముచేఁ గాని వానిఁబోలు
వాఁడుగాఁడు ; మత్సదృశుఁడే, వా స్తవమిది
యనుడు ; సకలమ్ము దెల్పెఁ జంద్రునకు దూత. ౨౬౬

క. తెలిపిన సరసిజవైరియుఁ
గలహమునకు వచ్చె దైత్యగణములు గొలువన్
గలహం బీగతి బునరు
త్కలితంబై యెసఁగె దేవదానవతతికిన్. ౨౬౭

వ. అంత, ౨౬౮

గీ. సరసిజాసనుఁడే తెంచి సంయుగమ్ము
వలదనుచు వారి వారించి కలహమునకుఁ
గారణంబగు గురుదారఁ గాంచి పలికెఁ
గోపమును బెద్దటికమును గొంత యెసఁగ. ౨౬౯

క. పడుచుఁదనపుఁబనిచే నీ
గాడవం గొని తెచ్చి తీవు కోమలి ! నీ కీ

కొడుకు కెవనివలనఁ గలిగెనో
తడయంగా నేల చెప్పఁ దగదే మాకుఁ? ౨౭౦

ఆ. వె. సిగ్గు చిన్ననాఁడ చెడిపోయెఁ బో! కొంత
కొంతపోయెఁ జంద్రుఁ గూడునాఁడు
కొడుకుఁ గంటిగాదె కోమలి? యిఁకనున్న
దియును లేనిదియును బయలఁ బడియె. ౨౭౧

గీ. నీవలనఁగాని వీరి సందియము తీఱ
దతివ! గురుతేజమో? లేక యబ్జవైరి
తేజమో? తెల్పరాదె; యీ తీరు నీదు
తలన పుట్టెనె? తప్పునే దైవకృతము. ౨౭౨

క. అను కమలాసను మొగముఁ
గనలేక శిరమ్ము వంచి కడుసిగ్గున మె
ల్లన నిట్లనెఁ దారయుఁ "జం
ద్రునకే చంద్రునకె చందురునకే" యంచున్. ౨౭3

ఆ. వె. పద్మసూతి యంత బాలు నిశ్శంకఁగాఁ
దొగలఱేని కిచ్చి తగవు దీర్చె
మిగుల సంతసించి మేలెంచి బుధుఁడంచుఁ
బేరుఁ బెట్టికొనెఁ దుషారకరుఁడు. ౨౭౪

ఆ. వె. గురుకళత్రమందుఁ గువలయహితునకు
బుధుఁడు పుట్టె నిట్లు బుధుని వలన
నల పురూరవుండు కలిగిన చందంబు
నెఱుఁగఁ జేసెదను మునీంద్రులార! ౨౭౫

—* పురూరవశ్చరిత్ర *—

క. ఖద్యోతతేజుఁ డతి సం
పద్యుతుఁ డుద్యద్యశః ప్రభావుఁ డపర
ప్రద్యుమ్నుఁడు సుద్యుమ్నుఁ డ
భేద్యాభిద్యోతమాన వీర్యుఁడలరున్. ౨౭౬

వ. ఆతం డొక్కనాఁడు కతిపయామాత్య సహితుఁడై సైన్యసమేతం
బుగా సైంధవం బెక్కి ధనుర్బాణమ్ములు ధరియించి మృగయా
వినోదమ్మున నానావిధ మృగమ్ముల నుక్కడంచుచుఁ గుమ్మరు
వాఁడు ముందట, ౨౭౭

చ. చని చని కాంచె నొక్కెడఁ బ్రశస్త తర స్తబకాభిశోభి నూ
తనకనదాగమాగమసదాగతి చాలిత మాలతీ లతా
త నిబిడకుంజపుంజ సుఖితప్రమదప్రమదావిపంచికా
స్వనమిళితాళికోకిలరవంబు కుమారవనంబు డంబుగన్. ౨౭౮

క. కని యవ్వనముఁ బ్రవేశిం
చిన తత్క్షణమంద వింత చెలువుగ వనితా
జనతాఘనతారుణ్యాం
బెనసిన యొక కన్నెరూప మెలమిన్ గాంచెన్. ౨౭౯

గీ. తోడవచ్చిన సేనయు నాఁడురూపు
గాంచె, నశ్వంబు బడబయై కానిపించె
నిట్లగుట కాత్మ నాశ్చర్య మినుమడింపఁ
గారణంబించు కేనియుఁ గానలేక, ౨౮౦

సీ. సామంతరాజన్య సంఘంబుతోఁ గొల్వు
కూటమ్ములో నెట్లు గూరుచుండు

నంతఃపురీవసతాంతామణుల కోర్కె
లెటేఁగి వారల చిత్త మెట్లు గొందు
గర్వించు శత్రువర్గంబు పైఁబడి రాఁగ
వారలతో నెట్లు పోరొనర్తు
పురుషయోగ్యంబైన భూపాలకత్వంబు
సిగ్గు లే కే రీతిఁ జేసికొందు

గీ. కటకటా! పూర్వకృత పాతకంబు గాక
పనికిమాలిన యీ యాఁడుతనముకన్నఁ
గలదె దురవస్థ? దైవంబు కరుణ దప్పె
నంచు యోజించుఁ గడు విలపించు నృపుఁడు. ౨౮౧

వ. అను సూతుం గాంచి మునీంద్రు "లోమహాత్మా! యివ్విభుం డ
వ్వనంబున నేమికతంబున స్త్రీత్వంబునందె నని యడుగుటయు
నతండిట్లనియె. ౨౮౨

చ. సనకసనందనాదిముని సత్తము లొక్కెడ దేవదేవునిం
గనఁ జన, దేవదేవి తనకాంతుని డాతొడ వస్త్రహీనయై
మనసిజకేళి నుండి, యట మౌనిసమాజము గాంచి, సిగ్గు మే
కొన వసనంబు దాల్చెఁ గడుఁ గొం కెసఁగగ్, ధరియించునంతలో

గీ. కాముకులసౌఖ్యమునకు విఘ్నం బొనర్పఁ
దగ దెవరికేని యని మునుల్ త్వర మెలర్ప
నరిగి రటనుండి నారాయణాశ్రమంబు
పార్వతియు సిగ్గుచేఁ దలవంచి యుండె. ౨౮౩

గీ. సిగ్గుచే మ్రగ్గు సతిఁ గాంచి శ్రీగళుండు
పలికె "నెవ్వఁడు గాని యివ్వనముఁ జొచ్చు

నంతనే స్త్రీ స్వరూపంబు నందు" నంచు ;
నదికతమ్మునగ స్త్రీత్వంబు నందె నితఁడు. ౨౮౫

క. అన విని మును లవ్వలికత
వినుపింపు మటన్న నట్లు వెలఁదియయి యతం
డనుఁగుం జెలికత్తెలతో
వనమున నిళ యనెడి పేర వర్తించునెడన్. ౨౮౬

క. వనమునఁ దిరుగుచు బుధుఁ డ
వ్వనితామణి పసిఁడిబొమ్మ వడువునఁ దనలో
చనములకు ముదం బొసఁగుడు
వనజాతాంబకుని బారిఁబడి వగఁజెందెన్. ౨౮౭

క. ఇళయును బుధునిం గని మేల్ !
బళి ! యని తగ మెచ్చి తనకుఁ బతిగా సతనిన్
వలచె ; నిరువురకు సుతుఁడై
వెలసెఁ బురూరవుఁ డనూనవిభవోజ్జ్వలుఁడై. ౨౮౮

క. ఇళ కొమరుఁ గాంచి తనకుం
గుల గురుని వసిష్ఠుఁ దలఁచికొనె వగపునఁ గొం
దల మందెడి సుద్యుమ్నుని
కల తెఱఁగు నెఱింగి యతఁడు కరుణార్ద్రుండై. ౨౮౯

వ. భగవంతుండగు నమ్మహాదేవుం గుఱించి తపం బొనరింప నతండు ప్రసన్నుండై వరప్రదాత యయ్యె. నంత సుద్యుమ్ననకుఁ బుంస్త్వం బనుగ్రహింపు మని ప్రార్థించుటయు శంకరుండు,

క. తనవాక్యము వ్యర్థంబై
చనకుండ వసిష్ఠమహానిసత్తమునకుఁ గో

రిన వర మిడె నొకమాసము
వనితయు మాసంబు బురుషవరుడుం గాఁగన్. ౨౯౧

క. ఈసరణి వసిష్ఠునిదయ,
నా సుద్యుమ్నుండు పుంస్త్వమంది పురికి వి
చ్చేసి యథాగతి రాజ్యము
శాసించెం గాని ప్రజకు సరిపడదయ్యెన్. ౨౯౨

గీ. మగతన మ్మూనువేళల జగతి నేలు
నాఁడుతన మూనునెడల హార్మ్యముల నొదఁగు
తనుజునకు నీడు వచ్చెడిదనుక నిట్టు
లవని పాలించి యతఁ డరణ్యమున కరిగె. ౨౯౩

వ. అట్లు చని నారదోపదిష్టంబగు నవాక్షర మంత్రరాజంబును జపిం
చుచుఁ దపం బొనరించునంత, ౨౯౪

క. సింగముపై నెక్కి కడున్
సింగారం బడర వారుణీమదపూర్ణా
పాంగయగు సర్వమంగళ
మంగలఁ గన్పట్టె నతనిపుణ్యముకలిమిన్. ౨౯౫

క. కనుపట్టిన జగదంబం
గని మ్రొక్కెడి ప్రేమమీఱఁగా నానందా
శ్రునయనుఁడయి మన మలరన్
వినుతింపఁ దొడంగె భక్తివివశత్వమునన్. ౨౯౬

గీ. దివ్యమనసొప్పు నీ రూపు తేట తెల్ల
ముగఁ గనుంగొంటి నా పూర్వపుణ్యరేఖ

భక్తకల్పద్రుమంబు నీ పాదపద్మ
యుగమునకు మ్రొక్కెదం బ్రోవుమో మదంబ! ౨౯౭

ఉ. అంబ! సురాసురాదులు ననన్యులు తావకదివ్యభవ్య తే
జంబు గనుంగొనంగ, మనుజన్ములనంగ నిఁకెంతవారు? నా
కుం బాడకట్టి తీ వెనుటకుఁ మది విస్మయ మందకున్నె? నీ
చుం బరమానురాగమునఁ జూచుట చోద్యము గాదె? శాంకరీ!

క. శంభుండును విధియును వి
శ్వంభరుఁడును సూర్యచంద్రవరుణాదులు నా
జంభారియు నినుఁ గనుఁగొను
దంభం బెఱుఁగ రన నాదు తరమే? జననీ! ౨౯౯

గీ. జలధిజాపతి నీ సత్త్వశక్తి నెఱుఁగు
శారదాపతి నీరజశ్శక్తి నెఱుఁగు
చండికాపతి నీ తమశ్శక్తి నెఱుఁగుఁ
గాని నీ నిర్గుణత వారు గాంచువారె? 300

గీ. మూఢుఁడైనట్టి యే నెడ! పూర్ణమైన
యీకటాక్షప్రసార మదేడ! నీకు
భక్తజనులందుఁ గల్గిన పక్షపాత
మింత యని చెప్పఁ గలనె? లోకైకజనని! ౩౦౧

సీ. ఒకవేళఁ బ్రణయకోపోద్రేకమున శిరో
భాగమ్ముపై వామపాద ముంచి
ఒకవేళ ననురాగవికలీభవత్క్రోధ
వై యురఃపీఠమ్ము నధిగమించి
ఒకవేళఁ గడుఁ జాకచక్కి నొప్పుమెఱుపు నా

జఘనప్రదేశమ్ము సంశ్రయించి
ఒకవేళ సింగార మొల్క ముద్దులుగుల్క
నంకభాగమ్ముపై నధివసించి

గీ. వాహనము నాఁగఁ దగు మధువైరి కీవ
లక్ష్మిపై మోద మిడెదు విలాసగతుల
నీ కటాక్షమ్ము లేకున్న నీరజాక్షుఁ
డంబ ! యొక గవ్వయైనఁ జేయఁడు నిజంబు. 303

చ. జనని ! భవత్పదంబు లనిశంబును గొల్చు విరించిముఖ్యు లం
గన లెటుకారు ? స్త్రీత్వమును గైకొనియుఁ బురుషస్వరూపముఁ
మును భవదీయసత్కరుణఁ బొందిరి కాదె ? యెవం డెఱుంగు నీ
యనుపమశక్తి దీనిఁ గొనియాడఁ దరంబె ? పరాంబ మాదృశుల్. 

క. స్త్రీపుంసభేదశూన్యం
బై పరతత్త్వస్వరూపమై దుర్జ్ఞేయం
బై పూర్ణంబై యెసఁగెడి
రూపము నెవ్వఁడు నేర్చు రూపింపంగన్ ? 304

గీ. నిను నిరూపింప నే నేర ; నేర్చుకొలఁది
నీపదాంబుజభజనంబు నిర్వహింతుఁ
గానఁ బ్రాణాంతమందు ననూనమైన
భక్తి నొసఁగుము నీపదద్వయమునందు. 305

గీ. ఇట్లు నుతియించి సుద్యుమ్న నృపతివరుఁడు
శాంకరీకరుణాకటాక్షంబు కలిమి
మునిజనశ్లాఘనీయమహా ముక్తిఁ గాంచె
నంబికాభక్తులకు నసాధ్యంబు కలదె ? 306

క. సుద్యుమ్నసుతుఁడు ఘనసం
పద్యుతుఁడు పురూరవుండు పరిపాలించెన్
హృద్యనిరవద్యగురు కీ
ర్తిద్యోతితమై తనరుప్రతిష్ఠానపురిన్. ౩౦౭

వ. అప్పురూరవుండు రాజ్యంబు గావర్పనెడ సామాదిచతు రుపాయ
మ్ములును ప్రభుమంత్రోత్సాహశక్తులును సర్వవర్ణాశ్రమ ధర్మం
బులును నిరుపప్లవంబు లయ్యె. ౩౦౮

క. జన్నము లొనర్చె నాతం
డెన్నేనియు నిద్ధమతుల కిడె విప్రుల క
త్యున్నత మగుదానంబుల
నన్నన్న ! నుతింపఁ దరమె ? యాతని గుణముల్. ౩౦౯

ఉ. ఆతనిరూపసంపదయు నానృపు తేజము నానృపాలు వి
ఖ్యాతియు నా ధరాపతియుదారత యావిభుశీల మాజగ
న్నేత కృపాధికత్వమును నేర్పును నీతియు భూతియున్ యశ
స్ఫీతియు నెంచి యూర్వశి వశీకృతయై వగఁ జెందు సంతతన్. ౩౧౦

గీ. పంకజోద్భవుశాపంబువలనఁ బుడమి
కరుగుట తటస్థ మగుడు నయ్యమరవేశ్య
చిరమనఃకాంతుఁడైన యన్నరవరేణ్యు
నెంచి వరియించి యతనితో నిట్టులనియె. ౩౧౧

చ. గొఱియలు రెండు నాకుఁ గడుఁ గూరుచు బిడ్డలకన్న నెక్కు ; డీ
గొఱియలఁ బ్రోచుటొక్కటియుఁ, గూటమివేళలఁ దక్క నీవు సి
గ్గఱి వసనంబు లేని తఱిఁ గన్పడకున్కియు, నేయిభుక్తికై
తెఱచుగ నిచ్చుచున్కియును దప్పవు ; తప్పినయప్డ వీడెదన్.

గీ. దీని కంగీకరించితివేని నన్నుఁ
గైకొని రమింపు మనెడి యక్కలికిమిన్న
ప్రీతిన కెదురాడ వెఱచి చేపట్టి దాని
వలచి క్రీడించె నొకకొన్ని వత్సరములు. ౩౧౩

తత్కటిస్థలమందుఁ దవిలి చిత్తము ధరా
వలయమ్ముపై నాసఁ గొలుపదయ్యె
దానినూగారుపైఁ దవిలి చిత్తము కత్తి
చేతఁ బూనుటకు వాంఛింపదయ్యె
తద్వచస్సంసక్తిఁ దవిలి చిత్తము కావ్య
కలనా వినోదంబు దలఁపదయ్యె
దానికౌఁగిటియందుఁ దవిలి చిత్తము పరా
ద్వైతభావంబుపైఁ బాఱదయ్యె

గీ. అవుర ! యేమందు నప్పురూరవునిచరిత
మఖిల మూర్వశియే యని యలరుఁగాని
ధర్మ మర్థంబు మోక్షంబు దలఁప డయ్యెఁ
గాముకుల కన్యసంగతుల్ గానఁ బడునె ? ౩౧౪

క. దుర్గముఁ డీనృపుఁ డంచు న
నర్గళరాగాతిశయమునన్ మరగి పున
ర్నిర్గమ మెఱుఁగక యూర్వశి
స్వర్గమ్మును మఱచెఁ బాకశాసను మఱచెన్. ౩౧౫

గీ. వార లిరువురు నీతీరు వార లగుచు
నున్న యంతటఁ బాకారి యూర్వశీ త
లోదరీమణి రప్పింప నూహఁజేసి
పలికె గంధర్వులను జూచి ప్రాభవమున. ౩౧౬

గీ. రంభ మొదలుగ నప్సరోరమణు లున్న
వార లైనను, నూర్వశీ వనిత లేక
యున్న కారణమున, స్వర్గమున్న దిపుడు
చంద్రికళ లేని యంబరస్థలము పగిది. 3౧౭

వ. కావున నేదేని యొక నెపమ్మునఁ బురూరవు వంచించి గొఱియల నపహరించినఁ గార్యమ్ము పొసఁగునని చెప్పి పంచిన, 3౧౮

క. గంధర్వులు రతికేళీ
బంధురుఁడగు నృపతి కెఱుఁగఁబడకుండఁగ ఘో
రంధర్యపటిమ గొఱియల
నంధతమసమందుఁ జోరులై హరియింపన్, 3౧౯

క. ఆయురణమ్ములు మే మే
మే యని రొదసేయఁ దన్నిమిత్త వెఱిఁగి సీ!
సీ! యని రోయుచు నృపుతో
నా యూర్వశి శోకతప్తయై యిట్లనియెన్. 3౨౦

ఆ. వె. కొడుకులవలెఁ బెంచుకొనుచున్న నా గొఱి
యలను జోరులిట్టు లపహరింప
నాఁడుదానికన్న నధముండవై యూర
కుంట యుక్తమగునె? కువలయేశ. 3౨౧

క. రక్షించెద వీవంచు ను
పేక్ష యొనర్చితిని గాని యెఱుఁగనయితి నీ
దక్షత యిట్టిది యని యో
కుక్షింభర! నిన్నుఁ గూడి కుత్సిత నైతిన్. 3౨౨

క. ఇటు కటకటఁ బడి తన్నుం
బెటిలి పడం దిట్టుచున్న ప్రియురాలికి న
క్కటికము చూపుట్కై ని
ష్పటుఁడై తస్కరుల వెంటఁబడి పరుగిడియెన్. ౩౨౩

గీ. నగ్నుఁడై వచ్చు నృపతిచందమ్ము నూర్వ
శీ వనిత కెఱుఁగఁ బడఁగఁ జేయు నిచ్చఁ
జంచలాకాంతులను మెఱపించి రపుడు
ధరణిపతి గేహమందు గంధర్వపతులు. ౩౨౪

వ. అంత, ౩౨౫

క. ఉరణమ్ములఁగొంచు దిగం
బరుఁడై తోతెంచు నృపతిఁ బరికించి వియ
చ్చర వారవనిత యాతని
చరణములకు మ్రొక్కి పలికె సాధ్వస మెసఁగన్. ౩౨౬

ఉ. చెప్పితిఁగాదె? మున్ను నృపశేఖర! నాదు ప్రతిజ్ఞ; దానికిం
దప్పిన యట్టి నీకు దరిదాపునఁ గాఁపుర మెట్లొనర్తు? నే
నిప్పుడ పోవలెన్ గరుణ యుంచుక నాపయి నుంచు; మయ్యయో
తప్పక తీరునే! విధివిధానము తప్పినపట్లఁ గూరుముల్? ౩౨౭

వ. అని యూరడించి, ౩౨౮

గీ. పార్థివోత్తము వలవంతపాలుఁజేసి
యరిగె నూర్వశి నిశ్చింతయై తనంత
స్వర్గముననుండి వచ్చినవచ్చుగాక
యమ్మరో! చెల్ల! లంజెల నమ్మఁదగునె? ౩౨౯

చ. తను విడనాడి యూర్వశి యథాగతి నేగఁ, బురూరవుండు చిం
తను గొని, వెఱ్ఱిఁ బూని, మతిఁ దప్పి, తదీయవిలాసవైఖరుల్
మనమున నెంచుచున్ విషయమగ్నతఁ జెందుచు లోనఁగుందుచుం
జని చని కాంచె నచ్చటులచారుకటాక్షగతిన్ గురుక్షితిన్. ౩౩౦

గీ. చూచినంతన యాతని లోచనమ్ము
లతులితంబైన సంతోషగతి నెసంగెఁ
జిరవిరహసంగతులకు నెచ్చెలిని గనుట
కన్న వేఱొండు భాగ్యంబు గలదె తలఁప? ౩౩౧

వ. అట్లుకని డగ్గఱి కరుణరసంబుట్టిపడ గద్గదగళుండై యిట్లనియె.

చ. కినిసి మొఱంగ నెన్నఁడును; గీడొనరించి మొఱంగ; నీకు దా
సునిగతి నుంటిఁగాని యొకచోనయినన్ బ్రతిఁ జెప్పలేదు; నీ
పనిచిన కార్యమెప్పుడు నెపంబిడి చేయక యుండలేదు; హా!
ననువిడనాడి పోతివిదినాయమె? నీకుఁగురంగలోచనా! ౩౩౩

గీ. ఓసి! దుర్మార్గురాల! న న్నీసడించి
తేని యీ మేను నే భరియింపఁజాల
నా మన మెఱింగియును గఠినత్వమూనఁ
దలఁపుఁ బూనెద వెంతటిదాన వయయొ! ౩౩౪

క. వలచి ననుఁ గలయ నేటికిఁ?
గలసి యిటుల్ విడిచి పెట్టఁగా నేటికి? నీ
వలపు సతమంచు నమ్మితిఁ
గలికీ! ననుఁ జింతపాలుగాఁ జేయుదువే? ౩౩౫

సీ. రమణి! నీ యాలింగనము చొప్పడమి నాకు
రాత్రు లెల్లను శివరాత్రులాయె

పూబోడి! నీదు తాంబూల మబ్బమి నాకు
దినము లెల్లను హరి దినము లాయె
తెఱవ! నీ కెమ్మోవి తేనెలబ్బమి నాకు
ఋతువు లెల్లను గ్రీష్మ ఋతువులాయె
కలికి! నీతోఁ బొత్తు గలిగి యుండమి నాకు
క్షణము లెల్లను గతక్షణము లాయె.

గీ. లలన! నీ నెన్నగవు వెన్నెలలకుఁ జొక్కు-
భాగ్య మబ్బమి నా కెల్ల పక్షములును
కృష్ణపక్షమ్ము లాయె, నీరీతి నొప్పు
కాల మేగతి వేగింతునే? లతాంగి! 33౭

క. అని బహువిధముల విలపిం
చు నృపాలోత్తమునిఁ గాంచి సూనృత గతి న
వ్వనితామణి యతని విర
క్తునిఁ జేసి మరల్చు తలఁపుతో నిట్లనియెన్. 33౮

మ. వెలయాండ్రెక్కడ! గూర్మలెక్కడ! దయావిశ్వాసభావమ్ము లె
క్కడ! లోలోఁ దలపోయ నేరకిటు మార్గ్యంబూనఁగా జెల్లునే?
కలలోనైనను వారకామినుల సాంగత్యంబు వాంఛింతురే?
కలడే సూత్రము గట్టినట్టి మగఁడొక్కండంచు మాజాతికిన్.

క. వనితల యెడఁ జోరుల యెడ,
జనపాలురు విశ్వసింపఁ జనదటుగానన్
ననుఁ దలఁచి విచారింపక
చని రాజ్యం బేలుకొనుము జననాథమణీ. 33౯

ఆ. వె. అనుచు నొప్పఁజెప్పి యరిగె నా యూర్వశి
మనుజవిభుఁడు దాని మఱవ లేక
వంతఁ జెందె, నెంతవాఁడైన వారకాం
తలను జేరఁదీయ వలదు వలదు. ३४०

గీ. వేద విస్తృత మీ కథావిధము దీని
జెప్పినాఁడను మీకు సంక్షేపగతిని
ఇట్టి వలవంత తన కబ్బునేమొ? యంచు
వ్యాసుఁడు ఘృతాచిఁ గని సందియమ్ముఁ జెందె. ३४१

—* శుకోత్పత్తి *—

క. ఈ రీతి సంశయించెడి
పారాశర్యుఁ గని శాపభయ విహ్వలయై
చేర వెఱఁగంది శుక వని
తా రూపముఁ దాల్చి చనె ఘృతాచి యకేచ్ఛన్.

వ. అట్లు చనుటయు, ३४३

గీ. హరిహరబ్రహ్మ లెవని దాసానుదాసు
లెవని యావేశ మెట్టి జితేంద్రియులకుఁ
గనులు పొరఁగప్పఁ జేయు నక్కమలశరుఁడు
పట్టి పాలార్చఁదొడఁగె నా వ్యాసమునిని. ३४४

ఆ. వె. తపము లెన్నియేనిఁ దగ నొనర్పఁగనిమ్ము
జపము లెన్నియేని సలుపనిమ్ము
కనుల కింపు గల్గుకాంతఁ గన్గొనినంత
మారుబారిఁ బడనివారు లేరు. ३४५

వ. ఇట్లు ఘృతాచీగతం బగు మనమ్ము మరల్చియు భవితవ్యతా నిమిత్తమున మరల్ప నేరక చింతించుచు నరణి మథించుచున్నంత, 3౪౬

క. అలపంచశరుని తాఁకునఁ
గలకలముం జెంది యున్న కతమున వీర్య
స్ఖలనము గల్గి యరణిలోఁ
పలఁ బడె నది యెఱుఁగ కతఁడు పట్టి మథించెన్. 3౪౭

గీ. అరణి జనియించె నంతట వ్యాస సదృశుఁ
డై యనలకాంతి భాసురుండై శుకుండు
కాంచి "యిది యేమి వింతయో" యంచు "శివుని
వర మహిమ," యంచు మది నెంచి వ్యాసుఁ డంత,

క. గంగానదికిం దన తన
యుం గొని చని యచటఁ బావనోదకములఁ బూ
తుం గావించి ముదం బెసఁ
గంగా నాతనికి జాతకర్మ మొనర్చెన్. 3౪౮

గీ. నభమునం దంత దేవదుందుభులు మ్రోసెఁ
బుష్పవర్షోదయమ్మునఁ బుడమి నిండె
నారదాది మునీంద్రు లందఱును గూడి
పాడి, రాడిరి రంభాది వారసతులు. 3౫౦

ఆ. వె. చిలుకరూపుఁ గనిన చెలువ కారణమునఁ
బుట్టె నీతఁ డంచుఁ బెట్టెఁ బేరు
శుకుఁ డఁటంచు వాని సుతునకుఁ; గ్రమముగా
వృద్ధిఁజెందె నతఁ డభేద్యగరిమ. 3౫౧

గీ. అంబర స్థలినుండి కృష్ణాజినంబు
దండము కమండలువు తదర్థముగఁ బుడమిఁ
బడియె నొకనాఁడు మునులార! వ్యాసుఁడంతఁ
గొమరున కొనర్చె నుపనయనముఁ గ్రమముగ. 3-౭౨

గీ. జనకునికిఁ బోలె నితనికి జన్మకాల
మంద వేద వేదాంగాదులన్నియు వశము
లైనను బృహస్పతిం గొల్చి యాగమ వ్ర
తమ్ము సల్పుచు నవి యెల్లఁ దవిలి చదివె. 3-౭౩

వ. ఇట్లు సంపూర్ణుండై గురుదక్షిణ నొసంగి తదాజ్ఞ వడసి తండ్రి
పాలికిం జనుటయు, 3-౭౪

ఉ. వ్యాసుఁడు కౌఁగిలించుకొని "వచ్చితివా! తనయా" యటంచుఁ బే
రాసఁ బ్రియమ్ము వల్కుచు "బృహస్పతియొద్ద సమస్త విద్యల
భ్యాసమొనర్చితే?" యనుచు నాదరముం బచరించి పుత్రు భా
ర్యాసముపేతుఁ జేయుటకునై మనమందుఁ బ్రయత్న మంచుచున్,

వ. పుత్రుండు విరక్తుండగునని యెఱింగిన వాఁడు బోలె సత్వరం
బుగ నొక్కెడ కరిగి సత్కుల ప్రసూతయు మనోహారిణియు నగు
నొక మునితనయన్ వివాహార్థంబు నిశ్చయించి యాశ్రమమ్మున
కేతెంచి శుకుం గాంచి యిట్లనియె. 3-౭౬

చ. చదివితి వెల్ల వేదములు; శాస్త్రములున్ బరికించినాఁడ; వి
ద్యదను వివాహయోగ్య మగునట్టిది గానఁ, గళత్రమున్ వరిం
పఁదగు; మఖక్రియల్ పొనరుపందగుఁ; బుత్రులఁగాంచఁగాఁదగున్
ఘనదమలరన్ మమున్ ఋణవిముక్తులఁ జేయఁ దగుం గుమారకా!

సీ. పుత్రసంతానంబు పొరయనినరునకు
సద్గతి లేదు యశంబు లేదు
గావున నొకకన్నెఁ గైకొని తనయులఁ
గాంచి నన్నానందకలితుఁ జేసి
పితృదేవతలకు సంప్రీతి యొనర్పుము
మాటాడకుము నాదుమాట వినుము
నీనిమిత్తము తపం బేనొనర్చితిఁ బెక్కు
వత్సరమ్ములు తపఃఫలము నీవు

గీ. నీవలనఁ గీర్తిఁ గనవలె నీవలనన
సద్గతిని బొందఁగా వలె సౌఖ్య మందఁ
గావలెను నీవలన నంచుఁ గాచియుంటి
ననుడు జనకునితోడ నిట్లనియె శుకుఁడు. 3గి

క. పరిణయమొల్లను నన్నుం
గరుణింపుము తత్త్వబోధఁ గావింపుము దు
స్తరసంసారాంభోనిధి
నరసి యరసి నన్నుఁ ద్రోయుట న్యాయమె ? తండ్రి ! 3౯

వ. అను పుత్రుం గాంచి వ్యాసుం డిట్లను, 3౬౦

మ. నినుఁ గంటిన్ శతవత్సరమ్ములు తపోనిష్ఠన్ బ్రవర్తించి ; నా
కనుకూలుండవు గమ్ము ; యౌవనము నీ కావిర్భవం బందె ; భా
ర్యనుగైకొమ్ము ; సుఖమ్ములం బడయు; మేరాజేంద్రునో చూచెదన్
ధనమున్ దెచ్చెద ; నీ కొసం గెదను ; నాఁ దత్త్వజ్ఞుఁ డాతం డనున్

చ. వనితను జేరి తద్వశత వర్తిలి దుఃఖము సౌఖ్య మంచు భ్రాం
తిని గొని సంసృతిం బడి గతిం గన లేక కృశించువారలం

గనుఁగొనియుఁ వివాహము సుఖం బనియే నెటు సమ్మతింతు ? దుః ఖనియతమైన సౌఖ్యము సుఖం బనఁ గూడునె ? మానిసత్తమా !

గీ. శృంఖలాబద్ధులు విముక్తిఁ జెందఁ గలరు
గాని కాంతాకటాక్షపాశానుగతుల
కబ్బునే ముక్తి యెన్నఁటికైన నిట్టి
విట్సుఖం బేమనుచుఁ బైని వేసికొందు ? 3౬౩

గీ. మలమయంబైన కామినీమణులదేహ
మందు బుధుఁడైనవాని కెట్లా సపృట్లు ?
యోనిసందర్భ మొక్కింతయును నెఱుంగ
నట్టి నా కేల యీహేయ మైనగొడవ ? 3౬౪

క. కర్మములను నెపమున దు
ష్కర్మంబగు హింస సలుపఁగాఁ జేయుచు న
తర్మదము పెంచునాగమ
మర్మంబుల నామనంబు మసలదు తండ్రి ! 3౬౫

గీ. వేదవేదాంగములకల్మి విస్తరించెఁ
గాని వాక్పతి తత్త్వంబు గఱపఁడాయె
పుత్రదారానురక్తుఁడై బొరలుగురుని
గొలిచి తరియించు పెట్టులు గలరె ? యెందు. 3౬౬

గీ. అట్టి గురునకు నొక్క మ్రొక్కాచరించి
తత్త్వవేత్త పటంచు నీదరికిఁ జేర
దుష్టసంసారమునఁ బడఁద్రోయ నగునె
భవ మెవరికైనఁ గాలసర్పంబ కాదె ? 3౬౭

క. పురుషులు హేయంబగు వి
ట్పురణిఁ జరియించుపగిది జడమతులును సం
సరణమునఁ బడెద రకటా !
పరికించిన భవము సౌఖ్యభాజన మగునే ? ౩౬౮

గీ. వేదశాస్త్రాదికం బెల్ల వెదకి తెలిసి
కొనియు సంసారవార్నిధి మునిఁగి తేలు
బుధునికన్నను మూఢుండు పుడమిఁ గలఁడె ?
యతఁడపో ! సూకరాదుల యట్టివాఁడు. ౩౬౯

గీ. పుత్రదారానుసక్తుని బుధుఁడటంచు
గారవించుటకన్న నజ్ఞానమున్నె ?
వాఁడపో బుద్ధిమంతుఁడు వాఁడ బుధుఁడు
వాఁడ శాస్త్రజ్ఞుఁ డవ్వాఁడె వంచితుండు. ౩౭౦

క. భవబంధకరం బయిన చ
దువు చదు వగునే ? సమస్త దుఃఖధ్వంస
ప్రవణం బగునద్దానిఁ జ
దు వనం దగు ; దాన ముక్తి దొరకును దండ్రీ ! ౩౭౧

క. ఎందుం జన నీయక తన
యందుం బంధించుటన్ గృహం బయ్యెన్ దా
నిం దవులుట బంధనగృహ
మందుంటయు భేద మించుకైనం గలదే ? ౩౭౨

క. మందులు విధి ప్రేతారితు
లుం దగులఁగనిమ్ము గృహములోపల వారిన్

నిందింపనేల మనుజత
నందియుఁ జదువుకొని యుండు నడుగంటుదునే? 323

వ. అను కుమారునకు వ్యాసుండిట్లనియె. 324

క. మన మతినిర్మల మైనఁ
దనకు గృహం బెట్లు బంధనం బగు మనముం
దనయిచ్ఛఁబోవనీయక
యునికి గృహస్థునకు ముక్తి నొసఁగుఁగుమారా. 325

గీ. న్యాయ్యముగ ధనసంపాదనం బొనర్చి
యనృతమాడమి యశుచిత్వమాచరింప
మియును విధిచోదితంబుగా మెలఁగుటయును
గలిగి వర్తించు గృహి ముక్తిఁ గాంచుఁ బుత్ర. 326

సీ. వేదవ్రతముల నాపాదించి చరియించు
బ్రహ్మచారుల కెల్లఁ బట్టుఁ గొమ్మ
అతిథులై యేతెంచునట్టి గృహస్థుల
నాదరింపఁగఁ గల్పాగమంబు
భార్యైకయుక్తులై వనమునఁ దిరుగు వా
నప్రస్థులకు రక్షణ ప్రసక్తి
సంసారహింసాదిరంసావిరక్తులౌ
సన్యాసులకును విశ్రాంతిభూమి

గీ. యైనగార్హస్థ్యమున నుండి యఖిలధర్మ
ముల నొనర్చి తుదకు ముక్తిఁ బొంద వచ్చు
నట్లు కాదేని యవ్వసిష్ఠాదిమునుల
కేల గార్హస్థ్యమున నుండు టెఱుఁగఁ జెప్పుమ. 322

గీ. ఆగమోక్త కర్మంబుల నాచరింపఁ
దలఁచి వర్తించుగృహి కెల్లధర్మములును
గరతలామలకమ్ములు గాన లాఁతి
యాశ్రమమ్ములు సరియె గార్హస్థ్యమునకు ? ౩౭౮

ఆదిని బ్రహ్మచర్యము ననంతరమందు గృహస్థధర్మ మా
మీఁదవనప్రవాస మటుమీఁద యతిత్వ మటంచు బ్రహ్మవి
ద్యాదరు లండ్రు గాదె తనయా! వినయమ్ముగలాఁడ వాగమా
పాదిత మైనధర్మము నెపమ్మున వమ్మొనరింపఁ బాడియే ? ౩౭౯

గీ. కాన గార్హస్థ్యధర్మమ్ముఁ బూని పుత్ర
వంతుఁడవుగమ్మ పితృదేవవర్గములకుఁ
బ్రీతి సేయుము నామాట వినుము సన్న్య
సించు టిప్పుడుగాదు యోజించుకొనుము. ౩౮౦

క. మనమును బంచేంద్రియములు
తనయా! కడుఁ జంచలములు దారవిహీనుం
జెనకి యధోలోకమునకుఁ
బనుచున్ వాఁ డెంత పెద్ద పండితుఁ డైనన్. ౩౮౧

గీ. ఇంద్రియజయమ్ముకొఱకునై యింతి నెంతఁ
వాఁడయినఁగాని వరియింపవలయు వార్ధ
కమ్ము సంప్రాప్తమైనఁ దపమ్ము సేయ
వలయుఁ గాని వేఱొకగతి వలదు తనయ. ౩౮౨

మేనకాతరుణిసమ్మేళనమ్మునఁ గాదె ?
గాధిపుత్రుతపమ్ము గంగఁ గలిసె
దాశపుత్రికతోడఁ దగులు చెందుటచేతఁ

గాదె ? సీతాత భంగమ్ము గనియె
నలఘుధృతాచిని జూచి యాసించుటను గాదె ?
నాకుఁ దేజస్ఖలనంబు గలిగె,
తనపుత్రికను మోహమున వరించుటచేతఁ
గాదె విరించి ప్రమాద మందె

గీ. గాన నొకకన్నె వరియించి దాన నింద్రి
యముల నిర్జించి మీఁద నియమము గాంచి
తపము సేయఁగఁ బూను టుత్తమము గాని
యుభయతోభ్రష్టతను గాంచు టుచితమగునె ? 3౮3

—* శుకుఁడు సంసారమును నిందించుట *—

క. అని యుపదేశము నొనరుచు
జనకుం గని శుకుఁడు వల్కు సౌఖ్య విహీనం
బును వాగురాసమానం
బును నగు గృహమందు బుద్ధిపుట్టదు తండ్రీ ! 3౮౪

క. ధనహీనులు స్వజనులచే
ననయము బాధింపఁ బడుదు రది గాక ధనా
ర్జనచింతావ్యాకులు లగు
జనులకు నెచ్చోటనైన సౌఖ్యము కలదే ? 3౮౫

సీ. ఈజగత్త్రయమేలు నింద్రునకైన స
న్యాసి కున్నంత సౌఖ్యమ్ము లేదు
సాక్షాన్మహాలక్ష్మి వక్షమందున్న వి
ష్ణునకైన యతి కున్న సుఖము లేదు
త్రిజగత్కుటుంబియగా నజునికైనను విర

క్తుల కున్న యంత నిశ్చలత లేదు
అణిమాదియుక్తుఁడౌ హరునికైనను గోఁచి
పాఁతరాయని కున్న భాతి లేదు

గీ. తపములకు విఘ్నము లొనర్పఁ దలచుటయును
దైత్యుల హరింపఁ దలఁచి ఖేదంబు గొనుట
యునుగదా వీర లొనరించుపనులు ; నే నె
ఱింగియును సంగమునఁ బడి బ్రుంగనేల ? ౩౮౬

క. ధనవంతునకే సౌఖ్యం,
బనిశ్చితప్రియ మన్నయప్పుడు ధనహీ
నునకు సుఖమెట్లు చేకుఱు ?,
జనకా ! సంసారమందు సౌఖ్యము కలదే ? ౩౮౭

ఆ. వె. నన్న యోనిజన్మ నయ మొకింతయు లేక
ఘోరదారరూప కూపమునను
బట్టి త్రోయ నగునె ? భవ మేడ ! సుఖ మేడ !
రక్తియేడ బంధముక్తి యేడ ! ౩౮౮

ఆ. వె. మొదల జన్మదుఃఖమును మీఁద ముదిమిచే
నైనదుఃఖమును ననంతరంబు
మరణకాలదుఃఖ మరయ నాపైఁ బున
ర్జననదుఃఖ మిందు సౌఖ్యమేది ? ౩౮౯

శా. ఆశాపాశముచేతఁ జిక్కువడి ప్రాణాచారముం బూని యా
చ్ఛాశంకన్ విడనాడి బుద్ధిబలవైశద్యంబు వోనాడి వి
త్తేశద్వారనివాసఖిన్నమతియై యేతెంచుసంసారికిన్
లేశంబైనను సౌఖ్య మున్నయదియో లేదో విచారింపుమా !

క. కొడుకులుఁ గూఁతులు మొదలగు
గొడవ పెరిఁగెనేని వారి కుడుపున కై యె
క్కుడు కష్టము పడవలె, నొక
కడుపుకుడుపు చెచ్చుకొనుట కష్టమె? తండ్రీ! 3-౧

వ. కావున యోగశాస్త్రంబును సుఖకరం బగు జ్ఞాన శాస్త్రంబును
నా కుపదేశింపు మని మఱియును, 3-౨

క. దయ గలిగి నాకుఁ గర్మ
క్షయ మగు పద్ధతి వచించి సంసారము నా
పయిఁ బెట్టక విజ్ఞానా
శ్రయ మగు మార్గమ్ముఁ జూపఁ జను దే తండ్రీ! 3-3

చ. జలగ శరీరముంబాదివి చయ్యన నెత్తురు గ్రోలుభంగిఁ, గాం
తలు తమ వీర్యముం దమ ధనంబు ఘనంబు హరింతు రంచు మూ
ఢు లెఱుఁగ రక్కటా! మిగుల రోఁతలపాఁతలౌలైన యీ పలం
బులు సుఖమీఁగఁజాలుదురె దుఃఖనుదక్కు మునీంద్ర యేటికిఁ?

క. వే యేటికి నిదానా
ఖ్యాయతి చెడఁగొట్టుకొనుట కంగనల గొల్చుట
బో! యెఱుకలేని మనుజుఁడు
నాయన! యిది యెల్లగతుల నరకంబుకదా? 3-౫

వ. అని సంసారంబు రోయు కుమారుం గాంచి వ్యాసుండు దుఃఖా
క్రాంతుం డగుటయు, 3-౬

సీ. వేదమ్ములెల్ల దుర్వేదంబులై యున్న
విభజనఁ జేసిన విశ్రుతుండు

జనులకు విజ్ఞానమును దేటపఱప వే
దాంతశాస్త్ర మొనర్చినట్టి ఘనుఁడు
అలమహాభారతం బష్టాదశపురాణ
ములు రచించిన మహాబుద్ధిశాలి
మునులలోపలఁ బెద్దతనము గల్గిన యశః
ప్రతిభ నొప్పినగొప్పపండితుండు

గీ. దివ్యవిజ్ఞాని సత్యవతీసుతుండు
మాయవలలోనఁ బడి పెడమార్గములకుఁ
గాలు వెట్టుచునుండె నౌఁ గలరె! యింక
నొరులనుచు నెంతయును వింత నొందె శుకుఁడు. ౩౯౭

గీ. హరిహరబ్రహ్మలును దురాప యగుచు
జగములన్నియుఁ దనమాయఁ దగులఁ జేయు
నేమహాదేవి సకలలోకైకజనని
యమ్మహాదేవి నర్చింతు నాశ్రయింతు. ౩౯౮

గీ. విష్ణునంశమ్మచే భువి వెలసి సకల
ధర్మము లెఱింగి వ్యాసునంతటి మహాత్ముఁ
డిట్టిప్రాకృతచింత పైఁ బెట్టుకొనియె
నకట! చిత్రంబ కాదె మాయాబలంబు. ౩౯౯

ఆ. వె. నేను నీవు నాది నీయది నాతండ్రి
నాతనూజుఁ డని యనారతంబు
ప్రీతి గొందు పంచభూతమయంబు దే
హం బటం చెఱుంగ రకట! జడులు. ౪౦౦

క. వ్యాసుఁడఁట వేదాంత
వ్యాసంగ మొనర్చినట్టి యనఘుండఁట తా
నీసరణిఁ జింతఁ గొనునఁట
సీ! సీ! మాయాబలం బజేయమ కాదే? ౪౦౧

క. అనుచుఁ మాయాబలవిల
సనమున కచ్చెరువు చెంది జనకుం గని శా
స్త్రనిదానమ్ముగ శుకుఁ డి
ట్లనెఁ దన విజ్ఞాన మహిమ యతనికిఁ దెలియన్. ౪౦౨

గీ. సకలము నెఱుంగునట్టి బోధకుఁడ వీవు
దివ్య విజ్ఞాన, సత్యవతీ తనూజ!
వీఁడు నావాఁ డనెడి భ్రాంతి వీడలేక
ప్రాకృతునిఁబోలె శోకాబ్ధిఁ బడుదురయ్య. ౪౦౩

ఉ. ఎందఱి కీవు తండ్రివొ నుతేందఱి కేఁ దనుజుండనో మఱి
గొందల మందనేల? కనుఁగొమ్ము విచారణసేయు మయ్య యో
తుందుడు కింత చెల్లునె? బుధుండవు కావె? యెఱుంగవే? ధృతిం
జెందక చిత్తవృత్తి నిటు చిందఱ వందఱఁ జేయ న్యాయమే?

సీ. ఆఁకలి దీర్పంగ నన్నమ్ము కలదు పి
పాసఁ దీర్చుటకునై వారి కలదు
ఘ్రాణతృప్తికినై సుగంధమ్ము గలదు క
ర్ణములఁ దన్పంగ శాస్త్రములు గలవు
కామ నివృత్తికై కాంతలు గలరు ద్ర
వ్యమ్ము నార్జింప భూపతులు గలరు
విజ్ఞానమునకుఁ దత్త్వజ్ఞులుగలరు మో
క్షమ్ము పొందుటకుఁ దపమ్ము గలదు

గీ. గాని కొమరునిచేఁ బొందఁగలుగునట్టి
దొక్క సుఖమైన లేకున్కి నిక్కమరయ
నట్టి కొమరులకై మది నాసఁజేయు
వానికన్నను వెఱ్ఱు లెందేనిఁ గలరె ? ౪౦౫

గీ. ఎంచి వలసిన విత్త మార్జించికొనుము
సుతునికన్నను విత్తంబు సుఖకరంబు
మున్నజీగర్తుఁ డనుముని కన్నసుతుని
యజ్ఞపశువుగ నమ్మి వేయఁడె ? మహాత్మ ! ౪౦౬

క. నను సంసారాంబుధిలోఁ
జొనుపక తత్త్వమ్ము గఱపి సూనృతరీతిన్
మనుపుము నే నింకఁ బున
ర్జనన భయంబనుభవింపఁ జాలను దండ్రీ. ౪౦౭

గీ. జన్మములలోన మానవజన్మ మధిక
కష్టసాధ్యం బదియుఁగాక కర్మభూమి
యందు ద్విజుఁడై జనించు టత్యధిక కష్ట
సాధ్య మది గాంచి సంసార సరణి యేల ? ౪౦౮

క. అని తిరుగని వైరాగ్యం
బును గొని సన్యాసమందు బుద్ధిఁ జొనుపు పు
త్రునిఁ గని సత్యవతీసుతుఁ
డనుమానం బుడిగి యిట్టు లానతియిచ్చెన్. ౪౦౯

తనయా ! మున్నొనరించినాఁడను మునీంద్రస్తుత్యమై సత్యమై
ఘనపాపౌఘవినాశమై సకల దుఃఖధ్వంసమై యొప్పి ము

క్తినొసంగఁ దగుసత్త్వభాగవత మొకటే శ్రేష్ఠ మీభాగవతీ
నిని నిత్యమ్ము పఠింపు మియ్యదియు సాధించుఁగా మనోభీష్టముల్.

ఆ. వె. అతిశుభప్రదంబు నాతివిస్తీర్ణంబు
బ్రహ్మసమ్మితంబు భాగవతము
వినిన యంతమాత్ర విజ్ఞాన మబ్బు న
జ్ఞాని జనుఁడు కొనుము జ్ఞానివగుము. ౮౧౧

—* దేవీభాగవత[illegible] *—

గీ. ద్వాదశస్కంధయుక్తమై పాపులకును
నాయువై పుణ్యమై పురాణముల కెల్ల
భూషణం బయి యొప్పు నీపుస్తకంబు
హతము సేయును సంసారబాధ లడఁగ. ౮౧౨

సీ. వటపత్త్రమునఁ బాలవైఖరి నుండి తా
నీప్రపంచస్థితి నెఱుఁగ లేక
యే నిటు బాలుండ నేకతమ్మున నైతి
నేవిధమ్మున దీని నెఱుఁగువాఁడ
నిటు నన్ను నిర్మించె నెవ్వఁడో యని చింత
నొందుచు నున్న ముకుందునందుఁ
గరుణించి భగవతి పరమరహస్యంబు
గాఁగ శ్లోకార్థంబు గాఁగ దీని

గీ. దెలిపి "యియ్యది సకలంబు దీని దెలిసి
కొనుటయే నన్నెఱుంగుట" యనియె నంత
విష్ణుఁడయ్యది విని దానివిధము దెలియ
నేర కిట్లని చింతించె నెమ్మనమున. ౮౧3

శా. శాంతంబై యకలంకమై సహజమై సత్యంబునై నిత్యమై
యొంతే మోదమొసంగఁ జాలునిది దా నేమూర్తి నార్కుణ గృపా
స్వాంతంబై యిడెనో? పదార్థమదిపుంస్త్వాలంబియో? షండమో?
కాంతాకారమొ? యెట్టిదో యని తదాకారమ్ము నూహించుచుణ.

వ. శ్లోకార్థ రూపమ్మగు నబ్భాగవతంబు పఠించుచున్నంత, ౪౧౫

సీ. శంఖచక్రి గదాది సాధనమ్ములు దాల్చి
హావణించు నాల్గు బాహువులతోడ
కోర్కాఱరు మెఱుఁగునాఁ గోమరారు పదియాఱు
వన్నె బంగారు దువ్వలువతోడ
మగరాలనత్తుపెన్నిగనిగల్ నగఁజాలు
సొగసు గల్గిన చిన్ని నగవుతోడ
తనతోడఁ దులఁదూఁగఁ దగు నొయ్యారము గల్గి
యలరారు నెయ్యంపుఁ జెలులతోడ

గీ. తొగలవగకానిఁ పెగడు నెమ్మొగముతోడ
నునుమెఱుంగు వెడఁదకందోయితోడ
డంబుచెన్నారు సత్త్వరూపంబుతోడ
నాతనికి శక్తి మోర్లఁ బ్రత్యక్షమయ్యె. ౪౧౬

వ. మఱియు రతియు భూతియు బుష్టియు పఠియుఁ గీర్తియు స్మృతి
యు ధృతియు శ్రద్ధయు మేధయు స్వాహాయు క్షుధయు నిద్రయు
గతియు దృష్టియుఁ బుష్టియు క్షమయు లజ్జయు జృంభయుఁ దం
ద్రియు ననుశక్తులతోడ నెదుటం బొడకట్టినమహాలక్ష్మీస్వరూ
పిణి యగు శక్తింగాంచి విస్మయావిష్టచిత్తుండై, ౪౧౭

మ. సలిలం బెక్కడ! మట్టి యెక్కడ! వినిస్తీర్ణాండనై తచ్ఛుచి
స్థలమం దేను వసించు టెక్కడ! మహాశక్తిస్వరూపంబు ముం
గలఁ గన్పట్టు టిదేడ? నాకు నెదుటం గన్పట్టు నీసర్వమున్
గలయో? మాయయొ? లేక మజ్జనని వేష్టల్ నాకుఁ జూపట్టెనో?

వ. అని నానాప్రకారంబుల శంకించుచు మౌనంబూని యున్నంత జగజ్జననియు మందహాసకందళిత ముఖారవిందయై యాతని కిట్లనియె.

గీ. మఱచితివి నన్నుఁ బరశక్తిమాయకతనఁ
బ్రళయమునయందు నిర్గుణప్రతిభ నొప్పు
నమ్మహాశక్తి; సగుణుండనై యొసఁగి
నీవు నను సర్వశక్తిగా నెఱుఁగికొనుము. ౭౨౦

క. నీనాభికమలమునఁ జతు
రాననుఁ డుదయించు నతఁడ యఖిలజగమ్ముల్
బూనియొనర్చు రజోగుణ
మూనినవాఁడైనకతన నుజ్జ్వలకీర్తీ. ౭౨౧

గీ. అతఁడు సృజించినట్టి బ్రహ్మాండమునకు
నీవు పరిపాలకుఁడ వయి నెగడఁ గలవు
అ న్నళినగర్భభ్రూమధ్యమందునఁ గ్రోధ
వశముచే రుద్రుఁడును నుద్భవ మందు. ౭౨౨

గీ. ఆతఁడును ఘోరమగుతపం బాచరించి
దానఁ దామసి యగుశక్తినూని ప్రలయ
కాలమునయందు సంహర్త కాఁగలాఁడు
బ్రహ్మనిర్మిత మైనప్రపంచమునకు. ౭౨౩

వ. ప్రపంచ రక్షణంబునకు నాసాహాయ్యకం బావశ్యకంబు గాన సత్త్వశక్తి నగుననున్నం గైకొమ్ము. భవద్వక్షస్థలంబున నెల్లప్పుడును వసింతు నన నతం డిట్లనియె. ౪౨౪

క. ప్రాకటవర్ణ యుతంబగు
శ్లోకార్థం బాకఁడు వింటె సుందరి! యది నా
కేకతమున వినఁబడియెనో
నీకతమునఁదెలియవలయు నిక్కమనవ్రుడున్, ౪౨౫

వ. మహాలక్ష్మియు నెలనగ వలర నిట్లనియె. ౪౨౬

ఉ. నాపలుకాలకింపుమ యనంత గుణాలయ నైనయట్టినా
రూపముమాత్రి మొప్పుగ నిరూపణఁ జేయగ నేర్తు వీవు దు
ష్ప్రాపము నీకు నిర్గుణత భాసిలు నప్పరదేవతామహా
రూపము తెల్పె నాపె యిది రూఢిగ భాగవతాఖ్యమంత్ర మా,

ఆ. వె. వేదసార మైనవిద్యయై సుభగమై
పుణ్యమై సమస్తగణ్య మగుచు
నొప్పుభాగవతము నొసఁగెఁ బరాంబిక
నీయదృష్ట మేమొ నేనెఱుఁగ. ౪౨౮

క. నీయందుఁ గృపామతియై
యాయంబిక నీకుఁ జెప్పె ననఘా! నిత్య
ధ్యేయంబు నమేయం బన
పాయంబు నటంచు దీని నరయుము మదిలోన్. ౪౨౯

గీ. దీని మఱవక పఠియించితేని శుభము
లబ్బు ననులచ్చిపలుకుల నాలకించి

వ. ఇట్లు బుణగ్రస్తునిపగిది నిర్ధనునిచాదంబున వైకల్యంబున శూన్య హృదయుండై వేశోకభంగిఁ జింతావిష్టుఁడగుకుమారుం గాంచి సాత్యవతేయుఁడు సంశయగ్రస్తుండై యిట్లనియె. ౪౩౪

క. జ్ఞానాభ్యాస మొనర్చుట
మాని వృథాచింతఁ జేసి మన మజ్ఞానా
ధీనముగఁ జేయ నేల? సు
ఖానుభవము గాంచి ముదము నందఁగరాదే? ౪౩౫

గీ. నాకుఁ గొమరుడవయ్యు విజ్ఞానమునకు
నింతగాఁ జింత సేయ నీకేల? నాదు
వచనములు నీమనమ్మునఁ బట్టవేని
వేశోక యుపాయ మొకఁగొతు వినుము పుత్రి! ౪౩౬

వ. మిథిలానగరమ్మున జనకుం డనునొక్క పృథివీపతి గలఁడు, ౪౩౭

గీ. అతఁ డతిశాంతుఁ డతిదాంతు డమలహృదయుఁ
డుత్తమజ్ఞానసంపన్నుఁ డూర్జితుండు
అతని దర్శించి నీసందియముల నెల్లఁ
దీర్చుకొనుమయ్య సత్యము దెలుపఁ గలఁడు. ౪౩౮

వ. అనిన శుకుం డిట్లనియె. ౪౩౯

గీ. రాజ్య మదమత్తు లైనట్టి రాజు లేడ
సకలమునిదుర్లభంబగు జ్ఞానమేడ
దంభ మగుగాక నిజ మని తలఁప నగునె?
కలఁడె? వంధ్యాసుతుండు లోకమున నెందు. ౪౪౦

—* శుకుండు మిథిలా నగరంబునకు నేగుట *—

క. పాపములకు మూలంబు ధ
రాపాలన వృత్తి దాన రక్తుండై యీ
భూపాలుఁడు విజ్ఞాన
ప్రాపకుఁ డని చెప్ప దిది యసంబద్ధము గాదే ?   ౨౨౧

గీ. పద్మపత్రము జలమునఁ బరిఢవిల్లు
చందమున నీతఁ డెట్లు సంసారమందు
నంటి యంటని విధమున నమరి యున్న
వాఁడొ ? యాతనిఁ గనుఁగొన వలచె నాకు ?   ౨౨౨

వ. సంసార చక్రమ్మునఁ బరిభ్రమించు వానికి నిది మాత యనియు
నయ్యది భార్య యనియు వీఁడు పుత్రుఁడనియు నది సోదరి
యనియు నిది కులట యనియు నది చేఁదనియు నది మధురం
బనియు నది క్షారంబనియు నిది శీత మనియు నది యుష్ణ మనియు
నానాభేదంబులు చెప్పడక తప్ప దట్టి భేదజ్ఞానంబు కలవాఁడు
ముక్తుఁ డెట్లగు ? సంతతియగాక రాజ్యభార నిర్వాహకుఁ డగు
నరపాలునకు శత్రు మిత్రాది పరిశీలనం బావశ్యకం బిన్నిటిం
దవిలియు జీవన్ముక్తుఁడగు పురుషుం డదృష్టచరుం డగుటం జేసి
యాతని దర్శింపఁ గుతూహలంబు పొడమెఁ గాయి వచ్చెద
నాజ్ఞ యిమ్మనుటయు వ్యాసుండు,   ౨౨౩

చ. అరిగెదవే కుమార ! శుభ మబ్బెడుఁ గాపుత నీకు నెల్లెడన్
దిరిగియు వైళమే యరుగు దేఁగదవయ్య ! భవన్ముఖంబు నే
నరయక తాళఁజాల విపులాయువు నీ కగుఁగాక యొందుచో
నరిగెదుసుమ్ము బాసయిడు మాపయి యిచ్చోటువీడు మిమ్మెయిన్.

క. జనక నృపుఁగాంచి సంశయ
వినివృత్తింబొరసి మరల వేగమ యిటకుఁ
జనుదెమ్మా, ప్రాణము నీ
వని నమ్మిన నన్ను నంగలార్పింపకుమీ. ౪౪౫

వ. అని మాటి మాటికి ననునయించు తండ్రికి నమస్కరించి యను
జ్ఞాతుండై ధనుర్ముక్తంబగు శరంబు వడువున నతిశీఘ్రగమ
నుండై యరుగుచుఁ దోవ నక్కడక్కడ ననేక విధమ్ములగు
దేశమ్ములను వనములను బర్వతమ్ములను క్షేత్రమ్ములను నానా
ప్రకారులగు మునులను శైవ వైష్ణవ శాక్తాదులను గాంచుచు
ననేక ప్రకారంబు లగు వారి వారి ధర్మంబుల కత్యాశ్చర్య
పర్యాప్తుండగుచు రెండు వత్సరంబులకు మేరువును నొక వత్స
రమునకు హిమనగంబును నతిక్రమించి మిథిలానగరంబు చొచ్చి
యచ్చటి విశేషంబు లాలోకించు చున్నంత ద్వారికుండు
వారించి "నీ వెవ్వండ వేమి కార్యంబున నరిగెద" వనుడు
నవ్వాని కేమియుం జెప్పక మరలి నగరద్వార బహిఃప్రదేశమ్మున
స్థాణువుంబోలె నచలుండై కూర్చుండుడు వెండియు ద్వారికుం
డిట్లనియె. ౪౪౬

క. మూకునివలె లోనికిఁ జన
నీ కెవ్వఁ డానతిచ్చె నృపు దర్శింప
న్నీ కేమి కార్య మబ్బెనొ ? నీ
కులధర్మ స్వభావ నియతులు సెపుమా. ౪౪౭

గీ. బ్రాహ్మణుండవు నాగమ పారగుండ
వంచుఁ దోఁచెడి నినుఁ జూచినంత నాకు

నైనఁ గులమును గార్యంబు నరయఁ జెల్లి
యేగవలె న్యాయ్య మియ్యది యిట మునీంద్ర. ౪౪౮

వ. అనిన శుకుం డిట్లనియె. ౪౪౯

క. ఏ కార్యమ్మునకేఁ బృ
థ్వీకాంతునిఁ జూడ నరుగుదెంచితినో నా
కా కార్యము నీకతముః
వాఁకిటనే యెదురు పడియె వగపేఁక నేగా ? ౪౫౦

మ. హిమవన్మేరు నగమ్ములన్ గడచి నే నీరాజు దర్శింపఁ గ
ష్టము నోర్చెంతయు లెక్క సేయక దురాశన్ నిర్వాహంబు ని
క్కముగా నెమ్మది నిల్చి నచ్చుటది నా కర్మంబు గాదు నో
సము వేషాంతము గల్గ నేర్చునె ? మహాత్మా నిబ్బరం బుల్లసన్.

క. విను పేశ పంభ్రమంబా
బునకు ధనాశయ ప్రధాన మూలము నాకున్
ధనలోభము లేకుండియుఁ
జనుదెంచితిఁ గర్మ గతి యసాధ్యము కాదే ? ౪౫౨

ఆ. వె. ఆస లేనివాని కధికంబు సౌఖ్యంబు
మోహవార్ధియందు మునుఁగఁ డేని
యాస లేనివాఁడ నయ్యును మోహంబు
చాయఁ దవిలి వెడలఁ జాలకుంటి. ౪౫౩

గీ. మేరుపర్వత మది యేడ ? మిథిల యేడ ?
కాలినడలన యిటకు రాఁ గలుగు టేడ ?
అహహా ! యిది యెల్లఁ బ్రారబ్ధ మహిమ కాక
యెంచి చూచిన ఫల మొకింతేనిఁ గలదె ? ౪౫౪

క. వేదము శాస్త్రము పుణ్యా
పాదక మగుతీర్థమో నృపాలునిఁజూడన్
రాఁ దగునె? యిటకుఁ బ్రా
ర్థాదేశముఁ దప్పఁద్రోయనగునే యెందున్? ౨౫౫

క. పరిశీలింపక యే నిట
కరుదెంచినపనికి లాభ మబ్బెను బురిలోఁ
జొరఁబోకుము పొమ్మంచున్
బరిచారకుఁ డడ్డపెట్టుపాటియె తలఁపన్? ౨౫౬

క. ప్రారబ్ధకర్మవశమునఁ
దారసిలు శుభాశుభములు దప్పింకొనంగా
నేరికిఁ దరమా? యని శుకుఁ
డూరక మౌనంబు నూని యుండెఁ దనంతన్. ౨౫౭

వ. ప్రతిహారియు నీతండు మహానుభావుం డని నిశ్చయించి విన
యమ్మున డగ్గఱం జని సామపూర్వకంబుగా నిట్లనియె. ౨౫౮

క. నే యిచ్చ కష్టపెట్టిన
నాయపచారంబు సైఁచి నావచనంబుల్
రోయక పురిలోనికిఁ జను
మా! యేరికినైన నిన్ను నడ్డఁ దరమే? ౨౫౯

క. అన శుకుఁ డిట్లను నీదగు
పని నీవొనరింప దీనఁ బాతక మగునే?
విను పరతంత్రుఁడ వగు ని
న్నను టనుచిత మధిపునాజ్ఞ యట్టిద కాదే? ౨౬౦

క. నరపతియును దూష్యుఁడు గాఁ
డరయక యిట కేగుదెంచు టది నాతప్పే
పరిశీలించిన నొందుం
బు గేహాగమసము గౌరవప్రదమగునే? ౩౬౧

క. అన ద్వారపాలకుం డి
ట్లను సుఖ మన నెద్ది? దుఃఖ మన నెయ్యది? శో
భన మిచ్ఛ గించునరుఁ డె
వ్వని సేయఁగ వలయు హితుఁ డెవం డెవఁడగు రిపుఁడౌ?

వ. నానృపు శుకుం డిట్లను లోకమ్మున జనుఁడు రాగి యనియు విరాగి యనియుఁ దగు నందు విరాగి జ్ఞాతాజ్ఞాత మధ్యమ భేదంబులు గలవాఁడు రాగియును మూర్ఖుండుఁ జతురుండునా ద్వివిధుండు శాస్త్రప్రయుక్తమ్మును మతిప్రయుక్తంబును నని చాతుర్యంబును ద్వివిధంబు, మఱియును యుక్తాయుక్త భేదంబున ద్వైవిధ్యంబు గలయది యన విని ప్రతిహారి మహాత్మా! నీ చెప్పిన వచనంబుల యందలి యర్థంబు నా కబోధ్యంబై యున్నయది. నన్నను గ్రహించి తెల్లంబుగాఁ జెప్పుమని వేఁడుటయు, ౮౬౩

గీ. ఎవఁడు సంసారమునయందు నిచ్ఛగలుఁడౌ
వాఁడెపో రాగినాఁబడు వాని కట్టుల
సౌఖ్యములు దుఃఖములుగూడ సంభవించు
నందు మగ్నుండు పరగతి చెందఁబోఁడు ౮౬౪

క. ధనదారమానవిజయము
లను గొని సుఖ మందునట్టిలాభము లేదు
న్నను దుఃఖము గనుఁ గావున
నొనరుచు యత్నము నతఁడు సుఖోదయమునకుఁ. ౮౬౫

గీ. వానికి సుఖమ్ము నొడఁగూర్చువాఁడ హితుఁడు ;
విఘ్నము నొనర్చువాఁడ పో ! విద్విషుండు
చతురుఁ డెల్లెడ మోహసంగతుఁడు గాఁడు
మూర్ఖుఁ డన నెల్లెడల మోహమును వహించు. ౪౬౬

గీ. ఇఁక విరక్తున కగు సుఖ మెట్టిదనిన
తత్త్వబోధయు నాత్మవిత్త్వమును, దుఃఖ
మనఁగ వానికి సంసార మనుగమించు
వారి చరితంబు విని వలవంతఁ గొనుట. ౪౬౭

క. పరతత్త్వాదరుఁ డగున
ప్పురుషునకుఁ గ్రోధలోభములు మోహంబుఁ
బరికింప శత్రువు లగుఁ
బరమానందంబ వానిబంధువు దలఁపఁ. ౪౬౮

వ. ఇట్లు బోధించు శుకుని విజ్ఞానమ్మున కచ్చెరు వంది ద్వారపాలకుండు యథేచ్ఛాగమనంబున కంగీకరించుటయు నతండు ద్వారమ్ము నతిక్రమించి రాగద్వేషాదిసంకులమ్మును క్రయవిక్రయోపలక్షితంబును విపణిద్రవ్యమనోహరంబును వివదమానజనసంకులంబును వసుపూర్ణంబును నగు నప్పురంబు నల్గడల నాలోకించుచుఁ జనువాఁడు రాజమందిరద్వారమ్మున దౌవారికుచే నివారింపంబడి శీతోష్ణాదికంబుల సమదర్శనుండై మోక్షోపాయంబుఁ జింతించుచు నచలుండై స్థాణువుం బోలి నిలిచి యున్నంత నమాత్యుం డొక్కఁడే తెంచి బద్ధాంజలిపుటుండై లోనికిం దోడ్కొని పోయి దివ్యపాదపలతాశోభితం బగు నొక్క రాజోద్యానమ్మున నతిథిసత్కారమ్ము నెఱవేర్చి, ౪౬౯

వ. అక్కాంతలును నాతని జితేంద్రియుండని నిశ్చయించి భక్తితాత్ప ర్యమ్ములిగుర్కొత్తఁ దత్తదుపచార కల్పనమ్ముల సేవించుచుండిరి. శుకుండును నిర్వికారచిత్తుండై యాత్మారాముండై యథావిధిగ సాయం సంధ్యోపాసనం బొనర్చికొని యామమాత్రంబు ధ్యాన నిశ్చలుండై పదఁపడి తదంగనాదర్శితంబగు నొక మనోహరతల్పం బున శయనించి వేగుజామున మేల్కాంచి యుషఃకాలంబు దనుక ధ్యాననిష్ఠుండై పిదపఁ గాల్యకృత్యమ్ములు నెఱవేర్చికొని మరల సమాధియుక్తుండై యున్నంత, ౪౭౪

—* శుకజనక సంవాదము *—

క. శుకముని యాగమనమ్ము జ
నకుఁడెఱిఁగి పురోహితుం దనకు మున్నుగఁ జే
సికొని శుకునిఁ దగ నర్ఘ్యా
దికముల నర్చించి కడు విధేయుం డగుచున్, ౪౭౫

వ. కుశలం బడిగి యొక గోవును సమర్పించి వినయవినమితుండై యున్నంత శుకుండును జనకునిఁ దగు గౌరవ భాషణంబుల గౌర వించె నంత జనకుండు, ౪౭౬

ఆ. వె. నిస్పృహుండవైన నీ వేమికతమున
నిటకు వచ్చినాఁడ వెఱుఁగఁ జెపుమ!
యనుడు నన్న రేంద్రు నాదరమ్మునఁ జూచి
యారణేయుఁ డిట్టులనియెఁ గడఁగి. ౪౭౭

వ. రాజేంద్రా! మా తండ్రి యగు వ్యాసుండు నాకుపనయనాది కం బొనరించి సమాప్తవ్రతుండనైన నన్నుం దారపరిగ్రహం బొనరింపుమనుడు సంసారబంధమ్మునకు భీతిల్లి యే నొల్లనైతి

నాయనయు గృహస్థాశ్రమం బుత్తమం బనియు నవశ్యగార్హస్థ్యం బనియు ధర్మార్థకామమోక్షసాధనంబనియు నుపదేశించి యోగీ కరింపని నన్నుం గాంచి మిథిలానగరమ్మున కేగినచో నీ సంశయంబు నిర్గతంబగు నని చెప్పినకతమ్మున నిన్నుం గనవచ్చితి. మోక్షకాముండగు నాకుం గర్తవ్యం బెయ్యదియో యానతీవలయు ననిన నతని కాతం డిట్లనియె. ౪౭౮

గీ. వినుము విప్రేంద్ర! మోక్షంబుఁ గోరఁగ నిచ్ఛ
గలుగువారలు వర్తించు క్రమము మొదట
నుపనయన మంది వేదంబు నొంది దేశి
కునకు దక్షిణ నొసఁగి మీఁదను దదాజ్ఞ, ౪౭౯

క. దారం బైకొని విసులా
చారుండై న్యాయరీతి జవదాఁటక క
ర్మారంభ మ్మొనరించు మ
సారగతిఁ మెలఁగుటొప్పు సంసారమునన్. ౪౮౦

సీ. పుత్రులఁ బౌత్రులఁ బొడఁగాంచి వీఁద వా
నప్రస్థుఁ డగుచు వనమ్మునందుఁ
దప మాచరించి షడ్రిపుజయం బొసగించి
యగ్నుల నాత్మ యం దావహింపఁ
జేసి భార్యను వీడి చిత్తము వైరాగ్య
మనుగమింపఁగఁ దుర్యాశ్రమంబు
నంగీకరించి శుద్ధాంతరంగుండయి
చరియించుటిది వేదసమ్మతంబు

గీ. గాని మొదలనె సన్న్యాసమూనుటది వి
రుద్ధము విరక్తికలన సంశుద్ధుఁడైన

యనఘుఁడే కాని సన్న్యాస మధిగమింపఁ
దగఁడు తగఁ డియ్యదియె నా మతము మునీంద్ర. ౪౮౧

క. నలువది యెనిమిది సంస్కృతు
లిల వేదాపాదితమ్ము లిందు గృహి కగుఁ
నలువది తుర్యాశ్రమవం
తుల కెన్మిదియగు ననుచు శ్రుతులువచియించుఁ. ౪౮౨

క. అనిన శుకుఁ డిట్టులను నో
జనపాలవరేణ్య! మానసమ్ము విరాగం
బున కెనసినంత సన్న్యా
సనియతి గొనుటొప్పకున్నె సారజ్ఞునకుఁ? ౪౮౩

వ. అనిన జనకుం డిట్లనియె. ౪౮౪

గీ. ఇంద్రియమ్ము లజేయమ్ము లెంత పెద్ద
పండితునకైనఁ గాని లోఁబడకయుండు
నాటి తేఱనివారల కడుగవలెనె?
ప్రతిపదమ్మును మదివికారమ్ము గ్రమ్ము. ౪౮౫

గీ. భోజనాసక్తి శయనేచ్ఛ భోగరక్తి
పుత్రసంసక్తియును మదిఁ బొడమెనేని
యతియయినమీఁదఁ దన కెటు లనుభవింప
వచ్చుఁ? గోరిక లనఁగ నవారితములు. ౪౮౬

గీ. కానఁ గ్రమమున సర్వ భోగములు ననుభ
వించి త్యజియించి గ్రహియించి మించవలయుఁ
గాని యువ్వెత్తుగా వీడఁగాఁ దరంబె?
యూర్ధ్వసుప్తుండు పతనమ్ము నొందకున్నె? ౪౮౭

క. ఏవఁడు యతియయ్యు వైరా
గ్య వివేకం బెడలి భోగముం బాసక్తిం
దవులునొ భ్రష్టుండై వాఁ
డవల నిరంతరము నరకమంద కృశించున్. ౪౮౮

గీ. చీమ మెలమెల్లఁగాఁ జని చెట్టు తుదకు
నేగు కరణిఁ గ్రమమ్ముగా నెఱుక గలిగి
సన్యసింపఁగవలెఁ గాని సన్యసించి
కొంటికిం జెడ్డ రేవడ రీతి చనునె? ౪౮౯

గీ. వడివడిగఁ బోవు పక్షుల వడువు గనక
మందగమనంది యరుగు చీమల వడువునఁ
గ్రమముగా నుత్తమ పదంబు గాంచినప్పుఁ
గాని తత్క్షణపాటు సుఖప్రదంబె? ౪౯౦

గీ. మన మజేయుబు దానిఁ గ్రమక్రమమున
యుక్తమార్గమ్ములకుఁ జొన్పి యుపవలయు
ననుభూతేంద్రియసుఖాత్ములైనవారి
కింద్రియమ్ములు శత్రులై యొనగూడునె? ౪౯౧

మ. గృహమం దుండియు శాంతిగల్గి తగుభంగిం బోవుచున్ లాభసం
గ్రహసంతృప్తుఁడు లాభ మబ్బమిని దుఃఖగ్రస్తుఁడుం గాక స
ద్విహితంబుల్ పొనరించుచున్ సతత మావిర్భూతమోదోదయుం
డహితత్యాగియునై చరించుపురుషుం డందుం గాదె మోక్షమున్.

చ. ననుఁ గనుఁగొమ్ము భోగము లనంతముగాఁ గొనుచున్ జనానురం
జన మగురీతి రాజ్యమును సల్పుచు నిచ్చఁ జరించుచుండియున్

మన మతినిర్మలంబుగ నొనర్చి చెలంగుటచే విదేహాము
క్తిని గొనువాఁడ నీ వనుమతింపగ రాదె ? సుఖమ్ము లిమ్మెయిన్.

గీ. ఆత్మవస్తు వెవ్వరికైన నక్షిగోచ
రంబుగా దనుమేయ మరంజనంబు
నిర్వికారంబు దానికి నెగడు టెట్లు
బంధనం బింత దెలియంగఁ బడదె మౌని ! ౪౯౪

ఆ. వె. సలుపనిమ్ము తపము జప మొనర్పఁగ నిమ్ము
తిరుగనిమ్ము సర్వ తీర్థములును
చిత్తశుద్ధి లేని చెనఁటులు చేయు ప
నులు దలంప వ్యర్థములు మునీంద్ర. ౪౯౫

ఆ. వె. నేను నీవు నాది నీయది యనెడి సం
బంధ కారణంబు మనము వినుము
మనము శాంతమైన మునినాథ బంధమ్ము
కలుగు నెట్లు ? ముక్తి గలుగ దెట్లు ? ౪౯౬

గీ. శత్రుమిత్రాదిభేదమ్ము సకలమును మ
నోగతమ్ము నవిద్యా వినోదమును ఘ
టంచుఁ దెలియుము విద్యోదయంబు వొడమె
నేని యివి యన్నియును నశియింప కున్నె ? ౪౯౭

క. విద్యన్ దెలియుట కొఱకు న
విద్యా కార్యముల ననుభవింపన్ వలె సూ
ర్యద్యుతిఁ బడలని వానికి
హృద్యంబై చెట్టునీడ యొసకం బిడునే ? ౪౯౮

గీ. భూతములు భూతములయందుఁ బొరలెనేని
గుణములు గుణమ్ములను గూడికొనియెనేని
ఇంద్రియము లింద్రియార్థమ్ము లెసఁగెనేని
యాత్మ కరయంగ దోష మింతైనఁ గలదె? ౯౯

క. వేదము లోకములకు మ
ర్యాదాపాదకము దాని నవమానించి ధ
రా దవమానించిన ధ
ర్మాదులు నశియించు సౌగతాదులకు బలెన్. ౧౦౦

గీ. ధర్మ మడఁగినయంత నధర్మ మెసఁగుఁ
దాన వర్ణాశ్రమాదివ్యవస్థ లడంగుఁ
గాన వేదోదితము లగుకర్మము లను
వగ నమష్ఠించుటయు సమ్మతము మునీంద్ర. ౧౦౧

క. అని జనకుం డుపదేశిం
చిన విని శుకుఁడనియె నీవు చెప్పినవిధమున్
మనమలరన్ వింటిని నా
యనుమానము తీఱదయ్యె ననఘచరిత్రా. ౧౦౨

గీ. వేదధర్మంబు లన హింసవిధము దెలుపు
తలఁపు గలయవి హింస యధర్మమకద
అట్టి ధర్మేతరము చెప్పునట్టి యాగ
ముమ్ము లవియును ముక్తిప్రదమ్ములగునె? ౧౦౩

గీ. పశులఁ జంపించుటయు మాంసభక్షణంబు
సోమపానమ్ము ప్రత్యక్షసురతవిధి యొ
నర్పఁజేయుట మొదలు జన్నములయందు
నలుపు దుర్వృత్తు లివియు మోక్షప్రదములె? ౧౦౪

సీ. ధర్మరతుండు వదాన్యుండు శిష్ట సం
రక్షకుండును దుష్టశిక్షకుండు
ననఁ దగు శశిబిందు వసురాజు మును దా నొ
నర్చిన మేటిజన్నమ్ములందుఁ
జంపిన పశువుల చర్మంబు లవి వింధ్య
పర్వత సదృశభావంబునందె
ర_క్త మంతయును జర్మణ్వతి యను నొక
నది యయ్యె నట్టి మానవపతికిని
గీ. గతి దివంబాయెఁ గాని మోక్షంబు దొరక
దాయె; నాతని యశము సాక్ష్యమ్మొసంగు
నాగమో_క్త కర్మంబుల నాచరించు
వారలకు మోక్షపదము దుష్ప్రాప మనుచు. ౫౦౫

గీ. కాన నీదృశధర్మముల్ గలుపు నాగ
మముల నాకించుకయు బుద్ధి మసల దనఘ
సంసృతికిఁ గారణంబు స్త్రీ సంగమంబు
దానిఁ గనువాఁడు ముక్తుఁ డెట్లౌను ? చెప్పుమ. ౫౦౬

ఉ. ఆగమధర్మ మూనఁగ గృహవ్రతియే యధికారి వానికిన్
సాఁగదు. దారతోడ సుఖసంగతిమై వసియింపకున్న నా
భోగము చేకుఱన్ మనము పొంగును జేకుఱకున్న ఖిన్నుఁడై
తాఁగ్రుశియించు నిట్టిపరతంత్రుఁడు మోక్షముఁజెందనేర్చునే ?

వ. అనిన జనకుం డిట్లను; మునీంద్రా ! యజ్ఞాదికంబుల వేదోదితంబగు
హింస యుపాధిభేదమ్మున నహింసయ యగు నది యెట్లంటేని ?

మ. ఫలముం గోరి యొనర్చుహింస తనకుం బాపమ్ము సంధించుఁ గా
ని లవమ్మైన ఫలమ్ము గోరనియెడన్ లేదట్టి పాపమ్ము ని

ర్మలమై యొప్పెడిపిమ్మ కింధనపుసంబంధమ్ముచేఁ గాక తాఁ
గలుగన్నేర్చునె ధూమ మూరకయ, నికిఁ గాంచింత యూహింపుమా.

గీ. రాగి కాక యొనర్చు కర్మమ్ము లవి కృ
తమ్ములయ్యును విను మకృతమ్ము లగును
గాన మోక్షేచ్ఛ నొందిన ముకర్మనులకుఁ
బాతకము లేదటంచు విద్వాంసు లందు. ౧౧౦

వ. అనిన శుకుం డిట్లనియె. ౧౧౧

గీ. సందియం బొక్కఁడు మనమ్మున నొకఁ డొదవు
చున్నయది మాయలో మున్గి యున్నవాఁడు
నిస్పృహుఁ డెట్లు లగు ? మోహనియుతులరును
గేవలము శాస్త్ర మగునె ముక్తిప్రదంబు ? ౧౧౨

ఆ. వె. దీపవార్త చేతఁ దిమిరంబు వాయుని
యట్లు శాస్త్ర మబ్బినంతమాత్రి
లోన నున్నతమము లోకొని యడఁగునే ?
యనుభవమునఁ గాక జనకభూప ! ౧౧౩

క. పరహింస సలుపకుండుట
పరమహితంబ కద ! మోక్షపదగాములకు సం
సరణమున మునిఁగి తేలెడి
నరులకు నది యెట్లు జరుగు నరనాథమణీ. ౧౧౪

క. ధనవాంఛయు సుతవాంఛయు
వనితావాంఛయును రాజ్యవాంఛయు నీ నె
మ్మనమున వదలవు నీకుఁ ద
గునె జీవన్ముక్తపదము ? కువలయనాథా ! ౧౧౫

గీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణమ్ము
నవనిపతివైన నీ కవశ్యములు కావె
యిట్టి భేదమ్ము చొప్పడునట్టి నీ వి
దేహముక్తికి నే సమ్మతించు టెట్లు ?   ౧౧౯

మ. కటుతిక్తామ్ల కషాయభేదము లెఱుంగక లేవో ? యిష్టార్థలం
పటభావమ్మును బొందవో ? కడు నరమ్యంబైన వస్తుక్రియా
ఘటనన్ హేయతఁగాంచకుంటివో కో? జాగ్రత్స్వప్నసుప్త్యాదులం
దటులే మగ్నతనొందకుందువో ? తురీయావస్థ నీకొప్పునే? ౧౨౦

మ. ఇది నాసేన, మదీయరాజ్య మిది, నాయేణాక్షి యీనాతి, యి
య్యది నాపుత్రిక, వీఁడు నాసుతుఁడు, నా కాహ్లాదకం బిద్ది, యి
య్యది నాకుం బ్రతికూల మంచు మది నూహల్ సేయు నీవెట్లు ము
క్తదశం జెందెదు ? నీకు లోష్టమును బంగారమ్మునుం దుల్యమే ?

సీ సేవింప గతి లేదు చేయంగఁ బని లేదు
నిలిచి వసింపంగ నీడ లేదు
కామింప సతి లేదు గణియింప మతి లేదు
దుఃఖించుటకు లోనదుడుకు లేదు
తిట్ట శత్రుఁడు లేఁడు దీవింప హితుఁడు లేఁ
డేలంగ నొకపల్లెయేని లేదు
మానమ్ము లే దవమానమ్ము లేదు క
ష్టమ్మును లేదు సుఖమ్ము లేదు

గీ. పుష్పఫలమూలములఁ బొట్టఁ బోసికొంచు
నరయ నాయంతవాఁడనై యడవిమృగము
వడుపునఁ జరింతు నావంటిబడుగు చెందు
వాఁడు కాఁడె ? జీవన్ముక్తపదము నధిప !   ౧౨౧

ర్మలమై యొప్పెడివహ్ని కింధనపు సంబంధమ్ముచేఁ గాక తాఁ
గలుగన్నేర్చునె ధూమ మూరకయ, నిక్కంబింత యూహింపుమా.

గీ. రాగి కాక యొనర్చు కర్మమ్ము లవి కృ
తమ్ములయ్యును విను మకృతమ్ము లగును
గాన మోక్షేచ్ఛ నొనరించుకర్మములకుఁ
బాతకము లేదటంచు విద్వాంసు లండ్రు. ౧౧౦

వ. అనిన శుకుం డిట్లనియె. ౧౧౧

గీ. సందియం బొక్కఁడు మనమ్మునందుఁ దోఁచు
చున్నయది మాయలో మున్గి యున్నవాఁడు
నిస్పృహుం డెట్లు లగు ? మోహానియతులకును
గేవలము శాస్త్ర మగునె ముక్తిప్రదంబు ? ౧౧౨

ఆ. వె. దీపవార్త చేతఁ దిమిరంబు వాయని
యట్లు శాస్త్ర మబ్బినంతమాత్రి
లోననున్న తమము లోకొని యడఁగునే ?
యనుభవమునఁ గాక జనకభూప ! ౧౧౩

క. పరహింస సలుపకుండుట
పరమహితంబ కద ! మోక్షపదగామికి సం
సరణమున మునిఁగి తేలెడి
నరులకు నది యెట్లు జరుగు నరనాథమణీ. ౧౧౪

క. ధనవాంఛయు సుతవాంఛయు
వనితావాంఛయును రాజ్యవాంఛయు నీ నె
మ్మనమున వదలవు నీకుఁ ద
గునె జీవన్ముక్తపదము ? కువలయనాథా ! ౧౧౫

గీ. శిష్టరక్షణమును దుష్టశిక్షణమ్ము
నవనిపతివైన నీ కవశ్యములు కావె
యిట్టి భేదమ్ము చొప్పడునట్టి నీ వి
దేహముక్తికి నే సమ్మతించుటెట్లు ? ౫౧౬

మ. కటుతిక్తామ్ల కషాయభేదము లెఱుంగన్ లేవొ ? యిష్టార్థలం
పటభావమ్మును బొందవో ? కడు నరమ్యంబైన వస్తుక్రియా
ఘటనన్ హేయతఁగాంచకుంటివొకొ? జాగ్రత్స్వప్నసుప్త్యాదులం
దటులే మగ్నతనొందకుందువొ ? తురీయావస్థ నీకొప్పునే? ౫౧౭

మ. ఇది నాసేన, మదీయరాజ్య మిది, నాయేణాక్షి యీనాతి, యి
య్యది నాపుత్త్రిక, వీఁడు నాసుతుఁడు, నా కాహ్లాదకం బిద్ది, యి
య్యది నాకుంబ్రతికూల మంచు మది నూహల్ సేయు నీవెట్లు ము
క్తదశం జెందెదు ? నీకు లోష్టమును బంగారమ్మునుం దుల్యమే ?

సీ. సేవింప గతి లేదు చేయంగఁ బని లేదు
నిలిచి వసింపంగ నీడ లేదు
కామింప సతి లేదు గణియింప మతి లేదు
దుఃఖించుటకు లోనదుడుకు లేదు
తిట్ట శత్రుఁడు లేఁడు దీవింప హితుఁడు లేఁ
డేలంగ నొకపల్లెయేని లేదు
మానమ్ము లే దవమానమ్ము లేదు క
ష్టమ్మును లేదు సుఖమ్ము లేదు

గీ. పుష్పఫలమూలములఁ బొట్టఁ బోసికొంచు
నరయ నాయంతవాఁడనై యడవిమృగము
వడువునఁ జరింతు నావంటిబడుగు చెందు
వాఁడు కాఁడె ? జీవన్ముక్తపదము నధిప ! ౫౧౯

చ. వనిత గృహమ్ము విత్తమనువాంఛలతోఁ బనిలేని నాకు నా
పని పెఱవారి కేమి ? గుణవర్గము వీడి చరింతు ; నీవనన్
వనిత గృహమ్ము విత్తమనువాంఛ మదిన్ వదలంగ లేవు నీ
కనువగునేని ముక్తిపద మన్యులు పొందనివార లుందురే ?

క. ఒకవేళ ధనము లేమి మ
ఱొకవేళను సేన లేమి నొకవేళను శ
త్రుకృతభయం బెడఁబాయమి
నకదా ! చింతించుచుందు వవనీపాలా ! ౨౧

తే. గీ. అనఘులు జితవ్రతులు మితాహారులైన
యట్టి వైఖానసులు దీని సత్యసార
మంచు గుర్తించియును నడుగంటుచుండ
నీవు సంసారివై ముక్తి నెట్లు గంటి ? ౨౨

వ. భవదీయవంశోత్పన్నులగు రాజులకందఱకు సమూచానంబుగా విదేహపదంబు చెల్లంబోలుఁ; గాదేని మీపూర్వుండగు నిమి జన్నం బొనరింపఁ గులగురుం డగు వసిష్ఠుం గాంచి విన్నవించిన నతండును " సురేంద్రుండు యజ్ఞం బొనరింప నున్నవాఁడు తదధ్వరమ్ము సమాప్తి నొందించి నీమఖంబు నెఱవేర్చెద " ననుడు వేఱొకని వశమ్మునఁ దనజన్నంబు నెఱవేర్చికొని కుపితుండగు వసిష్ఠుచే " నీశరీరంబు భూపతితం బగుఁ గాక " యని శపింపంబడి " నీకును నియ్యదియ శాపం " బని యెదురు శపించె నని వింటి. విదేహముక్తు లగువా రిట్టిపను లొనర్తురే ? యని మఱియును,

క. విను మీవిదేహబిరుదం
బనఘా ! ఘృతకోశమట్టులయ్యె దరిద్రున్

జనునే లక్ష్మీశ్రీధరుఁడన ?
ననువే విద్యాధరాహ్వయము మూర్ఖునకున్ ? ౧౨౮

వ. నావుడు జనకుండిట్లను, ౧౨౯

మ. భవదుక్తం బనృతమ్ము గాదు విను విప్రా! నీవు నీతండ్రియా
జ్ఞ వృథా చేసి వనాంతరమ్మునకు వేడ్కన్ బోవనుంకించె ద
య్యవనిన్ మాత్రము సంగముం గనక యేలా యుండ్క నీకొప్పున
య్య! విలోకింపు మరణ్యమందు మృగనిత్యవ్యాప్తి లేకుండునే ?

క. దండం బేమయ్యెడినో క
మండలు వేమగునోయంచు మాటికి నెట్టుల్
గొండాడె దీవు, నే భూ
మండలభరణమును నల్లె మది సంధింతున్. ౧౩౨

గీ. నిత్యమును బొట్టకై చింత నీకుఁ దప్ప
దట్టులే రాజ్యచింత నాకభిమతంబు
సందియముఁ జెంది యీవు విచార మొందె
దేను నిస్సంశయుండ నై యెసఁగువాఁడ. ౧౩౩

మ. అనుమానం బొకయింత లేక సుఖినై యాహారముం గొందు ని
ద్రనుగై కొందు సుఖమ్ములంబడయుదున్ రాజ్యమ్ము శాసింతుఁ గా
ని నిబద్ధుండ నటంచు భీతిని గొన న్నీ వన్నియున్ వీడి ని
త్యనిబద్ధుండ నటంచుఁ జింతిలెదు నీకా! ముక్తి సిద్ధించుటల్.

గీ. కాన నీవు నిబద్ధుండఁ గా నటంచు
సకలము నొనర్పు మదియ మోక్షమ్మునుమ్ము
బద్ధబుద్ధిని నీ వెంతపాటువడిన
ముక్తిఁ గాంచుట సున్న యోమునివరేణ్య. ౧౩౦

ఆ. వె. మమత వీడి యెట్టికర్మమునైన వర్తించె
నేని వాఁడు ముక్తికేగువాఁడు
మమత నొందువాఁడు మఱి యెట్టికర్మముఁ
బోయె నేని ముక్తి బొరయ లేఁడు. ౫౩౧

గీ. అనఘ ! రాజ్యాదికంబు నాయది యటంచు
నిచ్చ గలిగి ప్రవర్తింప నింత నిజము
గాన నేను జీవన్ముక్తగతిని గంటి
వెట్టిఁబడ నేల ? నామాట వినఁగదయ్య. ౫౩౨

క. అని జనకుం డుపదేశం
బొనరించిన శుకుఁడు మోద మొంది తపంబొంగన్
జనె నాశ్రమమ్మునకు సుతుఁ
గని వ్యాసుండును బ్రమోదకలితుండగుచున్, ౫౩౩

క. తనయా ! జనకునివలనన్
మనమునఁ గలసందియమ్ము మానెఁగదా ! నీ
కనుచు శుకుఁడిట్టులనె స
జ్జనకునివలె మునికి నాకు సమ్మత మనఘా ! ౫౩౪

వ. అట్లు సమ్మతించిన వ్యాసుండు సంతుష్టాంతరంగుండై పీవరి యను
నొకకన్నియం దెచ్చి వివాహం బొనరించె. ౫౩౫

క. ఆ రమణియందు శుకుఁ డా
త్మారాముండయ్యుఁగనియె ననఘుల సుతులన్
గౌరప్రభు దేవశ్రుతు
భూరిన్ గృష్ణున్ సమస్తబుధమానితులన్. ౫౩౬

గీ. నలువురకు వెన్క నొక్కకన్యకను గీర్తి
యనెడి దానినిగని దాని నణుహుండ డనఁగ
నెసఁగు విభ్రాజపుత్రున కిచ్చె, నతఁడు
బ్రహ్మదత్తునిఁ గనియె నప్పడఁతియందు. ౫౩౭

క. శుకకన్యాతనయుం డ
త్యకలంకుఁడు బ్రహ్మదత్తుఁ డవనీపతియై
సకలముఁ బరిపాలించుచు
నొకతఱి నారదుని మునికులోత్తముఁ గాంచెన్. ౫౩౮

తదుపదిష్టం బగు మాయా బీజోపదేశమ్మునతన నిరర్గళజ్ఞాన సంపన్నుండై విరక్తిం గాంచి రాజ్యభారంబు పుత్రునందిడి బదరికాశ్రమమ్మునకుం జనియె. శుకుండును బితృసాన్నిధ్యంబు విడిచి కైలాస శిఖరంబున కరిగి యచ్చట నిరంతర ధ్యానసంపన్నుండై కొండొకకాలమ్ము వసియించి పిమ్మటఁ దద్గిరి శిఖరమ్మునుండి యోగబలమ్మున నుత్పతనంబొనర్చి సకలయోగిజన దుష్ప్రాపంబగు సిద్ధిం బొరసి యంబరతలమ్మున రెండవ భాస్కరుం బోలె వెలుఁగుచుండె. ౫౩౯

క. వ్యాసుండును సుత విరహా
యాసమ్మునఁ బెచ్చుపెరుఁగు నడలున మిగులన్
గాసిలి యట నిలుపోపమి
హా సుత! యనుచుం జనె రజతాచలమునకున్. ౫౪౦

ఆ. వె. అచట నంగలార్చు నమ్మహాభాగుని
యందుఁ గరుణ గలిగి యఖిల గతుఁడు
ప్రతి రవం బొనర్చెఁ బరముఁ డిప్పటికి న
ప్పర్వతమున నెగడుఁ బ్రతి రవంబు. ౫౪౧

చ. అటు విలపించు వ్యాసుకడ కంగజ మర్దనుఁ డేగుదెంచి "నీ
విటు దిగులొంద మంచిదగునే? భవదీయ సుతుండు యోగ దు
ర్ఘటమగు మోక్షముం గనె నఖండుఁ డతం డిఁక వాని కింత య
కటకటికము పూని దుఃఖపడఁగాఁ దగునయ్య! పరాశరాత్మజా.

క. అని యోదార్చు శివుం గని
యనియెన్ వ్యాసుండు పుత్రు నరయక యున్నన్
గనులకుఁ జల్లన గలుగదు
చినఁబోవు మనంబిఁకేమి సేయుదు దేవా! ౧౮౩

వ. అని పునఃపునర్విషాదంబునం దిగులొందు వ్యాసుఁ గరుణించి శంకరుండు "నీ సుతుండు ఛాయారూపమ్మున నెప్పుడును నీ సన్నిధి నుండు" నని వరంబిచ్చి యంతర్హితుండయ్యె. ౧౮౪

క. హరుఁ డటువోయినమీఁదన్
బరాశరాత్మజుఁడు దుఃఖభరమగ్నుండై
యరుదెంచె నాశ్రమమ్మున
కరయఁగ శుకచరిత మిది మహామహులారా! ౧౮౫

వ. అని చెప్పు సూతుంగాంచి శౌనకాదు లో మహాత్మా! శుకుం డట్లు సిద్ధిం గాంచిన పిదప వ్యాసుఁ డేవిధమ్ముగ వర్తించె విన రింపుమన నతఁ డిట్లనియె. ౧౮౬

సీ. వ్యాసుని శిష్యులై వటులు దేవలుఁడు నై
శంపాయనుండును జైమినియును
నసితుండును సుమంతుఁ డంతకుమున్న యా
తని యాజ్ఞఁ గైకొని చనిరి వ్యాసుఁ
డటు శిష్యు లరుగుట కిటు పుత్రుఁ డంతరిం
చుటకును నెమ్మది శోక మంది

తానును నందేనిఁ బో నుద్యమించి యం
తటఁ దన తల్లి యా దాశరాజ

ఆ. వె. సుతను సత్యవతిని శుభగుణ సంపన్న
సంతరాత్మఁ దలఁచి యచ్చోటు వీడి
జన్మభూమి కడకుఁ జని నిషాదులఁ గాంచి
యాపెజాడ వారి నడుగుటయును, ౧౮౭

—* ధృతరాష్ట్రాద్యుత్పత్తి *—

వ. వారు సత్యవతిని శంతనున కిడిన వార్త తెల్పిరి. పదఁపడి దాశ రాజు తగు సత్కారమ్ముల నాతని గారవించి స్వాగతం బడిగి వినయ వినమిత శిరస్కుండై బద్ధాంజలిపుటుండై, ౧౮౮

క. దేవా పాత్రస్యం బైతగు
తావక సందర్శనం బొదవు కతమున నేఁ
బావనుఁడ నైతి జన్మము
పావనమై యెసఁగెఁ గులము పావనమయ్యెన్. ౧౮౯

వ. భవదాగమనకారణంబు వినవలతు ననుడు వ్యాసుండు మఱేమి యుం జెప్పక యట కనతిదూరమ్మున నున్న సరస్వతీ యొడ్డున నాశ్రమం బేర్పఱచుకొని తపం బొనరించుచుండె. బదఁపడి శంత నుండు సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులను గొమరులఁ బడయుటయు నయ్యది విని వ్యాసుం డమితానందంబు నందె. ఇట్లు తనయులం గాంచి వారి కారణమునఁ దన్ను ధన్యుంగా నెంచికొనుచుఁ గొండొకకాలమ్ము రాజ్యమ్ము శాసించి కాల గతిం బొరసిన పిదపఁ బ్రథముండగు గాంగేయుండు తన తండ్రికిఁ గాలోచితంబు లొనరించి పైతృకంబగు రాజ్యంబొల్లక దేవ

వ్రతుండై తనతమ్ములలో నగ్రజుండగు చిత్రాంగదునకుఁ బట్టంబు గట్టె. ౫౫౦

శా. ఆ చిత్రాంగదుఁ డొక్కనాఁడు మృగయావ్యాపారికేళిన్ మృగ
ప్రాచుర్యంబున నొప్పు నట్టడవిలోఁ బ్రవేశించి క్రీడించుచో
నాచెంతన్ నృపు నాత్మనామధరు డాయం జొచ్చి నాగాధిప
ద్యాచాతుర్య మెలర్పఁ దాకె నొకగంధర్వుం డనాదృత్యమ్మునన్.

క. ఆ యిరువురు నొక మూఁడేం
డ్లాయతగతిఁ బోరుసల్పి రా ఖచరుఁడు గాం
గేయానుజున్ స్వర్గ
స్థాయిగ నొనరించె నిశితశరపాతములన్. ౫౫౧

వ. భీష్ముం డయ్యుదంతంబు విని తమ్మున కుత్తరక్రియ లొనర్చి విచి
త్రవీర్యుని రాజ్యమ్మున కభిషిక్తుం జేసె. సత్యవతి పుత్రశోకో
పహత యయ్యుఁ గనీయఃపుత్రరాజ్య లాభమ్మునకు సంతసించె.
వ్యాసుం డియ్యది విని యామోదించె నంత విచిత్రవీర్యుండు
క్రమమ్ముగా సంప్రాప్త యౌవనుండై రాజ్యమ్ము శాసింప
గాంగేయుం డతనికిం బరిణయం బొనర్ప నుంకించుచుండె. ౫౫౨

ఆ. వె. అంతఁ గాశిరాజు సంతసమ్మునఁ దన
యాత్మజాతలకు స్వయంవరమునఁ
బెండ్లి సేయు నిచ్చఁ బిలిపించె రాజన్య
వరుల నెల్లఁ దగినవారిఁ బంచి. ౫౫౩

వ. భీష్ముం డచ్చటి కేగి నిఖిల రాజన్యుల జయించి యంబాంబా
లాంబికలను మువ్వురఁ గన్యకలం దనరథమ్మున నిడికొని
మాతృది భావమ్మున వారిం జూచుచుఁ బురమ్మున కరుదెంచి

తల్లికిఁ గన్నియలఁజూపి దైవజ్ఞనిర్ణీతంబగు నొక్క సుముహూర్తమ్మునఁ దమ్మునకుఁ బరిణయంబొనర్ప సమకట్టియున్నంత వారిలోఁ బెద్ద యగు నంబ లజ్జావనతాననయగుచు శాంతనవున కిట్లనియె. ౧౧౧

శా. నాకున్ సాల్వునియందు నానృపతికిన్ నాయందు నెయ్యంబు దా
నేకాకారముఁ జెంది యున్నయది, నీ వెంతే బలాఢ్యుండవై
యాకర్షించితి నీ యధీన నగు నా కారాజు ప్రేమించునే?
నీకుం దోఁచని ధర్మముం గలదె? మన్నింపంగదే నావుడున్,

వ. దేవవ్రతుండును వృద్ధబ్రాహ్మణజననీసచివానుమతంబున నద్దాని యథేచ్ఛాగమనమ్మున కంగీకరించిన నయ్యదియు సాల్వ నికేతనమ్మునకుంజని యతనితో నిట్లనియె. ౧౧౨

క. నీయం దనురాగము గల
నా యాథార్థ్యమ్మెఱింగి నను విడిచెను గాం
గేయుం డో నృపమన్మథ
న్యాయముగఁ బరిగ్రహింపుమా నాకరమున్. ౧౧౩

ఉ. నావుడు సాల్వుఁ డిట్లులను నాతిరో! నేఁ గనుచుండ నాఁడు నిన్
గేవలమంటె భీష్ముఁ డెటు నే గ్రహియింతు? నెవండు గైకొనున్
బో! వెలఁదిన్ బరుండు గొనిపోయి త్యజించిన దానిఁ, బౌరుష
శ్రీ వెలిదొక్కి సుక్కువడదే? చనుమీ చనుదెంచినట్లుగన్.

గీ. అట్లు త్యజియింప నయ్యంబ "యకట! చెడితి"
ననుచు విలపించుచును వెస నరుగుదెంచి
భీష్ముఁ గని పల్కు "ధర్మజ్ఞ బేలనైతిఁ
జెడితి సాళ్వుండు న న్నిరసించె నురక. ౧౧౦

క. ననుఁ గైకొను మీ " వని కడు
వినయము పై న్యాయము దోఁప వేఁడుకొనుము శాం
తనవుం " డన్యాసక్తుఁ
నినుఁగొన రా దేగు మిపుడ నీ తండ్రిఁ గనన్. ౨౬౧

గీ. అనుటయును జేయునది లేక యాంబ పుత్త్రి
నింటి కేగక వనమేగి యొంటి నచటఁ
దపము సేయఁగఁ బూనె శాంతనవుఁ డంతఁ
దమ్మునకుఁ బెండ్లిచేసె నత్తలిరుఁబోండ్ల. ౨౬౨

క. ఆ యిరువురు భార్యలతో
నా యవనీపాలుఁ డుపవనాది క్రీడా
వ్యాయామ గతిఁ జరించుచు
న్యాయంబుగ భూమిపాలనం బొనరించెన్ ౨౬3

గీ. అట్లు నవ వత్సరములు భార్యలను గూడి
కేళి సల్పుచు నా భూమిపాలుఁ డంత
రాజ యక్ష్మార్తుఁ డగుచు మరణము నొందె
నతినిధువనంబు మృత్యుసంగతము గాదె ? ౨౬౪

వ. సత్యవతి సుతుండు మృతుం డగుటకు దుఃఖించి మంత్రుల
వలనఁ గాలోచిత కృత్యమ్ము లొనర్పంజేసి గాంగేయుం బిలిచి
యేకతమ్మున నిట్లనియె. ౨౬౫

క. శంతను మహీపతి కీవును
సంతానమ వగుటఁ బృథివి శాసింపుము నా
వంతఁ దొలఁగించి నాకున్
సంతానపుఁ గొఱఁతఁ దీర్పఁ జనదె ? కుమారా !

క. అంబాలికాంబికల యం
దుం బడయుము పుత్త్రికుల, సుతుల లేమిని వం
శం బడఁగు నకట ! యిది నిం
ద్యంబని తలపోయ నగునె, ధర్మముకాదే ? ౫౬౭

వ. అను తల్లికిం గొడు కిట్లనియె. ౫౬౮

శా. తల్లీ ! నాదు ప్రతిజ్ఞ నీవు వినలేదా ? రాజ్యభారంబు నే
నొల్లన్ దారఁ బరిగ్రహించుటకు నే నొప్పన్ గులీనుం ద్విజుం
ద ల్లీలావతులందుఁ గూర్చి తగు సంతానంబు నందింపఁగాఁ
జెల్లున్ శాస్త్రము లిట్టి ధర్మమును శాసించున్ గులార్థంబుగా.

గీ. ఇట్లు మనుమనిఁ బడసి మహీతలమున
కతని నభిషిక్తుఁ గావింపు మంబ ! వాని
శాసనంబు నాకెంతయు సమ్మతంబ
యనుచు వ్యాసునిఁ దలఁచె సత్యవతి మదిని. ౫౭౦

క. స్మరియించి నంతమాత్రన
యరుదెంచి నమస్కరించి యట నిల్చిన య
ప్పురుషున్ వ్యాసుని భీష్ముం
డరసి తగినరీతిఁ బూజలర్పించె వెసన్. ౫౩౧

వ. సత్యవతియు వ్యాసుం గాంచి యిట్లనియె. ౫౭౨

క. తనయా ! నాయనుమతి నీ
యనుజుని క్షేత్రమ్మునన్ నయంబుగఁ బుత్త్రిం
గనుమా నా శాసనమున్
వినుమా వంశంబు నిల్పి విశ్రుతి గొనుమా. ౫౭౩

క. అను తల్లిమాట లాప్తవ
చనములుగా నెంచి వ్యాససంయమి యనుజాం
గన ఋతుకాలమ్మున గను
దనుకం దా నట వసించెఁ దద్దయు నెమ్మిన్. ౧౭౪

వ. అంబికయుఁ గొండొకకాలమ్మునకు ఋతుస్నాతయై యత్త
యానతికతన వ్యాసుం గలయుట కంగీకరించిన, ౧౭౫

ఆ. వె. వ్యాసుఁ డా విలాసవతిఁ గూడి క్రీడింప
వనిత యంధు నొక్క తనయుఁ గాంచె
నతఁడు రాజ్యమునకు నర్హుండు గాకున్కి
సత్యవతియుఁ గడు విచారమంది, ౧౭౬

వ. రెండవ కోడలగు నంబాలికం బిలిచి యంగీకరింపఁజేసెఁ నాపె
యును యోగ్యకాలమ్మున వ్యాసుం గలిసి పాండురోగగ్రస్తుం
డగు నొక కుమారుం బడసె. అతండును రాజ్యమునకు నర్హుండు
గామి నంబికం బిలిచి మరల నొక్క కుమారుం గనుమనిన
నామెయు నత్తమాట కుత్తరం బీఁజాలక వల్లె యని తన దాసిం
బనిచె. ౧౭౭

క. దాసియు వ్యాసునిమది కు
ల్లాసం బొనరించి తగు విలాసములొప్పం
జేసినకతమున దానికి
వ్యాససముఁడు విదురుఁ డనెడివాఁ డుదయించెన్. ౧౭౮

వ. ఇవ్విధమున ధర్మవేదియగు వ్యాసునివలన ధృతరాష్ట్ర పాండు
రాజ విదురు లుద్భవించి భరతవంశం బుద్ధరించిరని నుడువుటయు ;

—* స్కంధాంత పద్యములు *—

శా. సారాచార విలాస! నిస్తులయశస్సంభార! గంభీర! సం
సారాత్యంతవిరక్తచిత్త! త్రిజగత్సంస్తుత్య! షడ్దర్శనీ
పారావారనిశాకళత్రి! కరుణాపారీణచారిత్రి! లీ
లారాజీవభవావతార! గురుచర్ల బ్రహ్మవిద్వన్మణీ! గి౦

క. హృద్యాన్యవద్యవిద్యా
విద్యోతితసకల దేశవిభుమండల సం
సద్యోషాభూషాయిత
విద్యార్థి విశేష! బ్రహ్మవిద్వద్భూషా. గి౧

మానినీవృత్తము. ధవళగిరి నివాసా! ధర్మరాజద్విలాసా!
శివతరసుచరిత్రా! శీలవచ్ఛాత్రపుత్రా!
భవపరిచితచిత్తా! బ్రహ్మసూత్రార్థవేత్తా!
త్రివిధమతవిహారీ! దేశిక బ్రహ్మసూరీ! గి౨

గద్య.

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన
దేవీ భాగవతంబను మహాపురాణంబునందు
ప్రథమస్కంధము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ మత్పర దేవతార్పణమస్తు.

---



శ్రీమత్పరదేవతాయై నమః

శ్రీ

# దేవీ భాగవతము

—:x:—

## ద్వితీయ స్కంధము.

శ్రీచర్ల కులాంబుధి రా
కాచంద్ర! సమస్తయాచకసురద్రుమ! ధీ
వాచస్పతి! దుర్మత దు
ర్వాచాకుర్వల్లిశస్త్ర! బ్రహ్మాయశాస్త్రీ! ౧

గీ. అవధరింపు మనంతరం బఖిలమునులు
సూతుఁ గన్గొని హర్షసమేతులగుచు
"సత్యవతి నెట్లు కైకొనె శంతనుండు
మున్నె యామెకు వ్యాసుండు పుట్టు టెట్లు? ౨

వ. వ్యాసుని జన్మంబును సత్యవతి యాథార్థ్యమ్మును సవిస్తరముగా నెఱిగింపు" మనవుడు సూతుండు, 3

ఉ. అంబ! నినుం దలంచు జనులందఱు ధర్మము నర్థకామమో
క్షంబులు గాంతు రీవకద సర్వనియంత్రివి నీవు మంత్రరా
జంబు పఠించువారలకు శాశ్వతసిద్ధి ఘటించు మత్ప్రణా
మంబును సేకరించి నను మాన్యవచోవిభవుం బొనర్పుమా. ౪

క. అని యంబికకు మ్రొక్కెడి యో
యనఘులు వినరయ్య మును లహార్పతి తేజుం
డనఘుం డుపరిచరవసుం
డను చేదిధరాధినాథుఁ డలరుఁ ధరిణిన్. ౫

గీ. అతని తపమున కెద మెచ్చి యమరనాథుఁ
డొక్క దివ్య విమానంబు నొసఁగె దాని
నెక్కి యుప్పరవీధుల నేగుచుండు
కతన నుపరిచరాఖ్యను గాంచె నతఁడు. ౬

క. ఆతని సహధర్మిణి తరు
ణీ తిలకము గిరిక యనఁగ నెగడు మహాప్రఖ్యా
జాతులు గల రాతనికి సు
జాతు లైదుగురు వార లధిక బలాఢ్యుల్. ౭

క. వారలఁ దత్తద్దేశ ధ
రారమణులఁగా నొనర్చి రమణీమణి తో
న్నారాధింపఁగ సుఖియై
స్వారాజుంబోలె నుపరిచరవసు వ్రాలెన్. ౮

వ. అంతఁ గొండొక కాలంబున నొక్కనాఁడు గిరిక ఋతుస్నాతయై
తనరాక కెదురుచూచుచుండె నయ్యవసరంబున, ౯

గీ. శ్రాద్ధ మొనరించుకొనఁదగు సమయ మిపుడు
గానఁ గానకు నేగి మృగములఁ గొట్టి
తెమ్మనుచుఁ బితరులు గడు నెమ్మినాయి ని
ధించుటయు లోనఁ గొంత చింతించి యతఁడు, ౧౦

క. పితృవాక్యం బాచరింతునో
సతివాక్యం బొనరుతునో విచారించినచోఁ
బితృవాక్యము సేఁతయ స
మ్మతమని తాఁ దుట్టతుదకు మది నూహించెన్. ౧౧

క. బిత్తరిపైఁ జిత్తము కడు
హత్తినవాఁడయ్యు మృగయ కరిగెన్ వనికిన్
జిత్తము సాంబశివునిపై
బత్తి మఱొక్క యెడ నించి పార్థివుఁడంతన్, ౧౨

వ. ఇట్లు చని కానం జరించుచున్నంత, ౧౩

క. ఆ లావణ్యవతీమణి
పై లోలుపుఁడై సకతసఁ బాచాస్త్రుఁడు పూఁ
గోలలు నాటిన రేత
స్ఖాలిత్యము వొడమె నుపరిచరవసువృపకున్. ౧౪

క. అటువొడమిన శుక్లమ్మును
వటపత్త్రమునందుఁ బట్టి వ్యర్థముగాకుం
డుటకై ఋతుమతి యగు తన
కుటిలాలకరొయ్యద్ది కనుపఁగోరి కడంకన్, ౧౫

వ. ఎదుటం జరించు నొక డేగం బిలిచి పత్త్రపుటనిక్షిప్తంబగు వీర్యం
బభిమంత్రించి యిట్లనియె. ౧౬

గీ. దీని గొనిపోయి గిరికాసతీమణికి నొ
సంగు మమ్ముద్దియకు ఋతుసమయమిప్పు
డియ్యది యమోఘవీర్య మెందేని దీనిఁ
బాఱవై చెదవేమొ యో పక్షిరాజ! ౧౭

వ. అని యద్దానిం బనిచిన నదియు నవ్వటపత్రపుటంబు ముక్కు-
నం గఱచుకొని యుప్పరమ్మున కెగసి యరుగునెడ ముందట,

గీ. దానిం గనుంగొని మఱియొక శ్యేన మామి
షభ్రమం జేసి వేవేగ సమరమునకు
డీకొనిన నయ్యదియు దానిం దాంకి యొప్పి
నంతపాటిగం బోరాడు నవసరమున, ౧౯

వ. చంచూపుటనిక్షిప్తంబగు నప్పత్రపుటంబు యమునోదకమ్ములం
జాఱి పడిన నద్దాని విప్రశాపోపహతయై మత్స్యయై పడియున్న
యద్రిక యను నొక యచ్చర మ్రింగె నని చెప్ప సూతుం
గాంచి తచ్ఛాపకారణం బెఱింగింపు మనవుడు నాతం డిట్లనియె.

మ. యమునాతీర్థమునం ద్విజుం డొకండు సంధ్యావందనాసక్తుం డో
యములోనం దిగి వార్చుచున్న సమయంబున నద్రికాకాంత తో
యములాడం జనుదెంచి మున్గి ద్విజు డాయం బోయి తత్పాదయు
గ్మము హేలాగతిం బట్టి లాగుటయుం దత్కంజాక్షిన్ నాతం డుగ్రుండై,

క. అలిగి విసారాంగనవై
జలమునం బడియుండు మనుచు శపియించిన న
వ్వెలందియు నాతనిచరణం
బులం బడి దీనాస్య యగుచుం బురపుర పొక్కెన్. ౨౨

వ. దానిం గరుణించి కొండొకకాలమ్మునకు నీగర్భంబున నొక
బాలుండును బాలికయుం బుట్టుదు రాక్షణంబ నీకు నిజస్వరూ
పంబు ప్రాపించు నదియ శాపాంతం బని చెప్పి యరిగె నయ్యచ్చ
రయుం దచ్ఛాపవశమ్మున నయ్యమునాజలమ్ముల మత్స్యమై
యుండె, ౨౩

క. ఉపరిచరవసువువీర్యం
బు పరిగ్రహించి గర్భమును దాలిచి యం
దుపచితగర్భయగుచు న
న్నపుడు వలం బడియె దాశయంత్రిత యగుచున్, ౨౪

వ. వాఁడు నద్దానిగర్భంబు భేదించిన నొక బాలుఁడును నొక బాలికయుం బొడమిరి. వారిం గొని వసురాజునొద్దకుం జని సకలం బెఱింగించిన వసువు విస్మయావిష్టుండై బాలకుం గ్రహియించి బాలికను మత్స్యజీవి కొసంగె. అబ్బాలిక కాలికయనియు మత్స్యోదరి యనియు మత్స్యగంధి యనియు నామత్రయమ్మున నొప్పి తద్గృహమ్మున వర్ధిలుచుండె. బాలుండు మత్స్యుండను నామమ్మున వసురాజగృహమ్మున సర్వవిధములఁ బిత్రుకల్పుండై వృద్ధినందె. ౨౫

గీ. మత్స్యరూపమ్ము వదలి యమరవరాంగి
యగుచుఁ దనయిచ్చ నరిగె నయ్యద్రికయును
మత్స్యగంధియు దాశసమ్మతిని వాని
పుత్రికయుఁబోలె వృద్ధిని బొందెఁ బిదప. ౨౬

ఉ. జవ్వన మంది యెన్నదగు చక్కఁదనంబును మేల్మి చెక్కులున్
మవ్వపుఁగన్నులున్ మురువుమాటలు గుల్కుపిసాళిగుబ్బలున్
నవ్వుల తేటలున్ సొలపునం దగు మేటివిలాసపున్నడల్
నివ్వటిలంగ నక్కలికి నేరుపుకూరుపు నాఁ జెలంగుచున్, ౨౭

—* వ్యాసోత్పత్తి *—

గీ. ఉన్నయెడఁ దీర్థయాత్రార్థ మొక్కనాఁడు
యమున కేగి పరాశరయతివరుండు
దాఁటునిచ్చను నక్కన్నెతండ్రిఁ బిలువఁ
గూడుఁగుడుచుచుఁ దనచిన్నికూఁతు ననిపె. ౨౮

క. మునివరుఁ డీతఁ డీతని
నను పుమవలి యొడ్డునకు గయ్యంబుగ నని చె
ప్పినఁ దండ్రిమాటఁ గొని యు
వ్వనజాక్షియు వచ్చె మౌనివరు దాఁటింపన్. ౨౯

వ. వచ్చి యుడుపం బెక్కించుకొని నడుపుచున్నంత,  ౩౦

ఉ. ఆయువతీమణిం గలసి యా యమునం దరియించుచున్నఁ బాఁ
గాయజుఁ డాగ్రహించి మునికాంతునిపైఁ బుసురాకు బాఁకులం
గోయని యార్చి యేయఁ దనకుం గల ధైర్యముఁ దక్కి యాతఁ డ
త్తోయజనేత్రచారుకరతోయజ మల్లన మాట్టె ముట్టినన్,

క. సకియు మొలనగవు నగుచుఁ ద
నకరం బెడఁ జేసికొని యనఘు ! ఇ...
చుకయును సందేహి పక
యకటా ! నాపొంటిఁగోటి నాటా నాగా ? ౩౧

ఉ. నీవు వసిష్ఠువంశ్యుఁడవు ; నేను నిషాదునికూఁతురన్ ; నగః
భావమునందుఁజూడు ; మిది భావ్యము గాదిటు చేసెద గల
బా ! వెలిఁజెందు ; మౌనివరులా ! హసియింత్రు ; తపంబు నష్టమై
పోవు ; భవాదృశుల్ వెడఁగుఁ బోకలకుం దగువారగ జాడరే ?

క. తపమునకును నాశంబున
కుపద్రవము సంభవించు నూహింపక యి
ట్టిపనికిఁ జొరఁబడ నగునే
తపసుల కెందేని యిట్టి తగులము లున్నే ? ౩౨

మ. అనఘా ! మానవజన్మ మెత్తుట యసాధ్యం ; బగ్రజత్వంబు గై
కొనుటన్నం గడు దుర్లభం ; బదియు నీకుం జేకుఱెన్ ; మీఁద గా

సిని లెక్కింపక మానినివై తపము వాసిం జెంది పెంపొందు నీ
వనిమిత్తంబుగ మారుబారిఁబడి నన్నాసింపఁగాఁ జెల్లునే ? ३४

వ. అదియునుం గాక, ३६

ఉ. చేఁపల కంపుచే నెగడి చెప్పఁగరాని యసహ్యభావముం
జూపెడి నా శరీరమును జూచి పయిం బడ నిచ్ఛగించె దీ
వోపిక మాని ; దీనసుఖ మున్నదొ లేదొ గ్రహింపవయ్యయో !
పాపపు మారుబారిఁ బడి పండిత భావము రిత్తపుత్తురే ? ३८

వ. ఇట్లు బోధించెడి తన పలుకులు వినని వానిం బోలె నటించి
మరలఁ గరగ్రహణం బొనర్చుటయు నయ్యతివ తన మనంబున,

ఉ. ఈతఁడు పంచబాణశిత హేతిపరంపరచే గృహీతుఁడై
యాతురుఁ డయ్యె, నిక్క మిఁక నాఁగఁడు ; కాముకులైన వారికి
న్నీతియుజాతియుం దెలియనేర్చునె ? యంచుఁ దలంచి యొంతయుం
జాతురి మీఱ నిచ్చటుల చారువిలోచన మాని కిట్లనున్, ३९

ఉ. తుందుడు కింత చెల్లునె ? బుధుండవుగావె ? మనంబునన్ ధృతిం
జెందుము ; చిత్తవృత్తి నిఁకఁ జిందఱ వందఱఁ జేయఁబోకు ; నా
యందము నీ మనమ్మునకు నందినదేని, భవన్మనోరథం
బుం దగఁ దీర్తు ; నోర్పునకుఁ బోవఁగ నిమ్ము నమంబు నావుడున్.

క. హితమగు నమ్మాటకు స
మ్మతిఁ జెంది, పరాశరాఖ్య మానివరుఁడు నా
సతికరము వీడి, యవ్వలి
కతిరయమునఁ జేరి, మరల నాకర్షించెన్. ४०

మ. అటు పైపైఁ బడు నమ్మునీంద్రుఁగని యయ్యబ్జాక్షి యాకంపితో
త్కట భీత్యుద్భటదేహయై మునివరుం గామాతురుం జూచి తా
నిటు వల్కెన్ ; విను నాదు దేహమిది యెంతే మీనదుర్వాసనా
ఘటితం ; బీదృశ మైన వస్తువులు భోగ్యం బౌనె ! మీ జాతికిన్ ?

గీ. అదియునుం గాక సంయోగ మను సమాన
రూప యౌవన వంతులకే ప్రసంగు
ననుడు నమ్మౌనివర్యుఁ డత్యాదరమునఁ
గాంచి యద్దాని యోజనగంధిఁ జేసె. ౪౩

మ. మృగనాభీఘుమఘుంఘు మార్భటుల పేర్మిన్ మించు మైతావితో,
సొగసుం గుల్కెడి ముద్దు నెమ్మొగముతో, సొంపారు కెమ్మోవితోఁ
దొగల న్నవ్వు మెఱుంగుఁగన్నుఁగవతోఁ, దోరంపుగారాముతోఁ
దగు నత్తన్వికరంబు వట్టె ముని కందర్ప జ్వరావిష్టుఁడై. ౪౪

క. కరముం బట్టెడి యమ్ముని
వరునిం గని వల్కె ; మౌనివర విను లజ్జా
విరహితమతివై నయముం
బరికింపక పట్టపగలు పట్టం దగునే ! ౪౫

గీ. అరయుచున్నాఁడు నాతండ్రి యవలియొడ్డు
నందు ; నదిగాక మార్గస్థు లరుగుదెంచు
వారొ యేమొ ? యిటుల్ పశువైఖరిని ర
మింపుటకు నామనము సమ్మతింప దనఘ. ౪౬

గీ. కాలనియమము పశులసాంగత్యమున క
నవసరము గాని మనుజుల కట్లుగాదు
కాన నామాట విని రాత్రికాలమబ్బు
దనుకఁ దాళుము పాపకృత్యం బిదేల ? ౪౭

గీ. నీకుఁ బ్రీతి చెప్పఁగా నోప; నీ వెఱుఁగని
యట్టిధర్మంబు కలదె? కామాతురత్వ
మింతగా నీ మనము నలయించెఁగాక,
పట్టపగ లిట్టి పనిఁ జేయఁబాడి యగునె? ౪౮

గీ. దాశపుత్రికతోడఁ బరాశరుండు
పట్టపగలు నదీతటీభాగమందు
తగు లొనర్చె నటంచు వింతగ జనమ్ము
లాడుకొనుమాటలు సహింపనగునె పిదప? ౪౯

క. అని పలుకు నత్తలోదరిఁ
గని, యుత్తమ పల్కె తీవు; కల్పించెద మం
చు; నిదియ చీఁకటివలె మన
కనుకూలం బగు నటంచు నటుఁలొనరించెన్. ౫౦

గీ. మంచు నాలుగు దెసల వ్యాపించి తమము
గలుగఁ జేయును నమ్మౌనికాంతుఁ డంత
నించువిల్కాని కేళి కాసించుటయును
బలికె సత్తన్వి మధురసంభాషణముల. ౫౧

గీ. కన్నియను నేను; నాతోడఁ గలసి సుఖము
వడయ నుంటి వమోఘ వీర్యుఁడవు నీవు
దేవ నీయిచ్చకోలఁది నెందేనిఁ జనెద
వయ్యయో! నాదుబ్రతు కేమియగునో పిదప. ౫౨

మ. తలిదండ్రుల్ దల లెత్త లేక కడువంతన్ మున్గి యెగ్గింతు; ర
న్నలుఁ దమ్ముల్ పెఱవారిమోములు గనన్ శంకించి లజ్జింత్రు; నె
చ్చెలు లన్నం గడు గేలి సేయుదురు; వారిన్ బెండ్లి గాఁబోదు; క
న్నెలకున్ జారుఁ డొనగ్చు వేఁకటు లవెంతేఁ జింతఁ గల్పింపవే?

గీ. గర్భవతి నౌదు నేని నీకతన నేను
నీవు నీతో వెం బోవ నానేర మెట్లు
తండ్రి యెఱుంగని విధమున దాంచికొందు ?
ననఘ ! యోజించి చెపుము పాయంబు నాకు ౫౪

వ. అని పట్టరానిభయమ్మునంగొంకు నద్దాని కాతం డిట్లనియె. ౫౫

గీ. నీకు నాపొందుంజేసి కన్నెఱికమునకు
హాని వాటిల్ల కుండెడు నదియుంగాక
కోరుకొను మిచ్చెదను నీదుకోర్కెలెల్ల
ననుడు ముని కిట్టులనియె నవ్వనజనయన. ౫౬

సీ. తల్లి దండ్రుల కీయుదంత మించుకయేనిం
దెలియకుండంగ సాధించు టొకటి
నిన్నుం బోలంగల్గు చిన్నారిపొన్నారి
చిఱుతపాపని దయసేయుటొకటి
కన్యాత్వమున కించుకయు నిందు నందు లో
పమ్ము లేకుండం గాపాడు టొకటి
యక్షయం బగునట్టి యౌవనం బేవేళ
మించురీతిని గటాక్షించు టొకటి

గీ. మీనగంధంబు వాపి నామేని కిప్పు
డీ వొసంగిన కస్తూరితావి చేవ
చెడక వాసించుపద్ధతి చేయుటొకటి
నాకు దయచేసి యామీంద నన్నుం గొనుము. ౫౭

వ. అనునద్దాని కతం డిట్లనియె. ౫౮

మ. నిగమమ్ముల్ విడఁదీయువాఁడు సొబగుల్ నేర్పుల్ దయాళుత్వముం
దగువాఁ డుత్తముఁ డూర్జితాత్ముఁడు పురాణంబుల్ వెలిం జేసి యీ
జగతిం బేరును గాంచువాఁడు హరితేజస్ఫూర్తిమన్మూర్తి నా
దు గుణంబుల్ గలవాఁడు నీ కొకసుపుత్రుం డుద్భవించుం జెలీ !

వ. తక్కిన నీకోర్కెలెల్ల నట్లయగునని మఱియును, ౬౦

ఉ. అచ్చెరమచ్చెకంటుల యొయారము లారసి యూరకున్న నా
కిచ్చ జనించె నేఁడు కమలేక్షణ ! దైవవశంబుఁ జేసి, నీ
మచ్చెపుఁదావి యెడ ! నిను మన్నన చేసి వరించు టెడ ! నా
సచ్చరితం బదేడ ! తనశక్యమె దైవకృతంబు దాఁటఁగన్ ? ౬౧

గీ. నీకు నాకారణమున సుశ్లోకుఁ డైన
పుత్రుఁ డుదయింపఁగాఁగల పుణ్యముండెఁ
దప్పఁ జేయఁగ నెవ్వరితరమటంచు
దాశపుత్రిక నెనసెఁ బరాశరుండు. ౬౨

క. తనవశమగు నక్కన్నియ
నెనసి పరాశరమునీంద్రుఁ డెంతయు సుఖలీ
లను దేలి యమున లోపల
మునిఁగి శుచియగుచుఁ దనంతఁ బోయినపిదపన్, ౬3

క. ఆగుణవతియును దా స
ద్యోగర్భము దాల్చి మిగుల నుజ్జ్వల తేజ
శ్శ్రీ గలిగి చెన్నుమీఱు మ
హాగుణనిధియైన యొక్క యనఘుం గనియెన్. ౬౪

గీ. పుట్టునంతన యామహాపురుషుఁ డంబ
కెఱిగి యిట్లను ; నీవు యథేచ్ఛఁ జనుము

నేను దపముసకేగెద ; నీవు నన్ను
నెప్పుడు దలంచిన నప్పుడ యేగుదెంతు. ౬౧

వ. అనవుడు సత్యవతి నిశ్చింతయై తనతండ్రిపాలికిం జని సుఖంబుండె ;
నతండును ద్వీపమ్మునం బుట్టినకతమ్మున ద్వైపాయనుం డనియు
వేదంబులు విభజించిన కతన వ్యాసుం డనియుం బరంగి యష్టా
దశపురాణమ్ములును మహాభారతమ్మును రచియించి సుమంత
జైమినిపైలవైశంపాయనాసితదేవలముఖ్యులగు శిష్యులకును
సుతుండగు శుకునకును నుపదేశించె. ౬౬

గీ. సత్యవతి పుట్టి నట్లు, వ్యాసముని పుట్టి
నిట్టు లిట సందియ మొకింతయేని వలవ
దనఘులగు వారిచరితలయందు గుణము
గ్రాహ్యమగుం గాని దోషంబు గ్రాహ్య మగునె ! ౬౭

గీ. కారణం బిట్టు లుండిన కతన సత్య
వతికి మత్స్యోదరమ్మునం బడుటయును బ
రాశరునిం బొందుటయును సంప్రాప్త మయ్యె ;
నట్లు గాకున్న మునియుం గామార్తుం డగునె ? ౬౮

గీ. శంతనునృపాలుం డామీంద సత్యవతిని
దా గ్రహించి సుఖించి సంతతిని బడసెం
జిత్రముం బవిత్రమిక్కథం జెప్పినాండ
దీని వినువారలకు శుభస్థితులు గలుగు. ౬౯

వ. అని నుడువు సూతుం గని మహాత్మా నీ చెప్పిన సత్యవతీ జన్మం
బును వ్యాసోత్పత్తియును సంతోషదాయకంబులయ్యె నింకొక
సందియంబు గలదు. పురువంశజుండును ధర్మాత్ముండును మహా

భాగుండును నగు శంతనునృపాలకుండు కులహీనయగు నిషాద పుత్రిక నెట్లంగీకరించె ? నతనికిఁ బ్రథమపత్ని యెవ్వతె ? ఇతని కొమరుం డగు భీష్ముఁడు వస్వంశసంభూతుం డగు కతం బేమి ? సకలగుణసంపన్నుఁడును జ్యేష్ఠుండును నగు భీష్ముండు రాజ్యంబు సత్యవతీతనయుల కేల యిచ్చె ? సత్యవతి తన కోడండ్రియందు గోళకుల నెట్లు జనియింపం జేసె ? భీష్మునికి దారసంగ్రహంబు లేనికతం బేమి ? ఇది యిట్లుండ, 20

వేదముల్ విభజించి మీఁద వేదాంతసూ
త్రము లొనర్చినయట్టి బ్రహ్మవేత్త
పదియునెన్మిది యనంబడు పురాణమ్ములు
పచరించినట్టి సర్వజ్ఞవరాళి
అదిగాక భారతంబన నొప్పు పంచమా
గమ మొనర్చిన మహాకవివరుండు
ఇది పుణ్యకృత్య మియ్యది పాపకృత్యం బ
టం చెఱింగి చరించునట్టి తపసి

గీ. వ్యాసుఁ డాసించె భ్రాతృభార్యాసుఖం బ
టంచుఁ జెప్పితి వకట ! పరాంగనాసు
ఖం బె పాతక మన, భ్రాతృకాంతతోడఁ
గ్రీడసల్పుట కెట్టు లంగీకరించె ? 21

—* శంతనూపాఖ్యానము *—

గీ. వ్యాసశిష్యుండ వైన నీ కఖిలధర్మ
సూక్ష్మత లెఱుంగవచ్చు నో సూత ! దీని
కుత్తరము సెప్పు మాదరాయత్తమతి న
టంచుఁ బల్కెడి మునుల కిట్లనియె నతఁడు. 22

క. కలఁడు మహాభిషుఁ డను భూ
తలనాథుం ; డతఁడు సత్యతత్పరుఁడు ; ధరా
తలనాయకమకుటమణీ
విలసితచరణుండు ; బ్రహ్మవిద్యాధికుఁడున్, ౭౩

గీ॥ అశ్వమేధసహస్రమ్ము లాచరించి
దాన నిందుని సంతుష్టుఁగా నొనర్చి
స్వర్గమున కేగి యచ్చట సకలసౌఖ్య
ములను రెండవయిందుఁడై పొందుచుండి, ౭౪

వ. ఒక్కనాఁడు దేవతలతోడఁ జతురాననుః సేవించుటకై సత్యలోక
మ్మునకుం జనియె. ౭౫

క. గంగానదియును బరమే
ష్ఠిం గని కొనియాడ నచ్చటికి వచ్చి, విరిం
చిం గాంచి మ్రొక్కి, యొక్క యె
డం గాలూఁది నిలువంబడం దెమ్మెరయున్, ౭౬

చ. బలువడి వీవ నాపెతోడపైఁ గల చీరచెఱంగు దూఁగి యూ
వల కొకకొంత యొరసిలె ; వస్త్రము దూలుటఁ దా నెఱుంగ క
క్కలికియు మిన్నకుండె ; నటు గాంచుట తప్పని యొక్కపెట్ట నా
దలలను వంచి రీన్నృపుఁడుదక్క సభాసదులైననిర్జరుల్. ౭౭

ఉ. తన్ను మహాభిషుం డలిమదమ్మునఁ గన్గొనుచుండ, గంగయున్
గన్నులవిల్తు బారిఁ బడి కన్గొన సాగె నృపాలుమోము ; ని
ల్లెన్నఁగరానిమోహమున నిద్దఱు గాఢతరానురాగులై
యున్నతఱిం, గనెన్ గమలజోద్భవుఁ డక్కడు తామసమ్మునన్.

క. పెద్దలు గల యీసభ వీ
రిద్ద ఱపత్రపఁ ద్యజించి యిటు నిర్భయులై
ముద్దులవలె నటియించెద
రిద్దాని సహించుటొప్పునే ? సుజనులకున్. ౭౯

వ. ఇట్లెంచి వారలం గాంచి "మంచిచెడ్డ లెఱుఁగక వర్తించితిరి గావున మీ రిరువురును మర్త్యలోకమ్మునం బుట్టుం" డని శపించె ; నంత వారును శాపంబునకుఁ జింతిల్లుచు నచ్చోటు వీడి వెడలిరి. ౮౦

గీ. ఆ మహాభిషనరపాలుఁ డంత మర్త్య
లోకమున నెవ్వనికులమ్మలో జనింతు
ననుచు యోజించి పురువంశమునఁ బ్రతీపుఁ
డనునృపుని దండ్రిగా నెంచె నాత్మయందు. ౮౧

వ. ఇది యి ట్లుండె. ౮౨

గీ. అష్టవసువులుఁగూడ భార్యాసమేతు
లగుచు విహరించుచును వసిష్ఠాశ్రమంబు
నందుఁ జరియింప నందొక్క యతనిభార్య
నందినీధేనువును జూపి నాయకునకు, ౮౩

వ. ఇది యెవ్వరిది ? యని యడుగుడు నత్తన్వి కాతం డిట్లనియె. ౮౪

గీ. చెలియ యిది గలవాఁడు వసిష్ఠమౌని
దీని నెల్లరు నందినీధేను వండ్రు
దీనిపా లిన్ని గ్రోలినఁ దెవులు జరయు
మృతియు దరిఁ జేర వని తనపతి వచింప, ౮౫

వ. ఆసతియు ముదం బంది "నా కుశీనరరాజకన్యక కడు నెయ్యంబు గలయది. ఆపె మర్త్యలోకనివాసిని యగుకతన జరామరణాది

కంబుఁ బొరయఁ గలదు. తన్నివృత్తికై యీధేనువు నద్దాని కొసంగి యుపకృతి నొనర్ప వలయు నిద్దాని నాకై తెమ్మ"నుడు,

గీ. ఆవసువు భార్యమాట పథ్యమ్ముఁ జేసి
తక్కఁగలవసువులఁ గూడి దాని నపహ
రించె; రాజోప్పు నాపద నొంచఁడయ్యె
నంగనాసక్తు లాపత్తు లరయఁ గలరె? ౮౭

వ. పిమ్మట వసిష్ఠుండు తనధేనువుం గానక వెదకించి విసివి తన యోగబలమ్మున వసువు లపహరించుట యెఱింగి మనుష్యయోనిం బుట్టుండని వారలకు శాపం బిచ్చె. పదఁపడి దాని నెఱింగి వార లతని కడ కేతెంచి శాపమోక్షం బనుగ్రహింపవే యని వేఁడుడు మునివరుండు కరుణించి యిట్లనియె. ౮౮

మ. అనుసంవత్సర మొక్కొక్కఁడు కగు శాంపాంతంబు; నాధేనువుం బనిగా భార్యకునై హరించె నెవఁ డా పాపాత్ముఁ డా కష్టుఁ డ మ్మనుజత్వమ్మును దీర్ఘకాలము వహింపంగాఁ గలాఁడంచు న మ్ముని శాపాంతము సెప్ప, నవ్వసువు లిమ్ముల్ చేరుచుణ్ణముందటఁ,

వ. విధిశాపవశమ్మున దీనాననలై భువి కేతెంచు గంగం గాంచి తమ శాపప్రకారం బెఱింగించి "తల్లీ నీగర్భమున జనించెదము మ మ్మనుగ్రహించి శంతనునృపాలకున కీవు పత్నివగు మదియునుం గాక, ౯౦

క. పుట్టినతోడన మమ్ముం
గిట్టింపుము నీట వైచి కీడెంచక నీ
విట్టు లొనరించుకతమున
నెట్టన మాశాప మది వినిర్ముక్త మగుఁ. ౯౧

క. అని వసువులు తనుఁ బ్రార్థిం
చిన నంగీకరించి చెచ్చెర గంగా
ధుని తనయిచ్చం జనియెన్ ;
జనిరి వసువులును గడంగి స్వర్గమ్మునకున్. ౯౨

వ. పిమ్మట ప్రతీపుఁ డొక్కనాఁడు గంగాతటమ్మునకుం జని సూర్యో
పాస్తి యొనర్చుచున్నంత, ౯౩

ఉ. ఆ సలిలమ్మునన్ వెడలి యంకురితప్రథమానయావనో
ల్లాసిని చారుహాసిని విలాసిని వే చని రాజ శేఖరుం
దాసి యశంకితాత్మయయి దక్షిణపుందొడఁ గూరుచుండఁగా
నాసరసీరుహాక్షిఁ గని యాధరణీపరిణేత యిట్లనున్. ౯౪

ఉ. ఎవ్వతె వీవు ? నాదు కురు వెక్కట కేమి కతంబు ? వల్కుమో
జవ్వని ! యన్న. నచ్చటుల చారువిలోచన ముద్దు లొల్కఁగా
నవ్వుమొగమ్ము వంచి, నయనమ్ము లొకానొకవింత చెల్వునన్
నివ్వటిలంగఁ బల్కెఁ దగు నేరుపు తోరపుఁదీరుపుం దగన్. ౯౫

ఉ. ఎవ్వతెనైన నేమి పృథివీశ ! సుమాస్త్రసమానరూప ! నా
జవ్వన మంత నీకయి వశం బొనరింపఁ దలంచి వచ్చితిన్ ;
జివ్వకు వచ్చు సమ్మదను చెయ్యవల కోరువఁ జాల నక్కటా !
నవ్వులు గాఁ దలంపకుము నావచనమ్ము లటన్న నిట్లనున్. ౯౬

క. కన్నెరో ! యపత్యమునకుం
దన్నళినాక్షులకు యోగ్యతగల కుడి తొడన్
గ్రన్న నధిష్ఠించితి కా
న న్నినుఁ నేఁ గోవఁగఁ దగదు నా ; కటుమీఁదన్. ౯౭

ఆ. వె. భార్యఁదక్క నొండు పడఁతిఁగూడ నటంచు
వ్రతము గలదు ; నాయపత్యమునకుఁ
బత్నివై సుఖమ్ము వడయుము ; నాకు సం
తానమొదవెనేనిఁ దలిరుఁబోణి. ౯౮

క. సంతానహీనుఁ డితఁ డని
వంతం గొనఁబోకుమీ ! భవత్పుణ్యమ నా
సంతానకారణం బగు
నింతయు నిక్కమన నాపె యేగెఁ దనంతన్. ౯౯

వ. అంతఁ గొండొక కాలమ్మునకు మహాభిషుండు ప్రతీపునకుఁ దన
యుండై శంతనుండు నాఁగ వర్ధిల్లుచుండెఁ బ్రతీపుఁడును, ౧౦౦

క. గంగకుఁ దనకుం జరిగిన
సంగతి కొమరునకుఁ జెప్పి చనియెం దా రా
జ్యాంగమ్ము విడిచి యడవి న
సంగుండై యుండి తపము సలుపు నెపమునన్. ౧౦౧

వ. శంతనుండు పైతృకం బగురాజ్యమ్ము నేలుచు నొక్కెడ మృగ
యార్థంబు వనమ్మునకుం జని వ్యాఘ్రాదిమృగమ్ముల నుక్కడం
చుచు గంగాతటకుంజపుంజమ్ములం జరించువాఁడు ముందట,

సీ. మృగశాబములకు నేర్పెడి నేర్పుగలచూపు
సోయగం బొలుకు కందోయిదాని
కుంభికుంభములయుక్కను ద్రొక్కి నిక్కి నీ
లైడిగుబ్బ చందోయి బెడఁగుదాని
మాటమాటకు ముద్దు మూటఁగట్టఁగఁ జాలు
సొగసుచే నెగడు నెమ్మొగముదాని

ముకురమ్ములకుఁ జాకచక్కిఁ దీర్పఁగాఁజాలు
తళుకుఁజెక్కుల తళ త్తళలదాని

గీ. తొగలవగ కానిజిగిబిగి నగ డొనర్చు
నిగనిగలఁ దగు నగవుసోయగముదానిఁ
దావులకు దీవి యగు కావిమోవిదానిఁ
గనియె నొకకన్నెఁ గన్నులకలవుదీఱ. ౧౦౩

క. సురకన్యవోని యయ్యం
బురుహాననఁ జూచి తండ్రి మున్నుతనకు నే
విరిబోణిఁ జెప్పె నీసుం
దరి యయ్యతివయొకొ యంచుఁ దనమది నెంచున్. ౧౦౪

ఉ. సుందరుఁడైన యానృపతిసూనునిఁ జూచి తదంబుజాక్షి "యీ
యందపుటెక్కు నిక్కము మహాభిషుఁడే" యని రాగమగ్నయై
కంది మనోజతాపమునఁ గ్రాఁగి పునఃపునరాదరోదయా
నందమునం దదీయవదనంబునఁ జూడ్కి నిగుడ్చి యున్నెడన్,

క. శంతనుఁడు దానిరీతిం
గొంత గనుంగొని రసమ్ము గులుకఁ బలికె "నో
యింతీ! మరుదంతీ! విరి
బంతీ! నీవెవ్వతెవొ? కృపం బలుకఁగదే. ౧౦౫

ఉ. ఎవ్వతెవైన నేమి కమలేక్షణ! నిం గనుఁగొన్న మాత్రనే
పువ్విలు కానికైన భ్రమ పుట్టక మానదటన్నఁ బ్రాకృతుం
డెవ్వఁడు నిన్నుఁ జూచి సహియించు? ననుంగరుణించి నాకు నీ
జవ్వనపుం వినోదము లొసంగఁగదే తగదే యలంచుటల్."

వ. అని మదనశరదళితహృదయుండై పల్కు నజ్జనపతిని మహాభిషు
నింగా నెఱింగినయది గావునం బూర్వసంఘటిత ప్రేమవశమ్మునం
గించిత్స్మితపూర్వకంబుగా నిట్లనియె. ౧౦౮

చ. తెలియంగ నయ్యె నీవల ప్రతీపునిపుత్రుఁడ వత్యుదారస
త్కులుఁడవు ; నిన్ను బోంటినృపకోటిశిరోమణి నెట్టికామినీ
తిలకములైనం గోరుదురు ; దేవసమానుఁడవైన నిన్ను నే
వలచియ యుంటి ; నైన నొకపల్కు వచించెద నాలకింపుమా.

ఉ. ఏ నొనరించు కార్య మది యెట్టిది యే నగుం గాక, నీవు న
ద్దానికి నడ్డురాం జనదు ; దాని నటుండంగ నిమ్ము ; విప్రియం
బైన విధమ్మున న్నను నొకప్పుడు గాని వచింపం బోల ; ది
ట్లైన నినుక్ వరించి సుఖ మందెదం గోర్కులు మిన్నుముట్టంగన్.

క. ఈనియతి కెపుడు ప్రత్యా
ఖ్యానంబొనరింతు వపుడ యరిగెదఁజుమ్మీ
భూనాథ నిను విడిచి, నా
పై నేరము మోపవలదు పలికితి నిపుడే. ౧౧౧

క. అని వసువులప్రార్థన నె
మ్మనమునకుం దెచ్చుకొని క్షమానాథుని పే
ర్మి నెఱింగి సమయుం బొనరిం
చిన నందుల కొప్పె నెదురు చెప్పక యతఁడున్. ౧౧౨

వ. గంగయు నతనియందుం జిరకాలలబ్ధానురాగయైన కతమ్మునం
దన్నృపమందిరమ్మునకుం జని సుఖభోగమ్ము లనుభవించు చుండె.

—* భీష్మోదయము *—

సీ. నవరత్న ఖచితసుందరతరా ప్రతిమాన
వైచిత్ర్యయుత సౌధవాటులందు
కోకిలాకాకలీ కేకిలీలాకల
ధ్వని కనదుద్యాన వనములందు
హంసాది సంశోభితాసమానాంభోజ
షండ మండిత సరస్తటులయందు
గంభీరరంభా విజృంభమాణ నవీన
ఘనసారఘన కుంజగణములందు

గీ. శంతనునృపాలకుండు నకాంతయును స
దా శచీంద్రులమాడ్కిఁ బద్మాహరుల వి
ధమ్మున నఖండభోగ భాగ్యమ్ము లనుభ
వించు కాలంబు పెద్దయ్యు నించు కయ్యె. ౧౧౪

ఉ. తా నెవఁడో ప్రపంచపువిధాన మ దెట్టిదొ యన్యు లెవ్వరో
తా నివసించు వాసమువిధం బది యెట్టిదియో యెఱుంగ క
మ్మానవనాథుఁ డక్కలికిమక్కువలోఁ బడి యున్నయంత న
మ్మానిని దాల్చె గర్భ మసమానవసుప్రవరాంశమై తగన్. ౧౧౫

వ. గర్భంబు నవమాసపూర్ణంబై యొక్క బాలకుం దుద్భవించుడుఁ దత్క్షణంబ వానిం గొనిపోయి నీటం బడవైచె; ని ట్లేడేటం బొడమిన బాలుర నేడ్వుర నేటం బడవైచిన శంతనుండు మన మ్మున నిట్లు విచారించె. ౧౧౬

మ. అకటా! యేడ్వురుపుత్రులన్ గుసుమబాణాకారులన్ నిర్దయా
త్మికమై యేటికి నప్పగించె నిఁక వృద్ధిం జెందు టెట్లొకో? మా

మకవంశం, బిది కూడదన్నను నన్నుఁ మన్నింప కీకాంత లే
చి కడు వేగమ పోవు; నిట్లగునె దుశ్శీలాంగనాసంగముల్!

క. అష్టమగర్భం బిది, మద
దృష్టముకతనన్ లభించె నిపుడైనను నీ
దుష్టాత్మురా లొనర్చెడి
కష్టపుఁబని నాకు నాఁగఁగాఁ జెల్లదొకో? ౧౧౯

వ. కావున నేవిధంబుననైన వంశరక్షణంబు కర్జం బని నిశ్చయించి
యున్నంత,

క. అంగనకై మునివరు గో
వుం గొనిపోయినవసుండు పుత్రుండై పు
ట్టం గని గంగయు వైళమ
గంగం గలుపంగ నెంచఁగా నృపతి వెసన్, ౧౨౦

వ. అడ్డమ్ము సొచ్చి వినయమ్మున నబ్బాలెంతరాలి కిట్లనియె. ౧౨౧

ఉ. దాసుఁడనైతి, నాపలుకు దబ్బఱసేయకు; కన్నపుత్రు వ్య
త్యాసినివై వధింపు టిది న్యాయమె? జాలి యొకింత లేదె? యే
దోసము నీకొనర్పనిసుతున్ వధియించెదిగొడ్డురాల! నీ
బాసలకున్ మదిం దలఁకి వంశము నాశ మొనర్ప నెంతునే?

క. అకటా! యేడ్గురఁ జంపితి
వికనైనన్ జాలిలేదె? యేణాక్షిరో! యీ
యొకనిం బ్రతికింపుము తా
వకచరణయుగంబుమీఁదఁ బడి మ్రొక్కెదుదున్. ౧౨౩

క. సుతులం బొరయనియెడ స
ద్గతి లే దని పెద్ద లండ్రు గావున వంశ

స్థితికై యీసుతునొక్కని
బ్రతికించిన నీవ్రతంబు భగ్నంబగునే ? ౧౨౪

క. అని బహువిధములఁ బ్రార్థిం
చిన వినకా వనిత చిన్ని శిశువుం జంపం
గొనిపోవుచుండ నిట్లనె
, జనపతియుగ్ కనుల వహ్ని జలజల రాలన్. ౧౨౫

గీ. ఓసి పాపాత్మురాల ! నాశాసనం బ
తిక్రమించియు నరకభీతియును లేక
కన్నకొడుకుల గంగలోఁ గలుప నగునె ?
యకట ! నినుఁ గనినట్టి దుష్టాత్ముఁ డెవఁడొ. ౧౨౬

వ. ఉండువుగాక పోదువుగాక యీ శిశువుం జంప నీ నని యడ్డమ్ము
సొచ్చ్చెడిశంతనుం గాంచి యక్కోమలి యిట్లనియె. ౧౨౭

చ. సమయము నెంచవైతి, వికఁ సాగదు నీకును నాకుఁ గూట ; ము
త్తముఁడవు నీవు ; నిన్విడు టధర్మము కాని, వచింతుఁ దన్నిమి
త్తము ; ననునొక్కకాంతఁగ నెదగ్ గణియింపకు గంగఁగా నెఱుం
గుము సురకార్యముగ్ సలుపఁగోరి నినుగ్ వరియించితిం జుమీ.

క. వసువులు మునిశాపమ్మున
వసుమతిఁబుట్టుటకు నన్నుఁ బ్రార్థించిన నేఁ
బ్రసు వైతి వారలకు నీ
కు సతినయి నృపాల ! తెలిసికొను మిదియెల్లన్. ౧౨౯

క. చిరకాలము మర్త్యులమై
ధరణిన్ వసియింప లేము తత్క్షణము మృతిం
గరుణింపు మన్న నే నీ
దురితం బొడిఁగట్టి నీటఁ ద్రోచితి సుతులన్. ౧౩౦

క. ఈతం డష్టమవసుకళ
చేతఁ జనియించె నధిప ! చిరకాలము నీ
చేతము గరఁగించెడి ప్ర
ఖ్యాతిం జెందం గలాఁడు కాఁగలఁడు సుమీ ! ౧౩౧

గీ. ఈడువచ్చెడి దన్కను వీఁడు నా స
మీపమందె వసించు నామీఁద నీకు
నప్పఁజెప్పెద దీనికి నొప్పికొనుము
తల్లి లేకున్న బ్రతుకు వృథా నృపాల ! ౧౩౨

క. అనినుడివి గంగయును దన
తనయుం గొని చనినమీఁద ధరణీపతి య
వ్వనితావిరహమ్మునకుం
దనయ విరహమునకుఁ జాలఁ దల్లడపడుచున్, ౧౩౩

వ. ఒకభంగి రాజ్యం బొనర్చుచుఁ గొండొకకాలమ్మున వేఁటఁ జని
మృగమ్ముల హింసించుచు విరహాభరమ్మునఁ జిక్కనయదియుం
బోలె నున్నగంగానదిం గాంచి, ౧౩౪

శా. ఆ కల్లోలినిమధ్యరంగమున దీవ్యద్బాణబాణాసన
శ్రీకై సేయ నిరంకుశప్రతిభమైఁ గ్రీడించుచున్ జాహ్నవి
ద్యాకౌశల్యముఁ జూపు నొక్కరుని గందర్పున్ విడంబించు ది
వ్యాకారంపు బెడంగు వానిఁగనితా నాశ్చర్యపర్యాప్తుఁడై, ౧౩౫

క. తన తనయుండని యనుకొనుఁ;
దన తనయుఁడు గాఁడటంచుఁ దలఁచున్ మరలన్
దనయాసక్తిం గను శం
తనుఁ డబ్బాలకునిఁ గాంచి తద్దయుఁ బ్రేమన్. ౧౩౬

క. కరలాఘవమును దుష్కర
శరలాఘవమును సమానసత్త్వముఁ దెలుపన్
నరపతి దరి కరిగి మహా
దర ముట్టిపడంగ నిట్లుతనితోఁ బలికెన్. ౧౩౭

ఆ. వె. తల్లి యెవతె నీకుఁ? దండ్రి యెవ్వఁడు? నీదు
నామధేయ మెద్ది? నగర మెద్ది?
చెప్పు మనుడుఁ బల్కుసెవిని బెట్టక తన
యంత నాడుచుండె నతఁడు పేర్మి. ౧౩౮

వ. అంతఁ గొంత తడవు గ్రీడించి యాతం డంతర్హితుం డగుడు జన
పతి చింతాకులుండై గంగం గొనియాడి తొంటిరూపునఁ బొడ
సూపిన నాపె కిట్లనియె. ౧౩౯

సీ. చిన్నారిపొన్నారి చిఱుతప్రాయమువాఁడు
ముద్దు లొల్కెడినవ్వు మొగమువాఁడు
కళలనీనెడి గొప్ప కనుల నొప్పెడి వాఁడు
కరికలభాకార గరిమవాఁడు
ఆజానులంబిబాహాసౌష్ఠవము వాఁడు
హరి నీసడించు మధ్యమ్మువాఁడు
శరశరాసనవిభాసురకరమ్ములవాఁడు
డంబు చెన్నారు వక్షంబువాఁడు

గీ. నాకుఁ బొడకట్టి యంతట నన్ను మొఱఁగి
చనియె నొకముద్దులాఁడు వాఁడనఁగ నెవఁడు
తెలిపి వైళమ యవ్వానిఁ దెచ్చిచూపి
గారవింపుము నావుడు గంగ నగుచు, ౧౪౦

క. ఎనిమిదవ వసుని యంశం
బునఁబుట్టినవాఁడు నీకుఁ బుత్త్రుఁడు గాంగే
యునిగా నెఱుఁగుమువానిన్
గనఁజేసెదఁ గనుము కనులకఱ వెడలంగన్. ౧౮౧

వ. అని యబ్బాలకుం దెచ్చి చూపి యితండు సకలవేదమ్ములును వసిష్ఠునియొద్దఁ బఠించె. వేయేల నీబాలుండు పరశురామునికిం గూడ శిష్యుండును సర్వథా యయ్యనఘునకుఁ దుల్యుండును భవత్కులోద్ధారకుండును నని చెప్పి యంతర్ధానంబుఁ గనుడు శంతనుండు పుత్త్రుం గౌఁగిలించుకొని రథముపై నిడికొని రాజధానికిం జని మంత్రి పురోహితానుమతంబుగ సుముహూర్తమ్మున యౌవరాజ్యాభిషిక్తుం జేసి గంగావియోగజంబగు దుఃఖమ్ము మఱచి సుఖం బుండె. ౧౮౨

క. ఇయ్యది వసువులచరిత్రం
బియ్యది శుభదంబు; దీని నెంతయు నాసై
నెయ్యమ్మున ద్వైపాయనుఁ
డయ్యరణిజతోడఁ గలిపి యానతియిచ్చెన్. ౧౮౩

వ. అనిన సూతుం గాంచి మును లవ్వలికథఁ జెప్పు మనవుడు సూతుం డిట్లని చెప్పం దొడంగె. ౧౮౪

గీ. యౌవరాజ్యమ్ము గాంగేయుఁ డందు నిలిపి
శరవణోద్భవుచే మహేశ్వరుఁడువోలె
సర్వసుఖములు కైకొంచు శంతనుండు
నాలుగేడు లానందాబ్ధి నోలలాడె. ౧౮౫

వ. పదఁపడి యొకనాఁడు మృగయాసక్తుండై నిరంతరకుంజపుంజమండితంబగు కాళిందీతటమ్మునకుఁ జని యచ్చట, ౧౮౬

మెసకమ్ము గల్గుకా
ందుల బీర మడంచియడంచి
పొడవుగల్గిన యేనుం
మొత్తముల నేలంగూల్చికూల్చి
న సమయింపంగాం జాలు
ులగుంపులతోడం బోరిపోరి
ర్వోధమ్ము లగు సింగ
ముల గములెల్లను గలంచికలంచి

గీ. జవముమెయి గాలితోం బోలం జాలులేడి
కదుపులఁ బ్రదరమ్ములం జదిపిచదిపి
ప్రళయకాలకిరాతుని పగిది జంతు
మండలమ్మును వేటాడి మగిడి యతండు, ౧౪౭

వ. ఒక్కశీతలతరుచ్ఛాయాతలమ్మున నిషణ్ణుండై యున్న యెడ,

క. ఆనందోద్దీపకమై
నానాపరిమళవిశేషనవసౌరభమై
జానొప్పంజాలు నొకగం
ధానిల మేతెంచి నరవరాగ్రణి సెనసెఁ. ౧౪౯

వ. అతండును దత్పరిమళమ్మున కచ్చెరువంది, ౧౫౦

మ. మృగనాభిం బురణించి, యబ్జముల పేర్మిం గ్రిందుగాంజేసి, సం
పెంగలం డీకొని, కేతకీసుమములఁ బిట్టేచి, కుందమ్ములం
దిగు లొందించియు, మాలతీసుమములం దీండ్రించి, నిర్హేతుకం
బుగ నేతెంచు పరిమళం బిది సుఖాంభోరాశిలో ముంచెడిఁ.

క. దీనికిఁ గారణ మే మొకొ
కానఁగవలెనంచు వేడ్క గడలుకొనంగా
నానాపుష్పాకీర్ణం
బై నెగడు వనాంతమెల్లనరయుచుఁ జనుచున్, ౧౫౨

చ. అమరిన వేడుకం గనియె నబ్జముఖిన్ నవసౌరభోజ్జ్వల
ద్ఘుమఘుమ విగ్రహన్ గమలకుట్మలచారుపయోధరద్వయన్
యమితశిరోజభార మలినాంబర నాతివిభూషణాంచితా
దములపుటాకువంటి యొక తామరసప్రతిమాననలోచనన్, ౧౫౩

క. ఆకలికి నాతలోదరి
నాకలకంఠీలలామ నాకనకాంగిన్
భూకాంతుఁ డిటు గన్గొని
యీకన్నియ యేమనితావియే యిది యనుచున్, ౧౫౪

ఉ. దాని పిసాళిగుబ్బలును దాని యొయారపుఁ జూపుఁదీపులున్
దాని వళిత్రయీగరిమ దాని శరీరపరీమళంబు న
ద్దాని వయోవిలాసమును దాని పదక్రమసౌష్ఠవంబునున్
దేనికి నగ్గలం బనుచుఁ దీరనికూరిమిగారవంబునన్, ౧౫౫

—* శంతనుండు సత్యవతిం బెండ్లియాడుట *—

వ. డగ్గఱి సిగ్గరితనమ్మునన్ మొగ్గు నగ్గజగమనం బునఃపునరాద
రోదయమ్మునం గనుఁగొనుచుఁ దన మనమ్మున, ౧౫౬

క. ఈ మగువ దేవతాకాం
తామణియొ ! కిన్నరాంగనామణియొ ! ఫణి
స్త్రీమూర్ధన్యయొ ! కాక
భూమిన్ గలపొలఁతి కిట్టి పొలుపుంగలదే ? ౧౫౭

క. అని తలపోయుచు నా శం
తనుజనపతి తొల్లి దైవతధుని దనువరిం
చినభంగిఁ దలఁచుకొని య
త్తనుమధ్యన్ జేర్మిఁజూచి తగనిట్లనియెన్. ౧౫౮

ఉ. ఎవ్వతె వీవు ? నీజనకుఁడెవ్వఁడు ? జవ్వని ! యివ్వనమ్మునం
దెవ్వనికై చరింతు ? కులమెయ్యది ? నీ విటు లొంటిపాటునన్
మవ్వపుమేనికాంతి కనుమాయఁ జరింపఁగ నేమి వచ్చె ? నీ
కెవ్వఁడు భర్త ? దెల్పఁగదవే ? మదవేల్లితదంతిగామినీ. ౧౫౯

క. నీసొగసు నీవిలాసము
నీ సౌరభ్యంబుఁ జూచి నేనెంతయు నీ
కాసించి మదనభూత
గ్రాసీభూతుండ నైతిఁ గరుణింపఁగదే ? ౧౬౦

వ. అన నక్కాంత చిఱునగవలర నిట్లనియె. ౧౬౧

ఉ. కన్నెనుగాని వేఱొక ప్రకారము దాననుగాను ; దాశరా
జన్నయభిఖ్యగన్న సుగుణాత్ముఁడు నాజనకుండు ; నన్ను " నా
వ న్నడిపించుచుండు మిదె వచ్చెద " నంచు వచించి డించి పో
యె న్నరనాథ ! యింటి ; కదియే యతఁడుండెడితావు నావుడున్,

చ. నరపతియిట్లు వల్కు నరనాథుఁడ నేఁ గురువంశజాతుఁడన్
దరుణి ప్రతిక్షణప్రబలితం బగుజవ్వనమున్ వృథాగతిం
బొరయఁగఁ జేయ నేల ? ననుఁ బొందు మసంశయరీతిఁబత్నివై
పరమసుఖమ్ములం గొనుము పత్నియు గిత్నియు వేఱులేదిఁకన్.

ఉ. ఓసరసీరుహాక్షి విను మొక్కలతాంగి ననున్ వరించి పే
రాసలు గొల్పిపోయె ; నది యాదిగ నేను మఱొక్కలేమపై

క. ఎనిమిదవ వసుని యంశం
బునఁబుట్టినవాఁడు నీకుఁ బుత్త్రుఁడు గాంగే
యునిగా నెఱుఁగుమువానిక్
గనఁజేసెదఁ గనుము కనులకఱ వెడలంగన్. ౧౪౧

వ. అని యబ్బాలకుం దెచ్చి చూపి యితండు సకలవేదమ్ములును వసిష్ఠునియొద్దఁ బఠించె. వేయేల నీబాలుఁడు పరశురామునికిం గూడ శిష్యుండును సర్వథా యయ్యాసఘునకుఁ దుల్యుండును భవత్కులోద్ధారకుండును నని చెప్పి యంతర్ధానంబుఁ గనుడు శంతనుండు పుత్త్రుం గౌఁగిలించుకొని రథముపై నిడికొని రాజధానికిం జని మంత్రి పురోహితానుమతంబుగ సుముహూర్తమ్మున యావరాజ్యాభిషిక్తుం జేసి గంగావియోగజంబగు దుఃఖమ్ము మఱచి సుఖం బుండె. ౧౪౨

క. ఇయ్యది వసువులచరితం
బియ్యది శుభదంబు; దీని నెంతయు నాపై
నెయ్యమ్మున ద్వైపాయనుఁ
డయ్యరణిజతోడఁ గలిపి యానతియిచ్చెన్. ౧౪౩

వ. అనిన సూతుం గాంచి మును లవ్వలికథ చెప్పు మనఁ బ్రుడు సంతో
డిట్లని చెప్పం దొడంగె. ౧౪౪

గీ. యావరాజ్యమ్ము గాంగేయుఁనకు నిలిపి
శరవణోద్భవుచే మహేశ్వరుఁడువోలె
సర్వసుఖములు వైకొంచు శంతనుండు
నాలుగేడు లానందాబ్ధి నోలలాడె. ౧౪౫

వ. పదఁపడి యొకనాఁడు మృగయాసక్తుండై నిరంతరకుంజపుంజ మండితంబగు కాళిందీతటమ్మునకుఁ జని యచ్చట, ౧౪౬

సీ. ఏన్గుగున్నలవంటి యెసకమ్ము గల్గుకా
రడవిపందుల బీర మడఁచియడఁచి
భూధరమ్ములపాటి పొడవుగల్గిన యేనుఁ
గుల మొత్తముల నేలఁగూల్చికూల్చి
శమవాహనమునైన సమయింపఁగాఁ జాలు
పులులగుంపులతోడఁ బోరిపోరి
విక్రమాటోపదుర్వేధమ్ము లగు సింగ
ముల గముల్లెల్లను గలఁచికలఁచి

గీ. జవముమెయి గాలితోఁ బోలఁ జాలులేడి
కదుపులన్ బ్రదరమ్ములఁ జదిపిచదిపి
ప్రళయకాలకిరాతుని పగిది జంతు
మండలమ్మును వేఁటాడి మగిడి యతఁడు, ౧౪౭

వ. ఒక్కశీతలతరుచ్ఛాయాతలమ్మున నిషణ్ణుండై యున్న యెడ,

క. ఆనందోద్దీపకమై
నానాపరిమళవిశేషనవసౌరభమై
జానొప్పుఁజాలు నొకగం
ధానిల మేతెంచి నరవరాగ్రణి నెనసెన్. ౧౪౮

వ. అతండును దత్పరిమళమ్మున కచ్చెరువంది, ౧౪౯

మ. మృగనాభిం బురణించి, యబ్జముల పేర్మిం గ్రిందుగాఁజేసి, సం
పెఁగలం డీకొని, కేతకీసుమములన్ బిట్టేచి, కుందమ్ములం
దిగు లొందించియు, మాలతీసుమములం దీండ్రించి, నిర్హేతుకం
బుగ నేతెంచు పరీమళం బిది సుఖాంభోరాశిలో ముంచెడిన్.

క. దీనికిఁ గారణ మేమొకొ
కానఁగవలెనంచు వేడ్కఁ గడలుకొనంగా
నానాపుష్పాకీర్ణం
బై నెగడు వనాంతమెల్లనరయుచుఁ జనుచున్, ౧౫౨

చ. అమరిన వేడుకం గనియె నబ్జముఖిన్ నవసౌరభోజ్జ్వల
ద్ఘుమఘుమ విగ్రహన్ గమలకుట్మలచారుపయోధరద్వయన్
యమితశిరోజభార మలినాంబర నాతివిభూషణాంచితా
దములపుటాకువంటి యొక తామరసప్రతిమానలోచనన్, ౧౫౩

క. ఆకలికి నాతలోదరి
నాకలకంఠీలలామ నాకనకాంగిన్
భూకాంతుఁ డిటు గన్గొని
యీకన్నియ యేమనితావియే యిది యనుచున్, ౧౫౪

ఉ. దాని పిసాళిగుబ్బలును దాని యొయారపుఁ జూపుఁదీపులున్
దాని వళిత్రయీగరిమ దాని శరీరపరీమళంబు న
ద్దాని వయోవిలాసమును దాని పదక్రమసౌష్ఠవంబునున్
దేనికి నగ్గలం బనుచుఁ దీరనికూరిమిగౌరవంబునన్, ౧౫౫

—* శంతనుండు సత్యవతిం బెండ్లియాడుట *—

వ. డగ్గఱి సిగ్గరితనమ్మునన్ మొగ్గు నగ్గజగమనం బునఃపునరాద
రోదయమ్మునం గనుఁగొనుచుఁ దన మనమ్మున, ౧౫౬

క. ఈ మగువ దేవతాకాం
తామణియొ ! కిన్నరాంగనామణియొ ! ఫణి
స్త్రీమూర్ధన్యయొ ! కాక
భూమిన్ గలపొలఁతి కిట్టి పొలుపుంగలదే ? ౧౫౭

క. అని తలపోయుచు నా శం
తనుజనపతి తొల్లి దైవతధుని దనువరిం
చినభంగిఁ దలఁచుకొని య
త్తనుమధ్యం జేర్మిఁజూచి తగనిట్లనియెన్. ౧౫౮

ఉ. ఎవ్వతె వీవు ? నీజనకుఁడెవ్వఁడు ? జవ్వని ! యివ్వనమ్మునం
దెవ్వనికై చరింతు ? కులమెయ్యది ? నీ విటు లొంటిపాటునన్
మవ్వపుమేనికాంతి కనుమాయఁ జరింపఁగ నేమి వచ్చె ? నీ
కెవ్వఁడు భర్త ? దెల్పఁగదవే ? మదవేల్లితదంతిగామినీ. ౧౫౯

క. నీసొగసు నీవిలాసము
నీ సౌరభ్యంబుఁ జూచి నేనెంతయు నీ
కాసించి మదనభూత
గ్రాసీభూతుండ నైతిఁ గరుణింపఁగదే ? ౧౬౦

వ. అన నక్కాంత చిఱునగవలర నిట్లనియె. ౧౬౧

ఉ. కన్నెనుగాని వేఱొక ప్రకారము దాననుగాను ; దాశరా
జన్నయభిఖ్యగన్న సుగుణాత్ముఁడు నాజనకుండు ; నన్ను " నా
వ న్నడిపించుచుండు మిదె వచ్చెద " నంచు వచించి డించి పో
యె న్నరనాథ ! యింటి ; కదియే యతఁడుండెడితావు నావుడున్,

చ. నరపతియిట్లు వల్కె నరనాథుఁడ నేఁ గురువంశజాతుఁడన్
దరుణి ప్రతిక్షణప్రబలితం బగుజవ్వనమున్ వృథాగతిం
బొరయఁగఁ జేయ నేల ? ననుఁ బొందు మసంశయరీతిఁబత్నివై
పరమసుఖమ్ములం గొనుము పత్నియు గత్నియు వేఱులేదిఁకన్.

ఉ. ఓసరసీరుహాక్షి విను మొక్కలతాంగి ననున్ వరించి పే
రాసలు గొల్పిపోయె ; నది యాదిగ నేను మఱొక్కలేమపై

నాస విగుడ్వనైతి ; నిను నారసినంతన బుద్ధి పుట్టె ; నీ
దాసుఁడనైతి ; నావిధురతం బెడఁ బాపుట కిచ్ఛగింపుమా !

వ. అని సరసంబుగాఁ బల్కి నజ్జననాయకునియందు బద్ధానురాగ
యయి యత్తొయ్యలి లజ్జించుచు నిట్లనియె. ౧౬౫

క. నిను నేఁచెడి యమ్మదనుఁడు
ననుమాత్రము విడిచిపెట్టునా ? యెందేనిన్
వినుమొక్క మాట ధర్మ
మ్మునకుం గట్టువడవలదె పూవుంబోఁడుల్ ? ౧౬౬

ఉ. పెద్ద లెఱింగి కన్నెలకుఁ బెండిలిసేయుట పాడిగాని తా
గద్దరియై తనంతన యొకానొక నాయకుఁ జెట్టవట్టినన్
బెద్దఱికంబు వాయదొకొ ! పెద్దలకుం దలవంపు నింపదో !
హద్దు నతిక్రమించుట కులాంగనకు న్విహితప్రచారమే ? ౧౬౭

ఉ. ఈపరతంత్రురాలి నిటు లీవు వృథా మొగమోటవెట్టి సం
తాపము నొందఁజేయకుము, ధర్మముమర్మ మెఱింగి యించుకే
నోపిక చేసి మజ్జనకునొద్దకు నేగి తదాజ్ఞఁ బూని న
న్నాపయి స్వీకరింపు ; మతఁ డన్నిఁట ధీవరుఁ డింత యొప్పదే.

గీ. ఇట్టు లొప్పఁగఁ జెప్పనయ్యింతి కెదురు
మాటచెప్పఁగలేమి, నమ్మనుజ విభుఁడు
దాశగృహమున కేగెఁ దత్కన్య నతని
యనుమతింగొని వరియింప నాత్మనెంచి, ౧౬౯

ఆ. వె. వచ్చుచున్న నృపతివరుని దాదవ్వుల
నరసి ధీవరుఁడు కృతాంజలి యయి
యెదురువచ్చి వినయ మెసఁగంగ నిట్లనె
గౌరవప్రపత్తి గడలుకొనఁగ. ౧౭౦

వ. ఏను భవద్దాసుండ నిచ్చోటికి మీరు విచ్చేసినకతన ధన్యుండ
నైతి నావలనికార్యం బానతిమ్మనుడు నతం డిట్లనియె. ౧౭౧

క. నీ కనుమతి యగునేనిఁ
గై కొనియెద ధర్మపత్నిగా నీతనుజన్
రాకాచంద్రనిభానన
నాకోరిక చంద మిది యనన్ మనమలరన్, ౧౭౨

చ. అనఘుడు బల్కు నాతఁ; డధిపా! కడుభాగ్యముగాదె నాతనూ
జను వరియించి నాకులము శస్తముగా నొనరింపు చెన్న ; నీ
కు నొసఁగు వాఁడ, నైన నొకకోరికఁ గోరెద ; మత్కుమారికా
తనయుఁడు నీ యనంతరము ధారుణికిం బతి గావలెం జుమీ!

వ. అనుదాశునివచనంబులువిని శంతనుండు గాంగేయుం దలంచు
కొని నిరుత్తరుండై చింతాక్రాంతుండై యచ్చోటు విడిచి తన
గృహమ్మున కేతెంచి దాశకన్యాగతమనస్కుం డగుచు నశనాది
కంబు వర్జించి యున్నంత, ౧౭౪

క. గాంగేయుఁ డెలమిఁ దనతం
డ్రింగని యిట్లనియె, చేలరీతిని నిటు గుం
దం గతమెయ్యదియోకో! త
త్సంగతి యొక్కింతనాకు దయఁ దెల్పఁగదే. ౧౭౫

గీ. దుర్జయుండగు శత్రుండు దొడరె నొక్కొ-
సలుపఁగా రానికార్యంబు గలిగె నొక్కొ-
యేనుగలుఁగఁగఁ గొదవ నీకెట్లు గల్గు
నేల చింతింప? వచియింపవే మహాత్మ! ౧౭౬

క. జనకుని చింతం దీర్పని
తనయునిఁ దనయుఁడని చెప్పఁదగ దండ్రిబుధుల్
మనమున డాఁపక చెప్పుమా
యనఘా ! నీకున్న కోర్కెయది నేఁ దీర్తున్. ౧౭౭

సీ. తండ్రియాజ్ఞనుగదా ! దశరథాత్మజుఁడు భా
ర్యానుజోపేతుఁడై యటవికరిగె
నల హరిశ్చంద్రభూపాత్మజుండగు రోహి
తాస్యుండు జనకాజ్ఞ నమ్ముడువడె
యజ్ఞపశువుగాఁగ నంగీకరించె శు
నశ్శేఫుఁడు దనజనకునియాజ్ఞఁ
బరశురాముఁడు తల్లిశిరము ద్రొల్లఁగ నేసె
జనకాజ్ఞ దాఁటరాదనియకాదె
ఆ. వె. చేయఁదగని చెట్టసేఁతయైనను బూర్వు
లాచరించు రెందు నరయఁ దండ్రి
యాజ్ఞకన్న ముఖ్యమైనది వేఱొండు
గాదటంచుఁ దెల్పఁగాదె యధిప ! ౧౭౮

క. తాను సమర్థుండయ్యును
బూనికమై జనకుకోర్కెఁ బూరింపని య
వ్వానిది జన్మమె ? వాఁడును
మానిసియే ? పశువుగాక మానవనాథా ! ౧౭౯

ఆ. వె. తండ్రి కోర్కెఁదీర్చి తనియింపఁగాలేని
పుత్రకుండు జగతిఁ బుట్టనేమి ?
గిట్టనేమిఫలము ! గిట్టవా ! పుట్టవా !
స్వేదజములు మఱియు భేదమేమి ? ౧౮౦

క. అని పల్కు తనయుఁ గని, శం
తనుఁ డిట్లను లజ్జ మనమునదరికొనఁ దనయా!
గనుఁగొనుము చింతగాదే ?
తనయుండొక్కరుఁడ యైనఁ దండ్రికిఁదలఁపన్. ౧౮౧

క. ఒకకొడుకు కొడుకునుంగాఁ
డొకకన్నును గన్నుఁగాదయో ! పుత్రా ! దై
వికగతి వాఁడందినఁ దం
డ్రికి వేఱొండుగతి గల్గనేర్చునె యెందుఁ ? ౧౮౨

వ. ఇట్లు చింతాక్రాంతుండై యున్న తండ్రి యుదంతంబు సాంతం
బుగాఁ దెలియంగోరి యమాత్యులంబనిచిన వా రున్నయునికి
నెఱిఁగి భీష్మునకుం జెప్పిన నతండు తదమాత్యులతోడం గలసి
దాశరాజుసదనమ్మునకుం జని యతనితో నిట్లనియె. ౧౮౩

ఆ. వె. ఓయి ! దాశరాజ ! యొసఁగు నీపుత్రి మ
జ్జనకుఁడైన శంతనునరపతికి
మాతయైన నీదుకూఁతున కే నెల్ల
యెడల భక్తుఁడనని యెఱుఁగు మనఘ ! ౧౮౪

క. అన దాశుం డిట్లను నో
యనఘా ! నీ కిచ్చెదను మదాత్మజ సతిగాఁ
గొను మీవుండఁగ నేత
త్తనయుం డీనేల నేల ధర్మమె ? చెపుమా ! ౧౮౫

క. అనుదాశరాజునకు శం
తనుతనయుం డిట్లు పల్కెఁ ; దగ నీసుత మా
తను జేయుము నా కేత
త్తనయుఁడ రాజ్యమ్ము నేలఁదగుఁగా కనఘా ! ౧౮౬

వ. అనుడు మహాత్మా ! నీవు రాజ్యం బొల్లమియ నిశ్చయంబైనను నీతనయుండు మద్దౌహిత్రు రాజ్యమ్మునకు సమ్మతించునే యన భీష్ముండతని కిట్లనియె. ౧౮౭

గీ. ఏను దారపరిగ్రహం బిచ్చగింప
నిట్టి నా కేల పుత్త్రుఁడుపుట్టుఁ జెపుమ
నావలని శంక మనమునఁ బోవఁ ద్రోచి
తల్లిగాఁజేయు టొప్పు నీతనయ నాకు. ౧౮౮

వ. అనుగాంగేయుపల్కులకు సమ్మతించి దాశుండు శంతనునకు సత్యవతి నొసంగి పరిణయం బొనరించె. ౧౮౯

ఆ. వె. సత్యవతిని ధర్మసతిగాఁగఁ గైకొని
సంతసించెఁ గాని శంతనుండు
పెండ్లి గాకమున్నె బిడ్డఁడు వ్యాసుండు
కలిగె ననెడిమాటఁ దెలియఁ డయ్యె. ౧౯౦

వ. పిదప నతండు కొండొక కాలమ్మునకు నాసతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులను తనయులంగాంచె. వారిరువురును గాలవశమ్మున మృతులగుడు విచిత్రవీర్యపత్నియగు నంబిక యత్త యాజ్ఞ వ్యాసుం గలయునెడ నేత్రనిమీలనం బొనర్చుకతనఁ బుట్టంధుండగుధృతరాష్ట్రుం డుదయించి రాజ్యార్హుండు గాఁడయ్యెఁ బిదప రెండవది యగు నంబాలికం బనుప నాపె వెలవెలఁ బాఱుకతనఁ బాండురోగగ్రస్తుండగు పాండురాజుదయించె నతండును రాజ్యార్హుండు గామి సత్యవతి పెద్దకోడలిఁ బిలిచి మరల వ్యాసుం గవయు మనుడు నాపె యొల్లక కామకలావేదినియగు తన దాసిం బనిచిన దానికి ధర్మాంశమ్మున విదురుం డుద్భవించె.

ఉ. ఈ జగదంబయే మనల నెల్ల సృజించినతల్లి, యీ మహా
తేజము యల్పబుద్ధులకుఁ దెల్లము కానిది, మాయ యన్న యీ
శ్రీజనయిత్రియే, జగమశేషము నిండిన దీ పరాంబయే
తేజుల కెల్లఁ దేజొసఁగు తేజన నీజగదేకనేత్రియే. ౪౩

గీ. ఈమెయే సర్వలోకంబు సృష్టిఁజేసి
పెంచి హరియించు నీమెయే వేదగర్భ
యీమెయే సర్వబీజమయియును విశ్వ
నాయికయు నీమెయే సదానందమూర్తి. ౪౪

క. ఇరుగడలన్ బరిచర్యా
పరత మెఱయ భూషణములువలల విభూతుల్
పరఁగెడి గోట్లకొలఁది నా
సరణిం జూడుఁడు విరించిశంకరులారా! ౪౫

క. ఎంతతపము చేసితిమో
యెంతటి ధన్యులమొ కాని యీభగవతి న
త్యంతముఁ గనుఁగొని ముదిత
స్వాంతుల మైనార మిదియు సామాన్యంబే. ౪౬

చ. తపసులు గాంచ లేరతివదాన్యులు చూడఁగ లేరు భార్గవీ
చపలమృగాక్షి యాదియగు సర్వనిలింపసతుల్ శతాంశమం
దుపమకు రారు తత్సుకృతయోగము నెన్నఁ దరంబె? పూర్వపు
ణ్యపుఁబరిపాక మెట్టిదో కదా! కన నయ్యెఁ బ్రపంచమాతృకన్.

గీ. మున్ను బొటవ్రేలుగుడిచెడి చిన్ననాఁడు
నన్ను నుయ్యాలలో నుంచి సన్నమైన
యెలుఁగ లరఁ బాటలను బాడి యేడ్వకుండఁ
గాచి ప్రోచినతల్లి యీకన్నతల్లి. ౪౭

గీ. ఇంతసేపు పరీక్షించి యేనరయఁగ
వెనుకఁ గనుఁగొన్న సంగతి విశదమయ్యె
మాట లేక వేయునేల యీమాత మనలఁ
గన్న జగదంబ లేరీమెఁ గన్నవారు. ౪౯

వ. అట్లగుట మన మీ పరదేవతా సమీపమ్మునకుఁ బోయి ప్రణుతించిన మన యభీష్టమ్ము లొసంగుఁ; గాదని ద్వారికులు వారించిన ద్వారమంద నిలిచి నుతింపం గడంగుద మను పల్కులకు సమ్మతించి విమానంబు డిగ్గి తద్ద్వారసమీపమ్మునకుం బోవుడు మమ్ముఁ గాంచి జగదంబ చిఱునగ వొనర్చుటయు మూగురము స్త్రీలమై తత్సన్నిధికిం జని నమస్కరించి యన్యోన్య వనితారూపమ్ము లరసికొనుచుఁ గోటి సూర్యప్రతీకాశంబును నానా మణిస్థగితంబునునగు తత్పాదపీఠమ్ము నవలోకించుచున్నంత, ౫౦

క. కొందఱు రక్తాంబరలును
గొందఱు నీలాంబరలును గొనకొని యాపెఁ
సుందరులు గొల్చుచుండిరి
కొందఱు పీతాంబరలును గోట్లకొలఁదిగన్. ౫౧

క. ఈడును జోడునుగల విరిఁ
బోఁడులు నానావిచిత్ర విభూషణములఁ సొం
పీడేర నాపె ముందటఁ
బాడుదు రాడుదురు కనులపండువు గాఁగన్. ౫౨

ఉ. నారద ! యేమి సెప్పుదు వినన్ గనరాని విచిత్ర మంబికా
దార రుచిప్రసన్ననఖదర్పణమందు నినున్ సనున్ శివున్
నీరజనాభునిన్ ధరణి నీరజమిత్రుని నీరజారినిన్
వారిధిపర్వతాదుల నవారణఁ జూచితి మొక్కపెట్టుగన్. ౫౩

వ. మఱియు మ[illegible]కారి [illegible] [illegible]యుఁ [illegible] యగు నచ్యు
తుడును [illegible] [illegible]తు[illegible]ను [illegible] త్రి[illegible]త్కోటి
దేవతలును మరుద్గణంబులును తుంబురుండును హాహాహూహూ
ప్రముఖగంధర్వులును రంభాదులగు నప్సరలును కైలాసాది
లోకంబులును మున్నగాఁగల యావద్బ్రహ్మాండము జూచి పర
మాశ్చర్యభరితులమై యామె జగజ్జననిగా నామె నిశ్చయించు
కొంటిమి. ౧౪

గీ. అమృతమయమగు నాస్వాదమగు లోక
జననిఁ గనుఁగొని మోహాబ్ధి మునుఁగుమాకు
క్షణముగా నొకనూఱువత్సరము లరిగెఁ
[illegible]సుఖంబును స[illegible] పరము గాను. ౧౫

క. సుముఁ జలికమ్మల మని యా
ప్రమదామణులెల్లఁ బ్రేమ బయలుపడఁగ శ్రా
స మనములం దుంచక సూ
క్ష్మమయిన్ గౌరవము చేసి మెలఁగిరి పిదపన్. ౧౬

—* హరిహరబ్రహ్మలు భువనేశ్వరిని నుతించుట *—

క. ఒకనాఁడు భక్తి నా యం
బిక నాలోకైకమాత విశ్వజగత్ప్రా
పకమహిమఁ గాంచి విష్ణువు
ప్రకటగతి నుతించె నిట్లు బద్ధాంజలియై. ౧౭

సీ. కామదాయిని! దేవి! కళ్యాణి! ప్రకృతి! వి
ధాత్రి! లోకేశ్వరి! దండమమ్మ
సచ్చిదానందాత్మ! సంసారకారిణి!
కలుషహారిణి! నమస్కారమమ్మ

పంచకృత్యవిధాత్రి ! పరదేవి ! యర్థమా
త్రార్థభూతాత్మ ! జ్యోతిహారులమ్మ
హృల్లేఖ ! సంసిద్ధి ! వృద్ధి ! కూటస్థ ! నా
నాస్వరూపాత్మ ! వందనములమ్మ

తే. గీ. జగముసృష్టించి పురుషుని కనఁబడఁగఁ
జేసి యానందమొనగూర్తు శ్రీమహేశి !
తల్లి ! యిరువదిమూఁడుతత్త్వముల వెల్గు
దింద్రజాలంబు నా మాకు నింపుగూర్పు. ౫౮

గీ. స్వప్రభావమ్ముకలిమి విశ్వమ్ముఁ బ్రోతు
వాత్మతేజమ్ముచే జగ మలరఁజేయు
దంబ ! కల్పాంతకాలమ్మునందుఁ గూడ
నుందు వెవ్వాఁడెఱుఁగు నీచందమెల్ల. ౫౯

గీ. జనని ! మధుకైటభాఖ్యరాక్షసులచేత
మడియ కుండఁగ రక్షించి మాకు లోక
మెల్లఁ గనుపడఁ జేసిన తల్లివైన
నీదుదర్శనమదియు వర్ణింపఁ దరమె ? ౬౦

క. ఏనును బ్రహ్మయు రుద్రుఁడు
గానంగా లేము నీయఖండమహత్త్వా
బే నరునకు శక్యం బగుఁ
బూని కనుంగొనఁగ నీయపూర్వపుఁజరితల్. ౬౧

క. హరిహరకమలజులను హరి
హరకమలజులకును జూపి తంబరో ! నీదౌ
చరితం బెఱుఁగం దరమే
పరమాద్భుతసుప్రభావభావ్యము తల్లీ. ౬౨

గీ. [illegible] కోటులను
[illegible] నాము నిలుచు టొకటి
నోట ధరియించు నామంబు నుడువు టొకటి
అంబ! భావించు నిన్నెపు డరయు టొకటి. ౬౩

గీ. నిన్ను నాభృత్యునిగను బుద్ధివెట్టి నన్నుఁ
బాలనము సేయనలెనమ్మ పరమకృపను
పామరుండ నేను వచియించు పలుకులందు
నేమునికి వచ్చినంత మన్నింపుమమ్మ. ౬౪

సీ. నీవు సృష్ట్యాదికం బొనరించుట కల్ల
ధనమిచ్చు మామిదఁ బ్రబలకున్న
ధాత్రి సమస్తంబు ధరియించు టది కల్ల
నాంధారశక్తి ప్రసాదకున్నఁ
గాంతిహేతుఁడు ప్రకాశించుటయుఁ గల్ల
తావక తేజంబు దవులకున్న
సకలజంతువులును సంచరించుట కల్ల
నీశక్తియొక్కింత నెగడకున్న

గీ. బ్రహ్మ మొదలుగ నఖిలప్రపంచములు న
నిత్యములుగాన నెల్లప్డు నెగడనేర
వఖిలమైనట్టి ప్రళయమ్ములందుఁగూడ
నిత్య వీ వొక్కతెవె భవానీ! మదంబ! ౬౫

గీ. విద్యగల బుధవర్యులవిద్య వీవ
కీర్తిగల పుణ్యమూర్తుల కీర్తి వీవ
శక్తిగల దివ్యశక్తుల శక్తి వీవ
యంబ! పలుమాటలేల గాయత్రి వీవ. ౬౬

పంచకృత్యవిధాత్రి! పరదేవి! యర్థమా
 త్రార్థభూతాత్మ! జోహారులమ్మ
హృల్లేఖ! సంసిద్ధి! వృష్టి! కూటస్థ! నా
 నాస్వరూపాత్మ! వందనములమ్మ

తే. గీ. జగముసృష్టించి పురుషుని కనఁబడంగఁ
 జేసి యానందమొనగూర్తు శ్రీమహేశి!
 తల్లి! యిరువదిమూఁడుతత్త్వముల వెల్గు
 దిందజాలంబు నా మాకు నింపుగూర్ప. ౫౮

గీ. స్వప్రభావమ్మ కలిమి విశ్వమ్ముఁ జొత్తు
 వాత్మతేజమ్ముచే జగ మలరఁజేయు
 దంబ! కల్పాంతకాలమ్మునందుఁ గూడ
 నుండు వెవ్వాఁడెఱుంగు నీచందమెల్ల. ౫౯

గీ. జనని! మధుకైటభాఖ్యరాక్షసులచేత
 మడియ కుండఁగ రక్షించి మాకు లోక
 మెల్లఁ గనుపడఁ జేసిన తల్లినీవ
 నీదుదర్శనమదియు వర్ణింపఁ దరమె? ౬౦

క. ఏనును బ్రహ్మయు రుద్రుఁడు
 గానంగా లేము నీయఖండమహత్త్వ
 మ్మే నరునకు శక్యం బగుఁ
 బూని కనుంగొనఁగ నీయపూర్వపుఁజరితల్. ౬౧

క. హరిహరకమలజులను హరి
 హరకమలజులకును జూపి తంబరో! నీదా
 చరితం బెఱుఁగం దరమే
 పరమాద్భుతసుప్రభావభావ్యము తల్లీ. ౬౨

గీ. కోరఁగాఁ బోను నేనొరులకోరికలను
నీపదాంబుజంబు నామది నిలుచు టొకటి
నోట భవదీయ నామంబు నుడువు టొకటి
యంబ! యాచింతు నిన్నెపు డరయు టొకటి. ౬౩

గీ. నీదు నాభృత్యుఁడను బుద్ధిఁబెట్టి నన్నుఁ
బాలనము సేయవలెనమ్మ పరమకృపను
పామరుఁడ నేను నచియించు పలుకులందు
నీమదికి నచ్చినంత మన్నింపుమమ్మ. ౬౪

సీ. ఏము సృష్ట్యాదికం బినుమడించుట కల్ల
భవదిచ్ఛ మామీఁదఁ బ్రబలకున్న
ధాత్రి సమస్తంబు ధరియించు టది కల్ల
యాధారశక్తి ప్రాపందకున్నఁ
గగనాంతహితుఁడు ప్రకాశించుటయుఁ గల్ల
తావక తేజంబు దవులకున్న
సకలజంతువులును సంచరించుట కల్ల
నీశక్తియొక్కింత నెగడకున్న

గీ. బ్రహ్మ మొదలుగ నఖిలప్రపంచములు న
నిత్యములుగాన నెల్లప్డు నెగడనేర
వఖిలమైనట్టి ప్రళయమ్ములందుఁగూడ
నిత్య వీ వొక్కతెవె భవానీ! మదంబ! ౬౫

గీ. విద్యగల బుధవర్యులవిద్య వీవ
కీర్తిగల పుణ్యమూర్తుల కీర్తి వీవ
శక్తిగల దివ్యశక్తుల శక్తి వీవ
యంబ! పలుమాటలేల గాయత్రి వీవ. ౬౬

ఉ. ఆగమముల్ ద్విజామరహితార్థము చేసినతల్లి వీవ మో
క్షాగమమూల మీవ జగదాదివి నీవ స్వధాస్వరూప మీ
వే గతివీవ సర్వమునవహించెడిదానవు నీవ స్వాహ నీ
వాగమవేద్య వీవ జగదంబ! మదంబ! కదంబవాసినీ. ౬౭

తే. గీ. అబ్ధికిఁ దరంగములయట్టు లాదిపూరు
షాంశములు జీవులగుట లోకాంబ! వారి
బంధనిర్ముక్తి కఖిలప్రపంచసృష్టి
సల్పుదువు స్వార్థమిందు లేశంబు లేదు ౬౮

గీ. జీవుఁ డెప్పుడు తెలివిని జెందు నపుడ
లేనియట్లొనరింతు వీ లీలలెల్ల
నాట్యమొనరించి యీమీఁద నర్తకుండు
మించు తత్తత్కృతుల విరమించునట్లు. ౬౯

ఉ. ఎల్లపుడున్ భవచ్చరణమే శరణం బని నమ్మినాఁడ నో
తల్లి! దురాపమైన పరితాపము తీరన దయ్యె నేని స
న్నుల్లమునందు వేఁ[illegible]కనియోజ గణింపక యుద్ధరింపు ము
త్ఫుల్లసరోజలోచనసముల్లసదుచ్ఛ్రదయాసుధార్ధురీన్. ౭౦

క. అంబ! భవచ్చరణాబ్జయు
గంబునకున్ మ్రొక్కెడుదు నఖండతరజ్ఞా
నం బొసఁగి కన్న తనుజా
తుం బలె రక్షింపుమీ కుతుక మొప్పారన్. ౭౧

వ. అని నానాప్రకారంబుల నుతించి విరమించుడు హరుం డిట్లని
నుతింపం దొడంగె. ౭౨

గీ. త్వత్ప్రభావంబుఁ దెలిసె హరి తనరెనేని
బ్రహ్మయును నీదుకార్యమై పరఁగెనేని
నేనమాత్రము నెఱుఁగ నాదృశుఁడఁగాక
సామాన్యుఁడనె చెప్పుమమ్మ లోకైకజనని. ౨౩

గీ. జనని ! భూమ్యాదిభూతపంచకము నీవ
త్వక్ముఖ మొదలగు నింద్రియపంచకంబు
నీవ బుద్ధియుఁ జిత్తంబు నీవ మనము
నీ వహంకార మఖిలంబు నీవ కావె ? ౨౪

గీ. హరిహరాదులు జగమున కాదిభూతు
లనుచు నేవారు వచియింతు రల్లవారు
తెలియనేరని మూర్ఖులో దేవదేవి !
వారు జనియించు టెల్ల నీవలనఁ గాదె ? ౨౫

గీ. సవిషయమ్ములు సగుణమ్ము లవని మొదలు
గాఁ గలుఁగు భూతములచే జగంబు పుట్టు
నది స్ఫుటంబగుటకు భవదంశ మొక్క-
యించుకేనియు లేకున్న నెట్లు పొసఁగు ? ౨౬

క. నీ వజవిష్ణుశివాకృతి
భావమునం జేసి జగము ప్రబలించియు నా
పై వెలుఁగ మతిగల్గిన
నావర్జించెదవు నీకు నడ్డముకలదే ? ౨౭

గీ. ఏము సృష్ట్యాదుల కొకింతయేని శక్తి
గనుట కూహింపఁగా ముఖ్య కారణంబు
సకలలోకాంబ ! తావకచరణనళిన
రాజమానాసమాన పరాగగరిమ. ౨౮

క. భవదీయదయావైభవ
సువిహితము తమోగుణంబు చొప్పడ నాకున్
శివదాయిని! సత్త్వము కే
శవునకును రజోగుణంబు జలజభవునకున్, ౭౯

క. ధనికు లధనికులు నృపులు త
దనుచరులు మొదలుగ నగు ననంతంబగు భే
దనియతిఁ జొప్పడు జగమిది
జననిరో! భవదీయమతి విషమ మగుటం గాదా? ౮౦

గీ. జనని! యెన్నంగ సత్త్వరజస్తమములు
త్వద్గుణములు సృష్ట్యాదినిదానములగు
హరిహరవిరించుల మము సృష్ట్యాదులకు ని
మిత్తమాత్రమ్ముగా వినిర్మించి తీవు. ౮౧

ఉ. అంబ! విమానసంగతులమై చనుదెంచిన మా త్రయంబులో
నంబుజనాభుఁ డీజగమునంతయుఁ జేసినవాఁడొ! లేక యీ
యంబుజసూతి చేసెనని యందునొ! నే ననుకొందునో! సమ
స్తంబు భవద్విలాసకలితంబు నవం బొకయింత యున్నదే? ౮౨

గీ. ఈవ సృజయింతు పాలింతు విచ్చపోడను
నేని యఖిలమ్మును హరింతు వెల్లవేళ
స్వపతియగు పూరుషుని మోదసంగతునిఁగఁ
జేయుదువు నీవిలాస మజ్ఞేయ మంబ! ౮౩

ఆ. వె. ఆఁడుజన్మమైన నది యభీష్టమమాకు
నీదుసేవనంబు నెగడెనేని
గాన నెల్లవేళఁ గరుణించి యిటులుంచు
మంబ! పురుషభావ మధికమగునె? ౮౪

ఉ. తల్లి! భవత్పదద్వయము నెక్క మఱొక్కటి నొల్లఁ ద్వత్పదో
త్ఫుల్ల సరోజ మకరందపూరము గ్రోలక యున్నచోఁ ద్రుటుల్
కల్లలు గావె కల్పములుగాఁ గనుపట్టు నహర్నిశంబు ని
న్నొల్లక యన్యుల న్గొలుచుయోగులు నిక్కము దైవవంచితుల్.

క. అంబ! పృథఙ్మాటల లా
భంబేమి? యనుగ్రహించు భావంబది నీ
కుం బాపు మనేని నీ మం
త్రంబు నవాక్షరము నాకు దయసేయఁదగున్. ౮౬

క. అను శిశువుఁ గరుణించి జగ
జ్జనని నవాక్షర మఖండసత్త్వము మంత్రం
బును నుచ్చరించె దానిం
గొని ప్రణతిం గొలిపి ముదముగొని యతఁడుండెన్. ౮౭

వ. అంత నేనును భక్తిపరవశుండనై యిట్లు నుతించితి. ౮౮

క. నిను నిర్వచింప శ్రుతి నే
ర్చునె దేనిన్ జెప్పుకున్నె? శ్రీంకరి! స్వాహా
యనుట మఖాదుల నినుఁ
గూర్చినదే సర్వజ్ఞవీవె త్రిభువనజననీ! ౮౯

ఉ. ఏ నొనరించువాఁడ జగమెల్లను నాకుఁ బరుండు లేఁడు వి
జ్ఞాని ననంగ నేనె" యని శాంకరి! శంక యొకింతలేక లో
నూనితి ధన్యతాగరిమ మూరక సంసృతిసాగరంబునన్
జ్ఞానవిహీనతన్ బడితిఁ గావఁగదమ్మ కదంబవాసినీ. ౯౦

ఉ. ఇంతకుమున్ను ధన్యుఁడను నే ననుకొన్న దసత్యమైన నీ
చెంతకు వచ్చి నీచరణసేవ యొనర్పఁగ గల్గెఁ గాన నా

వంతయుశంకలేదిఁకఁ గృతార్థుఁడ ధన్యుఁడ మాన్యుఁడన్ భవ
ధ్వాంత మడంచి నీదుపరభక్తి ధురీణఁబొనరింపు మంబరో!

క. నీవలనఁ గల్గు నొక రా
జీవమ్మునఁ బొడమితిని విశేషించి భవ
త్సేవకుఁడనైతి సజ్జా
నావృతిఁ దొలఁగించి ప్రోవు మఖిలాంబ! దయన్ ౯౨

ఉ. నీచరితం బెఱుంగని వినీచులుదక్కఁ బరాత్పరుం డటం
చీచతురాననుం దలఁప రీశ్వరి! స్వర్గము గోరి జన్మముల్
నోఁచెడి వారు నిట్టిరె జనుల్, నను నీవ సృజించి తీక్షి యా
లోచన నాకె తోఁచదిఁక లోకులకున్ గతియేమి? శాంకరీ.

క. పరతత్త్వంబంచును ని
న్నరయక యోగంబులంచు నన్యాశ్రయముగాఁ
బరమేశ్వరి! కొందఱు చెడు
దురు త్వద్భక్తేతరులకు దొరకునె ముక్తుల్? ౯౪

ఉ. ఎందుల కంబ! పాట్లువడి యెన్నిటనో కృశియించు టో మహా
నందవిధాత్రి! సారెకుమనంబున "శాంకరి! యీశ్వరీ!" యటం
చుం దగుభక్తి నీజపము చూఱగొనం గలవాఁ డెవ్వఁడు వాఁ
డొందు నొకింతలోన జగదంబ! యిహంబుఁ బరంబు సర్వమున్.

తే. గీ. కావలెనె వీఁడు సృష్టికై కమలభవుఁడు?
హరియు రక్షింపవలెనె? లయంబు శివుఁడు
లేనిచో నెఱవేఱదె? లీల లివి స
మస్తమును జేయఁజాలు దోయంబ! నీవు. ౯౬

చ. హరి మధుకైటభాసురుల కందిన నేమగు ? సృష్టివేళ నీ
కరుణయె కా! సముద్ధరణ కారణమయ్యె నతండు నేను శం
కరుఁడు మమద్భవుండఁట ! జగజ్జన నామములయందు శక్తితోఁ
బొరయుదు మేని యెవ్వరికిఁ బొందనివారు వచింపు మంబరో !

క. అదటికి జన్మకారణ
ము దెలియఁగవచ్చు సర్వమోహిని ! యది నీ
కుం దెలియరాదు వినరా
దెందును నజ వనఁగ నగుదు వీవ నిజముగా. ౯౮

ఉ. ఏ సృజియింతు నీహరి వహించును రుద్రుఁడు సంపు నిక్కమే
కాసున కేనిఁ గాని మముఁ గార్యవిశారదులం బొనర్తు వం
బా ! సకలేశి ! నీకళయె మాకు సహాయము గానిచో వృథా
యాసమె కాని మే మొక రవంతయుఁ జేయఁగ లేము శాంకరీ.

వ. మఱియు సకర్తయు నగుణుండును ననుపాధియు నకలుండును నగుపురుషుండు భవదీయంబగు వినోదంబు నీక్షించి సంతోషించు చుండునని తద్జ్ఞులు సెప్పుదురు. ఈతం డొక్కరుండు దక్క నీకన్న బరుండు లేఁడు. ఇదియ నిక్కంబైనచో "నేకమేవాద్వితీయం బ్రహ్మ" యను వేదవాక్యంబునకు మిథ్యాత్వంబు వొసంగుఁ గాన నన్ననుగ్రహించి యీ యన్యోన్యవిరోధ పరిహారం బొనర్చి యవ్వాక్యంబునకు వాచ్యంబునీవో లేక యప్పురుషుండో విస్పష్టంబొనర్పుము ; నీవు స్త్రీవో పురుషుండవో యెఱింగింప వలయు ; మత్పూర్వయోగమ్మునం జేసి భవదీయసాన్నిధ్యంబు చేకూఱె నని ప్రార్థించునన్నుం గాంచి మృదుమధుర గంభీర సంభాషణంబుల నజ్జగదంబ యిట్లనియె. ౧౦౦

ఆ. వె. అతఁడ యేను నేన యాతఁడు భేదం బొ
కింతయేని యుండ దిరువురకును
బుద్ధిమంతులైన పురుషు లెఱుంగుదు
రెఱుఁగ లేరు బుద్ధిహీనజనులు. ౧౦౧

క. మాయిరువుర యంతరము
జ్ఞేయం బద్దాని యెఱుకఁ జెందిన పురుషుం
డే యోగియు ముక్తుఁడు నన
పాయుం డాతనికి లేవు భవబంధంబుల్. ౧౦౨

—* బ్రహ్మాదులకు దేవి తనరూపం బుపదేశించుట *—

వ. మఱియు దీపం బుపాధిభేదంబున ద్వైవిధ్యంబు గాంచునట్లును నాదర్శమ్మునం దోఁచు ప్రతిబింబమ్ముభంగిదిని వ్యవహారకాలమ్మున ద్వైవిధ్యంబు కల్పితంబయ్యెఁ బరమార్థమ్మనకు " ఏక మేవా ద్వితీయం బ్రహ్మ " యను వేదవాక్యంబ నిక్కం, బిట్టి యునుంగాక స్త్రీరూపంబు నాకు సృష్టికాలంబునఁ గల్పితంబైనదికాని కల్పాంతమ్మున స్త్రీపుంనపుంసకభేదంబులు లేక యుండుదు. బుద్ధిశ్రీధృతి కీర్తిస్మృతులును శ్రద్ధామేధాదయా లజ్జాక్షుధాతృష్ణలును కాంతిశాంతిపిపాసలును నిద్రాతంద్రాజరలును విద్యావిద్యాస్పృహావాంఛాశక్త్యశక్తులును వసామజ్జాత్వక్కులును ఋతానృతవాక్కులును పరామధ్యాపశ్యంతులును వివిధమ్ములగునాడులును నేనకాని వేఱొండుకాదు. వేయేల, సంసారంబందు మద్వియుక్తంబగు పదార్థం బొక్కండు లేదు. నానాదేవతలందు గౌరీబ్రాహ్మీవారాహీరౌద్రీవైష్ణవీశివావామనీకౌబేరీనారసింహీవాసవీప్రముఖ నానాశక్తిస్వరూపమ్ములఁ బరాక్రమించుచు సర్వకార్యమ్ము లొనర్చుచుండు. జలమ్ముల

శైత్యగుణమును, వహ్నియం దౌష్ణ్యంబును, దివాకరునందు దేజంబును, జలాశయంబున హిమంబును ననే మత్త్యక్తంబగు వస్తువిశేషంబులకుం గేని సమర్థంబుకాదు. మీరు మువ్వురును మదీయశక్తి విముఖులైనచో రాక్షసాదిహరణంబున కశక్తులకా నిశ్చయింపుడు. మఱియుం బలితుండును సాక్షితుండును శాంతుండును భీతుండును శత్రునిశగతుండును నశక్తుం డనంబడునుగాని యరుద్రుండనియు నవిష్ణుండనియు వ్యవహరింపంబడండు. శక్తియుక్తుండ వగుటంజేసియ యీవు జగంబు సృజియింతువు. విష్ణురుద్రులును సూర్యచంద్రులును నష్టదిక్పాలకులును శక్తియుక్తులగుటంజేసియ తమతమ కార్యంబులు నిర్వహించుచుందురు. భూమియు శేషుండు నాదికూర్మంబును దిగ్గజంబులును శక్తిగలుగుటంబట్టియ భారవాహకంబులగుచున్నవి. కానిచోం బరమాణువహనంబునకును గొఱగావు. ౧౦౩

శా. హంసాగ్రేసరవాహ ! నీరమును నాఖ్యాశేషమౌ నట్లు ప్ర
ధ్వంసంబుం బొనరింతు నయ్యనలు నార్పంబూనుదుం గాలి నా
శంసామాత్రముగా నొనర్తు మది నిచ్ఛామాత్రముం జేసి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావము నొనర్పన్నేర్తు నన్నింటికిన్ ౧౦౪

ఆ. వె. అంతమాత్రమున సమస్తతత్త్వములును
బోయెననెడి బుద్ధిం బూనరాదు
ఘటకపాలరీతిం గాం బరమాణువు
లందుం బృథివి నిల్చు నబ్జసూతి ! ౧౦౫

వ. మఱియు శాశ్వతంబును క్షణికంబును శూన్యంబును నిత్యానిత్యంబును సకర్తృకంబును నహంకారాగ్రిమంబును మహత్తును నను నీయేడు భేదంబులం జొప్పడు మహత్తత్త్వంబు. దీనికతన నహంకా

రంబుపుట్టి; నీ విమ్మహత్త్వంబు వలన సమస్తభూతంబులును యథాపూర్వంబగుగతి రచియింపు మని చెప్పి, ౧౦౬

ఉ. చారుహాసన్ముఖిన్ విమలంజందసగంధి సితాంబరన్ మనో
హారిణి రాజసిన్ సరసిజాసన దివ్యసరస్వతిన్ మహా
దారవిభూషణన్ గొనుము దారను గా నని నా కొసంగె ని
పారఁగ నొక్కశక్తిని మహాసుగుణన్ జగదంబ యున్నతిన్.

క. ఒసఁగి యిటులనియె నోయి స
రసిజాసన! యేగు మీసరస్వతితో స
ర్వసుఖముల ననుభవించుచుఁ
బొసఁగన్ వసియింపు సత్యభువనమునందున్. ౧౧౭

వ. మద్విభూతియగు నీ సరస్వతి నెన్నండు నవమానింపక యిష్ట సుఖమ్ము లనుభవించుచు స్వకర్మానుయాతంబులై జీవసమూహంబు లను లింగకోశంబులం గొని చతుర్విధంబుగఁ గాలకర్మస్వభావానుగుణంబుగ సచరాచరంబగు జగంబు సృజియింపుము. సత్త్వగుణ ప్రధానుండగుట విష్ణుండు నీ కెక్కుడు; దుస్సహమ్ములగు విషయమ్ములందు మానవప్రకృతులందును దదన్య ప్రకృతులందును బుట్టుచు దానవులం బరిమార్చుచుండు శంకరుండును నిట్లు సహాయుం డగుచుండు. ౧౦౯

క. దేవతలం జేయుము భూ
దేవాదిద్విజులు మిమ్మధికదక్షిణలన్
భావింపఁదగిన యాగ
శ్రీ వెలయఁగ నెపుడుఁబూజసేయుదు రెలమిన్. ౧౧౦

వ. తత్తద్యాగమ్ములయందు మన్నామోచ్చారణ మాత్రమ్మునన్ జేసి మీరును సంతుష్టిఁ జెందుదురు గాక. మీరాలోఁ దమోగుణ

ప్రధానుండగు శంకరుండు విశేషించి పూజనీయుండు; దైత్యుల
వలనిభయంబు మీ కేరికిని దుస్సాధంబగునెడ వారాహీప్రము
ఖావతారంబుల మదీయ శక్తు లుత్పత్తినొందుచు సంహరించెడిఁ
గాక. మంత్రరాజంబగు నవాక్షర మంత్రంబు సబీజంబుగా నెల్ల
ప్పుడు జపియించిన నీకు సర్వార్థసిద్ధి కాఁగలదు పొమ్మని చెప్పి
హరిం జూచి యిట్లనియె. ౧౧౧

ఉ. ఈరమణీలలామఁ గమలేక్షణ నిందిరఁ జందిరాననన్
దారనుగా గ్రహించి త్వదుదారభుజాంతరసీమ కేళికా
గారముగా నొసంగు మొకకాలమునందయినన్ విమానితం
గా రచియింపకే మిగుల గారముగాఁ గనఁగాఁ దగుం జుమీ

క. దేవతల జీవికకునై
యావశ్యకములు సమస్తయాగంబులు భూ
దేవతల కని విధించితి
నావిషయంబున మెలఁగుఁ డవిరుద్ధగతిన్. ౧౧౩

క. మీరలు ముగురు మదంశో
దారు లగుటఁజేసి జగము తగ మిము నెంతే
నారాధించు సమమ్ముగ;
నారయు భేదంబు నెవ్వఁ డతఁ డడుగంటున్ ౧౧౪

గీ. హరిహరబ్రహ్మలకు భేద మరయరాదు
గాని గుణభేద మొక్కింత గలదు మీకు
సత్త్వము ప్రధానమగు నుపసర్జనంబు
తక్కిన గుణద్వయము నీకుఁ దమ్మికంటి. ౧౧౫

క. ఈవు రజోగుణ మూనెడి
యావేళలయందు నుపవనాదికమున సు
శ్రీవెలయఁగ నీభార్గవి తో
విహరింపుము మదిం గుతుకమలరారన్. ౧౧౬

వ. వాగ్బీజమాయాబీజకామబీజసంపుటీకృతంబును బరమార్థదంబు
నగు నిమ్మహామంత్రంబుఁగైకొను మని యమ్మనురాజం బుపదే
శించి యిట్లనియె. ౧౧౭

ఉ. నా కెపు డిచ్చ వుట్టునో వినాశమొనర్తుఁ బ్రపంచమస్త, నా
యాకృతియందు మీ ముగురు నైక్యముఁ జెందెద రట్టివేళ, సౌ
ఖ్యాకరమై జయప్రదమునై తగు నీ వరమంత్రరాజముం
జేకొని పేర్మిమైఁ బఠన సేయుము పొమ్ము శుభంబు నీకగున్. ౧౧౮

వ. వైకుంఠంబు నీకు నివాసంబగుఁ గాక యని శంకరుం జూచి
యిట్లనియె. ౧౧౯

గీ. సత్త్వము రజోగుణము నుపసర్జనములు
తమము ముఖ్యము నీ కస్మదంశజనిత
యగు మహాకాళి యీ గౌరి తగు కళత్ర
ముగ వసింపుము కైలాసభూధరమున. ౧౨౦

ఉ. గౌరిని గూడి సంతతసుఖమ్ములు చెంద రజోగుణంబు దే
వారులతోడఁ బోరుల జయంబు గొనంగఁ దమోగుణంబు సం
సార మహార్ణవోత్తరణసాధన మస్మదభిఖ్య యాగమా
ధారము సంస్మరింపఁగ నుదారము సత్త్వగుణంబు నీకగున్. ౧౨౧

గీ. ముగురకును మూఁడుగుణములు ముఖ్యములు గు
ణంబులకు వెలియగుపదార్థంబు లేదు

అట్టివాఁ డొక్కపరమాత్మ యతఁ డదృశ్యుఁ
డేనుఁ గాలానుగతి గుణ మూనుదాన. ౧౨౨

వ. సర్వంబునకుఁ గారణంబకాని యేను గార్యంబుగాను; నావలన సత్త్వరజస్తమోగుణాత్మకం బగుపరాహంతయు దానివలన * మహత్తత్త్వంబును దానివలన నహంకారంబును దానివలనఁ బంచతన్మాత్రలును వానివలనఁ బంచభూతమ్ములును యథాక్రమం బుగ నుద్భవించె భూతపంచకంబును గర్మేంద్రియపంచకంబును జ్ఞానేంద్రియపంచకంబును మనంబును నను నీ పదియాఱును కార్యంబులును గారణంబులు నైయొప్పు. మహత్తత్త్వాదిసప్తకం బును నిట్టిదియ. పురుషుండు కార్యకారణోభయ కోటిప్రవిష్టుండు గాకయుండు; నిదియంతయు సంక్షేపమ్ముగా వివరించితి నీక మీ మీవాసమ్ములకుం బొండు; విషమంబగు కార్యంబు దటస్థించి నచో శబలితుఁడగు పరమాత్మను స్మరించునది. స్మరణమాత్ర మ్మునంజేసి యేను గోచరింపఁగలదాన నని మా ముగురకుం జెప్పి పనిచిన నేమును నా స్థానంబు వదలి చనుదెంచువారము,

క. స్త్రీరూపమెడలి పురుషా
కారము సంప్రాప్తమగుడుఁ గలరీతిగ నా
యారీతు లెంచుచు విమా
నా రూఢులమగుచు నేగు నా సమయమునన్. ౧౨౪

చ. కనుఁగొన నా సుధాజలధిగాని మహామహిమానుభావ యా
జననియుఁగాని యా చెలుల సంఘముగాని మణీఘృణీ కన
త్కనకమయంబు ద్వీపమదిగాని మఱొక్కటిగాని లేద యే
మనఁగల ! శుద్ధశూన్యముగ నయ్యెడ నెయ్యెడఁదోఁచె నారదా.

---

* ఈ మహత్తత్త్వమే బుద్ధియనియుఁ జెప్పఁబడు.

వ. పిదప నేమును మను మధుకైటభుల వధించిన చోటికే తెంచి విమానంబు డిగితి మచ్చటన మజ్జన్మ పంకజంబునుం బొడసూపె.

—* బ్రహ్మాండోత్పత్తి *—

ఆ. వె. దేవియనఁగ నిట్టి దివ్యస్వరూప మ
హానుభావ యట్టి యనఘచరితఁ
గన్నులార నేము గాంచితి మనుడు నా
రదుఁడు దండ్రి కనియె ముదము దనర. ౧౨౭

వ. తండ్రీ! నీ చెప్పిన దేవీ మహత్త్వంబు నా మనమ్మునకు వచ్చె. నీకుఁ బురుషుండన నెట్టిఁడో వివరింపు మదిగాక యింత వట్టును సగుణయగు శక్తి ప్రభావం బెఱింగించితి వికఁ నిర్గుణ శక్తి ప్రభావంబు వినఁగోరెద. నేను శ్వేతద్వీపమ్మున నే తదర్థంబు దపంబొనర్చుడు సిద్ధులగు తపస్వి గణంబులు పొడ సూపిరి గాని తద్రహస్యంబు గోచరింపదయ్యె. ౧౨౮

క. కావున నిర్గుణశక్తి ప్ర
భావము నమ్మాదిపురుషు పారమ్యంబున్
నీవ యనుగ్రహమున సం
భావించి యెఱుఁగఁ జేయవలయు మహాత్మా! ౧౨౯

వ. అను నారదునకుఁ జతురాననుం డిట్లనియె. ౧౩౦

క. నిర్గుణుఁడగు పూరుషునిన్
నిర్గుణయగు శక్తినిన్ మునివరులు చిత్సం
సర్గమునఁ గాంతు రొరులకు
దుర్గమము నిరూప మెట్లు దోఁచుం జెపుమా! ౧౩౧

గీ. జ్ఞానభావ్యులు విశ్వాసగమ్యులును న
నాదినిధనులుఁ బ్రకృతియు నాదిపురుషుఁ
డును జగద్వ్యాపకులు వీరి నెనయునట్టి
వస్తువొక్కింతయును లేదు వాస్తవముగ. ౧౩౨

సర్వభూతగతంబగు తేజంబు పరమాత్మకంబని యెఱుఁగునది. ప్రకృతిపురుషులన నెల్లప్పుడు దేహమందు మిశ్రీభూతులై యేక రూపులై యవ్యయులై నిర్గుణులై నిర్మలులై, నిర్మములై, చిదాత్మకులై యెసంగుచుందురు. ౧౩౩

క. పరమాత్ముఁడనగ శక్తియ
పరికింపఁగ శక్తియనఁగఁ బరమాత్ముఁడ యీ
యిరువురకుం జొప్పించు న
తరమెఱుఁగఁగరా దదెట్టి తత్త్వజ్ఞులకున్. ౧౩౪

క. విరతిగలుగు మహనీయుల
కరయఁగ నగు విశ్వమున నహంకారకృతం
బు రహి నదియేరికైనన్
విరతిం గలుగంగ నీదు వేజన్మములన్. ౧౩౫

గీ. సగుణుఁడగువాఁడు నిర్గుణచర్య నెఱుఁగు
వాఁడె! పైత్యాదికంబునఁ బరుసనైన
రసన కలవడునే! రసారసవిచార
మక్షి కెనయునె! పీతనీలాదికములు. ౧౩౬

క. కనుఁగొనఁగ నహంకారం
బునఁ బుట్టియు సగుణమగుచుఁ బొల్చెడి చేతం
బున కెట్లలవడు! నిర్గుణ
మన వస్తువు నెక్కు నా రహస్యము చెపుమా. ౧౩౭

గీ. అనుచు నారదుఁ డిట్లను ననఘ ! సత్త్వ
మనఁగ నెట్టిదియో ! రజంబనఁగ నెట్టి
దో ! తమోగుణ మన నెట్టిదో ! వచింపు
వేఱువేఱ నిరూపించి విస్తరముగ. ౧౩౮

వ. అని యడిగిన విరించి యిట్లను. కుమారా ! సత్త్వరజస్తమం బులకుఁ గ్రమంబుగ జ్ఞానశక్తి క్రియాశక్త్యర్థశక్తులను మూఁడు శక్తులు గలవు. అందర్థశక్తి వలన శబ్దస్పర్శ రూపరస గంధంబులను తన్మాత్రంబు లుద్భవించె. ఇందు శబ్దగుణక మాకాశంబు స్పర్శగుణకంబు వాయువు రూపగుణకం బగ్ని రసగుణకంబు జలంబు గంధగుణకంబు పృథ్వి అర్థశక్తిసమా యుక్తంబులగు నీ పదియును తమస్సర్గంబు నాఁబడు. శ్రోత్రత్వక్చక్షూరసనాఘ్రాణంబులను జ్ఞానేంద్రియపంచకం బును వాక్పాణిపాదపాయుపస్థలను కర్మేంద్రియపంచకంబును ప్రాణాపానవ్యానోదాన సమానమ్ములను వాయువు లైదుం గలసి యీ పదియేనును రజస్సర్గంబు నాఁబడు. ఇవి క్రియాశక్తిమయంబులును జినుపాదానకంబులునునగు కర ణంబులు. మఱియు జ్ఞానేంద్రియపంచకమ్మునకు దిగ్వాయు సూర్యవరుణాశ్వినేయు లేగురును నధిష్ఠానదేవతలు. వీరుజ్ఞాన శక్తియుక్తంబగు సత్త్వంబువలన జనించిరి కాన వీ*రాఱుగు రును బుద్ధ్యాదికంబగు నంతఃకరణచతుష్టయంబును తదధిష్ఠాన దేవతలగు చంద్రబ్రహ్మరుద్రక్షేత్రజ్ఞులు నలువురును మనంబును గలిసి యీపదియేనును సాత్త్వికసర్గంబునాఁబడు. మఱియుఁబర మాత్మకు స్థూలంబనియు సూక్ష్మంబనియు రెండురూపంబులు గలవు. అందు స్థూలం బుపాసకులకు ధ్యానయోగ్యంబు, నాశరీ

* ఇందశ్వినులిద్దరుగాఁ జూడఁదగు.

రంబు సూత్రంబు నాఁబడు. ఇఁకఁబరమాత్మనిస్థూలశరీరం బెట్టిదన పంచీకృతసూక్ష్మభూతంబులవలన మహాభూతోత్పత్తి యగు. అందుఁ బంచీకృతోదకంబునఁబ్రతిబింబితమధ్యమాధి కారిచైతన్యమునకు దేహమున "నహ"మనుతాదాత్మ్యం బుద యించు. అందు విశేషాభిమాని యగు చైతన్యంబ యాదినారా యణ సంజ్ఞకంబు, పంచీకరణంబుచే నాకాశాదిమహాభూతవిభా గముదృఢకృతమగు. పదఁపడి శబ్దాదిగుణంబు లేకైకవృద్ధిక్ర మంబున నిందు వఱలుచుండు నదియెట్లన్న నాకాశంబునకు శబ్దం బొక్కటియె గుణంబు. వాయువునకు శబ్దస్పర్శమ్ములును నగ్నికి శబ్దస్పర్శరూపమ్ములును జలమ్మునకు శబ్దస్పర్శరూపరసమ్ములును బృథివికి శబ్దస్పర్శరూపరసగంధమ్ములైదును గుణమ్ములై చెల్లు; నిట్టిగుణమేళనంబున బ్రహ్మాణ్డముద్భవించె, సమస్తజీవమ్ములును బ్రహ్మాండాంశసముద్భవమ్ములుగా నెఱుంగునది; జీవరాసుల సంఖ్య యెనుబదినాల్గు లక్షలు. ఇంకసత్త్వాదిగుణంబుల స్వరూ పం బెఱింగించెద నని యిట్లనియె. ౧౩౯

—* సత్త్వాది గుణస్వరూపము *—

పీ॥ ప్రీత్యాత్మకంబుగా వెలయు సత్త్వము సుఖ
 మువలనఁ బ్రీతి సంభూతమగును
నార్జవం బొకటి సత్యంబు శౌచంబు శ్ర
 ద్ధాక్షమా సంతోష ధైర్యములును
శాంతియు దయయు లజ్జయునను వీనిచే
 సత్త్వప్రతీతి నిశ్చయము సుమ్ము
మఱియు సత్త్వమ్ము ధర్మ ప్రీతికరమును
 శ్వేతవర్ణమ్మునై చెలఁగుచుండుఁ

గీ. దనరు సాత్త్వికరాజసతామసమ్ము
లనఁగ శ్రద్ధలు ; మూఁటిలో నాద్యమైన
దాని వృద్ధి యొనర్పు సత్త్వమ్ము ; తక్కుఁ
గల యసచ్ఛ్రద్ధల నడంచి కలఁచుఁ బుత్ర. ౧౮౦

వ. రజోగుణంబు రక్తవర్ణంబును దుఃఖజంబగు ప్రీతిం గలుగఁ జేయు నదియు నని యెఱుఁగునది. ద్వేషంబును మాత్సర్యంబును ద్రోహంబును నుత్కంఠయు నిద్రయు రజశ్శ్రద్ధయు మానంబును దమమ్మును గర్వమ్మును రజోగుణ జన్యంబులు విచక్షణులగువారు వీనింబట్టి రజోగుణంబు నిశ్చయింతురు.

సీ. మఱియుఁ దమోగుణం బెఱుఁగుము కృష్ణ వ
ర్ణముగ ; మోహము విషాదము నొసంగఁ
జేయు నియ్యది దీనిచేష్ట లాలస్య మ
జ్ఞానమ్ము నిద్రయు దీనతయును
గార్పణ్యము భయమ్ముఁ గౌటిల్యము వివాద
రోష వైషమ్యముల్ దోషదర్శ
నంబును నాస్తికత్వంబును తామస
శ్రద్ధయు, వీనిచే సత్పురుషులు

ఆ. వె. తమము నిర్ణయింతు రెద్దయు శుభముల
నిచ్చగించువార లిందు సత్త్వ
మెసఁగఁ జేసి రజముపసఁ గసిమసఁగుచుఁ
దమము సంహరింపఁ దలఁపవలయు. ౧౨౮

చ. అరయఁగ నొక్కటొక్కటికి నాశ్రయమై కనుపట్టుటన్ బర
స్పరము విరోధభావమును బాల్పడనీయక వీని మూఁటినిన్

గర మనుకూలరీతిఁ గనఁగాఁదగు నియ్యావి మాటికిన్ బర
స్పరము విరోధముల్ సలుపుఁ బట్టకయుండిన ముప్పమూఁడెడిన్.

వ. మఱియు నింక నిద్దాని విస్తరించెద నాకర్ణింపు మెయ్యది యైన విని నంత మాత్రన ఫలంబు చేకూర దెట్లంటేని కామ క్రోధాదివర్జితుఁడు గానివాని తీర్థయాత్రాదికంబును బోలె ననుభవరహితంబగు శ్రవణంబు వ్యర్థంబు. కామక్రోధలోభ మోహమదమాత్సర్యతృష్ణాద్వేషాసూయేర్ష్యాఽక్షమాఽశాంతు లను నియ్యావి యొందాఁక నాశ్రయించి యుండు నంత దనుకఁ బురుషుండు పాపాత్ముండు; వాఁ డెయ్యది యొనర్చిన నిష్ఫలంబు. కర్షకుఁడు శ్రమంపడి తగుకాలమ్మున బీజావా పంబొనర్చి యహోరాత్రమ్ములుగాచి తుదకు ఫలకాలమ్మున నిద్రవోయిన ఫలంబు మృగాధీనంబగుభంగి నెంత శ్రమమ్మున దీర్థయాత్రాదికం బొనర్చినను గామాదుల జయింపఁడేని ఫలమ్ముఁ జెంద నేరఁడని చెప్పి మఱియును, ౧౮౮

మ. సరవిన్ శాస్త్రవిచారణంబు కతనన్ సత్త్వంబు వర్ధిల్లుఁ ద
త్పరతం జేసి క్రమక్రమమ్మునఁ దగున్ వైరాగ్య; మద్దానిచే
త రజంబున్ దమముం ద్యజించి కడు విద్యాసంతుఁడై బ్రహ్మవి
ద్వరుఁడై ముక్తి నిఁగాంచు మానవుఁడుతథ్యంబింతయున్ నారదా!

వ. లోభయోగంబున రజం బుత్కటం బయ్యేనేని సత్త్వతమంబుల నణంచు; నట్ల తమంబును మోహయోగమ్మునం జేసి ప్రవృద్ధంబై సత్త్వరజంబుల నణంచుఁ; దత్ప్రకారంబు వేఱ్వేఱ విస్తరించెద.

సీ. సత్త్వ ముత్కటమైన రజస్తమోభవములో
బాహ్యార్థముల డించుపఱచి పేర్మి

యజ్ఞాదికర్మముల నాసక్తిఁ గొల్పి సా
త్త్వికభోగములయందుఁ బ్రీతిఁ జొనిపి
మోక్షమ్మున మనమ్ము దీక్ష వహించు; న
ట్లు రజోగుణము వృద్ధినందె నేనిఁ
దగుసనాతనము లౌ ధర్మంబు లడఁగు ర
జశ్శ్రద్ధ పొసఁగు నెసంగు సర్ధ

గీ. మనుసరించును భోగంబు లఖిలములును
సత్త్వతమములు మొదటికి సమసిపోవు;
నట్లు తమమును నుత్కటం బయ్యె నేనిఁ
బ్రథమమున వేదశాస్త్రవిశ్వాస మడఁగు. ౧౮౭

గీ. మఱియుఁ దామస మగుశ్రద్ధ మదిని దవిలి
వ్యయ మొనర్చు ధనంబు ద్రోహములు సేయు
శాంతిఁ గనఁ డెన్నటికినైన సత్త్వరజము
లడఁగు మొదటికి స్వేచ్ఛావిహార మమరు. ౧౮౮

క. క్రమమున సత్త్వముఁ రజమును
దమముఁను నన్యోన్యమిథునధర్మంబున క్షీ
రమునీరముఁ బలె నన్యో
న్యము కలసియ యుండు విడిచి యలవడ కుండన్

గీ. రజము సత్త్వంబు, సత్త్వమ్ము రజము, తమము
సత్త్వరజముల విడిచి యెచ్చటను నొక్క
టొక్కటిగఁ గానరావు సంయుక్తధర్మ
కలితములు జన్యజనకతాకలితములును. ౧౯౦

క. సత్త్వము రజస్తమములకు
సత్త్వరజంబులకుఁ దమము జనకంబగు నా

సత్త్వతమములకు రజమును
దత్త్వముగ జనకమగు విను తత్త్వజ్ఞనిధీ. ౧౫౧

చ. జనకత మృష్టకటక్రియ నెసంగు గుణంబులు మూఁడు బుద్ధి నె
క్కొని సతతంబుఁ గామములకుం బురికొల్పుచు నుండు నాదికిం
గనఁగ రజంబు జాయ, యెసకంబున నిద్దియు దానిజాయ యై
చను నివిరెండునుందమము జాయలిటుల్ దగు యుగ్మభావముల్.

వ. అనుడు నారదుం డిట్లను మహాత్మా! నీచెప్పిన గుణలక్షణంబు
కతన నాకుఁ దృప్తిచొప్పడదు. నన్ననుగ్రహించి యీగుణ
పరిజ్ఞానంబు తెల్లమగునట్లు బోధింపు మన నతం డిట్లనియె.

క. ఏనెఱిఁగి నంతవట్టును
బూని యెఱింగింతు వినుము పుత్త్రా! సమ్య
గ్జ్ఞానము నాకును నలవడ
దైనను వచియించువాఁడ నాలింపుమొగిన్. ౧౫౪

చ. పతికిని బంధుసంతతి కపారముదం బొడఁగూర్చునట్టి య
య్యతివయ యెల్లవేళ సవతాలికి నప్రియయౌఁ గదా! యటుల్
మతిఁబరికింప సత్త్వముఁ దమంబు రజంబును బీడఁబెట్టు నీ
గతియ రజస్తమంబులకుఁ గన్పడు స్వేతరమందు నారదా!

వ. సత్త్వంబు స్వభావసుభగంబయ్యు స్వేతరసంపర్కమ్మునం జేసి
వికృతిం గొలుపు నది యెట్లంటేని, ౧౫౬

ఉ. జానగు జవ్వనంబుఁ గడుఁ జక్కదనంబు నయంబుఁ గామశా
స్త్రానుగతప్రచార మొలయం దగు జవ్వని సత్త్వరీతులం
బూని చెలంగుచున్ సవతిపోరునఁ దానును దుఃఖమొందు చం
దానఁ దదన్యభావమును దాలుచు సత్త్వము వైకృతస్థితిన్.

క. కనుఁగొనుము చోరులకు భీ
తిని గొల్పెడిసేన చోరధికకృతులగు స
జ్జనులకు సుఖదం బగున
య్యనువునన గుణమ్ములకును సగుభిన్నగతుల్. ౧౫౮

మ. ఘననిర్ఘోషవిశేషమై తిమిరయుక్తంబై కనచ్చంచలా
జనితత్విడ్ద్యుతమైన దుర్దినము బీజం బూడ్చి నిశ్చింతఁ గై
కొని కూర్చుండిన కర్షకావళికిఁ గులుకన్ గూర్చియున్ దున్నఁజొ
చ్చిన తక్కుంగల వారికిన్ శ్రీమదమై చెన్నారదా నారదా.

చ. అదియునుఁగాక వర్షబుతు వన్నిసుఖమ్ములుగల్గువారి నె
మ్మదికి ముదం బొసంగియును మన్నసఁజేయు ప్రియుండు దూరమై
కదలినవారికిన్, నిలువఁగాఁదగు గేహము కాష్ఠజాతమున్
మొదలుగ లేని గేస్తులకు మోదమిడందగునే! గ్రహింపుమా.

చ. మనము వినిర్మలంబయి సమంబుగ నింద్రియముల్ పదార్థముల్
గొనఁగ సమర్థతం బొరసికోలు ఘటించి శరీరమందుఁ జు
ల్కన గనుపట్టి శాంతి పొడకట్టుతఱిన్ జనుఁడెన్నఁగాఁ దగున్
దనయెడ సాత్త్వికంబగు విధం బధికం బయి చెన్నుమీఱుటల్.

గీ. రజమునకు లక్షణములు నిద్రావిజృంభ
ణంబు జృంభాతిరేకతంద్రావిశేష
చిత్తచాంచల్యపరదేశజిగమిషలును
బాపబుద్ధివివాదతాత్పర్యములును. ౧౬౨

క. కాయము బరువగు నక్షిని
కాయమును మనంబు శూన్యగతిఁగను నిద్రా
పాయ మ్మొనయుఁ దమం బ
త్యాయతమై యేదికేనిఁ దల కెక్కుతఱిన్. ౧౬౩

చ. అనవిని నారదుఁ డను మహాత్మ ! గుణంబులు భిన్నభిన్న వ
ర్తనములు గా వచించి తొలఁక తాఁపునకుఁ సమకూడెనేనిఁ గ
ల్గునె మఱికార్యసిద్ధి ? రిపుకూట మదొక్కెడఁ గూడుకొన్నఁ జే
టెనయున కాని కార్యగతి యెచ్చటనేని ఫలింపనేర్చునే ? ౧౬౪

వ. అనవుడు విరించి యిట్లను, ౧౬౫

క. తైలము వర్తియు నగ్నియు
లోలోన విరుద్ధరీతులుగ నుండియుఁ దా
మేలీలఁ గార్యమొనరుపఁ
జాలునో గుణములును నట్లచాలెడిఁ బుత్రీ. ౧౬౬

వ. అని పితామహుండు తనకుం జెప్పిన చొప్పున నారదుండు నా
కెఱిగించె నయ్యది నీకెఱింగించితి. గుణంబులన విశ్వకారణంబులు
శక్తియన జగద్వ్యాపినియై సగుణయనియు నగుణయనియు రెండు
తెఱంగులనొప్పు. పురుషుండనఁగ నిరీహుండును నవ్యయుండును
బూర్ణుండునై కార్యకారణభావమ్ములు లేక చెన్నారు. సద
సదాత్మకంబగు నీప్రపంచం బంతయు మహామాయయగు శక్తియ
నిర్వహించు. బ్రహ్మ విష్ణుమహేశ్వరులును సూర్యచంద్రు
లును అష్టవసువులును అష్టదిక్పాలకులును గుమార వినాయకులు
మొదలగు దేవతలును శక్తి సంయుక్తులగుటం జేసియ తత్తత్కార్య
నిర్వాహకు లగుచుందురు. కాన నమ్మహాశక్తి నారాధింపుమని
చెప్పి వ్యాసుండు మరల జనమేజయున కిట్లనియె. ౧౬౭

ఉ. ఆ జగదంబ నా కలుషహారిణి నాజగదంతరాత్మ నెం
తే జపియించి సద్గతుల నెందఱు వొందరు నీవుఁ గూడ నా
యోజ నఖండభక్తి చెలువొందఁగ నా పరదేవతాంఘ్రులన్
బూజ లొనర్చి యేరికిని బొందఁగరానిఫలంబు నొందుమా. ౧౬౮

వ. మఱియు నద్దేవి మహత్త్వంబింతింతయే! వ్యాఘ్రాది సందర్శన భయంబునఁ దదీయబీజాక్షరంబగు నైకారంబు బిందురహితంబుగ నేని యెవ్వం డొక్కపరి యాదృచ్ఛికంబుగ నుచ్చరించు నవ్వాఁడు పూర్ణకాముండగు నిందులకు దృష్టాంతంబుగ నిరక్షరకుక్షియగు సత్యవ్రతుండను ద్విజకుమారుఁడు కిటిముఖోద్గతంబగు నైకారంబు బిందురహితంబుగ ననుకరించినంత దయార్ద్రహృదయయగు పరమేశ్వరి యతనిం గవిరాజుగ నొనర్చెననుడు, జనమేజయుం డతని కిట్లనియె. ౧౮౯

క. సత్యవ్రతుఁ డన నెవని య
పత్యంబవ్వాని కెట్లు పరమేశ్వరి సం
ప్రీత్యనుగతయై వరమిడె
సత్యవతీతనయ! నాకు సత్యము చెపుమా. ౧౭౦

గీ. కిటిముఖంబున బీజంబు గెరలుటేమి
దాని సత్యవ్రతుఁడు మది నూనుటేమి
జగదధీశ్వరి కానంద మగుటయేమి
చిత్రమియ్యది వివరించి చెప్పు మనఘ. ౧౭౧

వ. అవ్వుడు వ్యాసుం డిట్లనియె. నే నొక్కనాఁడు తీర్థయాత్రకై వెడలి సకలమునిశరణ్యంబగు నైమిశారణ్యంబునకుంజని యట లోమశాది మునీంద్రులకుం బ్రణమిల్లి కథాప్రసంగంబులఁ గాలక్షేపం బొనర్చుచున్నంత జమదగ్ని మహాముని యొక ప్రసంగంబున నమ్మునులం గాంచి యిట్లనియె. ౧౭౨

చ. మునివరులార! రుద్రహరిముఖ్యులు దేవతలో! దిగీశులో!
యినుఁడో! నిశాధినాయకుఁడో! యింకమతెవ్వరు సేవ్యులో మనం

బునఁ దగఁ జర్చ చేసి యనుభూతగతిఁ వచియింపుఁ డంచుఁ బ
ల్కిన విని లోమశుండు వలికెఁ జమదగ్ని మహామునీంద్రుతోన్.

క. శుభ మిచ్చగించు వారల
కభయ విధాయినియుఁ బాపహారిణియు మహా
విభవయు నభవయునగు నల
యిభరిపువాహాయగు జననియే సేవ్యసుమీ. ౧౭౪

వ. స్మరణమాత్రమ్మున సర్వసౌఖ్యములిచ్చునది యాపె కాని
తక్కొరులుగా రిందుల కితిహాసం బొక్కండుకల దాకర్ణింపుము.

క. కోసలదేశంబున నొక
భూసురుఁ డనపత్యుఁ డగుచుఁ బుత్రునికొఱకై
చేసెను దమసాతటమునఁ
దా నవ మొక్కయెడ దేవదత్తుఁడు పేర్మిన్. ౧౭౬

—* సత్యవ్రతోపాఖ్యానము *—

సీ. వేదవేదాంగవిద్యాదర్శనాపర
బ్రహ్మ సుహోతృండు బ్రహ్మయయ్యె,
వేదంబునకు మాఱువిధి యొనర్చిన యాజ్ఞ
వల్క్యమహాసీంద్రుఁ డధ్వర్యుఁడయ్యె
నమరేంద్రునకు గురుత్వ మొనర్చెడి కళాధి
నేత బృహస్పతి హోతయయ్యె,
నాగమతంత్రవిఖ్యాతుండు పైలుఁ డ
త్యూర్జితాత్ముండు ప్రస్తోత యయ్యె

గీ. ఘనుఁడు గోబిలమౌని యుద్గాతయయ్యెఁ
దక్కఁగలవారు దక్కుబుత్విక్కు లైరి

సుతునిఁ బడయఁగఁ గోరి భూసురుఁడు దేవ,
దత్తుఁ డొనరించునట్టి సత్రంబునందు. ౧౭౭

క. ఆతఁడె సామాగమ వి
ఖ్యాతంబు రథంతరంబు నల గోబిలుఁ డు
ద్గాత సుసప్తస్వరసము
పేతముగా నుచ్చరించె వేల్పులు మెచ్చన్. ౧౭౮

వ. తత్సమయంబున నాతనికి దైవికంబుగ నిశ్శ్వాసంబు వొడమి స్వరభంగం బగుడు యజమానుం డతని కిట్లనియె. ౧౭౯

ఆ. వె. సుతునికొఱకుఁ జేయుక్రతు విధి మత్కామ్య
కర్మమునకు విఘ్నకర్త వగుచు
శ్వాసమెడలఁ జేసి స్వరభంగ మొనరించి
తేమనం గలాఁడ నింకమూర్ఖ ! ౧౮౦

క. అని యజమానుఁడు తనుఁ ది
ట్టిన గోబిలమౌనియుఁ గడిందియలుక నె
క్కొన దేవదత్తు నేడ్తెఱఁ
గనుఁగొని యనెఁ గనుల నగ్నికణములు రాలన్. ౧౮౧

వ. సర్వప్రాణిసాధారణంబగు నిశ్శ్వాసం బరికట్ట నొకరి తరంబె ? యనపరాధినగు నన్ను మూర్ఖ యని తిట్టితివి గాన నీకుం బొడము తనయుండు నిరక్షరకుక్షియు మూర్ఖుండును గాఁగలఁ డని శపియించె; నంత దేవదత్తుండు పశ్చాత్తప్తుండై గోబిలుం గాంచి

క. అపరాధ మేమి ? యింతనె
శపియింతురె ! మూర్ఖ సుతుఁడు జనియించిన నా

కుపకార మేమి కననగ న
నపత్యతయ దానికన్న నధికముగాదే ? ౧౮౩

ఆ. వె. ఎవఁడు గాని మూర్ఖుఁడేని బూజ్యత లేదు
విప్రుఁడైన వేఱ వెదక వలెనె ?
పశువురీతి శూద్రుభాతి మూర్ఖుండైన
బ్రాహ్మణుండు కర్మబాహ్యుఁడరయ. ౧౮౪

క. ఏరా జేలెడి భువిఁ బెం
పారుఁ మూర్ఖుండు పూజ్యుఁడై విప్రుఁడు ; భూ
దారుం డాతఁడు నింద్యుం
డా రాజ్యము విడుచు టొప్పు ననఘులు విబుధుల్.

క. తన దేశమ్మునఁ గలమూ
ర్ఖుని విప్రుని రాజు దున్నుకొనువానిఁగఁ జే
యునగుఁ బన్నిదుశూద్రుని
గనుగతి నవ్వాని: జూడఁగాఁ దగునెందుఁ. ౧౮౬

క. భూసుర శూన్యంబుగఁ దా
జేసినను శ్రాద్ధమొకటఁ జేయఁగనచ్చుఁ
బో ! సేయరాదు మూర్ఖుని
బోసేయఁగఁబెట్టి మెట్టి ముప్పుననేనిఁ. ౧౮౭

క. జడుఁడైన విప్రునకు నె
వ్వఁడు నేమియు నీయరా దవశ్యమయే నె
క్కుడుగ నిడక పొట్టకు సరి
పడునన్నము పెట్టి పంపవలయుఁ బ్రాజ్ఞుల్. ౧౮౮

క. తానును మూర్ఖుండగువాఁ
డేనియు నవ్వానిధనము నెవ్వండు దినం
గానేమి కొఱంత! నింబఫ
లానీకము కాకభోగ్యమగుటయుఁ దగదే? ౧౮౯

ఉ. భూపతిచేత మన్ననలు పొందఁగ నర్హుఁడుకాఁడు దేవతా
శాపరిపూర్తికిం దగిన సత్కృతికిం గొఱగాఁడు పైతృకో
ద్యాపన మాచరించుటకుఁ దజ్జులు పిల్వఁగ సంశయింతు రిం
కేపని సేయఁగా వలయు! నిట్టిసుతుం గని మానిసత్తమా. ౧౯౦

తే. గీ. అయ్యొ! గోబిల! సంసారమందు మూర్ఖ
పుత్త్రతకు మించు కష్టమ్ము పుడమిఁ గలదె?
అంతకన్నను జావు మే లన్యమేది
యేనియు భరింపనగుఁ గృపఁ బూను మనఘ! ౧౯౧

క. అని చరణంబులఁ బడు న
య్యనఘాత్ముని దేవదత్తు ననుకంపాదృ
ష్టిని గనె గోబిలుఁ డెందున్
ఘనులకుఁ గోపంబు క్షణముకన్న నిలుచునే? ౧౯౨

ఆ. వె. సహజశీతలంబు జల మది యగ్నిచే
గాని యాతపమునఁగాని కాఁగు
దానిపొత్తు విడిచి తనగుణంబును గాంచు
నట్లె శాంతులకును నబ్బు శాంతి. ౧౯౩

క. శాంతుఁడయి గోబిలుఁడు ధీ
మంతుం "డో దేవదత్త! మఱి నీపుత్త్రుం
డెంతయు మూర్ఖుండయ్యు న
నంతరమున బుద్ధిమంతుఁడగుఁ గవియు నగున్. ౧౯౪

ఆ. వె. అనుడు దేవదత్తుఁ డతిమోదమంది యి
ష్టిని సమాప్తి చేసి యనఘులైన
ఋత్విజులను సత్కరించె నంతకుఁ గొంత
కాలమునకు నతనికాంత యెలమి. ౧౯౫

క. రోహిణి యను పేరి వరా
రోహ కలితగర్భ యగుచు రోహిణిగల పు
ణ్యాహమ్మున సుతుఁ గనెఁ గడు
మోహమ్మున జాతకర్మము నతఁడొనర్చెన్. ౧౯౬

వ. పిదప నక్కుమారునకు శుభ దినమ్మున నుతథ్యుండను పేరు పెట్టి విధిచోదితంబగు కాలమ్మున నుపనయనం బాచరించి వేదంబుఁ జెప్ప నారంభించుటయు, ౧౯౭

ఉ. 'ఓ' మని తండ్రి చెప్ప నతఁడూరక చూచు, "నిదేమి పాపమో
రీ! మఱుమాట లే" దనిన నేడువ సాఁగు మతేమియందు నా
సోమరిపోతు నా వెడఁగు శుంఠఁ, జనెన్ బదిరెండు నేడు లి
ట్లామెయి సంధ్యవార్చువిధమైన నెఱుంగఁడిఁ కేటి వేదముల్ ?

క. ఇటు మూర్ఖైన కుమారున్
గటకటపడి జననియున్ జనకుఁడున్ లోలో
మటమట లాడెదరఁట ! య
క్కట ! యితరుల కెన్న నతఁడు గర్హ్యుఁడ కాఁడే ?

క. జననీజనకులయాదర
మెనయనిజన్మంబు జన్మమే ? యని వైరా
గ్యనియతుఁ డగుచు నుతథ్యుడు
వనమున కేతెంచె లోన వగ గడలుకొనన్. ౨౦౦

ఆ. వె. మూర్ఖుఁ డైనకొడుకు పుట్టుటకన్నను
గ్రుడ్డియైన మఱియుఁ గుంటియైన
మే లటంచు నతనిమేలు గణింపక
తల్లిదండ్రులు మదిఁ దలఁప రైరి. ౨౦౧

వ. అతండును గంగాతీరమ్మున నొకపర్ణశాల నేర్పఱచుకొని వసించుచుఁ బ్రతిదినంబును శూద్రునింబలె నమంత్రకంబుగ స్నానంబాచరించుచు ఫలమూలాదులఁ గాలక్షేపం బొనర్చుచు సత్యంబు దక్క వేఱొండు పల్క నని వ్రతం బూని యట నున్నంత జనులందఱు నాతని సత్యతపుండని పల్కిరి. ౨౦౨

క. అపకారంబొనరుపఁడఁట !
యుపకారం బంతకన్న నొనరుపఁడఁట ! యా
తపమునకన్న మఱింకొక
తప ముండునె యెంచిచూడఁ దత్త్వజ్ఞులకున్ ? ౨౦౩

సీ. తగురూప మలవడి సుగుణంబుల నెసంగి
వంధ్యయై యొప్పుజవ్వని విధమునఁ
గొమ్మలనొప్పి పూగుత్తులఁ జెలువారి
సఫలముగానివృక్షమువడువున
బలుపెక్కి మిగులఁ జూపుల గుబ్బమై కొంచె
మైనను పాలీని యావు పగిది
ధనధాన్యములు గల్గి తగు రాజ్యముండి దా
తృత్వము లేని పార్థివుని మాడ్కి

గీ. నుత్తమ ద్విజకులమున నుద్భవించి
చదువు సంధ్యయు లేక నిష్ఫలుఁడనైన

నాకు మరణంబుకన్న నన్యంబు శరణ
మున్నదె? యటంచు నతఁ డిట్టు లూహ సేయు. ౨౦౪

చ. వెనుకటి జన్మమందు నొక వేదపుఁ బుస్తకమైన విప్రునం
దనునకు దాన మిచ్చు సుకృతమ్మునఁ బోవనినాకు విద్య ర
మ్మనిన నదేలవచ్చు నకటా! విరిబోఁడియు విద్యయున్ ధనం
బును దొలిజన్మమం దిడని మూర్ఖులకున్ లభియింప నేర్చునే?

క. నా తోడివా రఖిల వి
ద్యా తంత్రమ్ముల సమర్థులై యుండఁగ నా
కీతీరు గలుగు టెన్నఁగ
నా తొలిజన్మంపు ఫల మనంగాఁ దగదే? ౨౦౬

క. ఏవారి దూఱ నేమగు
దైవాధీనములు సకలతంత్రమ్ములు నా
దైవగతి దాటఁ దరమే?
యా వారిజభవునికైన నభవునికైనన్. ౨౦౭

వ. అనివిచారించుచుఁ బావనోదకంబగు నవ్వనమ్మున జపతపము
లెఱుంగక కాలయాపనం బొనర్చుచున్నంత నతని మునులెల్లరు
సత్యవ్రతుం డనిరి. ఇల్లు పసునాలుగేండ్లు గతించు పిమ్మట
నొక్కనాఁడు, ౨౦౮

చ. యమసమ దేహుఁడున్ వనవిహారియు బాణధనుర్ధరుండు దు
ర్గమభుజశాలి యొక్కఁడు కిరాతుఁడు వేఁటకు వచ్చి యొక్కకో
లముఁ బడనేయ నయ్యది తలంకుచు భూసురపుత్రునగ్రభా
గమునఁ బలాయితంబగు చొకానొకరావ మొనర్చె నార్తిమై.

వ. దైవవశంబున నయ్యది సారస్వతబీజం బయ్యెఁ దత్ప్రభావం
బెఱుంగనివాఁడయ్యు నతండు, ౨౧౦

క. కోలము కిరాతబాణ
వ్యాలోలం బగుచు నిట్లు పలికె నటంచుం
జాలిమెయిం దదనుకరణము
వాలాయము సలిపెం దపమువడువున నంతన్. ౨౧౧

వ. అయ్యడవిపందియుం దత్సమీపస్థంబగు నొక్క పొదరింటం డాఁగుడుం దదన్వేషణంబునకుం గిరాతుం డేతెంచి సత్యవ్రతు నకు మ్రొక్కి యిట్లనియె. ౨౧౨

ఉ. తీవ్రశరంబు దాఁకి చనుదెంచెను గోల మ దేడ కేగె నో సువ్రత! చెప్పి యాఁకటను జొక్కుకుటుంబము నుద్ధరించి స త్యవ్రతనామధేయము యథార్థము సేయఁగదయ్య! మా కిరా తవ్రజ మిట్లుగా బ్రతుక ధాత విధించిన ధర్మమేకదా. ౨౧౩

క. తనకులవృత్తి విడువం దగ
దని మీవిప్రులె వచింతు రది గాకేవృ
త్తినినైనం దనకుటుంబం
బును బోషించు టది తగదె? భూసురవర్యా! ౨౧౪

ఆ. వె. అనుకిరాతుపల్కు లాలించి సత్యవ్ర
తుండు చెప్ప కూరకుండెం జెప్ప
కున్నం దనవ్రతంబు బన్నంబు జెందుం జె
ప్పిన నఘంబు జంతుపీడవలన. ౨౧౫

వ. అని ప్రాణిసంరక్షణార్థంబగు ననృతంబున వ్రతభంగంబు గామి నిశ్చయించి నిరుత్తరుండై తత్కటిముఖోద్గంబగు సారస్వతబీజం బుచ్చరించుచున్నంత, ౨౧౬

క. అంబ కృపగలిగి ప్రత్య
క్షంబై యవ్విప్రసుతునిఁ గవితావాల్మీ
కిం బొనరించె నఁట! తద్బీ
జంబు పఠించిన నరులకుఁ జదువులు కొదవే. ౨౧౮

వ. ఇట్లు పరదేవతా నిర్హేతుక కటాక్షమ్మునం జేసి నిరంకుశకవితాప్రభావమ్ముఁ జెంది యాసత్యవ్రతుం డక్కిరాతుంజూచి యీశ్లోకంబు నుడివె.

*శ్లో. యా పశ్యతి న సా బ్రూతే, యా బ్రూతే సా న పశ్యతి
అహో వ్యాధ స్వకార్యార్థిన్, కింపృచ్ఛసి పునఃపునః,

వ. అనుడు వ్యాధుండు నిరాశుండై యరిగె సత్యవ్రతుండును మహాకవియై తద్బీజమ్ము జపియించుచు విఖ్యాతింబడసె. ౨౨౦

చ. అతని కవిత్వమున్ విని యహా! యని మెచ్చెడివారుఁ బండితుం
డితఁడొకఁడే యటంచు నుతియించెడివారు నమస్కరించువా
రతులవిభూతిఁ గానుకల నంపెడివారు సరస్వతీదయా
గతకవితానుభావులకు గౌరవసంపద లబ్బు టబ్రమే. ౨౨౧

ఆ. వె. అట్టితనయుఁగాంచి యానందమందిరి
తల్లిదండ్రులెంత ధన్యతములొ
ముందు మూర్ఖుఁడైన పుత్రుండు తుదకు జ
గత్ప్రసిద్ధమైన కవితఁగాంచె. ౨౨౨

ఉ. కావున నంబికాకరుణ గాంచినవారికి నెందు విద్య గా
నీ, విభవమ్ముగాని, మఱి యెద్దియుఁ గాని, యసాధ్యమే? మునీం

---

* క. ఎదిచూచునో యది చెప్పదు, విదితముగాఁబల్కునేది వీక్షింపని ద
య్యది సారెసారె నేఘడి, గెద? యెవ్వరు చెప్పువా? రోగిరా జనుమృగయా!

దా్రి! వినుమంచుఁ జెప్పె జమదగ్నికి లోమశవహాని, నీవునుఁ
భూవర! యంబికాకరుణఁ బొందుము చెందుము సర్వసంపదల్.

క. ఆ యంబ ప్రీతిఁ జెందుట
కై యజ్ఞ మొనర్ప మఖిలమగు కామంబుల్
శ్రీయును సంపదయును విపు
లాయుర్ధాయాదికంబు నలవడు నీకున్. ౨౨౮

ఉ. దీనులు రోగపీడితులు దృగ్వికలుల్ క్షుధితుల్ శఠుల్ పరా
ధీనులు మూర్ఖులుఁ విగతతేజులు రిక్తులు నాదిగాఁగ నీ
మానవులఁ గ్రహింపు మనుమానముఁ దొలిజన్మమందుఁ ద
ద్ధ్యాన మొనర్పకున్కిఁ బరమాతురులై రిపుడంచు భూవరా.

సీ. తులలేని యైశ్వర్యముల నెసంగెడివారు
పుత్రపౌత్రులకల్మిఁ బొల్చువారు
వేదవేదాంగాది విద్యలుకలవారు
భోగమ్ములను దులఁ దూఁగువారు
పుష్టికల్గినగాత్రి యష్టిఁబొల్చెడివారు
సామ్రాజ్య విభవమెసంగువారు
పదిమంది బందుగుల్ బలిసి కొల్చెడివారు
సర్వథాసౌఖ్యముల్ జరుగువారు

గీ. నెల్లకాలము శుభముల నెనయువారు
మొదలుగాగలవారలు మున్ను జగద
ధీశ్వరిని దేవ దేవిని దెలివికలిమి
నెఱిఁగి కొల్చినవారని యెఱుఁగు మధిప! ౨౨౯

## —* దేవీయజ్ఞ విధానము *—

క. కావున దేవీమఖమును
గావింపుమటన్న వ్యాసుఁగాంచి పరీక్షి
ద్భావరతనయుఁడు జననుత
భావుఁడు జనమేజయుండు వలికెం బేర్మిన్ ౨౨౮

క. దేవీయజ్ఞ విధానం
బేవిధముననుండు దాని కేయేవస్తుల్
గావలయు నాకు నానతి
యీవే ! కృప ననుచు వ్యాసుఁ డిట్లని తెలిపెన్ ౨౨౯

వ. రాజేంద్రా ! సాత్త్వికంబును రాజసంబును దామసంబును నిర్గుణంబును జ్ఞానమయంబును నన దేవీయజ్ఞం బైదువిధమ్ములు గలయది ; యందు మునులకు సాత్త్వికంబును, రాజులకు రాజసంబును రాక్షసులకు దామసంబును, జ్ఞానులకు నిర్గుణంబును, ముక్తులకు జ్ఞానమయమ్మును, గర్తవ్యంబులు ; సమీచీన దేశకాలమంత్ర బ్రాహ్మణ ద్రవ్యంబులు గలుగునది సాత్త్వికంబు నాఁబడు. ఏ యజ్ఞంబు కాని ద్రవ్యశుద్ధి క్రియాశుద్ధి మంత్రశుద్ధులు లేనిచో సంపూర్ణ ఫలం బీనేరదు. అన్యాయార్జితంబగు విత్తమ్ముచేఁ జేసిన జన్నంబు పరలోకమ్మునకు వెలియగు, నిద్దానికిఁ బ్రత్యక్ష దృష్టాంతంబు మన పాండవుల రాజసూయం బది యెట్లంటేని,

మ. రమణీయుండగు శౌరి తోడుపడ భారద్వాజముఖ్యుల్ మహో
త్తము లార్త్విజ్య మొనర్పఁ బూర్వమున మీతాతల్ తగన్ రాజసూ
యము గావించి ప్రసిద్ధిఁ గాంచి నెలలో నాత్మీయమా సర్వరా
జ్యముఁ గోల్పోవుటకున్ గతంబు ధన మన్యాయార్జితం బౌటయే.

గీ. ద్యూతమాడి పరాజయోపేతులైరి
నాతి పాంచాలి సభకు నానీతయయ్యె
సిరి సమస్తము శత్రులచేతఁ జిక్కె-
దమ కరణ్యంబు రాజ్యమై తారసించె. ౨౩౨

క. అటఁ బండ్రెండేఁడులు మి
క్కుటమగుకష్టములఁ జెంది కోమలితోఁ బి
మ్మట విరటుఁ గొల్వ నేగిరి
కటకట ! మఱి యింతకన్నఁ గష్టముకలదే. ౨౩౩

ఉ. పాతకుఁడైన కీచకుఁ డపాత్రుఁడు ద్రౌవదిఁ బట్టి యెంతయున్
యాతనపా లొనర్పనపు డాసతికష్టము మాన్పుపుణ్యుపున్
జేఁతకు నొక్కరైన దయ సేయ రిసీ ! యదురాట్కటాక్షసం
పాతము లేడఁ జొచ్చెనొకొ ? పాఱులదీవన లేడఁ బోయెనో.

ఉ. గణ్యుఁడు కర్త ధర్మజుఁడు, కంజదళాక్షుఁడు తోడునీడ, బ్ర
హ్మణ్యులు బుత్విజుల్, గడు శుభావహమా క్రతు వందు ధర్మవై
గుణ్యము లేక యున్న సమకూడెనె యిట్టిదొసంగు ; లెందునన్
బుణ్యపుసేఁతయైనఁ జెడిపోయిన ముప్పులు మూఁడకుండునే.

గీ. ధర్మవికృతియు లేక సత్రంబొనర్చు
వారలకు భంగపాటు చేకూరెనేని
మంత్రములు వ్యర్థములు వేదమతము తప్పు
మును లసత్యులు తపములు ముప్పు లధిప. ౨౩౬

క. కావున నేకర్మంబేఁ
గావించినపిదప దొసఁగు గలిగిన దానన్
సేవల లోపము కల దని
కోవిదు లూహింప వలయుఁ గురుకులతిలకా. ౨౩౭

వ. కర్తృభేద ద్రవ్యభేద మంత్రభేదమ్ములఁ గర్మవైపరీత్యంబు గల్గుచుండు. మున్ను దేవేంద్రుండు విశ్వరూపుని గురునిగాఁ గైకొని జన్నంబొనర్చిన నతండు మాతృపక్షీయులగు రక్కసులకు గూడ నుపకరించెఁ బిదప నింద్రుండు కుపితుండై తన వజ్రమ్మున నతని శిరంబు ద్రొల్లనేసెఁ గావున నెవ్వండేనిఁ గర్మవైపరీత్యం బొదవకుండఁ గాపాడికొనవలయు. సర్వంబు దైవాధీనంబనుట సరికాదు. ౨౩౭

క. మును ద్రుపదనృపతి ఘటజ
న్మునిఁ బరిమార్పంగ జన్నమున ధృష్టద్యు
మ్నుని ద్రోవది యను కూఁతుం
గని ధన్యుండయ్యె వికృతిగననికతమునన్. ౨౩౮

గీ. దశరథుం డనురాజు సత్రంబొనర్చి
సుతుల నల్వురఁ గని జగద్ధిత మొనర్చె
నేదియేనియు సఫలమై యొసఁగుపొంటె
కర్మలోపంబు లేమియె కారణంబు ౨౩౯

వ. సాత్త్వికం బగుజన్నం బొనర్చుట యేరికిని గష్టతరం బయ్యది వైఖానసవ్రతనిష్ఠులును సాత్త్వికభోజనులునునగు మహామునులు సేయువారు. రాజసం బభిమానవంతులగు క్షత్రియులకును వైశ్యులకును విహితంబు. తామసయాగంబు మదమత్తులగు దానవులకు యోగ్యంబు. మోక్షకాములకు మానసంబు కర్తవ్యంబు తత్ప్రకారంబు వినుము. ౨౪౦

సీ. మనము నిర్మలముగ నొనరించి గుణములు
వర్జించి యింద్రియవర్తనముల

నణంగించి దేహంబు నతిశుద్ధముగఁ జేయఁ
గలవాఁడు తగునధికారిసుమ్ము
మాటపమ్మును వేది మహితాగ్నులను బుత్వి
జులను దక్షిణల నచ్చుగ మనమునఁ
గల్పించుకొనవలెఁ గడఁగి దీనికి హోత
యజమానుఁడును గూడ నరయ మనము;

గీ. నిర్గుణబ్రహ్మ మధిదైవనియతిఁ దనరు,
నాద్యయును నిర్గుణయు నగునట్టిశక్తి
ఫలద, బ్రహ్మైక్య మిద్దానిఫలము, మునులు
దీనిసేఁతకుఁ దగువారు తెలియుమధిప! ౨౮౧

క. ఏవంవిధ మగుజన్నం
బేవారు రచింతురో మహీయశ్శ్రద్ధా
ధీవిభవు లగుచు వారే
జీవన్ముక్తు లని చెప్పఁ జెల్లుదు రధిపా! ౨౮౨

వ. తక్కిన జ్యోతిష్టోమాదికంబునకు ఫలంబు స్వర్గంబు, అయ్యది యస్థిరంబు. ఐనను మానసంబు రాజన్యులకు దుష్కరం బగుటం జేసి తాదృశంబులగు యాగంబులు కర్తవ్యంబులు. అందుఁ దామసం బగు యాగం బొనరించి సర్వవైరంబుఁ దీర్చికొంటివి. ఇఁక రాజసంబగు జన్నం బొనర్చి ధన్యుండవు కమ్మని మఱియు నిట్లనియె.

శా. దేవీబీజవిధానవేత్తలగు భూదేవాగ్రణుల్ ఋత్విజుల్
గా వేదోక్తవిధానరీతిగ జగద్ధన్యంబుగా వేడ్కమై
దేవీయజ్ఞ మొనర్చి దుర్మృతిగతిం దీంర్డించు నీతండ్రి స్వ
ర్గావాప్తిం గనఁగాఁ బిత్రృణమును బాయం జెల్లదే? భూవరా!

మ. ఘనసంగ్రామమొ ! పుణ్యభూతలమొ ! గంగాతీరమో ! కాక నీ
జనకుం డున్నతసౌధరాజమున దుస్సర్పమ్ముచే దుర్మృతిం
గని ఘోరంబగు రౌరవమ్మునఁ బడెన్, గాళీమహాయజ్ఞసం
జనితానంతవిశేషపుణ్యమున నుచ్చైర్లోకముల్ గూర్చుమా.

ఉ. చెందితి సర్వసౌఖ్యములఁ జేసితిఁ బుణ్యములన్ జిరాయువుం
బొందితిఁ గర్మబద్ధ మగుబొంది నికన్ ద్యజియించి యాత్మతోఁ
బొందఁగరానిసౌఖ్యములఁ బొందఁగఁజెల్లదె ? యంచుఁ దృప్తిఁ జె
న్నొందినవానికిన్ గలుగు నుత్తమలోకము పార్థివోత్తమా.

వ. భవజ్జనకుం డిట్టి తృప్తిగల్గి దేహత్యాగం బొనరించినవాఁడు కాఁడు. కావున మున్ను మహావిష్ణువుచే నొనర్పంబడినదియు ననర్గళ ఫలదంబును నగుదేవీయజ్ఞం బొనరించి యకృతనఁ గృతార్థు నొనర్చి పితృఋణవిముక్తుండవు గమ్మనుడు జనమేజయుండు సాశ్రుకంఠుండై సాత్యవతేయున కిట్లనియె. ౨౮౮

మ. హరి జన్నం బొనరించె నంటి వొగి నాయజ్ఞంబున న్నాథులె
వ్వరొ ? యద్దానివిధాన మెట్టిదొ ? జగద్వంద్యుండు విష్ణుండు త
త్పరతం జెందుట కేమికారణమొ ? సర్వమ్ముల్ గుఱింగూర్చి స
త్కరుణాదృష్టివహించి మీఁద మఖముల్ గావింపఁగాఁ జేయుమా.

క. అనుజనమేజయుఁ గనుఁగొని
యనువ్యాసుం డధిప ! విను మహాద్భుతమగున
ట్లొనరించె మున్ను జన్నం
బును విష్ణుం డంబ మిగుల మోదము చెందన్. ౨౮౯

వ. హరిహరవిరించులట్లు దేవీ నికటంబునుండి శక్తియుక్తులై విమానం బధిష్ఠించి స్వస్వరూపమ్ములు ధరియించి యర్ణవ నికటమ్మున కేతెంచినపిమ్మట, ౨౯౦

గీ. ముగురకును మూఁడు వాసముల్ తగుగతిని నొ
సర్చికొని యున్న యంత ననంతకరుణ
మైన యా యంబచే ముక్తయయ్యె నచల
మైన యాధారశక్తి యద్దాని నూని, ౨౬౨

సీ. ధర పుట్టె, నద్దానిఁ దగ మధుకైటభ
మేదోభరమ్ముతో మిళితమైన
కతమున మేదినిగా వచింతురు; ధార
ణముఁ బొనర్చినకారణమున ధర య
నియు, మహీయస్త్వంబెనయుటను మహి యని
యును, విస్తృతఁబగుటను బృధివి య
నియు, వచింతురు దాని నెఱిమోయుటకుఁ బర్వ
తములఁ జేసిరి విస్తృతములు గాఁగ

గీ. నందు మేరువు కనకమయంబు రత్న
శృంగసంశోభితంబు; మరీచినార
దాత్రిపులహక్రతుపులస్త్య లలనసిష్ఠ
దక్షులును బ్రహ్మపుత్రులై తనరు మునులు. ౨౬౨

గీ. అలమరీచికి సుతుఁడు గశ్యపుఁడు దక్షు
నకుఁ ద్రయోదశకన్యకల్ ప్రకటమతులు
పుట్టె; రమరులు దైత్యు లిర్వురును దక్ష
కన్యకలయందుఁ గల్గిరి కశ్యపునకు. ౨౬౩

గీ, దానఁ గాశ్యపి సృష్టి యత్యధికమయ్యె
మనుజులును బశువులును గ్రమముగ విస్త
రించునంతటఁ బుట్టె విరించి దక్షి
ణాంగముననుండి ఘనుఁడు స్వాయంభువుండు. ౨౬౪

వ. అవ్విరించి వామభాగమ్మునుండి శతరూపయను నొకకన్నియ పుట్టె వీరిరువురకుఁ బ్రియవ్రతోత్తానపాదులును నతిసుందరులగు మువ్వురు కన్యకలును నుదయించిరి. ౨౫౫

క. ఏవంవిధముగ సృష్టిని
గావించి సరోజభవుఁడు గాంచనగిరియం
దావెనుక బ్రహ్మలోకము
గావించుకొనె న్నివాసగతికై తనకున్. ౨౫౬

వ. విష్ణువునకు నత్యుత్తమంబు వైకుంఠలోకంబును శివునకు రజతమయంబగు కైలాసనగంబును నివాసంబులుగాఁ గల్పించె. ౨౫౭

క. నానారత్న విరాజిత
మై నయనోత్సవకరంబునై తగునాక
స్థానము మేరుగిరిస్థము
గా నొనరిచి దేవతలకుఁగా నొసఁగె వెసన్. ౨౫౮

సీ. మఱియు సముద్రంబు మథియించునప్పుడు
నుచ్చైశ్శ్రవంబను నొక్క యశ్వ
మును నాల్గుదంతమ్ము లెనసిన యైరావ
ణంబను గజము విన్నాణమైన
పారిజాతంబను పాదపంబును గామ
ధేనువు సామ్యంబులేని సొబగు
గల రంభ మొదలుగాఁగల యచ్చరలు నందు
బొడమినఁ గైకొనె గడఁగి యింద్రుఁ

గీ. డుదయమందిరి జలజారియును భిషగ్వ
రుండు ధన్వంతరియును నఖండమైన

యర్ణవమునుండి వీరు దేవాంశభవులు
స్వర్గవర్తులు సృష్టి యీ సరణిఁజెలఁగె. ౨౭౯

వ. మఱియు నండజస్వేదజోద్భిజ్జజరాయుజంబులను నాల్గుభేదమ్ములు గలిగి కర్మవశమ్మున ననేకజీవరాసు లుత్పన్నంబు లయ్యె. ఇవ్విధంబున కృతకృత్యులై బ్రహ్మవిష్ణుమహేశ్వరులు తమతమస్థానంబుల సుఖంబుండి రంత విష్ణువు లక్ష్మితో సమస్తసుఖంబు లనుభవించుచు నొక్కనాఁడు సుధాసింధుగతం బగు మణిమండిత ద్వీపమ్మును సటఁ బొడకట్టినమహాశక్తియుఁ దన్నిమిత్తమ్మున దొరకొన్నమంత్రంబును దమకు స్త్రీరూపప్రాప్తియు మున్నుగాఁ గలసంగతులు మనమ్మునకుం దెచ్చుకొని యంబికాయజ్ఞంబొనర్పఁ గృతనిశ్చయుండై, ౨౮౦

చ. తనభువనంబు వెల్వడి ముదంబున నంబుజసంభవుఁ భవుఁ
ధనదు సురేంద్రుఁ బావకుని ధర్ము వసిష్ఠుని దక్షుఁ గశ్యపుఁ
ఘనుఁడగు వామదేవముని కాంతు బృహస్పతిఁ దక్కువారలఁ
బని గొని పిల్చి యత్నము నపారముగా నొనరించి యంతటఁ, ౨౮౧

వ. సమర్థులగు సప్తవింశతిబుత్విజులఁ గూర్చుకొని సువిస్తరంబు లగు వేదులఁ గల్పించి యథావిధిగ నగ్నుల నాసాదించి దేవీబీజ సమన్వితంబులగుమంత్రమ్ముల చే వేల్చిన సంతసించి జగదీశ్వరి యశరీరిణియై యిట్లనియె. ౨౮౨

ఉ. ఎంతయు సంతసించితి రమేశ ! భవత్కృతమైన యజ్ఞ మిం
తింతగ నొప్పునే ! భవదభీష్టములెల్ల ఫలించుఁగాక వా
క్కాంతుఁడు నిందురుడుఁ మొదలుగాఁగల దేవతలెల్ల నిన్ను న
త్యంతము పూజసేయ వరదాతవు గాఁగల వెల్లవారికిఁ. ౨౮౩

సీ. జన్మములను నీకు సకల దేవతలలోఁ
బ్రాముఖ్య మెంతేనిఁ బరిఢవిల్లు
రాక్షసభీతి గీర్వాణులెల్లరు నిన్ను
శరణుఁగైకొనిసారె సంశ్రయింతు
వేదమ్ములఁ బురాణవాదమ్ములను నీవ
యధికుండ వంచుఁ బ్రఖ్యాతి వచ్చు
ధర్మమ్మునకు నుపద్రవ మబ్బుతఱిఁ దత్త
దవతారములు దాల్చి యవనియందు

గీ. వివిధయోనుల యందు నావిర్భవించి
భూభరమ్మును దీర్చెడి పుణ్యమూర్తి
వై నెగడఁగలవు సిరి నిన్ననవరతము
వదలకుండెడి నాదగువరము కలిమి. ౨౩౪

క. వారాహి నారసింహియు
నా రాజిలురూపముల నెనసి శక్తులు నీ
కారయ సహాయలై కా
ర్యారంభములన్ సమాప్తి నందింతురొగిన్. ౨౩౫

వ. అట్టిశక్తుల నెన్నండును నీ వవమానింపక తగుగతి మన్నింపు చుండుము. భూలోకంబునను స్వర్గలోకమ్మునను నీమహిమం బమేయమ్మై యొప్పు నని చెప్పి విరమించిన విష్ణుండు నమందానందంబు చెంది క్రతుసమాప్తి నొందించి యెల్లర గౌరవించి మరల వైకుంఠంబున కరిగి సుఖం బుండె. ౨౩౬

క. అనిచెప్పినవ్యాసునిఁ గని
జనమేజయుఁ డిట్లు వల్కె సాత్యవతేయా!

మును దేవీయజ్ఞం బిం
క నెవరొనర్చిరో వచింపఁగాఁదగుఁ బేర్మిన్. ౨౬౭

వ. అనవుడు నాతండొక్క యితిహాసం బిట్లని చెప్పందొడఁగె ౨౬౮

—* ధ్రువసంధ్యుపాఖ్యానము. *—

మ. అలరారున్ సరయూతటమ్మున నయోధ్యాపట్టణం బద్ది కో
సల దేశమ్మున కెల్ల భూషణము కంజాతాప్తవంశ్యుండు కీ
ర్త్యలఘుం డప్పురి నేలుచుండు ధ్రువసంధ్యాఖ్యుండు రారాజు వి
ప్రులు రాజన్యులు వైశ్యులుంగలరు శూద్రుల్ తత్పురిన్ ధార్మికుల్

ఉ. ఆతని రాజ్యమందు నొకఁడైనను జోరుఁడు గాని జారతా
ఖ్యాతుఁడుగాని సూచకుఁడుగాని వసింపఁడు రాజ్య మీగతి
న్నీతిగ నేలు నాధరణి నేతకు నిద్దఱు ముద్దరాండ్రు, త
జ్జాతియు నీతిరీతియును జందము నందము నందనీయముల్.

క. ఆవిధి మనోరమయు లీ
లావతి యనఁ దనరు నా విలాసవతులతో
భూవిభుఁడు సుఖంబుండఁగ నా
వెలఁదులు చూలు దాల్చి యంతఁ గ్రమముగన్, ౨౭౦

వ. * సుదర్శనుండును శత్రుజిత్తు నను నిరువురు పుత్రులం గనిన
రాజు వారలకు జాతకర్మాదికం బాచరించి యథావిభవంబుగ
విప్రులకు ద్రవ్యంబు లొసంగి సమసౌహార్దమ్మున వారలం
జూచుచు మనోహరులగు నక్కుమారుల కతమున నానంద
మ్మునఁ గాలక్షేపం బొనర్చుచుండె. ౨౭౨

---

* సుదర్శనుఁడు శత్రుజిత్తుకన్న 1 మాసము పెద్ద.

ఉ. వారలలోన జ్యేష్ఠుఁ డనవద్యతనుండు సుదర్శనుండు, వి
స్తారవిలాసరూపసముదారవచోవిభవాభిరాముఁడుం
ధీరుఁడు శత్రుజిత్తతని తెల్వికిఁ దండ్రియు మంత్రులుం భటుల్
పౌరులు సంతసించి కడుఁబక్షమునం గనుచుండు రాతనిం.

వ. అంతనొక్కనాఁడు ధ్రువసంధి మృగయావినోదార్థం బడవి
కేతెంచి యనేకమృగమ్ముల నుక్కడంచుచు నొక్కనికుంజమ్ము
నందలి సింహముం గొట్టుడు, ౨౭౪

మ. సట లింతింతలు చేసి యూర్ధ్వముగఁ బుచ్ఛంబుం దటాయించివి
స్ఫుటవర్ణాభ్రపటత్పటధ్వని నభోభూభాగముల్ నిండ వి
కృటమౌ కోపభరమ్మునం భయదమై కుంజం బొకంజన్ సుదు
ర్ఘటవేగమ్మున వెల్వడె న్నృపవరుం గ్రొసంబుగాఁ గైకొనం,

వ. చనుదెంచునాహార్యక్షంబు నీక్షించి యతఁడు వాలును బల
కయుఁ దాల్చి చలింపక రెండవసింగంబై నిలిచె. తద్భటులు తమ
తమ యాయుధమ్ములతో సన్నద్ధులై యనేకశరమ్ము లద్దానిపై
విడుచుటయు, ౨౭౬

ఉ. చెచ్చెర వచ్చి యానృపతిసింహునిపైఁ బడె ధైర్య మెంతయుం
హెచ్చఁగనాతఁడుం గడఁగి యేసెఁగదాసి మృగేంద్రుఁడంతటం
నొచ్చి మఱింత హెచ్చి తన నూతనశాతనఖాగ్రధారలం
వ్రచ్చినఁ జచ్చె నానృపతివల్లభుఁ డేమనవచ్చు దైవముం.

క. ఆ నృపతి ఖడ్గనిహతిం
దా నొచ్చినదగుటకతనఁ దత్క్షణ మదియుం
బ్రాణములు వీడి యానృపు
పై నొరిగెం మృతులగతులు బహుభంగులుగా! ౨౭౮

వ. అంత రాజభటులు లేతెంచి జరిగిన వృత్తాంతంబెల్ల మంత్రుల
కెఱింగించిన వారును వసిష్ఠ పురస్సరంబుగాఁ గరణీయంబులు
నిర్వర్తించి సుదర్శనునకుఁ బట్టాభిషేకం బొనర్ప నుంకించిరి.

ఉ. దానికి సమ్మతించిరి ముదమ్మునఁ బౌరజనుల్, వసిష్ఠుఁడున్
"భూనుతుఁ డీతఁ డీతనికిఁ బోలును రాజ్య మొసంగుఁ" డంచు స
మ్మానము చూపె నంత నభిమానధనుండు యుధాజిదాఖ్యుఁ డ
న్యూనుఁడు శత్రుజిత్తున కనుంగగు తాత రయం బెలర్పఁగన్,

వ. జామాతృ మరణంబు విని యుజ్జయినీపురంబు నుండి యేతెంచె
నాలోనన మనోరమాజనకుం డగు కళింగాధిపతి వీరసేనుండు
తన మనుమఁడగు సుదర్శనునకు హితం బాచరింప నటకువచ్చె
నిట్లు యుధాజి ద్వీరసేను లిరువురును తమ తమ దౌహిత్రు
లకుఁ గూర్చువారై మంత్రులతో నాలోచించు చున్నంత
యుధాజిత్తు వీరసేనున కిట్లనియె. ౨౮౧

క. నీదుమనుమఁడు సుదర్శను
డాదరణీయుఁడు జ్యేష్ఠుఁడగు కతమున రూ
పాదికమున జ్యేష్ఠుం డగుఁ
గాదే మాశత్రుజిత్తు గనుఁగొనుమిత్రన్. ౨౮౨

వ. లోకమ్మున వయోజ్యేష్ఠులకన్న గుణజ్యేష్ఠుల గౌరవింతు
రట్లగుట నామనుమఁడ రాజ్యార్హుం డనుటయు, ౨౮౩

గీ. వీరసేనుండు వల్కె "నీ వెట్టిమాట
తగదు నా సుతయే కదా! ధర్మపత్ని
తత్తనూజుఁడు రాజు సుదర్శనుండు
జ్యేష్ఠుఁగాదని ధర్మముల్ సెప్పు టెట్లు?" ౨౮౪

వ. అనుడు వీరసేనునకు మంత్రి లెదురాడక సుదర్శనునక పట్టంబు గట్ట నుంకించుడు యుధాజిత్తు మంత్రిలంజూచి, ౨౮౭

ఉ. మీరును మీరు నేకమయి మేదినికిం బతిగా సుదర్శనున్
వారకచేయ నొప్పికొనువాఁడె యతండు! బలాన్వితుండు వి
స్ఫారవివేకశాలి గుణవంతుఁడు నా మనుమండు మద్బలో
దారత మిమ్ము గీటడఁచి తప్పక రాజ్యము సంగ్రహింపఁడే?

క. కరమున నేనసిఁ బూనిన
ధరణియు వ్రక్కలగు ననినఁ దక్కొరులకు నన్
బొరయఁగఁ దరమే? మనమున
నరసికొనుఁడు మీఁద జరుగునట్టిది యెల్లన్. ౨౮౮

వ. అని వీరాలాపమ్ము లాడిన వీరసేనుండు యుధాజిత్తున కిట్లను,

క. నా మనుమఁడు నీ మనుమఁడు
నీమెయిని సమానులగుట యేర్పడె మఱియున్
నా మనుమఁడు జ్యేష్ఠుం డతఁ
డీ మహి నేలంగఁ గర్త యెన్నివిధములన్. ౨౮౯

వ. ఇట్లు వా రెడతెగని వైరమ్మున వాదించుచుంటకు నచటివా రందఱును వ్యగ్రమానసులైరి. ౨౯౦

క. ధ్రువసంధినృపతిమరణం
బు వినితగన్ శృంగబేరపురవాసులు చౌ
ర్యవిధి ధనంబు హరింపఁగ
తవతవ నప్పురఘునకు హుటాహుటినడలన్. ౨౯౧

వ. వచ్చి యతికోలాహలంబుగా నలుప్రక్కల వ్యాపించియుండి
రంత యుధాజిద్వీరసేనులు తమతమసైన్యములను గూర్చుకొని
యుద్ధ సన్నద్ధులైరి. ౨౯౨

—* యుధాజిద్వీరసేనుల యుద్ధము *—

క. ధృతశస్త్రహస్తులును సం
గతసైన్యసమేతులును నఖండరుడావే
శితులును నగు నయ్యిరువుర
కతులితమగు తుములయుద్ధమయ్యె నృపాలా! ౨౯౩

క. దండిమెయి వీరసేనుఁడు
కొండపయిన్ గురియు మొగులుకొమరున సత్యు
ద్దండంబుగ బాణంబుల
తండంబులువరపె నాయుధాజిత్తుపయిన్. ౨౯౪

క. వీఁక నిటు వీరసేనుఁడు
దాఁకి ప్రయోగించుశరవితానము గను ను
ద్రేకమున యుధాజిత్తు
త్సేక మెలర్పెడిశరముల ఛేదించె వడిన్. ౨౯౫

క. తురగంబులుఁ దురగంబులు
కరులుఁ గరులు భటులుభటులు గలసి పెనఁగ నం
బరచరులును భయపడిన ని
తరులకు నాసంగరంబు దరమే పొగడన్. ౨౯౬

వ. అట్టి యెడఁ జూర్ణంబులగు రథంబులును ఖండితంబులగు వార
ణంబులును భగ్నంబులగు తురగంబులును పాతితులగు
పదాతులును ద్రెళ్లినశిరమ్ములును దెగినకరమ్ములును బగిలిన

వక్షమ్ములును దగిలినబాణమ్ములును నై సంగరమ్ము పరి
వర్తిల్లె. ౨౯౭

క. పిశితంబుఁ గ్రహియించెడి
యశనాయాపీడితమ్ము లగు బహు కంకా
ది శకుంతమ్ముల యార్భటి
దశదిశ లొక్కటిగ మ్రోసె ధరణీనాథా! ౨౯౮

క. కొండల కెనయగు మాంసపు
ఖండపుఁ బోవులను వెడలఁగాఁ జొచ్చె మహో
ద్దండము లగు సెలయేఱుల
తండములన రక్తములు పదంపడి యచటన్, ౨౯౯

చ. అరదమునుండి చచ్చిపడినట్టి శవమ్ముల పైపయిన్ దివిన్
గరమును మాంసముం గొనెడికాంక్షఁ జరించెడిగ్రద్ద పెద్ద ని
ద్దురగనియుండియున్ సొబగుతోఁ దులఁదూఁగునిఁజాంగకమ్ములన్
బొరసెడి దేహమందుఁ జొరబోయెడిజీవుఁడు నాఁగఁ జొప్పడెన్.

చ. అనిఁ దెగటారి యాకసమునందు విమానము నెక్కి యంకమం
దెనసి విలాసముల్ గొలిపి యింపుఘటించెడి యప్సరోంగనన్
గని యొకవీరు డిట్టులను "కాంత! మదీయశరీర మెంతచ
క్కనిదొ గతాసువయ్యుఁ గసుగందదు కన్గొనుమా! రణావనిన్.

చ. ఇఁక నొకవీరుఁ డచ్చరయు నింపుగ ముచ్చటలాడుచున్ జక
చ్చకితవిమానమెక్కి చనఁ జయ్యన నాతనిధర్మపత్ని య
గ్నికి నెరఁజేసి దేహము నొగి న్నవదేహముఁ దాల్చి వేగఁ ద
న్నికటముఁ జేరి యాసవతినిన్ బడఁగొట్టె మగండు నవ్వఁగన్.

మ. అనిలోమారొక్కనియిద్దఱుద్భటభటుల్ ప్రాణంబుగోల్పోయి నె
ట్టన నొక్కమ్మడి నేగియేగి యట మింటన్ దమ్మునంటంగ వ
చ్చిన వేల్పుంజవరాలిమిన్నఁ గని యూచిన్నారిపొన్నారి యం
గనకై వెన్కటికన్న నెక్కుడురుషన్ గాట్లాడి రత్యంతమున్.

సీ. నాభార్యకన్న విన్నాణంబు గలదాన
వంచు నచ్చర గారవించె నొకఁడు
ఏకపత్నీవ్రతం బేమిసేయుదు ముట్ట
దగదు పొమ్మనె వేల్పుమగువ నొకఁడు
కలికి! నాచెలిమిన్న కన్న నెక్కుడుదాన
వా! పొమ్మనియె వేల్పువనిత నొకఁడు
తనపతివ్రతాపము సెప్పి తన కనుకూలఁగాఁ
గావించుకొనె దేవకాంతనొకఁడు

గీ. అయినవా రెందఱో! యిప్పుడగుచునున్న
వార లెందఱో! కాబోవువార లెంద
ఱో! యొకండంచుఁ గలఁడె మీరోయువిదల
కనుచు నిరసించె నప్సరో వనిత నొకఁడు. 308

ఉ. ఒక్కని చెట్టవట్టి మఱియొక్కనికిన్ విడె మిచ్చి ముద్దు వే
ఱొక్కనికిచ్చి చల్లనిమృదూక్తుల వేఱొకనిన్ నగించి యిం
కొక్కని చెక్కుఁగొట్టిపొలుపొందె నొకచ్చరలేమ; యొక్కనిం
జిక్కటసున్న గాదె వెలచేడెలు స్వర్గముపొంత వోయినన్.

మ. బలపాదాహతిరేఁగు ధూళి దిశలన్ వ్యాపించి పై నంబర
స్థలి కేతెంచి సరోజబాంధవుని తేజంబు న్నివారించి ని
శ్చలమై రే బవ లన్నమాట లవలేశంబైన లేకుండఁ జే
సి లలద్రక్తపయోధిలోఁబడుడుఁదోఁచెన్ సూర్యుఁడామీఁదటన్

క. అట్టియెడ వీరసేనుని
 బెట్టిదమగు తూపులేసి బిట్టడఁచె జగా
 జెట్టి యుధాజిత్తతఁడును
 జెట్టువలెన్ గూలె సేన చెదరెన్ దిశలన్. ౩౦౭

వ. మనోరమ తన తండ్రి మృతిన్ విని దుఃఖితయై, ౩౦౮

చ. పతి చనిపోయెఁ దండ్రి నరపాల శిరోమణి మన్నిమిత్తమై
 మృతిఁగనె నాజిలో, సుతుఁడు మేలును గీడు నెఱుంగరాని చి
 న్నతనమువాఁడు; దిక్కెవరు నాకిటఁ! బాతకుఁడైన యూతఁ డీ
 సుతుని వధించి రాజ్యమును సొమ్మును మన్మని కీఁదలంపఁడే.

ఉ. పాపముఁ బుణ్యమంచుఁ దనవార లటంచును నన్యు లంచుఁ గో
 పోపహతుల్ నిరస్తవినయుల్ కడులోభులునైన వార లా
 హా! పరికింప నేర్తురె? భయం బెదఁ బాపి యనుగ్రహించులో
 కోపకృతి స్వభావులు మహోత్తము లిక్కడ నెవ్వ రిమ్మెయిన్!

గీ. మొదలనుండియు నే నన మదినిమండు
 సవతి లీలావతియుఁ గృప సలుపునొక్కొ!
 శీఘ్రముగ వచ్చి యయ్యుధాజిత్తు మమ్ము
 బంధనాగారమునఁ బడవైచు నిజము. ౩౧౧

వ. మున్నింద్రుండు కోపావిష్టుండై మాతృగర్భగతుం డగు బాలకుం
దన వజ్రమ్మున నేడుఖండమ్ములుగా ఖండించి పిదప నయ్యేడింటి
నేడేడుఖండమ్ములుగా నొనర్చిన నవి యేకోనపంచాశత్ఖండంబు
లై మరుత్తులనం బరఁగె. మఱి యొకనృపకాంత తన సవతి గర్భ
వతియగుటకు సహింపక విషమ్ము వెట్టిన విషదగ్ధుండగు బాలకుం
డుదయించె నతండకాఁడె సగరుండు? ౩౧౨

క. మును దశరథభూపా లాం
గనయా కైకేయి తనదుగాదిలి సుతు రా
జును జేసి సవతికొడుకున్
వనమున కంపించె ననెడి వార్తలు వినమే? ౩౦౩

గీ. అరయ నాసుతు రాజ్యమ్మునందు నిల్పు
మంత్రులెల్ల యుధాజిత్తుమాట కడ్డు
చెప్పలే రన్నదమ్ములు సేయఁదగిన
వారు లేరైరి యింకెట్లు వర్తనంబు. ౩౦౪

వ. అని బహుప్రకారమ్ములఁ జింతించి సకలకార్యనిపుణుండగు విదల్లుం డను మంత్రివరు నేకతంబ రావించి యిట్లనియె. ౩౦౫

చ. తనయుఁడు చిన్నవాఁడు తగు తంత్రవిధిజ్ఞుఁడు నాదు తండ్రి యు
ద్ధనిహతుఁడాయె మీప్రభువుధార్మికుఁడంతకుమున్న యంతముం
గనెఁగద! శాత్రవుల్ ప్రబలి గర్వ మెలర్పఁగ మానభంగముం
బొనరుపనుండి రియ్యెడలఁ బోలు నుపాయ మొకండొనర్పఁగన్.

వ. నావుడు మంత్రి యిట్లనియె. ౩౦౭

క. చలపట్టి యుధాజి ద్భూ
తలనాథుఁడు మిగుల మిమ్ము దండించు నతం
డలఘుం డియ్యెడ నిటుపై
నిలుచుట యుచితంబు గాదు నిక్కము తల్లీ! ౩౦౮

క. బలవంతుండును గాశీ
తలనాథుం డెంత కేనిఁ దగు నస్మన్మా
తులుఁడు సుబాహుం డతఁడు మ
నలఁబ్రోచు నచటికి నేగ నామతమనినన్, ౩౦౯

వ. వల్లె యని యారాజపత్నియు రణనిహతుండగు తన తండ్రికి నగ్నికృత్యంబులు నెఱవేర్పంజేసి సైరంధ్రి విదల్ల సహితంబుగాఁ గుమారుం దోడ్కొని భాగీరథీ తటమ్మున కరుగుటయు, ౩౨౦

ఉ. క్రూరులుచోరు లచ్చట నకుంఠితదుర్నయలీల రాత్రి య
వ్వారలఁ గొట్టి మేనఁ గలవస్తువులున్ ధనమున్ సమస్తమున్
గారణమాత్రులై బలిమిఁ గైకొని యేగిరి "యూరు విడ్చి పో
ర్గూరికిఁ బోయినన్ జలమునూనినకర్మము మాననేర్చునే ? ౩౨౧

వ. ఇట్లు చోరోపహతయై ప్రతికూలమ్మగు దైవమ్మునకు వగచుచు వస్త్రమాత్రావశేషంబుగ నచ్చోటుగదలి సైరంధ్రి సహాయగ నుడుపం బెక్కి గంగానదిం దాఁటి భారద్వాజాశ్రమంబునకుం జని కొంత ధైర్యమ్ము చెంది యమ్మునియెదుట నిలువంబడుడు నమ్మహానుభావుండు కరుణార్ద్రుండై యామె కిట్లనియె. ౩౨౨

క. నీ వాసస్థల మెయ్యది ?
నీవల్లభు డెవఁడు ? దుఃఖనీరధి మునుఁగం
గావలసె నేమికతమున !
దేవతవో ! మర్త్యసతివో ! దెలుపుము మాకున్.

వ. అను మునివరునకు మాఱాడక శోకించుచున్న విదల్లుం డమ్ముని వరున కిట్లనియె. ౩౨౪

మ. ధ్రువసంధ్యాహ్వయుఁడొక్కరాజు సుజనస్తుత్యుం డయోధ్యాపురీ
ధవుఁ డాతం డొకనాఁడు వేఁటకయి కాంతారమ్మునం గ్రుమ్మఱున్
గవిసెన్ సింగ మఖండచండిమమహాకారామితారావదు
ర్వ్యవసాయాతిరయప్రకృష్టభయదారంభాతిసంరంభమై.

వ. అట్టియెడ నాతండును పిఱుతివియక యద్దాని కెదురై పోర నయ్యెడియు, 3౨౬

క. అక్షీణగతిని నృపహ
ర్యక్షునిపై కుఱుక నతం డహంకృతి నైచెం
గ్ క్షేయకంబు పదంపడి
యాక్షణమ గతాసులైరి యన్యోన్యమ్మున్. 3౨౭

క. ఆతనిసతి యీసతి తను
జాతుం డీతండు వేఱుసతియును నాభూ
నేతకుం గల దాపెకుం దను
జాతుం డొక్కరుండుగలం డసాధ్యుండు బలిమిన్. 3౨౮

వ. ఇట్లిరువురకు రాజ్యంబుం బట్టంబు గట్టఃపొంటె నిరువురి మాతామహులుం బోరాడి రా సమరమ్మున నీతనితాత పరేతయయ్యెం బిదప నీరాజపత్ని తనపుత్రునిం గాపాడుకొనగతిలేమి వనమ్మునం గుస్మిరునది పుణ్యవశమ్మున భవద్దర్శనంబొనరించె. భయాతురులగు ననదల సంరక్షణంబు కోటియజ్ఞఫలదంబని భవాదృశులకు వక్కాణింప వలయునే? అనపుడు భారద్వాజుం డమ్మనోరమ కిట్లనియె. 3౨౯

క. సచ్చరితవైన నీకుణ్
వచ్చినభయమేమి? పుడమి పాలించు నిజం
బిచ్చిఱుపాహం డభయుం
బిచ్చితి నిచ్చోట నిలువు మిచ్చానుగతిన్. 330

వ. అని యొక్కపర్ణకుటీరముం జూపించిన నాపెయు విదల్ల సైరంధ్రీ సహితంబుగం గుమారుండును దానును సుఖంబుండె, నట యుధాజిత్తును, 33౧

ఉ. సంగరరంగమున్ విడిచి సైన్యసమేతముగా నయోధ్య కు
ప్పొంగుచువచ్చి మంచిదగుమూర్తమునం దలశత్రుజిత్తు ను
త్తుంగతరోత్సవం బెలయ దుందుభినిస్వనముల్ సెలంగ రా
జ్యాంగమునందు నిల్పెఁ బురమంతయు మంగళసంగతంబుగన్.

వ. అట్టియెడ ధర్మాధర్మవిచక్షణులగు కొందఱు జనంబులు, 333

గీ. అల మనోరమ యెచ్చటి కరిగెనొక్కొ!
యెడ కేగె సుదర్శనుం డిద్ధచరితుఁ
డకట! వీరసేనుఁడు మృతుడైన కతనఁ
గాదె? యిటువంటి కష్టంబు కలిగె ననుచు, 334

గీ. వగలఁ బొగిలియు శత్రుజిద్వశగులైన
కతన నేమియు ననక సమ్మతిగనుండి
రట్లు మన్నని రాజ్యమ్మునందు నిల్పి
యయ్యుధాజిత్తు తనపురి కరుగునెడల. 335

—* యుధాజిత్తు భారద్వాజాశ్రమమ్మున కరుగుట *—

వ. సుదర్శనుండును దల్లియు భారద్వాజాశ్రమమ్మున నున్నవారని యెఱింగి యతనిం జంప నూహించి చిత్రకూటపర్వతమ్మున కరిగి నిషాదాధిపతియగు బలుఁడను వానిం బురస్కరించుకొని శృంగిబేరపురాధిపతియగు దుర్దర్శు నికటమ్మున కేగుటయు, 336

చ. విని మనమందు భీతి గడు విస్తరిలంగ మనోరమాంగనా
జనతిలకంబు కన్నుల నజస్రము నశ్రులు గ్రమ్మ నమ్మునీం
ద్రునిదరిఁజేరి "యీసుతుని ద్రోహమునం గడతేర్ప శత్రుజి
జ్జననికిఁదండ్రి మాకుఁగడుశత్రుఁడు వచ్చె మునీంద్ర వింటివే?

వ. మున్ను పాండవులు పాంచాలీసహితులై మున్యాశ్రమమున నున్నయెడ వారలేవురు నొక్కనాఁడు వనంబున కరుగుటయు ద్రౌపది ధౌమ్యాదిమునులతో నాశ్రమమ్మున నుండె నయ్యవస రమ్మున, 33౮

శా. ఆమార్గమ్మున నేగుదెంచె వెస సైన్యంబుల్ తనుంగొల్వ దు ష్కామార్తుండు జయద్రథుం; డతఁడు వేడ్కన్ వేదనిర్ఘోష ము ద్దామప్రక్రియఁ గానొనర్చుమునులం దర్శింప నేతెంచి య చ్చో మాద్యత్కరియాన యానఁగనె మించుంబోఁడి నాద్రౌపదిన్.

చ. కనుఁగొనినంత నెమ్మది వికారము దొట్రిల మాటిమాటి క వ్వనజదళాక్షిపై వల పవారితమై చన ధౌమ్యుఁ గాంచి యి ట్లను "మునివర్య! యీజలరుహానన యీతనుమధ్య యీకన త్కనకనిభాంగియెవ్వతెయొ! గ్రక్కననాకెఱింగింపు నావుడున్,

క. పాండుతరకీర్తియుక్తు ల
ఖండులు పాండవులు వారి గాదిలిసతి యీ
యండజయాన నెఱుఁగవె ?
పాండవులన నీకుఁ గూర్చుబంధులుకారే ? 3౮౧

గీ. వారలేవురు మృగయకై వనముపొంతఁ
బోయి రిప్పుడో యిఁకనో రాఁబోవు వార
లనిన విని సైంధవుండు నయ్యతివఁ గాంచి
యిట్టులని పల్కె నాదరం బినుమడింప. 3౮౨

చ. కుశలమె నీకుఁ బాండవులకున్! బతులెచ్చటికేగి! రెంతయున్ గృశవయి తీవరణ్యమున కేగుకతంబున; మీకు నింత దు ర్దశఘటియించెగా! యనుచుఁ దద్దయుయోగ్యుఁడునాగఁబల్కెఁబం చశరవికారదూషితుఁడు సైంధవుఁ డెక్కుడు బంధువుంబలెన్.

వ. పదంపడి ద్రోవదియు బంధుసత్కారంబొనర్చె నంత యతండును,

క. పశువుగతి మంచిచెడ్డల
ప్రశంస విడనాడి ఋషులఁ బరికింపక దు
ర్వశుఁడై హరించె నాపె వి
వశులగు దుష్టులకు వావివరుసలు గలవే ? 3౮౫

వ. పిదపఁ బాండవుల వలన నామె విముక్త యయ్యెనని విందుఁగాన నేరిని విశ్వసింపఁ దగదు. మున్ను వైరోచనసుతుండును బహుళ యజ్ఞకర్తయు ధార్మికుండును బ్రహ్లాదపౌత్రుండు నగు బలిచక్రవర్తిని హరి కపటవామనాకారమ్మున నింద్రహితార్థంబుగా వంచించె. 3౮౬

ఉ. వామనమూర్తి లోభమున వచ్చి తనుం ద్రిపదప్రమాణ మా
భూమిని గోరినన్ గపటభూసురుఁ డంచు నెఱింగియున్ మహో
ద్దాముఁ డఖండదాత బలి దా నఖిలమ్మును ధారవోసెఁ గా
నీ మఱుమాట వల్కఁ డతఁ డెంతటిసత్యవదాన్యుఁడో కదా.

వ. సత్త్వగుణప్రధానుండగు సాక్షాన్మహావిష్ణు విట్లొనరింప నిఁక నన్యులన నెంత! కావున లోభోపహతచిత్తులకుఁ జేయరాని కార్యంబుండదు. 3౮౮

మ. పరహింసన్ బొనరింతు రొడ్లధనమున్ బ్రాణంబులున్ గొంద్రుమ
ష్కరులై యన్యవధూరతిన్ దిరుగుచున్ గార్యం బకార్యం బటం
చరయన్నేరరు లోభు ; లెయ్యెడల నన్యాయంబు లేతత్కృతుల్
పరలోకం బని భీతి చెందరు మనోవాక్కాయకర్మంబులన్.

ఉ. దేవతలన్ యజింతురు పరదేశములన్ జరియింతురు దాతలై
కోవిదకోటికిన్ ముదము గొల్పుదు రుత్తము ; లల్పలోభులో !

జీవుల హింససేయుదురు చేయుదు రెంతయుఁ జౌర్యముఁ దగన్
భావనసేయఁగాఁ బరధనంబు హరించెడిత్రోవ లిన్నియున్.

వ. కావున మన యాశ్రమనికటమ్మునఁ గాచియున్న యయ్యుధా
జిత్తు నవ్వలికన్పి నన్ను నిర్భయంజేసి నా పుత్రుఁ గాపాడు
మనవుడు మునివరుండు వల్లెయని యుధాజిత్తుకడ కేగి నీ రాకకుం
గతమేమియని యడుగుడు నతండు మనోరమానయనంబున కని
నుడివె నంత మునియును, ౩౫౧

క. పతిశోకముఁ బితృశోకము
నతిభరమై తన్ను నేచ నాత్మజుతో న
య్యతివ మము శరణుఁజెందె వి
గతభయయై యిచటనుండి కదలునె మరలన్. ౩౫౨

వ. అనవుడు యుధాజిత్తమ్ముని కిట్లనియె. ౩౫౩

క. క్రమముగ ననిపిన ననుపుము
క్రమమునకుం దక్కితేనిఁ గడఁగి బలాత్కా
రముగఁ గొనువాఁడ నిజమనఁ
గ మునివరుఁడు కనుల నగ్నికణములు వెడలన్, ౩౫౪

ఉ. ఓరి దురాత్మ! యోరికలుషోదర! యోరిజఘన్య! పో బలా
త్కారముగా గ్రహింపఁదగు దార్ఢ్యము గల్గిన నట్లొనర్ప రా
దే! ఋషులన్న రాజులకు నెల్లిదమే? మును మా వసిష్ఠుతోఁ
బోరెను గాదె ధేనువును బొందఁగ గాధిసుతుం డెఱుంగుదే?

వ. పిదప మంతనమ్మున యుధాజిత్తు మంత్రి కిట్లనియె. ౩౫౬

క. మునిపల్కులు వింటివిశద!
మనోరమను సుతునితోడ మనము హరింపం

గ నుపాయమేది! రిపువృ
ద్ధిని సైఁపఁగరాదు సూవె ధీమంతులకున్. ౩౫౭

ఆ. వె. రాజయక్ష్మపగిది రాజన్యులకు రిపు
శేషమున్న బాధ చేయుఁగాన
దవిలి వీనిఁ జంపి నాహితురాజ్యంబు
విగతశత్రుకముగఁ దగనొనర్తు. ౩౫౮

క. ఇటనన్ను నెదిరికొని పో
రుట కెవ్వఁడు లేకయుంట రూఢియకద! యీ
జటిలుని పల్కులకుం జం
కుట యుచితమె యనుచు మంత్రి కోవిదుఁడనియెన్.

చ. నరవర వింటివే! మునులనన్ మహనీయులు సాహసించు ము
ష్కరుల నొకింతలో నణఁపగా గల రెందును వారు పూన దు
ష్కరమగు కార్యముండ దదిగాక మునీంద్రుఁడు "గాధిపుత్రునిన్
గరము నెఱుంగుదే" యనిన కారణమున్ వినుమే వచించెదన్.

క. మును విశ్వామిత్రుం డను
జనవరుఁ డొక్కెడ వసిష్ఠసంయమిఁ జూడన్
జనుటయు నమ్ముని తగు నా
సనమిడి గౌరవము సలిపి సంతస మెసఁగన్, ౩౬౧

వ. సైన్య సహితంబుగా విందునకు నిలువుమనుచు నతం డట్లొనర్చె.

ఉ. నందినియున్ వసిష్ఠమునినాయకునానతి తెప్పపాటులో
నందఱ కన్నిభంగుల ననంతములై తగుభక్ష్యభోజ్యముల్
విందులొనర్ప సైన్యసముపేతముగా నలగాధిపుత్రుఁ డా
విందును దృప్తిగా ననుభవించె నుతించుచుఁ దన్మహత్త్వమున్.

వ. పిదప నమ్మునివరు నడిగి యాధేనువుం గొనువాఁడై సవిన యమ్మున నిట్లనియె. ౩౬౪

ఉ. ధేనులఁ జూడమో! మునుల దివ్యమహామహిమానుభావులం గానమొ? యెన్నఁడేని యిటు గాంచితిమే? యొకరెప్పపాటులో సేనలతో నృపాలురకుఁ జెచ్చెర విందులొనర్చి తృప్తులం గా నొనరించు ధేనువులఁ గన్గొన నీమహిమంబు శక్యమే. ౩౬౫

క. అని మెలమెల్లన నిట్లను
ననఘా! ధేనువుల దశసహస్రంబులు నీ
కు నొసంగెద నా కిద్దా
నిని దయసేయఁగదె కోర్కె నెరవేర్పఁగదే.? ౩౬౬

క. అనుడు వసిష్ఠుండను నో
జనవర! యెన్నని దీనిసరిగా విడి నం
దిని యనుధేనువు హోమం
బున కీక్షీరములు మాకు ముఖ్యము లరయన్. ౩౬౭

వ. గాన దీని నీనేరననుడు నతం డిట్లనియె. ౩౬౮

క. ఈకుంటివేని యెట్లేఁ
జేకొనియెద నెల్లినేఁట సిద్ధ మనుడు నెం
తో కోపియై వసిష్ఠుఁడు
గై కొందువుగాక చూడఁగాఁగల నేనున్. ౩౬౯

వ. నావుడు విశ్వామిత్రుండు బలిష్ఠులగు భటులం బిలిచి నందినిం బట్టుకొనుఁడనుడు వారును నద్దాని నట్లొనర్ప భయకంపితయగుచు నయ్యది వసిష్ఠున కిట్లనియె. ౩౭౦

ఆ. వె. ఏమి తప్పుగలిగె? నేకారణంబున
నన్ను విడిచెదీ? వనయులు భటులు
పట్టికొనఁగనేల? బాధింపఁగానేల?
యనుచు మునియు ధేనువునకు ననియె. 32౧

మ. బలవంతుం డగురాజు దుర్నయమునం బాధించుచున్నాఁడు నేఁ
గలకార్యంబు మఱేమి? నిన్ను విడువంగా నోప నాశక్తికిం
దలదాఁకెన్, దపమేడ! యుద్ధమునకుం దార్కోలు తానేడ! నీ
తలమైనన్ విడిపించుకొమ్ము ననువొందన్ రమ్ము మమ్మాటికిన్.

మ. అని వాసిష్ఠుఁడు వల్కఁ నందినియుఁ గోధావేశమొప్పార హుం
మ్మను నాలోనన రాక్షసుల్ ప్రబలదర్పాహంకృతుల్ మీఱఁ ద
ద్ఘన కాయమ్మునఁ బుట్టి నిల్వమని తత్సైన్యంబు వారించి గ్రి
క్కునఁ గాఁ జేసిన నెట్టులో మిగిలెఁ దత్క్షోణీశ్వరుం డొక్కఁడున్.

ఉ. అంతయుఁ గాంచి నెమ్మనమునం దతిభీతియు సంతసంబునుం
జింతయుఁ దొట్రిలంగఁ గడు సిగ్గిలి సీ! నృపపౌరుషంబు గో
రంతయుఁ గాదు బ్రాహ్మణతపోధికతాధిగతప్రతాప మిం
తింతఁగ నొప్పునే? ముని జయించుట కేమియుపాయ మిత్తఱిన్.

మ. అని దీర్ఘంబగు చింత నెమ్మనమునం దావిర్భవింపన్ ధిగం
చును క్షాత్రంబును ధిక్కరించి తప మస్తోకంబుగాఁ జేసి వా
రని కీర్తిం ద్విజుఁడై మునీంద్రుఁడగుచున్ బ్రహ్మర్షి యంతయ్యు న
మ్మునికింజాలకపోయె * బ్రాహ్మణులతోఁ బోరాడుటల్ మాటలే.

క. కులనాశకరంబగు వి
ప్రులతో వైరంబుగాన భూవర! మనమున్

---

* తాపసులతో

జలపట్టి కొలఁదివితోడన్
దలఁగోకికొనకయ చనఁగఁదగు మనపురికిన్. 326

ఉ. దీనుఁడు నిర్ధనుండు గతతేజుఁడు బాలుఁడు తోడు లేదర
ణ్యాని వసించువాఁ డనదనాఁదగువాఁడు సుదర్శనుండు నీ
పై నెటు రాఁగలాఁ డటఁలు వచ్చినఁ జూడఁగవచ్చుఁ గాని యీ
మానివరేణ్యునిం జెనకి మానముఁబ్రాణముఁ గోలుపోకుమీ.

ఆ. వె. తృణము వజ్రమగును దృణమగు వజ్రంబు
దోమ యేన్గుగున్నఁదో నెదుర్చు
శశకమైనఁగాని శార్దూలమును జంపు
దైవయోగ మొకటి దప్పెనేని. 327

క. కాఁదగినది కాకుండదు
కాఁ దగనిది కాదు దైవకారణమున నా
మోదముఖేదముఁ దుల్య
ప్రాదుర్భావమ్ము లిందు వగవరు తజ్ఞల్. 328

వ. అను మంత్రివచనమ్ములకు సమ్మతించి మునీంద్రపాలికిం జని
నమస్కరించి నానేరమి సైఁపుమని వేఁడుకొని యనుజ్ఞాతుండై
యుధాజిత్తు తనపురమ్మున కరిగె నంత మనోరమయు స్వస్థచిత్త
యగుచు నయ్యాశ్రమమ్మున నుండె శుక్లపక్షచంద్రుంబలె దినదిన
ప్రవర్ధమానుండగు సుదర్శనుండు సవయస్కులగు ఋషిపుత్రుల
తోడం గ్రీడించువాఁ డొక్కనాఁడు విదల్లుం గుఱించి ముని
పుత్రుం డొకఁడు క్లీబయని యామంత్రించుటయు, 330

—* సుదర్శనునకు కామబీజప్రాప్తి *—

క. విని యందు నాదివర్ణము
ననువుగ బిందువునుఁగూర్చి యనుదినముఁ బఠిం
చెను భావిభాగ్య వశమునఁ
జనె నొక వైదేశులిట్లు జననాథమణీ! ౩౮౧

ఉ. న్యాసమునున్న ఛందమనునట్టిది లే దిఁక ధ్యానమన్న స
న్న్యాసము సర్వశూన్యముగ నాతఁ డదృష్టమహోదయమ్మునన్
జేసి మనమ్మునన్ నిలిపి శ్రీకరమై తగు కామబీజ మ
భ్యాసము చేసె నెన్నటికినైనను విస్మృతిఁ జెందకుండగన్. ౩౮౨

గీ. అంత నేకాదశాబ్దంబునందు నుపన
యనము గావించి ముని వేదమభ్యసింపఁ
జేసె నా రాజసుతుఁడు సుశ్రీవహించె
వేదమున శాస్త్రమున ధనుర్వేదమందు. ౩౮౩

మ. ఒకనాఁ డంబిక రక్తవర్ణయును రక్తోద్యద్విభూషాంబరా
దిక శాభాసురచారుగాత్రియును నై దివ్యస్వరూపంబుతో
నకలంకుండగు నా సుదర్శనునిపై నత్యాదృతస్వాంతమై
సుకృతంపుంగనియై ఖగేశరథయై చూపట్టెఁ బ్రత్యక్షమై ౩౮౪

ఆ. వె. ఆ సుదర్శనుండు నాయంబ వైష్ణవిఁ
గాంచి మ్రొక్కి భక్తి గడలుకొనఁగ
సేవ సేయుటయు దయావతి యాతల్లి
శరశరాసనాది సకలమొసఁగె. ౩౮౫

గీ. శరశరాసన కవచముల్ శరధియుగళ
మాదిగాఁగొని దేవీకృపామృతమున

కాటపట్టయి మిగులఁ బ్రఖ్యాతి నెసఁగి
యతఁడు నవమన్మథుండయి యలరునంత, ౩౮౬

శా. కాశీరాజతనూజ రూపమునకుం గాణాచి, విద్యావయః
ప్రాశస్త్యంబుల కెల్ల, మొల్లమునకుం బ్రాణంబు, బల్ చాతురీ
సౌశీల్యంబులప్రోవునా శశికలాశ్యామాశిరోరత్న మ
య్యాశానాప్తతనూజతుల్యు విని వందీడ్యప్రభావాస్పదున్.

చ. విని తదధీనచిత్తయయి వేఁగుచు వేకువ నొక్కనాఁడు చ
య్యనఁ గనుమోడ్చునంత జగదంబ ముదంబున స్వప్నమందుఁ బే
ర్మినిఁ బొడసూపి యిట్లను "వరింపుము, నిన్ను సుదర్శనుండు గై
కొనుఁ గనకాంగి! నీదయినకోర్కె ఫలించు నవంచితంబుగన్."

క. అని పలికి చనియె నంతట
వనజాక్షియు మేలుకాంచి స్వప్నము తన చిం
తనమున కనుగుణమగుటకు
మన ముబ్బఁగ మోము మాటిమాటికిఁ జెలఁగన్, ౩౮౯

వ. హర్ష నీరధి మునుంగుడుఁ దల్లి యిందుల కేమికారణం బనవుడు
సిగ్గునఁ దలవంచె. ౩౯౦

ఉ. పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మి నొకించుక చెప్పరాదె! మీ
యమ్మకుఁ జెప్పమంచును రహస్యమునన్ దను మాటిమాటికిన్
గ్రమ్మిన రాత్రి స్వప్నమునఁ గల్గినముచ్చట లచ్చుగాఁగ న
క్కొమ్మ వచించె; నెచ్చెలులకున్ వినరాని రహస్యముండునే.

ఉ. అంత వసంతమందుఁ జిగురాకులచేఁ బొగరెక్కి కోయిలల్
అంతులు సేయఁ జుమ్మనుచు అంపిలి తుమ్మెదదిమ్మరీండ్లు బల్

గంతులు వేయ నాశశికలాలలితాంగి సఖీసమేతయై
కంతునికిన్ నివాస మనఁగాఁదగు పుష్పవనమ్మునం దొగిన్.

క. బహుఫలభరితకుసుమఘా
ర్వాహాపల్లవ కలితలలితపాదపవల్లీ
విహృతిమెయిఁ బ్రొద్దుపుచ్చుచు
సహార్పతిసమాను నొక్కయగ్రజుఁ గనియెన్. ౩౯౩

చ. కని వినయమ్మునం జరణకంజములం బడి మ్రొక్కి యిట్లనున్
వనజభవావతార! తమవాస మదెక్కడ? నేడనుండి యి
వ్వని కరుదెంచుటో! తమరువచ్చిన కారణమేమొ! పేర్మి నె
క్కొన వచియింపుఁడా! యనుచుఁ గోమలికిన్ ద్విజవర్యుఁడిట్లనున్

శా. భారద్వాజ మునీంద్రునాశ్రమను మద్వాసంబు కార్యార్థినై
దూరం బేగుచు నుంటి నావలన నేతో కార్య మున్నట్లు న
న్నారాధించి ప్రశంస: జేసితివి నీ యాంతర్యమున్ దెల్పి నీ
వే రాజన్యుని పుత్రివో నుడువుమా! యిందిందిరాభాలకా!

వ. అను నవ్విప్రకుమారున కక్కోమలి యిట్లను మహాత్మా!
యేను గాశిరాజు కూఁతుర శశికల యనుదానఁ దమరు పూజ్యు
లగుటం జేసియు భవద్దేశమందలి విశేషమ్ములు వినఁ గోరియుఁ
బ్రశంసించితి. భవదాశ్రమమ్మునం గల చక్కని యొక్క విశే
షంబు వక్కాణింపుఁడన నక్కమలాక్షి కతం డిట్లనియె. ౩౯౬

క. కలఁడు ధ్రువసింధుఁ డను భూ
తలపతి యా నృపుసుతుఁడు సుదర్శనుఁడను వాఁ
డలఘుఁడు మా యాశ్రమమునఁ
గలఁ డాతం డెంతకేనిఁ గలఁడు కుమారీ! ౩౯౭

ఉ. అంబురుహాక్షి ! యాతఁడు గుణాలయుఁ డాకృతిపంచచాణుఁడా
యంబకు భక్తుఁ డెంతయు నయంబునఁ బోల్పెడిముద్దులాఁడు వా
నింబలె నొప్పువేఁ డొకరినిఁ గనఁ బోము మఱేమి ! బ్రహ్మ నీ
కుం బనిఁ బూని చేసె ననుకొందు నిసుఁగని సుందరీమణీ! ౩౯౮

క. పూవుం దావియుఁ గొమ్మయుఁ
జేవయు బంగారు మణియుఁజేర్చిన విధి యో
పూవుంబోఁడిరొ ! నీ కా
భూవరమన్మథునిపొందు పొసఁగింపఁడొకో ? ౩౯౯

క. అనుభూసురవచనములకు
మన మలరఁగ మోము మొదమందరుచిరహా
సనియతిఁ బొదల శరీరం
బునఁ బులకలు వొడమనొప్పెఁ బూఁబోఁడి వెసన్. ౪౦౦

గీ. భూసురుం డేగె నంత నాభాసురాంగి
పూర్వమునకన్న ననురాగమును వహించి
చచ్చిచావనివానిబల్ హెచ్చునకు స
హింపనేరక చెలిమిన్న కిట్టులనియె. ౪౦౧

చ. చెలియరొ ! యేమనోహరుని చెల్వము విన్నది యాదిగాఁగఁ జం
చలతయు బల్ వికారము విచారముఁ దోరముగా నెసంగు న
చ్చెలువుఁడెవండొ? గోత్రమును జెయ్వులుదేశముఁదల్లిదండ్రులుం
గులము నెఱుంగ రాదెటులొకో ! యిటు మన్మథుఁడార్తి వెట్టినన్ ?

చ. కలఁ గనుఁగొంటి నాతని వికాసము హాసము భాసమానని
స్తులతర హావభావములు సుందరి ! యేమని చెప్పుదాన నా
కొలఁది యదృష్టహీనలకుఁ గోరినఁ బైఁబడి మ్రొక్కి వేఁడినన్
గలుగునె ? యట్టివాఁడు కలఁగన్నదియే యొకలాభ మంగనా !

సీ. చందనంబు విషంబు చందంబుగాఁ దోఁచుఁ
బూలమాలిక పాముపోల్కి నుండు
వెన్నెల నిప్పులకన్న వేఁడిమి చూపు
హర్మ్యంబు యమకూప మనఁగవచ్చు
పూసెజ్జ కత్తులబోనుగాఁ గనుపట్టు
రాత్రి మృత్యుప్రమాణ నెసఁగుఁ
బగలన్నఁ బగవాని పగిది బీరము చూపు
గీతాదికం బన్న భీతి పుట్టు

గీ. విడె మడలుగొల్పు పూఁదోఁట వెట్టిఁజేయుఁ
జెలులపైఁ గోప మొదవుఁ జాపలము హెచ్చుఁ
దల్లిదండ్రుల కిది చెప్పఁ దప్పు, చెప్ప
కున్న నేగతినబ్బు నవ్వన్నెలాఁడు. ౪౦౪

మ. అనురాగం బది కన్నుగానదు మనంబా! మిట్టుపల్లమ్ములన్
గన కెచ్చోటకునైన నేగు నిఁక వేడ్కల్ మించియుం జెడ్డయున్
మునుపే నేరవు మన్మథుండు చపలాత్ముం డెంతయున్ మూర్ఖుఁ డం
గనలన్ లోఁకువఁ జేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగన్?

మ. మదనుం దిట్టఁగ రాదు కోయిలలతో మాఱాడఁగా రాదు నె
మ్మది వారింపఁగ రాదు కోర్కెలపసన్ మర్దింపఁగా రాదు దు
ర్మదమున్ గ్రిందుగఁ జేయ రాదు తనకామం బన్యులౌ వారితో
మొదలే చెప్పఁగ రాదు కష్టమకదా! పూఁబోఁడినై పుట్టుటల్.

క. కులకాంతనై నకతనం
గలుగదు స్వాతంత్ర్య మేమిగానున్నదో! న
చ్చెలి! వెలవెలఁదుక లేనో
ములునోఁచిరో! వెట్టిమాటపోసీఁగదవే. ౪౦౭

ఉ. ఆతఁడు రాజ్యహీనుఁడు వనాంతరవాసియు నంచు వింటిఁ బ్రి
ఖ్యాతులు రాజ్యసంపద లఖండముగాఁ గలరాజపుత్రు లీ
భూతలమందు లేరొ! ననుబోటికి వారలు తగ్గవారు కా
రో! తరుణీ! యదేమొ యతఁడొక్కఁడ నామదిఁజిక్కి సొక్కెడున్.

క. ఆనృపుఁ డుండినయెడ నా
కానతి యిడె నొక్కవిప్రుఁ డటకేగుటకున్
మానసము తొట్రువడు న
వ్వానికి నావంతఁ దెల్పువా రెవ్వరొకో? ౪౦౯

చ. అలరెడివేడ్కఁ దండ్రియు స్వయంవరముం బొనరింపఁ డాయె నె
చ్చెలు లొకరైన బిట్టినయుచింత నడంపఁగఁ జాలరైరి నా
కలఁ గనుపట్టి చెప్పినజగత్ప్రసు వాపరదేవియైన బా
ము లెసఁగఁజేయు నాకుఁగలమోహము మేర యెఱుంగ దక్కటా.

వ. ఇట్లు తదధీనచిత్తయై యక్కన్నెమిన్న యుండె, నట సుదర్శనుండు స్వప్నాద్యవస్థలఁ దన్మహామాయాసందర్శనం బొనర్చుచుఁ దదేకధ్యానపరాయణుండై కాలమ్ముఁ బుచ్చుచుండె నతనికడ కొక్కనాఁడు శృంగిబేరపురాధ్యక్షుండగు నొక నిషాదపతి యేతెంచి సర్వోపస్కరయుతంబును జతుస్తురగయుక్తంబును బతాకాదిశోభితంబునునగు నొక్కరథం బుపాయనంబుగా నొసంగిన మిత్రభావమ్మునం గారవించి యయ్యది గైకొనియె. అట్టియెడ,

క. భారద్వాజాశ్రమగతు
లై రాజిలుమునులు వల్కి రాతనిఁ గని యో
వీరాగ్రేసర! యిఁక భూ
భారధురంధరుఁడగుచుఁ బ్రబలెదవు గడున్. ౪౧౨

ఉ. ఏపరదేవతామహిమ మించుక గల్గినవారు పాపముల్
తాపము లాపదల్ గడచి ధన్యులు మాన్యులునై జగజ్జయ
వ్యాపృతులై చెలంగెదరొ! భద్రవిధాయిని యామె ముఖ్యమా
పాప్రక మట్టినీకు దురవాపము గల్గునె ముజ్జగమ్ములన్? ౪౧౩

వ. అని మనోరమం గాంచి, ౪౧౪

క. ఓ వీరమాత! విను పా
రావారపరీతమా మహారాజ్యశ్రీ
కేవల దేవీకృపకున్
దావలమగు నీకుమారునకు సంధిల్లున్ ౪౧౫

చ. అనిన మనోరమాసతియు నట్టులె మీవచనంబు నిక్క మా
ననఘచరిత్రులార! యొకఁడైన సహాయము లేని నాతనూ
జున కెటు రాజ్యభారమది చొప్పడుఁ దప్పునె మీనుడుల్ మహా
జనులగువారిదీవనలె సర్వము నిర్వహణం బొనర్చెడిన్. ౪౧౬

క. ఈదశదిశ లోకమైనను
మేదిని రజమైన జలధి మిత్రైన నగున్
భూదేవత లిడు నాశీ
ర్వాదములకుఁ దిరుగులే దవార్యము లగుటన్. ౪౧౭

క. అని నెమ్మది యుబ్బఁగ నూ
నుని సేమముఁ గోరి యామనోరమయుండెన్
ఘనుఁడు సుదర్శనుఁడు జగ
జ్జననికటాక్షంబు తనకు సంతస మొసఁగన్. ౪౧౮

ఆ. వె. ఆరథంబు నెక్కి యలరెడివేడ్క నెం
దేనిఁ జనెడివేళఁ గానుపించు

దక్షమై తనర్చు నక్షౌహిణీసైన్య
నుధ్యమం దెలర్చు మహీపుమాడ్కి. ౪౧౯

ఉ. శోభనదాయియై సకలశోకవినాశకమైన కామరా
జాభిధబీజముఁ గురుదయావశతన్ దగ సంగ్రహించి శ్ర
ద్ధాభరితంబు గా నెవఁడు తద్దయుఁ దజ్జప మాచరించు వాఁ
డాభగవత్యనుగ్రహము నంది పురందరసన్నిభుం డగున్. ౪౨౦

సీ. అంబార్చనాసక్తులగు వారలకుఁ గలు
గనిశుభమ్ములు లేవు, కావరమున
నెవ్వ రంబార్చన నీసడింతురో వారు
మాతృకాద్రోహులు మందమతులు
దుష్టులు రోగులు దుఃఖపీడితులునుఁ
గా నెఱుంగుము దేవమాననీయ
యై యాదిశక్తియై యమరు నాయంబయే
యఖిల జీవులయందు నలరుచుండు

గీ. బుద్ధి ధృతికీర్తి లక్ష్మిసమృద్ధి శక్తి
శ్రద్ధ స్మృతి లోనుగాఁగల సకలమగుచు
నామె నెఱుఁగనివారల యజ్ఞులనఁగ
నెఱుఁగువారల పండితు లెఱుఁగు మధిప! ౪౨౧

ఉ. బ్రహ్మ మొదల్ పిపీలికలు పారముగాఁ గల జీవసంతతుల్
బ్రహ్మవచోభిధేయము నపార మనాద్య మమేయమౌ పర
బ్రహ్మము గాఁగ నే పరమపావని నే జగదంబఁ గొల్తు రా
బ్రహ్మముఁ దా నెఱింగె నొకపాటి యనందగు నే సుదర్శనున్?

శా. దేవారాధితయై మహామహిమయై దివ్యస్వరూపాఢ్య వి
ద్యావిద్యాకృతియై జగం బఖిలమున్ వ్యాకీర్ణమున్ జేసి స

ద్భావాతీతుఁ బురాణపూరుషుని సంభావించు నేదేవి యా
దేవిన్ గొల్చి సుదర్శనుండు సుఖమందెన్ రాజ్యమున్ బాసియున్.

క. శశికలయు నా సుదర్శన
వశగతహృదయ యయి వలపు వడ్డికిఁ బారన్
గృశయయి భృశచింతనయై
యశనాయాదికము మఱచె నధిప వతంసా! ౭౨౭

చ. కొమిరె విచారణాంశమును గొంత యెఱింగి సుబాహుఁ డాపెతం
డ్రి మురువుమీఱఁ బుత్రిపయి నెమ్మి దలిర్ప స్వయంవరం బొన
ర్ప మదిఁ దలంచి యెల్లనరపాలురకున్ దెలియంగఁ జేసె, న్యా
యమకద రాజపుత్రిలు స్వయంవరమందు వివాహ మాడుటల్.

వ. స్వయంవరమ్మును నిచ్ఛాస్వయంవరంబు పణస్వయంవరము
శుల్కస్వయంవరము నా మూఁడు తెఱంగు లందు శ్రీరాముండు
శివధనుర్భంగం బొవర్చి సీతం గైకొన్నది పణస్వయంవరంబు
తక్కఁగల రెండును బ్రసిద్ధమ్ము లందాద్యమగు నిచ్ఛాస్వయం
వరంబు చాటం బంచుడు, ౭౨౮

ఉ. మాళవచోళమద్రవరమాగధవంగకళింగసింధుబం
గాళకరూశలాటకురుకాశమరాటవరాటగౌళనే
పాళవిదర్భబర్బరనృపాలకుమారకు లాసుబాహుభూ
పాలుని పట్టణంబునకు వచ్చి రనేకు లుదంచితస్థితిన్. ౭౨౯

వ. అంతకు మున్న యన్నలినాక్షి తద్వృత్తాంతం బెఱింగి సఖింగాంచి
కుంచితాస్యయై కనుఁగొనల నశ్రులురుల మంతనంబున నిట్లనియె.

ఉ. నెచ్చెలి! నా మదిం గలుగు నెవ్వగ నెవ్వగ నాఁపికొందు? నా
నచ్చిన చెల్మికాఁడు జననాథ శిరోమణి నాఁటిరాత్రి భూ

భృచ్ఛయరాజపుత్రి కడుఁ బేరిమి నాకిడినట్టికోర్కె యు
ద్యచ్చరితుండునైతగు సుదర్శనుఁడక్క నొరుఁ వరింతునే? ౪౨౯

మ. ధనముల్ కాల్పనె? రాజ్యసంపదలు కాంతారమ్మునన్ జేర్పనే?
గొన ఖండంబును జాతురీగరిమయున్ గూలంకషప్రజ్ఞ యె
వ్వనికిం జొప్పడు వానిఁ గోరఁదగు నవ్వాఁడెన్నఁగా నా సుద
ర్శనుఁడే యింతకు నొక్కకండొక తెరున్ జక్కంగఁ గన్పట్టెడిన్

క. అని త్రిప్పరానిపేర్మిని
దనతోడం బల్కు రాజతనయవచనముల్
పనిఁగొని జననికిఁ దెల్పఁగఁ
జని యావైదర్భితోడ సఖి యిట్లనియెన్ ౪౩౦

వ. అమ్మా! మన శశికల సుదర్శనుండను రాజపుత్రుం దక్క న
న్యుని వరింపనని నిశ్చయించుకొని యున్నయది. ౪౩౨

క. భారద్వాజాశ్రమమున
నారాజ తనూజువాసమఁట! యాతనికిన్
ధారాళముగఁ ద్రిశుద్ధిగ
ధారాదత్తంబుజేసెఁ దననెమ్మనమున్. ౪౩౩

వ. అనుడు వైదర్భియు నయ్యుదంతంబు తన పతికెఱింగించిన నతం
డమ్మగువ కిట్లనియె. ౩౩౪

ఉ. వాని నెఱుంగుదే చెలియ! వాఁడన రాజ్యముఁ గోలుపోయి య
న్నానకు లేక కాననమునన్ మునిపల్లె వసించుఁ దల్లితోఁ
బూని యుధాజిదాహ్వయుఁడు పోరునఁ జంపెను వీరసేను న
వ్వానికతమ్మునన్ గడు నభాగ్యుఁడు వానికిఁ బుత్రి నిత్తునే?

క. కావున నచ్చుగఁ జెప్పుము
నీవేగి తనూజ కిపు డనింద్యచరిత్రుల్
కోవిదులు భాగ్యవంతులు
వేవేలు స్వయంవరమున విడిసిరి నృపతుల్. ౪౩౮

వ. అని భర్త వల్కిన వల్లెయని యావైదర్భి పుత్రికడ కరిగి బుజ్జగించి శిరమ్ము మూర్కొని తొడపై నిడుకొని యల్లన నిట్లనియె.

మ. ఫలమూలాశి వనప్రవాసి కృశుఁడున్ బంధుప్రజత్యక్తుఁడున్
బలకోశాదివియుక్తుఁ డెంతయును నిర్భాగ్యుం డతం డున్నతుల్
గలవా రూర్జితు లార్జితోత్కటయశః ఖ్యాతుల్ నరేంద్రాత్మజుల్
దలఁప న్నీకయి వచ్చిరందఱును సౌందర్యమ్మునన్ మన్మథుల్.

తరల. అల సుదర్శను తమ్ముఁడున్ గడునందగాఁడు మహాబలుం
డలఘుఁ డాతఁడు శత్రుజిత్తు ధరాధిపత్యము గల్గు వాఁ
డెలమి నీకనుకూలుఁడై తగు నేతదర్థమకాదె తాఁ
గలన నీతనితాత చంపెఁ బగన్ గళింగధరాధిపున్. ౪౩౯

క. అదియునుగాక యుధాజి
త్తదనగు నెడ నితనిఁ జంపు నాకతనమున నే
కద! భారద్వాజునికడ
సుదర్శనుండుండు టరయ సుదతీ! వినుమా! ౪౪౦

క. నీతండ్రి సుదర్శనున క
పేతవిభవుఁడనుచు నిన్నుఁ బెండిలిసేయన్
జేతోగతి వాంఛింపం
డాతలఁ పిఁక విడిచి పెట్టుమమ్మ కుమారీ! ౪౪౧

వ. అనుడు నక్కోమలి తల్లి కిట్లనియె. ౪౪౨

చ. వనమున నుండుఁగా కతఁడు పట్టణమందు వసించుఁగాక ని
ర్ధనుఁడగుఁగాక మేటిధనధాన్యములం దులఁదూఁగుఁగాక నా
మన సలవానిఁ దక్కఁ బెఱనూనిసి నొల్లను ధాతయైన ఫా
లనిహితమైన వ్రాఁతలకు లాఁతిగతుల్ పొసగింపనేర్చునే ?

క. శర్యాతి వచనమున మును
నార్య సుకన్యాభిధాన చ్యవనునిఁ గొని న
ట్లార్యావచనమ్మున శుభ
చర్య సుదర్శను వరింతు సత్యవ్రతనై. ౨౨౨

క. కైతవ మెఱుఁగక భర్తకుఁ
జేతోమోదమున సేవఁ జేసెడి సతికిన్
బ్రీతియు స్వర్గము మోక్ష వి
భూతియునుం గలుగు నిక్కముగ నోతల్లీ ! ౨౨౩

క. మచ్చిత్తభిత్తి భగవతి
విచ్చలవిడి వ్రాసె వానివిధమంతయు నా
నచ్చినవాఁ డతఁ డొక్కఁడ
పొచ్చెము లేదిందుఁ గూర్మి పొసఁగె నతనిపై. ౨౨౪

క. అని శశికల వివిధ నిద
ర్శనములు చూపించి తనకు రమ్యుండు సుద
ర్శనుఁ డొక్కఁడ యని చెప్పిన
జననియుఁ బతి కెఱుఁగఁ జేసెఁ జని సకలంబున్. ౨౨౫

వ. అంత స్వయంవర మహోత్సవం బాసన్నం బగుడు శశికల సుద
ర్శనునరామికిఁ జింతించి యత్యాప్తుండగు నొక్కవిప్రునిం బిలిపించి
రహస్యమ్ముగ నిట్లను నో యయ్యా ! మాయయ్య

యెఱుంగకుండ భారద్వాజాశ్రమమ్మున కరిగి సుదర్శనుంగాంచి
నా వచనమ్ములుగా నిట్లనుము. ౪౪౮

ఉ. అంబ నినుఁ వరింపుమని యానతి నాకిడె నామనంబు స
త్యంబుగఁ జిక్కె నీపయి స్వయంవరమా నిఁక నెల్లి; రాజసం
ఘంబు పురంబునఁ విడిసెఁ గాని త్వదాగమనంబు లేదు న్యా
యంబె యనాదరంబు విషమాంబకదర్శన! యో సుదర్శనా!

ఉ. నే నినుఁ దక్క నన్యుని గణింప వరింప మదిం దలంప నా
మేను నిజంబు నీయదిసుమీ వినుమీ! నను మాని తేని నిఁ
గానమి వహ్నిలోఁ బడుదుఁ గాని యెడఁ విషమాహరింతుఁ బ్రా
ణానకు వెన్కఁజూతునని నన్ దలపోయకు ప్రాణవల్లభా! ౪౫౦

చ. మనకుఁ బరాంబికాకృప సమస్తశుభమ్ములు గల్గు దైవమున్
మనమున నమ్మి రావలెఁ జుమా! శివకేశవముఖ్యు లేజగ
జ్జననికి వశ్యు లాజనని సత్యము దప్పనితల్లి యాపె వా
క్కును వితయానె నాథ! కయికొమ్ము ననుం బ్రతికించి పుణ్యమున్

చ. అని వచియింపు మానరవరాగ్రణి కిట్టులె యంచు శాస్త్రమా?
యనఘ! సమస్తమున్ దెలిసినట్టిమహాత్ముఁడ వీవు కార్య మే
యనువునఁ జక్క నౌనో యటు లాతనితో వచియించి పున్నెమున్
గొనుము పరోపకారమునకున్ సమమైన విశేషమున్నదే?

ఉ. అక్కరుణాకరున్ గడు రహస్యమునం గను మట్లు కాంచి నా
చక్కఁదనం బొకింత సరసంబుగఁ జెప్పుము చెప్పి నాదు పై
న్మక్కువ మేరలేని దని మాటికిఁ దెల్పుము చేతు లెత్తి నే
మ్రొక్కితినంచుఁ బల్కుమిక ముంచినఁ దేల్చిన నీవ నావుడున్,

వ. తద్దత్తంబగు దక్షిణఁ గ్రహించి యాతండును సుదర్శను కడ కేగి సకలమ్మును వచియించి యతనిచే స్వయంవరమ్మున కేతెంచెదనని యనిపించుకొని తత్క్షణమవచ్చి యక్కన్నెతో నంతయు నుడివె, నట సుదర్శనుండు స్వయంవర గమనోన్ముఖుండగుటయు,

క. తల్లి మనోరమ శోకం
బుల్లమ్మునఁ గడలుకొనఁగ నోగి గుండియలున్
జల్లన నల్లన నశ్రులు
వెల్లివిరియఁబల్కె నిట్లు విహ్వలమతియై. ౨౫౫

చ. పలువురు రాజు లున్నెడకు బాసట లేకయ పోఁ దలంచె ద
ప్పులుగు యుధాజిదాఖ్యుఁ డతివైరి నినుం గడతేర్ప నెంచి తా
నలయెడ కేగుదెంచు, నను నాత్మజశోకపరీతఁ జేయఁగాఁ
దలఁపకుమయ్య! నాపలుకు దబ్బఱ సేయకుమయ్య నావుడున్,

ఉ. అంబికయానతిన్ శిరమునం దిడి యేగెడి నాకు నెందు న
డ్డం బొకడుండునే? యొరులధాటికి జంకుదునే? మదంబ! శో
కం బుచితంబె క్షత్రియకుఁ! గాఁదగు కార్యము కాకపోదు దుః
ఖంబును సౌఖ్యముం జగతిఁ గావడికుండలు ప్రాణికోటికిన్.

వ. అని తల్లికి ధైర్యంబు చెప్పి నిషాదదత్తంబగు రథం బధిష్ఠించి చన నుద్యుక్తుండగు కుమారుంగాంచి మనోరమ యిట్లను నోయన్నా! విజయార్థం బేగెడి నిన్ను నగ్రమ్మున నంబికయు వెనుకఁ బార్వతియు విషమమార్గమ్ముల వారాహియు దుర్గమ్ముల దుర్గయు ఘోరకలహమ్ములఁ బరమేశ్వరి యగుకాళికయు స్వయంవరమ్మున సౌమ్యయగు మాతంగియు భూపమధ్యమ్మున భవానియు గిరిదుర్గంబుల గిరిజయుఁ జత్వరమ్ములఁ జాముండయుఁ గాననముల సనాతని యగుకామగయు వివాదమ్ములఁ వైష్ణవియు శత్రుసమాగమమ్మున

భైరవియు సర్వదేశంబుల జగద్ధాత్రియగు భువనేశ్వరియుఁ గంటికి
ఱెప్పచందమ్మున రక్షింతురుగాత మని దీవించి మఱియును,

శా. అన్నా ! నిన్నిఁడనాఁడె యిప్పుడ క్షణంబైనన్ వసింపంగఁ జా
ల న్నిన్నున్ గనులారఁ గాంచికద కాలంబెల్ల హేలాగతి
న్బ్రాణంబుగఁ బుచ్చుచుందు నదియున్ విఘ్నంబుగావింప నీ
కు న్న్యాయంబె ? రథంబుపైనిడి ననుం గొంపొమ్ము నీతోడుతన్.

వ. సుదర్శనుండు వల్లెయని ధాత్రేయీసహితంబుగఁ దల్లిని రథం
బెక్కించుకొని శీఘ్రగమనమ్మునఁ గాశీపురమ్ము చేరిన సుబాహుం
డెదుర్కొని తగినవిడిది యొసంగి యుపచారమ్మునకుఁ దగువారి
నియోగించె దౌహిత్రసహితుఁడగు యుధాజిత్తును దక్కఁగల
రాజన్యులును సుదర్శనుఁగాంచి తమలో నిట్లు ప్రశంసించు
కొనిరి. ౪౬౦

—* సుదర్శనుండు స్వయంవరమున కేగుట *—

ఉ. తా నిట కేగుదెంచెను సుదర్శనుడుం దగువానిభంగి రా
ట్సూనుల రాజరాజసుత సుందరు లందఱినిం ద్యజించి త
న్నీనళినాక్షి కోరుననియే మనమందుఁ దలంపఁ బోలు నే
మో ! నగినట్టియూళు లగు నొక్కెడఁ బట్టణముల్ గ్రమమ్ముగన్

క. అనిన యుధాజిత్తిట్లనుఁ
గనుఁడీ ! మీరెల్ల నాదుకడిమి నిట సుద
ర్శనుఁ గడతేర్చెద ననవుడుఁ
బనిఁగొని యనుఁ గేరళాధిపతియాతనికిన్. ౪౬౧

మ. ఇది యిచ్ఛావరణార్థ మేర్పడియె నయ్యేణాక్షి యిందొక్కరున్
మది కింపై తగువాని నంగభవుసామ్రాజ్యమ్మునం గూర్చు న

య్యది తక్కుంగల యస్మదాదుల కవార్యం బట్లు కాదేని దు
ర్మదు లీరాజులటంచు రెల్లరును మర్యాదావినాశంబుగన్.

చ. అది యటులుంచు న్యాయ్యమగు నాతనిరాజ్యము దుర్నయమ్మునన్
మొదల హరించి యిచ్చితివి ముగ్ధులమన్మని; కాతనిన్ వరిం
పఁదగదె ? యీ సుదర్శనుఁడె పట్టముగట్టెనె ! బేలరీతి నె
మ్మది నిటు కుందనేల వినుమా ! యితఁడే నినుఁ జక్కఁ జేసెడిన్.

క. విను మెన్నఁడేని ధర్మ
మ్మునకున్ జయమబ్బు సత్యమునకగు వృద్ధుల్
చనకుము దార్మార్గ్యమునకు
ఘనుఁడందటి నేలువాఁడుగలఁడో ! లేఁడో ! ౪౬౫

ఉ. అందఱినిన్ వరింపదు కదా ! యొకరాజతనూజ యిందఱున్
సుందరు లిందఱున్ మిగుల శూరు లుదారులు వీరిలోన నా
సుందరి యొక్కనింగొన నసూయమెయిన్ మనమెల్లఁ బోరినన్
నిందకు మూలమౌ నిది యనీతియొ ! నీతియొ ! నిర్ణయింపుమా.

క. అనుడు యుధాజిత్తను నీ
వనిన ట్లిచ్ఛాకృతస్వయంవర మిది యొ
క్కని ననవద్యచరిత్రుని
ననఘుని వరియించెనేని హా ర్దమ మాకున్. ౪౬౭

చ. పలువు రఖండ తేజులు నృపాలకుమారకు లుత్తమోత్తముల్
గలయెడ నెవ్వఁడో యొకఁ డగణ్యుఁడు కన్యఁ బరిగ్రహింప యో
గ్యులుగని యూరకుండుటదియున్ గడుయుక్తమె! సింహభోగ్యమౌ
పలలము నక్కకున్ విడువఁబాడియె ! యేడవి ! నీతివాక్యముల్ !

గీ. అగ్రిజాతికి వేదమ్ము లధికబలము
చాపమెక్కుడుబలమగు క్షత్రియులకు
బలము గలవానిరాజ్య మీపడఁతిమిన్న
బలమ శుల్కంబు రాజవివాహములకు. ౪౧౯

వ. అయ్యది సుదర్శనునకుం గలిగెనేని యతండ పరిగ్రహించు నిత రులకుఁ గలదేని యితరులు వశయుదు రని యన్యోన్యకలహమ్ము లొనర్చు నవనీపతులకడకు సుబాహుం డాహూతుండై వచ్చుటయు, ౪౨౦

క. అవనీపాలుర కెల్లను
వివాదము తటస్థమాయె వింటివికద ! యో
యవనీవర ! నీవియ్యెడ
వ్యవస్థనేర్పరచి వీరివా దడఁపఁదగుఁ. ౪౨౧

వ. అన నతం డిట్లనియె. ౪౨౨

చ. జనవరులార ! నాకొమిరె చాల సుదర్శనునిఁ వరింపఁగా
ననయము నెంచుచున్న దతఁ డర్హుఁడు గాఁడని యెంతచెప్పినఁ
విన దతఁడుఁ స్వయంవరపువేడుక వచ్చె బహూక్తు లేల దై
వనియతి కన్యథాకరణపాటవ మేరికినైనఁ గల్గునే. ౪౨౩

వ. అనుడు నాతని చిత్తవృత్తి నెఱింగి సంపన్నులగు రాజన్యులంద ఱును సుదర్శనుం బిలువనంబంచి యిట్లనిరి. ౪౨౪

ఉ. ఓయి నృపాలపుత్రి ! యిటకొక్కరుఁడై చనుదెంచి తీవు సే
నాయుతు లెందఱో నృపతినందను లాహవమాచరించి య
బ్జాయతనేత్రి నీశశికలాబ్జముఖిఁ గ్రహియింప నున్నవా
రీయెడ నీకుఁ జేయగల దించుకయుఁ గనుపట్టనేర్చునే ? ౪౨౫

శా. నీకుం దమ్ముఁ డఖండశౌర్యనిధి వర్ణింపంగ యోగ్యుండు లో
కైకాగ్రణ్యుఁడు శత్రుజిత్తును సహాయీభూతుఁడై తాతయున్
వీఁక న్నిన్ను వధింప నియ్యెడ కొగిన్ విచ్చేసియున్నారు నీ
రా కత్యంతము శోచనీయము కదా! రాజన్యవంశాగ్రణీ. ౪౭౬

గీ. ఎవరు పిల్చిరో నిన్ను! నీ వేకతమున
వచ్చియుంటివో కలిగిన వాస్త
వంబు చెప్పితిమి మీఁద నీదగుచిత్తవృత్తి
కర్హ మగున ట్లొనర్పు మటన్న నతఁడు, ౪౭౭

ఉ. వారలఁ గాంచి యిట్లను నృపాలకులార! కృపాళులార! మీ
పేరిమి యింతయొప్పునొకొ భీతిలియిప్పుడు లాభమేమి, నా
భారము దేవదేవి దిటఁ బాపిన దాజగదంబ నాకు నై
క్షీరమొ నీరమో యొకటి చేయదె శత్రులచేతి కిచ్చునే? ౪౭౮

చ. ఎలమి సమస్తమందుఁ బరమేశ్వరినే కనుఁగొందు నాకు శ
త్రులనుచు మిత్రులంచుఁ గలరో! యలరారెడివేడ్క నంబ నా
కలఁగనుపట్టి పొమ్మనిన గన్గొన వచ్చితి నీస్వయంవరం
బలుక నెవండు న న్నెదురు నాతని కంబిక శత్రు వయ్యెడున్.

మ. బలమిచ్చున్ యశమిచ్చు సంపదలిడున్ బాలించుఁ దేలించు దు
ర్బలులన్ జేయు దరిద్రులం బొనరుచున్ భంజించు గుంజించు నే
యలఘుప్రాభవ యేజగజ్జనని యేయార్యామహాదేవి త
ద్బలమే నాకు బలంబు తక్కబలమున్ బాటింప నే నెన్నఁడున్.

క. శక్తు లశక్తులు గలరే
శక్తియనుగ్రహము గల్గు జనులే శక్తుల్
శక్తికృపలేనివార ల
శక్తులు బ్రహ్మాదులైన జనవరులారా! ౪౮౧

చ. జయమయినం బరాజయము సంభవమైనను నాకుఁ గాదు త
జ్జయ మజయమ్మనన్ యశ మసద్యశమున్ జగదంబ, కట్టి నా
కయి పగవంగఁ బోకుఁడు మహామహులార! దయాళులార! ని
శ్చయముగ నేను శక్తుఁడ నశక్తుఁడ నేమిటి కీవిచారముల్. ౪౮౨

వ. అను నాతని వచనమ్ములకు సంతసించి కొందఱు రాజు లిట్లనిరి.

క. నీపల్కులెల్ల నిక్కము
భూపకులవతంస! నీవు పుణ్యాత్ముఁడ వెం
తో పగఁ బూని యుధాజి
ద్భూపతి యున్నాఁడు మఱచి పోయెదుసుమ్మీ! ౪౮౩

వ. నావుడు సుదర్శనుండు రాజేంద్రులారా! మీకు నాయందను గ్రహం బింత యొప్పినకతనం గదా యింతవట్టు నాకెఱింగించితిరి. దైవాధీనం బగు నీచరాచరాత్మక ప్రపంచంబున మృత్యువనునది తనంతన సంఘటించునుగాని యొకని నొకఁడు చంపువాఁడు లేఁడు. జీవుండు కర్మాధీనుండుగాని స్వతంత్రుండుగాఁడు. కర్మంబును సంచితవర్తమాన ప్రారబ్ధభేదమ్మున మూఁడుదెఱంగులై యొప్పుఁ గాలకర్మస్వభావ వ్యాప్తంబగు నీజగంబునఁ గాలంబాసన్నంబుఁ గాదేని దేవునకైనఁ జంపఁనశక్యంబు. కాలవశంబున మృతులగుప్రాణులకు యముండు నిమిత్తమాత్రంబుగా నెఱుంగునది. సింహంబు కతన మజ్జనకుండును యుధాజిత్తు కారణంబున మన్మాతామహుండును మృతులగుటయు నిట్టిదకా తెలియుఁడు. తానెంత ప్రయత్నం బొనర్చినను దైవయోగంబు మూఁడినఁ జావక తీరదు. ౪౮౪

గీ. ఎవ్వఁడో తన్ను రక్షింపనేల? దైవ
బలమొకటి తప్పకుండిన వాఁడు శత్రు

భయము రోగాదిభయమును బాసి వేయి
వత్సరమ్ములు జీవించు వంత తగునె ? గి౪౬

క. శుభమును నశుభమును నీ
యుభయమును బురాకృతమున నోడఁగూడును దా
ను భయంబందినఁ దప్ప ద
నుభవించియ తీరవలయును నరుల కెల్లన్. ౪౮౭

గీ. తా నొనర్చిన కర్మంబు తనకుఁ గష్ట
మొసఁగుతఱి తెల్విగలవాఁడు వ్యసనపడఁడు
అన్యు లపకారమును దన కాచరించి
రనుచు నజ్ఞుండు వైరమ్ముఁగని కృశించు. ౪౮౮

ఉ. దైవము నమ్మి వచ్చితిని దైవము సైన్యము తోడు నీడయున్
దైవము తల్లిదండ్రులును దైవము వైరియు నాకు సర్వమున్
దైవము తద్భవంబు సుఖదాయియొ కష్టము నిచ్చునట్టిదో
భావిఫలం బెఱుంగ మనపాటి మనుష్యుల కర్హ మెట్లగున్ ?

గీ. అయ్యుధాజిత్తు సుఖములనందుఁ గాక
యతఁడు శత్రుండుగాఁడు నే నతనికైన
నగుదుఁ గాక మఱేమి, లోకైక జనని
కలదు నా పాలిటికిఁ గల్పకంబు పగిది. ౪౯౦

వ. అనుడు నెల్లరు సంతసించిరి సుదర్శనుండును దన యెడ కరిగి
సుఖంబుండె. మఱునాఁడు సుబాహునిచే నాహూతులై రాజ
న్యులందఱును దదాస్థానమ్మున విమాన సంగతు లగు నమరులం
బోలె మంచంబుల నధిష్ఠించి శశికలాగమనమ్మున కెదురు
చూచుచు నక్కలికి యెవ్వని వరించునో యని సందేహించు

వారును సుదర్శనుండక్క నోరుల వరింపదను వారలును నట్లైన నన్యోన్య కలహంబు దప్ప దనువారును నై యుండు నెడ,

ఉ. మంగళ వాద్యముల్ సెలఁగ మజ్జనమాడి విభూషితాంగియై
యంగజుపూవు బాణమన నా లలితాంగియుఁ బట్టుపుట్టముల్
రంగుగఁ గట్టి యొప్పుగఁ గరంబునయందు మధూకమాల వే
లంగ నృపాలపుత్త్రిలు కలంగఁ జెలంగి సఖీసమేత యై, ౪౯-౨

వ. తత్సభానికటమ్మున నొక మణిస్తంభంబు చాటునఁ దలవంచుకొని చింతించుచున్నం గని స్మితపూర్వకంబుగ సుబాహుం డిట్లనియె. ౪౯-౩

శా. అమ్మా! కన్గొనుమమ్మ! రాజసుతు లత్యంతోన్నతుల్ మేటిరూ
పమ్మందుర్ మదనుల్ యశోన్వితు లతిప్రౌఢుల్ నినుర్ గైకొన
న్నెమ్మి న్నేఁడిట వచ్చియుండి రొకరుల్ నీకిష్ట మూవాని నే
ర్పొమ్మా! మాపవయఃకులోన్నతి కలాకూలంకపాలంకృతుల్.

వ. అనుడుఁ దండ్రికి నక్కుమారిక యిట్లనియె. ౪౯-౫

ఉ. కాముకు లున్మదుల్ శఠులు కశ్మలచిత్తులు పాతకుల్ జగ
త్పాపములు వీరియగ్రమున సాధ్వులు వర్తిలరాదు "సాధ్వియౌ
భామిని భర్తఁదక్క నొరుఁబాఱఁగఁ జూడఁగ రా" దటంచు వి
ద్యామహితుల్ వచింతు రిది ధర్మ విరుద్ధ మొనర్ప నేర్తునే?

క. పలువుర దృగ్విషయంబై
కులకన్యక చనిన దానికొఱ కెల్లరునుం
దలపోయుదు రెల్లిదమగు
వెలపొలఁతుకభంగి దానివిభవం బెల్లన్. ౪౯-౭

ఉ. మాలిక చేతఁ బూని తగుమానినిభంగి స్వయంవరస్థలం
బేలలితాంగి త్రొక్కు నదియే వెలభామిని వేఱ యున్నదే
చాలుగనున్న యీనృపతిసంఘములోఁ జొఱఁబాఱ నాకునుం
బోలునె తండ్రి! యేను వెలబోటినె యిప్పని నాచరింపఁగన్ ?

క. ఏను సుదర్శను సామ్మో
దానన కద! సభకు నేగి తక్కొరుఁ జూడం
గానేమి మానమున కవ
మానం బొనరింపఁ దగునె మానిని నయ్యున్ ? ౪౯౯

మ. వసధుల్ వట్టిన భూమి నక్కులయినన్ భాస్వంతుఁ డస్తాచల
మ్మున నావిర్భవమందినన్ శశికుహూస్ఫూర్తిన్ బ్రివర్తించినన్
విను మే నల్లసుదర్శనున్ విడిచి పృథ్వీనాథు వేఱొక్కనిన్
గన మట్టన్ వినఁ బేర్కొనన్ మనమునన్ గాంక్షింప ముమ్మాటికిన్.

క. కావున నాతనికి నను
న్నీవిచ్చి వివాహ మెల్లినేఁటఁ దగు గతిన్
గావింపుము కాదేనిన్
జీవితమున కిపుడ విడుతుఁ జేరెఁడునీటన్. ౫౦౧

—* సుబాహుండు చింతించుట *—

వ. అనువచనంబు లాలించి సుబాహుం డితికర్తవ్యతామూఢుండై
తనమనమ్మున, ౫౦౨

ఉ. వచ్చినవారు రాజు లనవద్యచరిత్రులు వేనవేలు వీ
రిచ్చకమాడినన్ వెడల రేమియొనర్తు ? మదాత్మజాతకు
న్నచ్చిన యాసుదర్శనుఁడనన్ బలహీనుఁడు, నాకు వీరిచేఁ
జచ్చుట సంభవించె నిది శత్రువు పుత్రిక గాదు గా! తుదిన్.

వ. అని కొండొకసేపు విచారించి ధైర్యమ్ము దెచ్చుకొని పలువురితోఁ గలహించుట యెట్టిబలవంతునకేనిఁ దగదని వారినొప్పించువాఁడై వినయవినమితుండై బద్ధాంజలిపుటుండై దీనుండై డగ్గఱఁ జని యిట్లనియె. ౧౦౪

ఉ. ఓనరపాలురార! కరుణోదధులార! మహాత్ములార! నా
పై నెనరుంచి నాదుపొరపాటు క్షమించి యనుగ్రహించి నా
మానముఁ బ్రాణముల్ మిగుల మన్ననఁజేసి యొసంగి కూర్పుస
న్మానములన్ గ్రహించిచనుమానమునన్ దయసేయు టొప్పగున్

ఉ. ఎన్నివిధంబులన్ వితిచి యే బతిమాలిన వానిఁ దక్క మా
కన్నియ యన్యునొల్ల నని గట్టిగఁబట్టును బట్టియున్న దే
మన్నను మాఱువల్క దది యన్నెముఁ బున్నె మెఱుంగనేర ద
న్నన్న! మదర్థమై శ్రమమునందితి రిందఱునున్ వృథాగతిన్

మ. కరులన్ రత్నములన్ దురంగమములన్ గ్రామంబులన్ గాంతలన్
సిరులన్ సౌధములన్ మహాంబరములన్ శ్రీమించుపూఁదోఁటలన్
ధరణీరాజ్యమునెల్ల నిచ్చెదను నాతప్పొప్పులన్ సైఁచి కూఁ
తురుగా నాదుకొమార్తనెంచి నను నిర్దుష్టున్ బొనర్పందగున్

వ. అని బహుభంగులం బ్రార్థించు నాసుబాహుని కొక్కరును మాఱాడక మిన్నకుండిరి. యుధాజిత్తు క్రోధతామ్రాక్షుండై పండ్లు పటపటఁ గొరుకుచు నిట్లనియె. ౧౦౫

ఉ. ఏమివచించెదీవు మది నింతవివేకము లేక పుత్రికన్
సోమరివై సుదర్శనుని సొమ్ముగఁ జేయఁదలంచి యోగ్యులన్
భూమివరేణ్యులన్ వెడలిపొమ్మనలేకిటు నక్కజిత్తులన్
వేమఱు పన్నినన్ దెలియనేరమె తక్కొరు లంత మూర్ఖులే.

చం. మొదలన సందియం బయిన మూర్ఖుఁడవై యిటులెల్లరన్ వృథా
విధిమెయిఁ బిల్వఁబంచి పలవించినఁ బోవునె ! నన్నుఁ జూడు నీ
మదమడఁగించి చక్కఁడఁచి మందుని నిందు్యని నీసుదర్శనుః
బదిలము చేసి మన్మనికిఁ బట్టముగట్టెద నీకుమారికన్. ౫౧౦

క. అనిలో నాకొక్కసుద
ర్శనుఁ డుష్పో ! యూరుఁగాయొ ! సకలనరేందు్రిల్
పనిగొని యెదురుకొనిన నొ
క్కనిమిషమునఁ జక్కఁడంపఁ గలనెఱుఁగవొకో. ౫౧౧

శా. భారద్వాజమునిం గణించి మును తత్ప్రాణం బుపేక్షించితి
న్వీరుల్ వీరలుమెచ్చ నేఁడడఁతు నీనేర్పింకఁ జాలించి యా
నీరేజాక్షిని నాదుమన్మనికిఁ బెండ్లింజేసి రక్షించుకొ
మ్మా! రాజ్యంబు మదాశ్రియంబుకలిమిః మేలెంచి కీలెంచుమా.

తే. గీ. రాజ ! 'నీచాశ్రియోనకర్తవ్య' యనఁగ
వినవొ ? యేమని యీ సుదర్శనుని కిత్తు
వాత్మజాతను ; మహాదాశ్రియంబు గోరి
తేని నామనుమని కిమ్ము మాననేంద్ర ! ౫౧౩

క. ఒక్క సుదర్శనుఁ దక్కఁగఁ
దక్కొరుల వరించెనేనిఁ దగఁ లాటంబుల్
పొక్కవు మంటపమునకుః
జక్కఁగ నీతనయఁ బిలువఁ జనుము నృపాలా ! ౫౧౪

వ. అనిపల్కు నయ్యుధాజిత్తున కుత్తరం బీనేరక కాశీరాజు చింతా
క్రాంతుండై తలవంచుకొని యంతిపురమ్మున కరిగి భార్యం గాంచి
యిట్లను "నోతరుణీ ! యెల్లైన సుదర్శనుః విడిచి మనకన్నియ

యన్యుని వరించు నట్లొనరింపవలయుఁ గాదేని మానంబుదక్క ”
దనవుడు వల్లెయని యాపె శశికల పాలికిం జని మెల్లన నిట్లనియె.

ఉ. అమ్మరొ ! యాసుదర్శనునికన్న బలాఢ్యులు రూపవంతులున్
సొమ్ములు గల్గువారలును జూడఁగ వేలకొలంది వచ్చి ర
ర్థమ్మును బ్రాణమానములు దక్క విఁ కాతనిఁ గోరితేని మా
యమ్మ ! వినంగదమ్మ ! పదవమ్మ ! స్వయంవర రంగభూమికిన్.

క. వినుము సుదర్శనుఁ గోరిన
ఘనుఁడు యుధాజిత్తు వానిఁ గడతేర్చి క్షణం
బున నిన్ను నన్ను నీ జన
కుని నట్లొనరించు నంత క్రూరుఁడుఁ గలఁడే ౫౧౭

క. అని నయమున భయమున న
వ్వనజముఖికిఁ దెల్పు నా యవసరంబునఁ ద
జ్జనకుఁడు సుబాహు భూపతి
చనుదెంచి మఱియును జెప్పెఁ జనువున బలిమిన్. ౫౧౮

క. వెస నా శశికలయును దా
నసిధారావ్రతము పూని యగ్ని నుఱికెదన్
విసమున్ మెసవెద నన్యుఁడు
విషమాంబకుఁడైన నొల్ల వేయేమిటికిన్. ౫౧౯

చ. వినుము నృపాల ! నా మనవి వీరలకున్ మది జంకెదేని న
న్ననువుగ నా సుదర్శనున కర్పణఁజేసి రథమ్మునందు మ
మ్మునిచి మహోత్సవం బలర నూరికి నావల విడ్వ మట్లొన
ర్చిన నెదిరించు శత్రుల హరింపఁ గలాఁ డతఁ డాహవమ్మునన్.

వ. అను నబ్బాల-కతం డిట్లను. ౫౨౦

చ. పలువురితో విరోధమది బ్రహ్మకునైనఁ దరంబుగాదు నా
వలుకు గణించి పంతమును బట్టకు మెవ్వరికైన సాహసం
బలవడ దన్ని కార్యములయందును "వెట్టి యడంగె రోఁకలిఁ
దలకును జుట్టుమం" చనువిధమ్మునఁ బల్కుదురమ్మ పుత్రికా!

చ. వదలుమటంచుఁ జెప్పెదవు వారలు వీరలు వైరయుక్తు లు
న్మదులు నృశంసు లెల్ల నరనాయకులుఁ మిముఁజుట్టి యేకమై
కదిసిన మీరొనర్పఁగల కార్య మొకించుక యేని లేదు నా
మది యెటులొప్పు దుర్మదులు మానక యెంతకునైన నొప్పరే?

వ. నా కొక్క యుపాయంబు దోఁచుచున్నయది. మున్ను సీతా
వివాహమ్మున జనకుం బలెఁ బణం బేర్పఱతు నట్లైన నిర్వివాదం
బుగ సమర్థుఁడగు వేరొకఁడుగాని సుదర్శనుండుగాని నిన్నుం
గైకొను ననుడు శశికల యిట్లను నోయయ్యా! సమర్థుండైనఁ
గాకున్న నాకు సుదర్శనుండ భర్త కాని యన్యుండు గా
నేరఁడు. గీ.౨౮

ఉ. ఈవు పణంబు నేర్పఱచితేని ధనాంగనరీతి నేనుఁ
గావలె వీరికిఁ సమముగా వశనై; యొకఁడెవ్వఁడో ననుం
జేవ గలాఁడొ వేఱొకఁడొ చేకొను నప్పుడుమాత్రి మెల్లరుఁ
భూవిభు లూరకుందురె? సముద్ధతు లెంతురె ధర్మపద్ధతుల్.

క. ఏ విధినైనను గలహము
భావింతు లోకైకజనని భావించి ననుఁ
దేవేరిగ నొనరింపు య
థావిధిగ సుదర్శనునకుఁ దలఁకకుమింకన్. గీ.౨౯

వ. స్వయంవర మంటపమ్మున కరిగి రాజులం గాంచి యుపాయ మ్మగ నిట్లనుము. "నేటిదినమ్మున కీ సభం జాలింత మెల్లైన నీ కార్యంబు నెల్లి సమర్థించెద నిది నిక్కువ" మని యవ్వారిని విడిదల కంపించి యీ రేయి గుప్తంబుగ నాతని రావించి విధి విధానంబుగ నన్ను సమర్పింపుము. మీఁద నాతండు నన్నుఁ దన రథంబునం దిడికొని పోవనేర్చు రాజులు సంగరోన్ముఖులై దుర్మదమ్మున నడ్డుపడిరేని యస్మదుపాసితయగు శక్తియ నివారించుఁగాక. కాదేని సుదర్శనుతోడి లోకంబ నాకును జేకుఱు నింత నిశ్చయంబని మఱియును, గీ-౨౭

క. ఒసఁగిన నొసఁగుము విధిగా
నొసఁగంగా నేరవేని యొగి నాయంతన్
బ్రిసవశరుఁడు సాక్షిగ దే
వి సహాయగ నతని వెంట వెడలెద ననుడున్. గీ-౨౮

—* శశికలా వివాహము *—

వ. సుబాహుండును గుప్తంబుగా సుదర్శనునకు వివాహంబు సేయం దలంచి చని సభ్యుల కిట్లను. నేఁటి కీ సభ చాలింతము రేపు భవదిచ్ఛానుసరణంబుగ స్వయంవరంబగుఁ దడవొనరింపక ప్రకృతము విడుదులకు దయసేయుం డనుడు నంగీకరించి రాజన్యులందఱును శిబిరమ్ముల కేగి పురంబు నల్గడల రక్షకుల నియోగించి సుఖంబుండి రంత నతండును వివాహంబునకుఁ దగు సంభారం బొనరించి యార్యుల రావించి యెరుఁగకుండ సుదర్శనుని బిలిపించి మంగళస్నానాదికృత్యంబులు నిర్వర్తించి యిరువుర నేకవేదిఁ గై సేయఁ జేసి యాచమనీయార్ఘ్యపాద్యమ్ము లాచరించి యనర్ఘవస్త్రద్వయం బొసంగి మధుపర్కంబిడి గోవును

సమర్పించి కుండలమ్ము లలంకరించి విధివిధానమ్ముగఁ గన్యా
దానం బొనరించె. గి.౨౯

ఉ. అంత సుదర్శనుండు దగ నాలలితాంగి సుధాకరాస్య సు
స్వాంత ననంతరమ్యగుణ నంబుజపత్ర విశాలనేత్రి ని
శ్చింత రమాసమన్ హరి శచీసతిఁ బోలె గ్రహించె మేదినీ
కాంతుఁడు గాశిరాజు పలుకానుకలన్ దనియించె నల్లునిన్.

ఉ. పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మిమెయిన్ దళుకారుబంగరుం
బొమ్మయుఁ బోని యానృపతిపుత్రిక నెత్తి యలంకరించి పొం
కమ్మగు యానమందు నెసకమ్మున నుంచియు మంటపమ్ముమ
ధ్యమ్ము నలంకరించిన సుదర్శనుపాలికిఁ దెచ్చి రిమ్ముగన్. గి.౩౧

వ. అంత బురోహితుండును నగ్న్యగ్నిధానం బొనరించి లాజావిసర్గంబు నిర్వర్తింపఁజేసి ప్రదక్షిణాదికం బొనరింపఁ జేయుడుఁ గాశీ రాజు సంతుష్టాంతరంగుఁడై సర్వోపస్కరయుతంబు లగు రెండువందల రథమ్ములును నానాలంకారయుతంబులగు ననేకప సహస్రమ్ములును విహంగమరాజవేగమ్ములగు తురంగాయుతమ్ము లును గ్రమేళకశతంబులును కాంచన భూషితంబులగు దాసీశతం బులును వివిధచిత్రవిచిత్రితంబులగు వాసగృహమ్ములును పూఁ దోటలును ప్రకటమ్ము లగు శకటమ్ములును తక్కుంగలుగు నానావిధవిశిష్టపదార్థమ్ములును నుపాయనంబుగా నొసంగి య ల్లునిఁ గారవించి వియ్యపురాలగు మనోరమం గాంచి విహితాం జలిపుటుండై యిట్లనియె. గి.౩౨

క. అమ్మా ! యీసుత నీసుతు
సొమ్మయి నప్పు డిఁక నీదుసొమ్మనవేలా.

నెమ్మిఁగలిగి యెంతయు గా
రమ్మున నేల్కొమ్మ నే గరములు మొగుడ్తున్. ౧౩౩

వ. అనుడు మనోరమ సంతోషపూర్వకంబుగ నిట్లను. ౧౩౪

గీ. ఇంతకన్నను వృద్ధిచే నెసఁగుమయ్య
రాజ్యహీనుండనక మహారాజవయ్యు
నిచ్చితివి మత్కుమారున కిగురుఁబోఁడి
రత్నపుంబొమ్మవోని గారాపుఁబుత్రి. ౧౩౫

ఉ. ధీరులయందు నుత్తముల ధీవసులందుఁ గృపాళులన్ మహో
దారుల వీరులన్ మఱియు ధన్యుల మాన్యుల నన్యులందు నిం
కేరు భవత్సమానులు? మహీంద్రమహేంద్ర! సుబాహుభూప! మా
భారము నీది నీ కొమిరెభారము మాయది నేఁటివారమే. ౧౩౬

ఉ. ఏరికినైనఁ బుత్రికలనిచ్చెడిచో ధనధాన్యసంపదా
ధారవిహార పుష్పవనతల్పము లాదిగఁ గల్గుభాగ్య వి
స్తారము నెంతు రెంతటి వదాన్యశిరోమణు ; లట్లుఁ గాక సా
ధారణు మత్కుమారకు సుతాపతిఁ జేసితి వింత యొప్పునే.

మ. ధనధాన్యంబులు గల్గి యెక్కుడగు విద్యాబుద్ధులం బొల్చి వ
ర్తనలం బెద్దలమెప్పుఁ గాంచిన మహాధన్యాత్ములౌ రాజనం
దనులన్ జూడక నీకుమారి తనయంత న్నాతనూజాతు ని
ర్ధనునిం గోరుట కేను మెచ్చ నిను నాంతర్యమ్మునన్ మెచ్చెదన్.

వ. అనవుడుఁ బ్రీతుండై సుబాహుం "డోయమ్మా! నీకొమరుండు రాజ్యవిహీనుండని విచారింపనేల? మద్రాజ్యం బఖిలం బతనిది కాదే" యని మఱియును, ౧౩౭

శా. నారాజ్యం బఖిలంబు నిచ్చెదను సేనాసీత్వముం బూనెదన్
నీరాజ్యం బిది యేను సేవకుఁడ నా నీభేదమేలా ? పయో
నీరన్యాయమునన్ వసింపుదము మన్నీలున్న వారింకఁ ద
ద్వైరం బెట్టులొ సామదానములనో వారింతు భేదాననో. ౫౪౦

క. ఆమాఁట జక్కఁబడ రే
నేమారమెన్ సంగరంబె యే నొనరింతున్
బో ! మానిని ! జగదంబిక
యే మన కన్నిఁటికిఁ గలఁ ది కేటికిఁ జింతల్. ౫౪౧

వ. నావుడు మనోరమ యిట్లను. ౫౪౨

ఉ. నీవచనంబు చేతన జనించె ముదంబు మదంబ నీకు సా
ధ్వ్యావహాయమ్యోదన్ సుఖములందును పుత్రులతోడఁగూడి యీ
భూవలయంబు నీవ తగుపోణిమి నేలుకొనంగదయ్య ! మ
ద్దేవియ మత్కుమారునకుఁ దెచ్చి యొసంగును దండిరాజ్యమున్. ౫౪౩

చ. కరమున మన్ను పట్ట నది కాంచనమౌఁ దనయత్న మింతయుం
బొరయక యే సమస్తమును బూర్ణమగున్ బ్రజలందఱున్ మహా
దరము వహింత్రు నెమ్మది ముదమ్మునఁ బొంగు సమస్త కార్యమున్
సరిపడు నొక్కపెట్ట గ్రహచారము చాలినయప్పుడేరికిన్. ౫౪౪

ఉ. చింత యొకింత లే దఖిలజీవులకున్ సుఖవేళఁ గష్ట మొ
క్కింతయు రాదు కష్టమున నించుకయున్ సుఖమబ్బఁ బోదు లె
మ్మింతకు నాతనూజునకు నిప్పటికాలము మంచిచాట నా
వంతయు వంతరాదిఁకఁ బ్రియత్న మొనర్పుము కూఁతునంపఁగన్. ౫౪౫

వ. అని యన్యోన్యకష్టసుఖపరిచారమ్ముల నారేయిఁ గడపుచున్నంత
నగరమ్మున విడిసియున్న రాజకుమారులు మంగళతూర్యాదిని
స్వనమ్ము లొక్కింత యూలించి, ౫౪౬

ఉ. కొందఱిదేమి హేతువనుకొందురు కొందఱు పెండ్లికాల మీ
చందమునం జెలంగు ననె సందియ మందరు కొంద ఱీనృపుం
డందఱ మోసపుచ్చి తనయాత్మజ నాతనికిచ్చి పెండిలిం
దొందరగా నొనర్చెడివినోదము గాఁదగు నందు రమ్మొయిన్. ౫౮౭

ఉ. అంతటఁ గాశిరాజు వినయమ్మున రాజులఁ బిల్వ నేగ భూ
కాంతులయం దొకండయిన గౌరవమున్ బొనరింపఁ డంతయున్
స్వాంతమునం దెఱింగియు సుబాహుఁడు వెల్వలఁబోక "యోధరా
కాంతులు! పెండ్లి విందునకుఁగా దయ సేయుఁడు మీర లెల్లరున్.

క. నాపుత్రి యెంత చెప్పిన
మాపలుకులు వినక తనదుమది కెక్కిన యా
భూపతనూజు సుదర్శను
నే పెండిలియాడెఁ జెప్పఁ డేమి యొనర్తున్? ౫౮౮

తే. గీ. మిమ్ము నిచ్చోట దయఁజూపి మించుపేర్మి
నించి నా గౌరవమును రక్షించుపొంటె
వేడుకొనియెద" నావుడు ఱేఁడులెల్లఁ
దలలు వంకించి యీరీతిఁ బలికి రతని. ౫౮౯

క. భోజనములాయె నొకరును
రాజా! రాఁజాల రకట! రాత్రి వివాహ
శ్రీ జరిపి బడలియుంటివి
భోజనమున కేమి! పొమ్ము పోదుము మేమున్. ౫౯౦

వ. నావుడు సుబాహుండు వారలమనంబు గ్రహించి సంశయించుచు
నగరికరిగె నంత నారాజులలోఁ గొందఱు సుదర్శనుం జంపి కన్య
కన్ గైకొందమనువారును నది న్యాయంబుగాదు మిన్నక
యుత్సవంబు నాలోకించి పోవుదమనువారును మఱియు నానా

పరికారంబులఁ బరిసంగించువారునునై యాయామార్గమ్ములం గాచియుండిరి. సుబాహుండు తక్కు-కార్యంబుల సలక్షణమ్ముగా నెఱవేర్చి యల్లుని సతీసమేతమ్ముగా నంపువాఁడై పారిబర్హం బొసంగుచున్నంత, ౧౧౧౨

—* సుదర్శన యుధాజిత్తుల యుద్ధము. *—

క. దూతలువచ్చి సుబాహుధ
రాతలపతి కిట్టులనిరి రాజా! నీ జా
మాత నిపుడంపఁబోకు మ
రాతులు గలరయ్య త్రోవ రక్కసుల క్రియఁన్. ౧౧౧౩

వ. నావుడు సుబాహుం డంతకుమున్న రాజులచందం బెఱింగిన వాఁడగుటంజేసి సంశయించుచుండ సుదర్శనుం డిట్లనియె.

చ. నృపవర! వారలేమి యొనరింపఁగలా రొనరించిగేని స
త్కృపగల తల్లి యా జగదధీశ్వరి నాకు సహాయభూతయై
రిపుల నడంపకున్నె తగురీతిఁ బ్రయాణమొనర్పుమయ్య మా
తపసుల యాశ్రమమ్మున ముదంబున నుండెదమయ్య! తద్దయున్.

మ. తగువాసం బది గాదటంచు మదిఁ జింతం జేయఁగాఁబోకు మొ
ప్పగు మా యాశ్రమమందు దివ్యమణి దీవ్యత్కందరాజాతమా
సొగసుంగుల్కెడి బావులా చెఱువులా సొంపారుపూఁదోఁటలా
నగరుల్ మీనగరంబులుం దగవు విన్నాణంబునన్ దానికిన్.

వ. అనవ్వడుఁ గాశిరాజును నసంఖ్యమ్ముగా ధనం బొసంగి సతీసమే తంబుగా నంపుచుఁ దానును బలసమేతంబుగాఁ బిఱుందన వెడలె.

ఉ. అంత సుదర్శనుండు దనయంకమునందలి కాంతతో రతీ
కాంతుఁడు నాఁగ నిర్భయముగాఁ జనుదెంచెడివేళ రాజు ల

త్యంత "మదే రథం బదె సుదర్శనుఁ డేగెడుఁ గాంతఁ గూడి మీ
పంతములెల్లఁ జెల్లఁ జని పట్టుఁడు కొట్టుఁ" డ టంచు రేఁగిరన్.

వ. సుబాహుండు వారల కడ్డపడియె నంత సుదర్శనుండు నిశ్చల చిత్తమ్మున నేకాక్షరమ్మగు కామరాజమహామంత్రంబు జపించుచు నంబాపదనళినంబులు మనంబున గుఱికొల్పి యుండె నాలోనన యుధాజిత్తును శత్రుజిత్తుఁ దాఁకిన, ౧౫౯

ఉ. వీఁక సుబాహుఁ డాత్మభుజవీర్య మెలర్పఁగ శంఖదుందుభి
ప్రాకటరావముల్ సెలఁగ బాణపరంపరలన్ యుధాజిదా
ఖ్యాకు నెదిర్చె నిర్వుర కఖండముగాఁ బొసఁగెన్ రణంబు ! ని
ర్భీకత నంబపై మనము వెట్టె సుదర్శనుఁ డప్పు డొప్పుగన్.

ఉ. దారుణరీతిగా రణము తద్గతి నొప్పుచునుండ దివ్యదా
కారముతో మహాయుధనికాయముతోఁ దగువల్వతో నలం
కారముతోడఁ గల్పసుమకాండ పరీవృత దివ్యమాలికా
భారముతో మృగాధిపతివాహనయై జగదంబ గ్రిక్కునన్, ౧౬౧

వ. ప్రత్యక్షం బగుడు సుదర్శనుండు హర్షపులకితగాత్రుండై మామ కుం జూపుచు, ౧౬౨

ఉ. ఇంక భయమ్ము చెంద మన కేమిటి కంచు రథమ్ము డిగ్గి యే
ణాంకముఖీలలామ యగు నంగనతోఁ దనమామతోడ ని
శ్శంకఁ దదంబికాంఘ్రి జలజమ్ములకుం బ్రణమిల్లె నెన్న లా
తంకము చెంద సింగమును ధ్వాన మొనర్చె ననూనరీతిగన్.

వ. మఱియు ఘోరవాయువులు వీచె దిక్కులు మిక్కిలి దారుణ ప్రకారంబులయ్యె దానంజేసి రాజులందఱును భీతిల్లి నిశ్చేష్టులై

మహాశ్చర్యపర్యాకులులై చూచుచున్నంత సుదర్శనుండు సేనాధిపతి కిట్లను. అస్మదుపాసితయగు జగదంబ శరణమై యేతెంచె నింక నీ వోరులకుఁ దలంకక రాజసంకులమ్మగు పథమ్మున ననర్గళమ్ముగ సైన్యమ్ముఁ బోనిమ్మనవుడు నతఁ డట్లచేసె యుధాజిత్తు భయగ్రస్తులై మాఁన్పడి చూచుచున్న రాజులంగని యిట్లనియె. ౧౬౪

ఉ. సింగముమీఁద నెక్కి యొక చేడియ వచ్చినయంత భీతులై
కుంగగనేల ? రాజు లధికుల్ గలచో నొక దుర్బలుండు త
న్వంగిని జేకొనంగ నదియారసి యూరకయుండఁ జెల్లునే ?
వెంగలి వీనిఁ జంపి బృధివీపతిపుత్రికఁ దెత్త మిత్తఱిన్. ౧౬౫

క. అని తాను శత్రుజిత్తును
గినిసి సుదర్శనునివంకఁ గీలించె శరా
సన మాకర్ణాంతంబుగ
ననేక బాణముల వాని నాతఁడు దుంచెన్. ౧౬౬

వ. అంత నంబికయు, ౧౬౭

చ. కనులను మిణ్గురుల్ సెదరఁగా నృపులందఱు కన్నిరూపులై
కనలి యనేకబాణముల గాఁడఁగనేసిన సంకులక్రమం
బునఁ దగె యుద్ధరంగము సముజ్జ్వలదేతదనూనబాణమ
ర్దనమున శత్రుజిత్తతనితాతయుఁ గూడఁ బరేతులై రొగిన్.

వ. తక్కంగలవార లందఱు నద్దానికిఁ బరమాద్భుతం బందిరి. సుబాహుండు పరమప్రీతుండై యానందబాష్పమ్ములు వెల్లివిరియ నప్పరశక్తి నిట్లని వినుతించె. ౧౬౮

ఉ. పేరిమి సర్వభక్త జనపీడ లడంచెడి తల్లిరో ! నమ
స్కారము, శాంతి విద్య శివ కామద నాఁజను తల్లిరో ! నమ
స్కారము, కొల్చువారలకు సంపద లిచ్చెడి తల్లిరో ! నమ
స్కార, మకారణంబ యుపకార మొనర్చుట నీక చెల్లెడిన్. ౧౭౦

పంచచామరము. సమస్త జంతుజాలమున్ ప్రశస్త సత్కృపాకటా
క్షమంగళోజ్జ్వలత్తరంగ సంగతిం బొసంగఁ జే
సి మేలుఁగూర్చి ప్రోచుతల్లి ! శ్రీకరిన్ నినున్ సదా
నమస్కరింతుఁబ్రోవుమమ్మ! నన్నుఁబేర్మిమీఱఁగన్.

క. అగుణవగు నిన్నుఁ గొనియా
డఁగలనె ? మూఢుండ సగుణుఁడన్ దుష్టుండన్
భగవతి ! నీ యాథార్థ్యం
బు గనం జాలరు విరించి ముఖులగు సురలున్. ౧౭౨

గీ. ఈవ వాగ్దేవతవు, బుద్ధి వీవ, మతివి
నీవ, జంతువులకు గతి నీవ, నిన్ను
నుతి యొనర్పంగఁ దరమె ? మనోనియంత్రి
వగుచు నెల్లెడ వర్తింతు వఖిల జనని ! ౧౭౩

ఉ. తావకభక్తముఖ్యుఁడు సుదర్శను సంగతిఁ జేసియేకదా !
భావుకమై యశేష జనపావనమై యజముఖ్యదుర్లభం
బై వెలుగొందు త్వత్పదనవాంబురుహద్వయి సూడఁగంటి నీ
సేవకకోటిలో నొకనిఁ జేసి ననుం గరుణించు మమ్మరో ! ౧౭౪

ఉ. అంబ ! రిపున్ హరించి భవదంఘ్రి రజోలవలేశధారి బా
లుం బలహీనునిన్ విజయలోలు ననాథు సుదర్శనున్ గృపా
లంబితచిత్తవై శశికలాసతితోఁ గరుణించి తింత పూ
ర్ణం బగునమ్మ ! నెమ్మి నిను నమ్మి భజించెడి భక్తకోటిపై.

మ. ధర భారమ్మ సహింపఁజాల నని వంతం బొందు మాకున్ దురు
ద్ధర మీకార్యము ద్వాపరాంతమున దుర్ధర్షస్థితిన్ భూభరో
ద్ధరణార్థం బవతార మెత్తుము నిరాతంకంబుగా భూస్థలిం
గరుణింపన్ దగదే యనాథులకు నీకన్నన్ బరుల్ గల్గిరే! ౩౮౦

వ. నావుడు సతం డిట్లను. ౩౮౧

ఆ. వె. ఏను నీవు రుద్రుఁ డితరులు నమరులు
నస్వతంత్రులనుచు నరయు మఖిల
జగము యోగమాయసంగతి గుణసూత్ర
కలిత మగుచునుండుఁ గంజసూతి ! ౩౮౨

వ. ఆపె దా నెట్లొనర్ప నిచ్ఛగించు నట్లు చేయుదము మనమందఱ
మును తద్వశగతులము, అట్లుకానినాఁడు మున్ను నేను మత్స్య
కచ్ఛపాదికుచ్ఛయోనులన్ జనింతునే! యని వెండియు. ౩౮౩

క. ఆర్యములు గానినింద్యపుఁ
దిర్యగ్యోనుల జనింపఁ దివురుట సుఖతా
త్పర్యమొ పుణ్యమొ కీర్తియొ
శౌర్యమొ భోగమొ మఱేమి సారస్యంబో ! ౩౮౪

వ. కిటినృసింహవామనరూపమ్ములు ధరించుటకును నయ్యంబయ
నిమిత్తం బదియునుం గాక, ౩౮౫

క. ఘనుఁడగు జమదగ్నిమహా
మునికిఁ బరశురాముఁడనఁగఁ బొడమి నృపతులన్
దునిమి తటాకంబులు గా
నొనరించితి రక్త మిదియు నోకసుకృతంబే ! ౩౮౬

వ. మీఁద రాముఁడనై జటావల్కలంబులు ధరియించి దండకార ణ్యమ్మునం దిరుగుచు నన్నపానాదులు లేమిఁ గృశించి రాజ చిహ్నంబులు విడిచి సిగ్గఱి పాదచారినై గుహ్మరుచు మాయా పిహితుండనైన కతనఁ గాంచనమృగంబు కలకేలాం కెలుంగక యొక యీరమ్మున నప్పుడమిచూలిం ద్యజించి యరుగుడు నఁత లక్ష్మణుండును గొండొక సేపునకు వెన్నడి వచ్చె. 3౮౭

ఉ. పిమ్మట భిక్షురూపమునఁ బేశలగాత్రిని సీత నెత్తికొం
చమ్మెయి రావణుండరిగె నంత లతాంగిని గాన కేను శో
కమ్మ గడల్గొనంగ నల కాననమెల్లను జూచి యేతద
ర్థమ్మున మైత్రిఁ జేసితిఁగదా ! రవిపుత్రునితోడ నారయన్.

శా. వాలిం జంపితి ధర్మబాహ్యముగ నాపై వానరానీకము
ద్వేలంబై వెనువెంట రా దనుజులన్ దీండ్రింపఁగా లంక కా
భీలప్రక్రియ నేగి యచ్చట నగంభీరుండనై నాగపా
శాళిం జిక్కితి సానుజుండ నయి, యన్యాధీనతల్ కూడ నే.

గీ. పాశములఁ జిక్కి చింతపాల్పడిన యన్న
దమ్ములను మమ్మ విడిపించెఁ దతబలుండు
గరుడుఁ డప్పుడు నామదిఁ గలుగుచింత
యింత యని చెప్ప శక్యమె యేరికేని ? 3౯౦

సీ. రాజ్యమ్మ పోయె నరణ్యంబు గతి యాయె
భార్యయు రక్కసుపాలఁ బడియె
నతికష్టమగు రణస్థితి పొసంగె నిఁకేమి
సేయువాఁడ వనమ్ము చెంత కనుచు
నప్పుడు తండ్రి గన్వైనను నాకీఁడు
ధనహీనుఁడఁ బదాతి ననద నకట !

రెంతటి ధనికున కేనియు వనవాస
మతిభరంబగుఁ జెప్ప నలవి యగునె

సీ. మాదృశునకంచు క్షత్రధర్మంబు విడిచి
బోయవడుపున నవ్వనంబునఁ జతుర్ద
శాబ్దములు వేఁగి మీఁద జయమ్ముఁ గొంటి
దైవవశమున, నాకు స్వాతంత్ర్యమేది ? 3౯౧

వ. మీఁద జానకిం గైకొని యయోధ్యకరిగి కొంతకాలమ్ము సం
సార సుఖంబు లనుభవించుచుఁ బ్రజలఁ బాలించుచున్నంత.

గీ. కడలుద్రొక్కిన పడఁతిని విడువలేక
మరలఁ గైకొనె నితఁ డనుమాట కోప
లేక విడిచితి సీత సుశ్లోక నటవి
నకట ! లోకాపవాద కేమనఁగవచ్చు. 3౯3

క. పిమ్మట న త్తరుణీవిర
హమ్మున సంప్రాప్తమయ్యె నతిదుఃఖ మ్మ
క్కొమ్మ రసాతలమున కరి
గెమ్మహి భేదించుకొని యొగిం దనయంతన్. 3౯౪

ఉ. ఏనును దమ్ములుం బిదప నేగితి మొక్కమొగిన్ నిలింపసం
స్థానము నిట్టి నాకుఁ బరతంత్రత గాక స్వతంత్రభావ మెం
దేనియుఁ గల్గునెట్లు ! విను మీవును రుద్రుఁడు నిట్టివార లే
జ్ఞానములేమి మాయకు వశమ్ముగ నిమ్ముగ నుందు మెప్పుడున్.

వ. అని మఱియు నిట్లను. 3౯౬

ఉ. ఏ మహనీయ మాయ మన కేరికి గోచరిగాక యుండు ను
ద్దాముని శాంతుఁ దత్త్వమయుఁ దారకు నప్పురపూరుషున్ గనన్.

తే "మహా" మంచు గర్వమున నిక్కదు మప్పురవస్తు వాస్తవ
స్థేమము నాఁడు చూచితిమి దెప్పరమాగతి నీ వెఱుంగవే. ౩౯౭

వ. అని సురల కిట్లనుఁ గల్పాదియందు సుధాసముద్రమ్మున మణి
ద్వీపమ్మున రాసమండలమ్మున మాచే నదృష్టపూర్వయు నశ్రుత
చరియునగు జగదంబ చూడంబడియె, సర్వకామప్రదయగు నా
పెఁ భజించిన మీ మనోరథమ్ముసిద్ధించు ననవుడు బ్రహ్మదు లా
యంబను మనమ్మున నిలిపి వేఁడికొనిన నాకె ప్రత్యక్షంబయ్యె.

క. పాశాంకుశధారిణియు జ
పాశంకాకరణకాంతిపాటవకలనా
పేశలగాత్రియు నగు జగ
దీశానిం గాంచి యమరు లెనసినభక్తిఁ. ౩౯౯

వ. ఇట్లు నుతించిరి. ౪౦౦

ఆ. వె. తలఁప నూర్ణనాభివలనఁ దంతువులు వి
భావసునివలన నపారగతి స్ఫు
లింగములును బొడమలీలగా నీ జగ
మెచటఁ బుట్టు నాపె కెఱుఁగవలదె? ౪౦౧

—* దేవీ స్తుతి. *—

క. ఏ మాయాశక్తికి లో
నై మను నఖిలప్రపంచ మా భువనేశా
నీమహిమ నెన్నఁ దరమా
నే! మానులకైన మఱియు నెవ్వరికైనన్. ౪౦౨

వ. అని పెక్కుభంగుల నుతియించి తల్లీ! కంసాది దుష్టులచే జగం
బెంతయుఁ బీడింపఁబడుకతనఁ దద్భారం బోర్వక పుడమి నిన్ను

55. 

శరణంబు వేఁడెడి, హరిహరాదుల కసాధ్యులగు రక్కసులు నీచే సాధింప నగుదురు కావునఁ దత్సంహారం బొనరించి భారంబు దీర్పు మనవుడు నిందుఁడిట్లనియె. ౪౦౩

ఉ. ఏరును శక్తిశూన్యులయి యెప్పనిఁ జేయఁగలేరు బ్రహ్మకుఁ
భారతి, లచ్చి విష్ణునకుఁ, బార్వతి శూలికి, నుంటఁజేసి వీ
రారయ నాత్మకార్యములయందు సమర్థులు తత్సహాయతా
ధారములేమి వీరు ప్రభుతాగతికిం దగువారలాదురే. ౪౦౪

వ. హరి యిట్లనియె. ౪౦౫

గీ. నీదు కళ మాకు నొక్కింత నెగడదేని
నేము ముగుర మశక్తుల మింత నిజము
నీవు తోడింతయును లేక నిఖిలకృతుల
యందు ధారాళగతి నూని యుందువంబ! ౪౦౬

వ. నావుడు జగదంబ సంతుష్టయై సురలఁగాంచి యాగమనకారణం బేమనవుడు వారలిట్లనిరి. ౪౦౭

క. భూపాలకు లెల్లరుఁ గడుఁ
బాపాత్మతఁ దన్నుఁ గష్టపడఁ జేయఁగ స
ర్వ్యాపద కోపక భార
వ్యాపృతయై పుడమి వగచు నరయుము తల్లీ! ౪౦౮

వ. తద్భారంబు దీర్చుటయ మాకభిమతంబని వెండియు, ౪౦౯

సీ. దానవకోట్లతో దర్పించి యెదిరిన
మహిషాసురుని రూపు మాపలేదా
శుంభనిశుంభుల గాంభీర్య మెడలించి
రక్తబీజుని నేల రాయలేదా

చండముండాది రాక్షసుల నడఁగించి
ధూమ్రలోచనుతల దుంచ లేదొ
దుర్ముఖదుస్సహాదులఁ దునుమాడి క
రాళు నంతకపురిఁ దోల లేదొ

గీ. జనని నీచేతఁ ద్రెళ్ళినదనుజు లెంద
ఱో వచింపఁగఁ దరమె? భూదేవి భార
మును హరింపఁగదమ్మ మా మ్రొక్కులను గ్ర
హింపఁగదవమ్మ నీకన్న నెఱుఁగమమ్మ. ౪౧౦

క. నావుడు జగదంబ మొగం
బావిర్భూతస్మితోదయంబుగఁ బలికెన్
దేవతలతో నదభ్రసు
భావహాకాలాభ్రగర్జితార్భటి చెలఁగన్. ౪౧౧

గీ. అని జరాసంధముఖ్యుల నన్యదుష్ట
నరపతుల నందఱ హరింప నా మనమ్ము
నందు యోజించి యుంచితి సమరులెల్లఁ
బుడమిఁ బుట్టుండు స్వస్వాంశముల రయమున. ౪౧౨

గీ. యాదవకులమ్మునను బుట్టు ననఘుఁడైన
కశ్యపుఁడు వసుదేవుఁడై కాంతతోడఁ,
బాడము భృగుశాపమున విష్ణువును నతనికి
బుత్రుఁడై, యేను నందునిపుత్రి నగుదు. ౪౧౩

క. నందునకు యశోదకు నే
నందనినై పొడమి యొకఁ డనఁగ నేల పొసం
గందగు నన్నికృతుల నా
నందముమై నిర్వహింతు నమనవగతులన్. ౪౧౪

గీ. బంధనాగారగతుఁడగు పద్మనేత్రు
గోకులమ్మున కనిపెద గూఢవృత్తి
దేవకీగర్భగతు శేషుఁ దిగిచి రోహి
ణీలతాతన్వికడుపున నిలుపుదాన. ४०౫

క. బలరామకృష్ణు లిద్దఱు
నలయక మచ్ఛక్తియుక్తులగుకతన దురా
త్ముల ద్వాపరాంతమున ని
శ్చలగతి భూపతుల నెల్లఁ జంపుదు రెలమిన్. ४०౬

గీ. ఇంద్రునంశమ్మునన్ జనియించు నర్జు
నుం డతఁడు మాపు నరవర మండలంబు
యముఁ డనిలుఁ డశ్వినులు కారణముగ ధర్మ
జుఁడును భీముండుఁ గవలును బొడమఁ గలరు. ४०౭

వ. వీరును వస్వంశసంభూతుండగు భీష్మండును దుష్టహారణంబు విశే
షించి యొనర్తు రింతేల వీరు నిమిత్తమాత్రులుగా నిఖిలంబు
నేన నిర్వహింతు మీరు మీమీపొందుపట్ల కరుగుండని మఱి
యును. ४०౮

ఉ. క్షత్రియజాతినెల్లఁ బెలుచన్ హరియింతు రణావనిన్ గురు
క్షేత్రమునం దమంతన నశింతురు యాదవులున్ క్షణమ్మునం
జిత్రగతిన్ బ్రభాసమునఁ జేటగుత్మృష్ణయు నోర్వలేమియున్
ధాత్రునిదేశమున్ ధరణిద్రైవతశాపము నేకమై తగన్. ४०౯

క. పిమ్మటఁ గృష్ణుండును దే
హమ్ము విడుచు శాపకలన, నఖిలసురలు! మీ
రిమ్మెయి గోకులమున మధు
రమ్మహిళలతో జనింప రమణం జనుఁడీ. ४౧౦

వ. అని యానతిచ్చి యోగమాయారూపిణియగు నజ్జననియుఁ గను మొఱఁగినంత నమరులు స్వస్థానమ్మున కరిగిరి. ధర సర్వసస్యోపేతయై సుస్థిరమ్ముగనుండెఁ బ్రజలెల్లరు సుఖులైరి ద్విజులును మునులును సంతుష్టాంతరంగులై స్వధర్మనిర్వహణంబున జాగరూకులై యుండిరి. ౪౨౧

క. విను జనమేజయ ! యదుకుల
మున సరసిజలోచనుండు పొడమునిమిత్తం
బనివార్యంబగు శాపం
బును మాయాబలము క్షితిసముద్ధరణంబున్. ౪౨౨

గీ. ఎల్లరకు నెల్లశక్తుల నే పరాంబ
గలుగఁగాఁజేయు నా శక్తిబలము కలిమిఁ
గలిగె విష్ణువునకు గర్భకష్ట మింక
నితరు లీమాయ దాఁటువారేమొ చెప్పుమ. ౪౨౩

వ. రామావతారమ్మున నతని మునుపడ్డ బన్నములు వినియుంటివి కదా ! వేయునేల, యోగీంద్రులును " నేను నాయది " యను మహాపాశమ్మునఁ దవులుకొని తన్నివృత్తికై యాజగజ్జనని నారాధింతురు. ౪౨౪

క. లవలేశమేని నరుఁ డే
భువనేశ్వరి భక్తి వలనఁ బొగడిన ముక్తి
స్థవిరతఁ గాంచునో యాపె వి
భవ మేరికి నేని వినుతిపాత్రమ కాదే ! ౪౨౫

వ. విద్యయు నవిద్యయునని యప్పరశక్తికి రెండు రూపమ్ములు గలవు. విద్యకతమున ముక్తియు నవిద్యకతమున బంధమ్మును గలుగునని యెఱుంగునది.

క. అవతారము లన్నియు న
య్యావిద్యచే యంత్రితమ్ములగుకతమున వి
ష్ణువు తత్తద్బంధనములఁ
దవిలి సుఖాసుఖము లనుగతములుగ మెలఁగుర్. ౭౨౭

క. హరిగాని హరుఁడు గానీ
సరసిజసంభవుఁడు గాని చంద్రార్కసురే
శ్వరధనదయమధనంజయ
వరుణాదులు గాని యెఱుఁగు పరతంత్రులుగాన్. ౭౨౮

వ. మఱియు వసిష్ఠవామదేవ సనకసనందనాది మహామునులందఱును
దద్వశులకా యెఱుంగుము. ౭౨౯

గీ. హర్ష శోకాది భావమ్ము లమరుచుండు
దేహమున్నంతదనుక సందేహమేల ?
సురల నమరులటంచు నిర్జరులటంచుఁ
బల్కుదురు కొంద అది సరిపడునె యెందు ? ౭౩౦

గీ. ఆయు వధికంబు నల్పంబు నగుటదక్క
బ్రహ్మ మొదలుగ మశకంబు పారముగ స
మానగతి నొప్పు మరణ ; మమరులనంగ
నిర్జరులనంగ నెవ్వరో నృపవరేణ్య ! ౭౩౧

క. జననము మరణము ననునివి
జనవర ! చక్రక్రమంబు చందంబున నొ
ప్పు నొకనికిని శాశ్వతమనఁ
జనునే మాయాకృతంబు సకలంబరయన్. ౭౩౨

వ. అమ్మాయ యెంతదనుక నలవడు నందాఁక నెవ్వండును ముక్తుం డుగానేరఁ డుత్పత్తికాలమ్మునఁ బుట్టువెట్లగు నట్లు నాశకాలమ్మున యథాక్రమంబుగ నందఱకును నాశం బొదవు నిట్లుండ.

గీ. ఎవ్వఁడు నిమిత్త మాత్రమై యెవనిఁ జంపు
నతనిఁ దత్కర్తగా లోకు లందు, విధివ
శమ్మని యెఱుఁగఁజాలరు సౌఖ్యమేని
గష్టమేనియు నొక్కఁడేఁ గలుగు టెట్లు! ౪౩౪

ఉ. అందఱకుం సుఖప్రదు లటంచు వచించెడి సూర్యచంద్రు లే
కుందును జెంద రేమొ కనుఁగొమ్ము దినేంద్రునిపుత్రుఁ డిస్సిరో!
మందుఁడు, చంద్రుఁడంకమున గ్రమ్ము క్షయామయబాధఁజెందు నే
మందు! విధి ప్రచారము మహాత్ములకేనియు దాఁటరాదుగా!

ఉ. వేదములన్ రచించిన వివేకి చతుర్ముఖుఁ డాతఁ డాత్మదా
యాద సరస్వతింగని స్మరాతురుఁడయ్యె; హరుండు దక్షదా
యాద మృతింగనంగ మదనాగ్నికిఁ దాళఁగలేక సూర్యదా
యాదజలమ్మునంబడఁగ నానది నల్లవడెన్ దదాదిగన్. ౪౩౬

వ. ఆతం డొక్కనాఁడు క్రీడాసక్తుండై నగ్నభావమ్మున భృగువనమ్మున కరిగిన నమ్మునీంద్రుండు కనలి నిర్లజ్జుండవగు నీలింగంబు పతితం బయ్యెడుమని శపించెఁ బదంపడి యతండు దానవనిర్మితం బగు నమృతవాపీరసంబు పానంబుచేసె నిది యిట్లుండ నింద్రుండు వృషరూపమ్మున నొక భూపతికి నొక్కెడ వాహనంబయ్యె మఱియు. ౪౩౭

క. పరమపురుషుఁడఁట! హరియఁట!
కరము వివేకంబు గల్గు ఘనుఁడొనఁట! బం

గరు మృగము నిజంబెఱుఁగక
త్వరపడి యద్దానివెంటఁ దవులుట తగవే? ౪౩౮

క. మాయాబల మేరికి దుర్
జ్ఞేయం బక్కటనఁగాదె శ్రీరాముఁడు కా
మాయత్తుండై సతిఁ గో
ల్పోయిఁ యడుగఁదొడఁగె వృక్షముల నవ్వనిలో. ౪౩౯

ఆ. వె. "నాదు భార్య జనకనందిని సౌందర్య
నిధి సుశీల సీత నిరుపమాన
నెవ్వఁ డపహరించె నే యెడ కరిగెఁ జె
ప్పంగ రాదె పాదపమ్ములార! ౪౪౦

ఉ. తమ్ముఁడ లక్ష్మణా! యవితథమ్ముగఁ బ్రాణములం ద్యజింతు నే
నిమ్మెయి నీవు నట్లత్యజియింతువు నీ యనుజుండునుం ద్యజిం
చు మ్మనతల్లులుం దెగుట చోద్యమె కైకయు నాపెపుత్త్రుఁడుః
సమ్మదలీల రాజ్యమును సల్పుదు రక్కట! సీత పోయెనే. ౪౪౧

ఉ. రాఁగదవే మృగాక్షి! నను రంజనసేయఁగదే లతాంగి! నా
రాగ మెఱుంగవే తరుణి! రాముఁడఁ గానఁటవే నెలంత! వే
వేగ ననుగ్రహింపఁగదవే మదవేల్లితదంతిగామినీ!
యీగతి నన్ ద్యజింపఁదగవే నగవే యిది నీకు మానినీ!

గీ. నిన్ను విడనాడి బ్రతుకంగ నేర నంచు
నీ వెఱుంగవె నీ యెడ నేమి లోప
మాచరించితిఁ ద్వదధీను నరసి నన్ను
దీను నోదార్ప నిట కరుదేరఁ దగదె. ౪౪౩

ఉ. ఈగతి నవ్వనాంతరము నెల్లను జూచి ధరాత్మసంభవన్
దాఁ గనలేక సర్వజనతాగతి యా రఘురామమూర్తి వే
వేగఁ గపీంద్రునిన్ శరణువేఁడి తదీయసహాయతన్ రయం
బౌగతి వార్ధిఁగట్టి రణమందు జయించె నవధ్యు రావణున్.

ఉ. రావణ కుంభకర్ణులను రాక్షసవీరులఁ జంపి జానకిన్
బావనశీలఁ జూచి యలపాతకుఁ బొందితి వంచుఁ బల్కె నా
రా, విధి! సర్వముం దెలియునట్టి మహాత్మున కెంతవచ్చెఁ ద
ద్భావ మెఱింగి తా నిడియెఁ బావకశోధ ధరాత్మజాతయున్.

క. పిమ్మట నవ్వనితం గొని
సమ్మదమున నుండె రామచంద్రుఁడు మాయన్
సొమ్మసిలి యిట్టు లవతా
రమ్ముల విష్ణుండు మిగుల భ్రాంతిం బొరయున్. ౪౪౬

క. విను శ్రీకృష్ణునిచరితం
బును వచియించెదను నతని పుట్టువునకు నో
జనమేజయనరవర! య
య్యనిమిషకార్యంబ ముఖ్యమగు ఫలముసుమీ. ౪౪౭

శా. కాళిందీపులినమ్మునన్ విపులశాఖాశోభివృక్షావళీ
హేలాలోలత నొప్పెడి న్మధువనం బిందిందిరానందమై
కాలాభీలబలాధికుండు లవణాఖ్యాకుండు నాజన్మదు
శ్శీలుం డమ్మధుపుత్రుఁ డవ్వనమునం జేయు న్నివాసంబొగిన్.

మ. ధరణీదేవుల బాధ పెట్టుచు నితాంతమ్మున్ వరప్రాప్త దు
ర్భరగర్వమ్మున నిక్క నద్దనుజు సత్త్రాణుండు శత్రుఘ్నుఁ డు

ద్ధురుఁడై త్రెళ్లఁగ నేసి యవ్వనమునందుం బట్టణ మ్మొక్కఁడుఁ
ధరణీరత్నము నాఁగఁగట్టె మథురానామంబు చెన్నారఁగన్.

వ. అమ్మధురాపురమ్మునకుఁ బదంపడి తన పుత్రులఁ బుష్కరాక్షుల నిరువుర నొడయలుగఁ జేసి యరుగుడుఁ గొండొక కాలమ్మునకుఁ దద్వంశంబు క్షయంబగు కతన నప్పురి యాదవులకు వశమయ్యె.

గీ. ముక్తిదంబగు నప్పురమ్మును యయాతి
తనయుఁడగు శూరసేనుఁ డుద్ధతబలాఢ్యుఁ
డేలు నతనికిఁ బుత్రుఁడై యెసఁగెఁ గశ్య
పుఁడు వరుణశాపమునఁ జేసి భూవరేణ్య. ౪౫౧

వ. అతండు నైశ్వర్యవర్తనుండగు కతన నమ్మధురాపురంబు మధువంశ సంభవుండగు నుగ్రసేనుం డేలుచుండె నతని కొమరుండు కంసుండు, కశ్యపుభార్యయగు నదితి దేవకతనూజయై దేవకినాఁ బరఁగి కశ్యపాంశంబున జనియించిన వసుదేవునకు భార్యయయ్యె.

క. దేవకుఁడు దేవకిని వసు
దేవున కిడి పెండ్లిచేసె దేవహితముగా
నావేళ నంబరమ్మున
నావిర్భవ మందె నిట్టు లశరీరపుఁబలుకుల్. ౪౫౩

క. "విను మీదేవకి కుదయిం
చిన సంతానమున మిగులఁ జేవందగువాఁ
డెనిమిదవ కొమరుఁడాతఁడు
నినుఁ దునుముంజుమ్ము కంస ! నిర్జరహితుఁడై ". ౪౫౪

వ. అను నయ్యాకాశవాణి పలుకులకుఁ దలరి కంసుండు చింతాక్రాంతుండై తన మరణం బిక్కోమలిం జంపినఁ దప్పునని యట్లొనరింప నుంకించి నిజాంతర్గతంబున. ౪౫౫

గీ. చెలియ లుత్తమురాలు నాచేయు మన్న
నలకుఁ దగుఁగాని యిబ్భంగి నఱుకులకును
దగునె యని కొంత యోజించి తన మరణము
కన్న నొక్కింత యిది లెస్సగాదె యనుచు. ౧౫౬

క. కాయము గలిగినఁ బాపము
ప్రాయశ్చిత్తముననైనఁ బాయందగు నా
త్మీయశరీరము పాపో
పాయంబుననైన నిలుపఁ బాడియకాదే. ౧౫౭

వ. అని నిశ్చయించి,

ఆ. వె. ఎల్లవారుఁ జూచి యిది యేమి యనుచు నా
శ్చర్యమంద రయమెసంగఁ గత్తి
కరమునం దమర్చి కడఁగి యద్దేవకి
కొప్పు వట్టెఁ బెండ్లికూఁతు రనక. ౧౫౮

గీ. చెలియలఁట యించుకేనియుఁ జెట్టదలఁచి
యెఱుఁగదఁట కంసునకుఁ జేతు లెట్లువచ్చె
గడగడ వడంకు నక్కన్నెగళము నఱుకఁ!
గఠినచిత్తుల కెక్కడఁ గరుణ గలదు. ౧౫౯

మ. కరవాలమ్మున నిట్టు లాపెగళముం ఖండించు నాలోన నా
తురుఁడై యవ్వసుదేవుఁ డడ్డపడియెం దోడ్తోన తత్పుత్రుసు
స్థిరులౌ యాదవవీరులెల్ల నకటా, చింతింపు మొందేని యా
క్కరణిం జేయుదురే దురాత్మ! యని సంగ్రామాభి[illegible]

వ. తలఁపడి హాహాకారమ్ము లొనర్చుచుఁ బోరాడునయ్యెడఁ గంసుం డబ్బాలిక నొడిచి వారల మారొకనియె నంత సంగరం బభంగురం బగుడు వృద్ధులెల్లరుఁ గంసు వారించి యనునయించి యిట్లనిరి.

చ. లలన వధించు టన్న మొదలం గడుఁ బాతక మంతఁబోక నీ చెలియలు పెండ్లికూఁతు రొకచెట్ట యెఱుంగదు నీకు నెంతయుం దలఁపఁగ మానినీయు యిటు దారుణకృత్య మొనర్పఁ జెల్లునే చెలియలిఁజంపు దుర్మతులు శ్రేయముఁజెందుట యొందుఁ గందు మే!

ఉ. అంబరవాణివాక్య మిది యంచుఁ దలంపకు మెవ్వఁడో యస త్యంబునకుం దలంకక వృథా వసుదేవునియిల్లు గూల్ప నీ కుం బహుమర్యశంబునొడఁగూర్పఁగ మాయలమారియై యిటుల్ పంబినయిందఱిజాల మిది పాటిగఁ జూతు రఁటయ్య ! ధీనిధుల్.

వ. అవశ్యమ్మునుఁ గాఁదగుకార్యమ్ములు కాకతీర వొక వేళ నిది నిక్కంబుగ నంబరవాణియ పల్కిన నీకుం దప్పింప వచ్చునే యని బహుభంగులఁ జెప్పినఁ గంసుండునుఁ జేయునదిలేక మిన్న కున్న వసుదేవుం డతని కిట్లనియె. ౪౬౪

చ. తలఁకకు మిందఱుం వినఁగఁ దథ్యముగాఁ బ్రతినం బొనర్తు నీ లలనకుఁ బుట్టినట్టిశిశులం దగ నీకిడువాఁడఁ దక్షణం బలమి హరింపు మిట్టి మరియాదకుఁ దప్పితినేని నాదుపూ ర్వులు నరకాలయంబునకుఁ బోయెడివార లటంచుఁ బల్కినన్.

క. వసుదేవుఁ డాడి తప్పఁడు
వసుధాస్థలి గుఱింగినన్ విభావసుఁ డస్తా
ద్రిసమీపమ్మునఁ బొడమిన
నసత్యమిది గా దటంచు నందఱుఁ గంసున్. ౪౬౬

వ. తల విఱిచి యొప్పించిన నతం డతనివాక్యమ్ములు విశ్వసించి గత
క్రోధుండై మిన్నకుండె. వసుదేవుండు భార్యతోడఁ దనగృహ
మ్మున కరిగి నిర్భయుండై యుండె. ౪౬౭

క. పిమ్మట నద్దేవకి గ
ర్భమ్మును ధరియించి పూర్ణభరసముపేత
త్వమ్మున నొకకొడుకుం గనెను శిశువా
ర్భకనివిలు కానిక మ్మను చెలికడ తెచ్చె ౪౬౮

—* దేవకీసుతవధ *—

వ. అంత వసుదేవుండు దేవకిం గాంచి తనపుత్రుని నెఱపం దలఁచి
యిట్లనియె. ౪౬౯

క. వనితా ! యీబాలునిఁ గం
సుని చేఁ జంపింతు ననుచు శోకింపకు మె
వ్వనివశమగుఁ బ్రారబ్ధ
మ్మును దాఁటఁగ ననుచు నిట్లు పొలఁతి వచించెన్.

క. తనమువు రాకృతకర్మం
బునకుం దీర్థాటనంబు మొదలగు సుకృత
మ్మున నాశ మబ్బకుండునె ?
వినమే ధర్మనిధులైన పెద్దలపలుకుల్. ౪౭౧

క. గురుతల్పగుండు కనకము
హరియించినవాఁడు బ్రహ్మహంతయు మద్యా
దరుఁడును బండ్రెండేఁడులు
కరము వ్రతం బెనసి శుద్ధిగాంచుట వినమే ?

క. మనువు మొదలుగాఁ గలిగిన
మునులెల్లను జెప్పు ధర్మములు వమ్మలె? శా
స్త్రనియతిఁ బ్రాయశ్చిత్త
మ్మను బొనరుచునరుఁడు పాపముక్తుఁడ కాఁడే? ౪౭౩

చ. అగునది కాకతీర దను టంత వివేకము కాదు యత్న మొ
ప్పుగుగతిఁ జేసి తత్ఫలము నందుట కానమె ? యిట్లు కానిచో
నిగమములుఀ మఖమ్ములు మునిప్రవరుల్ పరమౌషధమ్ము లా
దిగ నఖిలం బసత్యమ, మదిం దలపోయు ముపాయ మిత్తరిఀ.

క. కేవలదైవాధీనత
భావమ్మున నెంచి చిన్నిపాపని విడువం
గావచ్చునె ? ధర్మ్యమ్మగు
తో్ర్వఀ బ్రదికింపుమింత మందుడు కేలా ? ౪౭౫

వ. నాపుడు వసుదేవుండిట్లను. ౪౭౬

క. లలనరో ! యత్నం బొనరుప
వలె నను టొప్పితిని దైవవశమగు యత్నం
బులఫల మనియెఱుఁగుము కే
వలయత్నమువలన ఫలము వడయుట కలదే ? ౪౭౭

వ. ఈ సంసారమ్మున సంచితప్రారబ్ధవర్తమానభేదమ్మునఁ గర్మంబు మూఁడు తెఱంగు లందు సంచితవర్తమానంబులకుఁ బ్రాయశ్చిత్తంబు నివర్తకం బగుఁ గాని ప్రారబ్ధంబునకుఁ గానేరదు. జీవుండు పూర్వదేహంబు విడిచి శుభాశుభకర్మానుసారంబుగ దివ్యదేహం బొండె యాతనాదేహం బొండె ధరియించి స్వర్గనరకమ్ముల ననుభవించి పదంపడి మరలఁ బుట్టుసమయమ్మునఁ గర్మబద్ధుఁడై

జనియించి ప్రారబ్ధం బనుభవించుఁ గావున నిబ్బాలుం డవశ్య
మ్మును గంసున కీఁదగువాఁ డని మఱియును. ౪౭౮

క. ఆరయ నసారమగు సం
సారమ్మున సత్య మొకటి సార మ్మగు నె
వ్వారై రద్దానిఁ ద్యజింతురు
వారల జీవచ్ఛవములు వనరుహనయనా! ౪౭౯

వ. కష్టసుఖమ్ములు లెక్కింపక సత్యమ్మునఁ బ్రవర్తించువారలకుఁ
గ్రిమమ్మున శుభమ్ములు చేకుఱు నిక్కం బింత యొఱింగి
యిబ్బాలునిఁ గంసున కిడ సమ్మతింపు మనవుడు దేవకి శోకసంత
ప్తయై వేపమానయగుచుఁ గొమరుని వసుదేవున కిచ్చిన నతఁడు
కంసుసదనమ్మునకుం జను సమయంబున, ౪౮౦

క. బాలకునిఁ గేలఁ గొని చిం
తాలేశము లేక కంసు దరి కరిగెడి స
చ్ఛీలుని వసుదేవునిఁ గని
వాలాయము మెచ్చి రెల్ల పౌరులు నధిపా! ౪౮౧

క. ఇతఁడ మహాత్ముఁడు సత్యం
బితని యధీనంబు సఫల మీతని జన్మం
బితనికి నితరుల కెన్నఁగ
శతాంశ మంతరము సత్యసమ మొకఁడున్నే? ౪౮౨

క. ఒడలి తడియైన నాఱని
కొడుకుం గంసునకు ఘాతుకున కిడుటకు నీ
తఁడు తడఁబడఁ డక్కట! యె
క్కడ నేనియు నింత సత్యకర్ములు గలరే? ౪౮3

వ. పదంపడి వసుదేవుండు కంసునకు బాలకు నిచ్చిన నతం డతని ధైర్యమునకును సత్యమ్మునకును మెచ్చి నాకీబాలుండు మారకుండుగాఁ "డష్టమగర్భం" బనికదా యంబరవాణి వచియించె; నిర్నిమిత్తంబుగ వీని వధింపనేల ? గృహమ్మున కరిగి వీనిం బోషించుకొమ్మ నావుడు వసుదేవుం డట్లొనరించెఁ, బిమ్మటఁ గంసుండు మంత్రిల కీ యుదంతంబు చెప్పిన వారును లెస్స చేసితి వని సంతసించి యాత్మగృహముల కరిగిరి. ౪౮౪

ఆ. వె. అంత నతనికడకు నరుదెంచె నారదుం
డమ్మునీంద్రునకుఁ గ్రిమమ్ముగఁ దగ
నర్ఘ్యపాద్యకృతుల నర్పించి వచ్చిన
కారణంబు నడుగఁగా నతండు. ౪౮౫

మ. పలికెం జిర్నగ వొప్పఁ గంస ! వినుమీ బ్రహ్మాదు లెల్లందగన్
గలయం జేరి నినున్ హరించుటకునై కంజాక్షునిన్ దేవకీ
తలునీపుత్రునిఁగా నొనర్త మని మంత్రిం బాచరింపంగ నే
నెలమిన్ వింటి శిశున్ వధింప వకటా, యేమందు నీ తెల్వికిన్ !

వ. నావుడుఁగంసుం డష్టమగర్భంబుమన్మృతికింగారణంబని యాకాశవాణి నుడివెఁ బ్రిథము వధింపనేల ! యన నారదుండిట్లనియె.

మ. అరయం జాలవు దేవతల్ మిగుల మాయాకోవిదుల్ శత్రువుం బరిమార్పం దగుఁగాని యల్పుఁ డనుచుం బాటింపఁగారాదు త్వ
న్మరణం బష్టమగర్భజాతవశ మైనన్ దక్కువా రేడ్గు రొం
డొరులంగూడి సహాయులై నభరమానోకాదొయూహింపుమా !

వ. అని యతం డరిగె నంతఁ గంసుండు మరల బాలకు రప్పించి యొక పాషాణమ్మునం బడవైచి సుఖం బుండె నావుడు జనమేజయుండు దుఃఖాక్రాంతుండై యిట్లనియె. ౪౮౬

ఉ. పుట్టినతోడనే మరణముం గన నాశిశు వంతలోనఁ దాఁ
గట్టిన పాప మేది ? మునికాంతుఁడు నారదుఁ డిట్టి పాపసం
ఘట్టనకుం దలంక కిటు కంసునిఁ దాఁ బురికొల్ప నేల ? యె
ప్పట్టునఁ గర్త, కారయిత, పాపమునన్ సమభాక్కు లేకదా ?

వ. నావుడు వ్యాసుఁడిట్లనియె. ౪౯౧

ఉ. అమ్మునిఁ సత్యవాది కలహప్రియుఁ డంతియకాని దీనఁ బా
పమ్ము గణింప లే దనుచుఁ బల్కఁగరాదు నరేంద్ర! బాలష
ట్కమ్మిటు కంసుచేత మృతిఁ గాంచెను శాపము కారణమ్ముగా
బమ్మకునైనఁ గర్మపరిపాకము మిన్నక పోవ నేర్చునే. ౪౯౨

వ. స్వాయంభువమన్వంతరమ్మున మరీచికి నూర్ణ యనుభార్య యం
దార్వురు పుత్రులు గలిగిరి వారు కొండొకకాలమ్మునఁ గొమిరె
యగు సరస్వతిం గవియ నుంకించిన విరించిం గాంచి పరిహాసిం
చుడు నతండలిగి "దైత్యయోనిం బుట్టుం" డని శపించిన నాష
డ్గర్భులును కాలనేమికి సుతులై రెండవజన్మమ్మున హిరణ్యకశిపు
నకుం బుట్టి విజ్ఞానంబుకతన విరించి గూర్చి తపం బొనరిం
చుటయు. ౪౯౩

గీ. అతఁడు ప్రత్యక్షుమై వారి కనియె, నాఁడు
కోపయుక్తుఁడనై మీకు శాపమిచ్చి
తిని భవత్తప మిష్ట నామనము గరఁచె
వర మొసంగెదనన గర్భు లరసి యతని. ౪౯౪

క. వర మిడఁగ నీకు నిచ్చ య
మరిన నమరదనుజసిద్ధ మానవులు మముం
బొరిపుచ్చలేమి యొసఁగుము
స్థిరజీవుల మగుదు మనుడుఁ జెచ్చెర నొసఁగెన్. ౪౯౫

వ. అంత హిరణ్యకశిపుండు కొమరులంగాంచి నన్ను విడిచి మీరు చతురాననుం గుఱించి తప మ్మొనరించి వరంబు వడసి యవమానించితిరి కావున మీరు నాకడ నుండఁదగరు. పాతాళమ్మునకుం బోయి యెల్లవేళ నిద్రాధీనులై చిరముండి పదంపడి దేవకీగర్భమ్మునం బుట్టునది. ౪౯౬

క. వెనుకటి జన్మమ్మున మీ
జనకుండగు కాలనేమి జనియించును గం
సునిరూపముగొని యాతఁడ
జనియించిన యప్డు మిమ్ముఁ జంపెడు మనుచున్. ౪౯౭

వ. శాపం బొసంగె నది కారణంబుగ షడ్గర్భులు దేవకి కుదయించి కంసునిచేఁ జచ్చిరని మఱియు నిట్లనియె. ౪౯౮

గీ. కంసుచెలియలు సప్తమగర్భ మంతఁ
దాల్చె శేషాంశమున, దానిఁ దాఱుమాఱొ
నర్చె నయ్యోగమాయ, జనంబు లాపె
గర్భ మెడలె నటంచు విక్లాంతులైరి. ౪౯౯

వ. కంసుఁడును నైదవమాసమ్మున దేవకికి గర్భపాతంబాయె నను మాట విని సంతసించె, నా శిశువును రోహిణీగర్భమ్మున వృద్ధి బొందుచుండె, నంత దేవకియు మరలఁ జూలుదాల్చె. ౫౦౦

క. ఎనిమిదవగర్భమున స
త్త్వనిధి సరోజాక్షుఁ డెలమి ధరణీభారం
బును దీర్చి దేవకార్యం
బొనరింప వసించె సంతతోజ్జ్వలదీప్తిన్. ౫౦౧

వ. అట్లు దేవతలందఱును దమతమ యంశమ్ముల నుద్భవించిరి తెఱంగు సంక్షేపమ్ముగ నాలింపుము. ౫౨౨

క. వసుదేవుఁడు కశ్యపుఁ డ
వ్వసుదేవునిభార్య యదితి పార్థివ! శేషాం
శసముద్భూతుఁడు బలరా
మసమాహ్వయుఁ డింక నొక్క మర్మము వినుమా.

క. నరుఁడును నారాయణుఁడును
నరయఁగ ధర్ముని కుమారులని తెల్పితి న
న్నరుఁ డర్జునుఁడై పుట్టె
న్నరవర! కృష్ణుఁ డయి పుట్టె నారాయణుఁడున్. ౫౦౪

వ. మఱియు ధర్మాంశమ్మున విదురయుధిష్ఠిరులును ననిలాంశమ్మున భీముండును నశ్వినుల యంశమ్మున నకులసహదేవులును సూర్యాంశమ్మునఁ గర్ణుండును బృహస్పతి యంశమ్మున ద్రోణుండును యమరుద్రకామక్రోధమ్ముల యంశమ్మున నశ్వత్థామయుఁ బుట్టిరి. శంతనుండు సముద్రాంశమ్మునఁ బొడమె.

గీ. శంతనుండు సముద్రాంశ జనితుఁడై స
కతనఁ బతి గాఁగ వరియించె గంగ యతని
వసువు భీష్ముండు, గంధర్వవరుఁడు దేవ
కుఁడు, మరుద్గణ మవ్విరాటుఁడు, నృపాల! ౫౦౬

వ. కృపాచార్యుండును గృతవర్మయు మరుద్గణాంశసంభవులుగా నెఱుంగునది. అరిష్టనేమిసుతుండగు హంసుండు ధృతరాష్ట్రుండు, కలి దుర్యోధనుండు, ద్వాపరంబు శకుని, సోమప్రరువను యాదవుఁడు సువర్చుండను సోమపుత్రుండు, ధృష్టద్యుమ్నుండనలాంశ

సంభవుండు, శిఖండి రాక్షసాంశసంభూతుండు, ప్రద్యుమ్నుండు సనత్కుమారుండు, వరుణుండు నృపముండు, లక్ష్మి ద్రౌపది పాంచాలీపుత్రు లేవురును విశ్వేదేవాంశజులు. ౫౦౭

క. కుంతియు మాద్రియు నను నీ
యింతులు సిద్ధియును ధృతియు నృప! గాంధారీ
కాంత మతి, వేలుపులరో
యింతులు పదియాఱువేలు కృష్ణునిభార్యల్. ౫౦౮

వ. ఇంక నసురాంశజుల వినిపింతు, హిరణ్యకశిపుండు శిశుపాలుండు విప్రజిత్తి జరాసంధుండు, ప్రహ్లాదుండు శల్యుండు, కాలనేమి కంసుండు, హయశిరుండు కేశి, గోకులమ్మున వధింపఁబడిన కకుద్మి యనువాఁడు బలిపుత్రుండగు నరిష్టుండు, అనుహ్లాదుండు ధృష్టకేతుండు, బాష్కలుండు భగదత్తుండు, లంబుండు ప్రలంబుండు ఖరుండు ధేనుకుండు, వారాహకిశోరులను నీ యిరువురు రక్కసులును జాణూరముష్టికులను మల్లులు, దితిపుత్రుండగు నరిష్టుండు కువలయాపీడంబను గజము, బలిపుత్రి బకి, తదనుజుండు బకుఁ డిట్లు సురాసురుల యంశమ్ముల ననేకు లుద్భవించిరని వెండియు.

చ. అమరులు బ్రహ్మఁగూడి తను నారసి ప్రార్థనఁజేసి భూమిభా
రము హరియింపు మన్నపుడు రాక్షససూదనుఁ డిచ్చె రెండు కే
శములు సితాసితమ్ములు వెసన్; హరి శ్యామలవర్ణుఁ డయ్యెఁ దె
ల్పమరెఁ దదగ్రజాతునకు నయ్యది హేతువుగాఁగ భూవరా.

వ. ఈయంశావతరణం బెవ్వారలు భక్తిభావమ్మునఁ జదువుదు రవ్వారికి సమస్త శుభమ్ములు కరతలామలకమ్ము; లట్లు దేవకీపుత్రుల నార్వురఁ జంపి యేడవగర్భంబు పతితం బగుట యెఱింగి యష్టమగర్భమ్మును బ్రయత్నమ్మున హరింపఁ గంసుం డున్నంత.

క. హరి దేవకికడుపున సు
స్థిరుఁడై వసియించె నపుడు దేవహితముగా
నరుదెంచి యోగమాయయుఁ
గర మలరారెన్ యశోదగర్భము నందున్. ౫౧౨

ఆ. వె. గోకులమున రోహిణీకాంత కుదయించె
రాముఁ డంతఁ గాంతిధాముఁ డగుచుఁ
గంసుఁ డతిభయమునఁ గారాగృహమ్మున
నుంచె దేవకిని మదోద్ధతుండు. ౫౧౩

వ. అట్లుంచి భృత్యుల నట గావని యోగించె. వసుదేవుఁడును భార్యాస్నేహాయత్తచిత్తుండై యామెతో నక్కారాగారమ్ముఁ బ్రవేశించి కుమారోదయమ్ము చింతించుచుండె నంత దేవకార్యార్థియగు విష్ణుండు దేవకీగర్భమ్మున నమరసంస్తూయమానుండగుచుఁ గ్రమమ్మున వృద్ధిఁ జెంద దశమాససమ్పూర్తి యయ్యె. ౫౧౪

—* శ్రీ కృష్ణోదయము *—

గీ. శ్రావణమ్మునఁ గృష్ణపక్షమున రోహి
ణీకలిత మైన యష్టమి నాకులత్వ
మడరఁ గంసుండు దైత్యుల నరసి పల్కె
"నష్టమం బిది గర్భంబు కష్టదంబు. ౫౧౫

ఉ. దీని జనించుబాలకుఁడు తెల్లముగా ననుఁ జంపు నిక్క మె
ల్లైనను వీనిఁ జంపవలె నప్పుడు నిద్దుర పట్టఁగా వలెన్
లేనియెడన్ సుఖమ్ము లిఁక లేవు శ్రమింపడి మీర లందఱున్
బూనికఁ గాచి యుండవలెఁ బుట్టినతోడనె చెప్పఁగావలెన్."

వ. అని వారల నియోగించి గృహమ్మున కరిగి చింతావిష్టుండై నిద్రాదికం బెఱుంగక యొకభంగి నతఁడుండె. రక్కసు లందఱును దమతమ యాయుధమ్ములు ధరియించి జాగరూకులై కాచుచుండి రయ్యెడ దేవకి వసుదేవున కిట్లనియె. ౫౧౭

క. అసహాయ నైననాకుఁ
బ్రసవసమయమాయెఁ జేయుపని యే మిట ర
క్కసులు నలుగడలఁ గాపుగ
నసమానబలాఢ్యులుండి రకట ! మహాత్మా ! ౫౧౮

వ. మున్ను నందునిపత్నియగు యశోదకును నాకును నొక్క సమయంబు గల దెట్లంటేని " నీకుం బొడము నపత్యంబు మన్మందిరమ్మున కనుపుము. మదపత్యంబు నీగృహమ్మున కనిపెద " నావుడు వల్లెయని నే నొప్పితి నిప్పు డప్పని యెట్లు సేయనగునని చింతించుచు గర్భభరం బాఁగఁజాలమి సిగ్గటి పతికిట్లను. ౫౧౯

క. భరమాయె గర్భవేదన
యరుగుము సిగ్గాయె నిన్ను నరయఁగ నని స
త్వరమున మొగ మటుచేసి కొ
మరునింగనె మరుని నగు కొమరుగలవానిన్. ౫౨౦

ఆ. వె. చెప్పనలవిగాని చెలువున నొప్పారు
చిన్ని బాలుమోము చెలువ గాంచి
పులకితాంగి యగుచు నెలమిని వసుదేవుఁ
బిలిచి శిశువుఁ జూపి పలికె నిట్లు. ౫౨౧

క. కనుఁగొను మాముఖకాంతియుఁ
గనులవిశాలతయుఁ జెలువుగల మృదుకాయం

బును నెన్నఁడేని యిట్టిఁడు
జనియించెనె యేరికేని సదమలహృదయా. గీ౨౨

ఉ. చచ్చెడివానికిన్ మిగులఁ జందము నందముఁ గల్గు నంచు వి
ద్వచ్ఛయ మాడుమాటలు వృథాయగునే యెటు లీఁగ నేర్చె దీ
విచ్చిఱుతన్ జగమ్ములల మేలెడి తేజము వొల్చువానిఁ గా
ర్చిచ్చననొప్పుకంసునకు జీవవిఘాతికిఁ జేతులాడఁగన్. గీ౨౩

వ. అనవుడు వసుదేవుం డక్కొమరుమొగం బాలోకించుచు నితి
కర్తవ్యతాశూన్యుండై యున్నంత నాకాశవాణి విశదాక్షరంబుగ
నతనిం బిలిచి యిట్లనియె. గీ౨౪

ఉ. అందఱు రక్షకుల్ నిదుర నందిరి నా పెనుమాయకల్మి, దీ
నందగు తల్పులున్ విడియె నా వలనన్, వినుమింక నష్టు లే
దెందును; వేగ నీ శిశువు నెత్తి యురమ్మునఁ బట్టి గోకులం
బందు యశోదగేహమున యందిడు మేటికి సందియంబిఁకన్.

వ. నావుడు వసుదేవుండు బాలకు నెత్తికొని విశృంఖలుండై వివృత
మ్ములగు నా యష్టద్వారమ్ములు దాఁటి యోగమాయాప్రభావ
మ్మున నేరికి నలక్షితుండై జవుజవ్వనఁ గాళిందీతటమ్మున కరిగి
యిది యెట్లు తరింపనగునని యెంచు నాలోన నయ్యేదియు మొల
బంటి యగుడుఁ జయ్యన గోకులమ్మున కరిగి నిర్జనంబగు మార్గ
మ్మున నందుని మందిరంబు సొచ్చి తద్ద్వారమ్మునఁ బసువిభూతిం
జూచుచుండె. గీ౨౫

సీ. అంత నందుని భార్యయం దవతరించె
యోగమాయాంశసంపన్న యొక్క బాల
దాని వసుదేవునకు నిచ్చి తనయుఁ గొనియె
దాదినెపమున నజ్జగదాదిదేవి. గీ౨౬

వ. పిమ్మట వసుదేవుం డబ్బాలం గొని కారాగారమ్మునను న్న దేవకి పక్క నునిచి తానును సమీపమ్మునం జింతావిష్టుండై యుండునంత. ౫౨౮

క. ఆ కొమిరె మెల్ల మెల్లన
ప్రాకృతబాలికయుం బోలె బహుమధురరస
శ్రీకలితంబుగ నేడువ
వే కళవళమంది లేచి భృత్యులు గడంకన్. ౫౨౯

ఆ. వె. కంసుకడకు నేగి కనియె దేవకి పుత్రి
నరుగుదెమ్ము వేగ మనుడు నతఁడు
నరిగి తలుపుఁ దీయు మనుచు నవ్వసుదేవుఁ
బిలిచి యిట్టులనియె నలుక వొడమ. ౫౩౦

క. ఎనిమిదవ గర్భ మియ్యది
ననుఁ జంపఁగ నెంచి దీన నారాయణుఁడే
జనియించు నంచు వింటిన్
దనుమంగా వలదె యిట్టి దుష్టుని శిశువున్. ౫౩౧

వ. జాగు సేయక తెమ్మనుడు భయత్రస్తుఁడుంబోలె వసుదేవుండు చింతించుచు నబ్బాలందెచ్చి కంసుని హస్తమ్మునం బెట్టిన నతండు సూచి సంశయగ్రస్తుండై నిజాంతర్గతమ్మున, ౫౩౨

ఉ. ఏమిది! క్రొత్తపుట్టె మృష యెట్లగు నంబరవాణిపల్కు? మి
థ్యామతి నారదుం డనృతమాడునె! యివ్వసుదేవుమాయ నాఁ
గా మన మెట్టు లొప్పికొనుఁ? గాచెడివారలు చుట్టునుండఁగ
న్యామణి యేడవచ్చె! సుతుఁడక్కట యెక్కడికేగెఁ జిత్రమా!

క. కాలగతి విషమ మని చిం
తాలోలుం డగుచు బాల సంఘములం గొని యా
భీలగతి బిట్టు వైచెన్
దూలి యుపలమందుఁ బడఁగఁ దుందుడుకు మెయిన్.

వ. అక్కులపాంసనుం డిట్లొనర్చిన నబ్బాల కరమ్మునుండి జాఱినంతన యుప్పరమ్మున కెగసి దివ్యరూపధారిణియై మృదుస్వరమ్మున నిట్లనియె. ౧౩౧

క. ననుఁ జంపినంత నేమగు
వినుమో దుష్టాత్మ! మిగుల వీరుఁడు నీకై
జనియించినాఁడు వృద్ధిం
గనుచున్నాఁడతఁడు నిజము గడతేర్చు నినున్. ౧౩౬

వ. అని నుడివి తనంత నరిగెఁ బిమ్మటఁ గంసుం డతివిస్మితుండై తన గృహమ్మున కరిగి బకధేనుకవత్సకప్రలంబముఖులం గాంచి యిట్లను. ౧౩౭

ఉ. గోకులమందుఁగాని మఱి కొంకక యెచ్చటఁ గాని పుట్టు దు
ష్పాకులఁ బాకులన్ విగతసంశయులై వధియింపుఁ డిందఱు
న్నాకయి జాగరూకతఁ గనందగుఁ బూతన బాలహంత్రి దా
నీ కృతియందు నేర్పుగల దొంతయు నయ్యది మీకుఁ దోడగున్.

వ. ఇట్లు నియోగించి చింతావిష్టుండై యతం డుండె నంతఁ బ్రాతః కాలంబయ్యెఁ బదంపడి నందుండు సంతుష్టాంతరంగుండై పుత్రో త్సవం బొనరించె. ౧౩౯

క. నందుఁడు పుత్రోత్సవ మా
నందగతి నొనర్ప నదియు నాలుగు దెసలం

బొందుపడెం గింవదంతిగ
నందంద చరించుచారు లతిరభసముగన్, ౫౪౦

వ. కంసుకడ కరిగి నుడివిరి. అంతకుమున్న యతండును నారదునిచే
బోధింపఁబడినవాఁడగుట గోకులమ్మువంక నతిక్రోధమ్మునఁ గలఁడై
యుండె నంత, ౫౪౧

—* శ్రీ కృష్ణ లీలలు. *—

ఉ. పూతనఁ జంపె, ధేనుకు నపూర్వబలున్ వధియించె, వత్సకున్
బాతకు నబ్బకాసురునిఁ బట్టి యడంచెఁ, బ్రలంబుఁ జెండె, గో
జాతమురక్షసేఁతకు వెసన్ గిరి యెత్తె నటంచు విని న
త్యాతురుఁడయ్యెఁ గృష్ణునెడ నాత్మవధంబున నిశ్చితాత్ముఁడై.

వ. పదంపడి కేశియనురక్కసుం గూడ దునుమాడుట యాలించి
యుపాయమ్మునఁ గృష్ణు వధింప నెంచి ధనుర్యాగంబు నెపమ్మున
బలరామ కృష్ణుల రప్పించువాఁడై యక్రూరుం బనిచిన నతం
డరిగి రథం బెక్కించుకొని వారలం దోడికొని వచ్చె నంత,

గీ. ధనువు భంజించి రాజుల దర్ప మడఁచి
గజము వధియించి చాణూరుఁ గసిమసంగి
ముష్టికునిఁ జంపి శలుని నిర్మూలుఁ జేసి
తోశలు హరించి రిపువు రుద్ధురత మెఱయ. ౫౪౪

మ. సిగచేతం గొని పట్టి యీడ్చి సమరస్థేమాభిరామత్వ మొ
ప్పగఁ గంసుం బరిమార్చి లీలమెయి నంబాశృంఖలల్ వాపి బం
ధగతున్ దండ్రి వదల్చి రాజ్యమునకు న్నాథుండుగా నుగ్రసే
నుఁ గడున్ వృద్ధు నలంకరించె హరి తన్ను న్నిర్జరుల్ మెచ్చఁగన్.

వ. పిదప వసుదేవుం డబ్బలరామకృష్ణుల కుపనయనం బాచరించి సాందీపనునొద్దకు విద్యాభ్యాసమ్మున కనిచెఁ బదపడి వారు గురుకుల వాసమ్ము చేయుచు సమస్త విద్యల నభ్యసించి ద్వాదశాబ్దమ్ములవారయి మధురాపురమ్మున సుఖమ్మున నున్నయెడ నల్లుని మరణంబు విని కలుషితాంతరంగుండైన జరాసంధుండు మధుర నరికట్టి ఘోరంబగుసంగరం బొనర్చి పరాజితుండై యరిగె నిట్లతం డేడుమార్లు కృష్ణునితో నెదిరి యోహటించి మ్లేచ్ఛాధిపతి యగు కాలయవనుం బురికొల్ప వాఁడును యాదవభయంకరుండై మధురపై నెత్తివచ్చినఁ గృష్ణుండు యాదవసమక్షమ్మున బలరామున కిట్లనియె. ౧౧౨౬

క. పాతకుఁడు జరాసంధుం
డీతని నంపించె వీఁడు నెంతయు బలవి
ఖ్యాతుండు పరిబలసైన్యో
పేతుం డిత్తులువతోడఁ బెనఁగుట భరమౌ. ౧౧౨౭

క. ధనమును గృహమును వీడియుఁ
దన ప్రాణము రక్షసేత ధర్మంబగు సా
ఖ్యునియతిఁ జొప్పడు నెయ్యెడఁ
దనకది పితార్జితముగఁ దలఁపఁగ వలయున్. ౧౧౨౮

వ. పూర్వార్జితంబగు దేశం బెల్లప్పుడుఁ దనకు భయజనకంబేనిఁ గులోచితం బని యట వసించుటకన్న శైలసాగరనికటంబున నేని నిష్కంటకంబుగ వసించుట సమంజసంబని పెద్దలు వల్కుదురు.

చ. హరి శయనించు నంబునిధియం దహితల్పమునన్ భయమ్మునన్
హరుడు వసించు రాజతకులాచలగహ్వరమందు నింకఁ ద

క్రూరుల గణింపనేల ? మన మొక్కుమొగిన్ బురి వీడి ద్వారకా
పురమున కేగి సౌఖ్యములు పొందుట లగ్గని నాకుఁ దోఁచెడిన్.

వ. అప్పురవరంబు రైవతాచలంబుకడ సముద్రతటమ్మునఁ గలదనియు నతిమనోహరంబనియును గరుఁడుండు సెప్ప ననుడు యాదవులు సమ్మతించి సకుటుంబమ్ముగఁ దరలి బలరామకృష్ణపురస్సరులై కతిపయదినమ్ములకు ద్వారవతి కరిగి యప్పురమ్మునఁగల జీర్ణ గృహమ్ములఁ బునరుద్ధరణాబొనర్చి సుఖం బుండిరి. పిదప బలరామకృష్ణు లిరువురును నిర్జనమ్మగు మధుర కేతెంచియటవసించు చున్నంత యవనుండు మరల నప్పురంబు ముట్టడించె. ౧౧౨

చ. హరి పురి వీడి వైళ మసహాయతఁ దాఁ బదచారియై వెసం
బరుగిడె నంత వాఁడు ననమానరయమ్మునఁ బాదచారియై
యరిగెఁ బిఱుంద నీవరుస నయ్యవనవీరుఁడు రక్కసుండు నో
కురువర ! యేగిరంత ముచికుందుని యాశ్రమపుణ్యభూమికిన్.

వ. హరియు నయ్యెడ నంతర్ధానంబు చేసె నయ్యవనుండునట నిద్రించు చున్న ముచికుందుం గాంచి శ్రీకృష్ణుండని యెంచి తనకాలఁ దన్నుటయు నారాజర్షి మేల్కని క్రోధతామ్రాక్షుండై యవను భస్మసాత్కరించి కెలనఁ గృష్ణుం గాంచి నమస్కరించి సన్నుతించెఁ బిదపఁ గృష్ణుండు బలరామసహితమ్ముగ ద్వారవతికరిగి యుగ్ర సేనునిపై రాజ్యభార మ్మునిచి తాను యథేష్టమ్ముగ సంచరించు చుండె. ౧౧౩

క. అసహాయశూరుఁడగు హరి
వెస నా శిశుపాలువలన విడిపించి సమం
జసగుణయగు రుక్మిణి రా
క్షసోపయమవిధి గ్రహించె జగములు వొగడన్. ౧౧౪

గీ. జాంబవతి మిత్రవిందయు సత్యభామ
నాగ్నజితి భద్రయును లక్షణాతరుణియు
చేర్మిఁ గాళిందియును గృష్ణుఁ బెండ్లిచేసి
కొనిన భార్యలు సౌందర్యఖనులు భూప! ౧౧౧౧

క. ఆ రుక్మిణి శ్రీకృష్ణుని
గారామునఁ గూడి కొంతకాలమ్మునకున్
జారుతరగాత్రుఁ గనియెఁ గు
మారున్ బ్రద్యుమ్నుఁ గాంతిమహితాకారున్. ౧౧౧౨

వ. అయ్యర్భకునకు జాతకర్మాదికం బొనర్చినపిదప మాయాకోవిదుం
డును బలిష్ఠుండునునగు శంబరుండు సూతికాగృహమ్మునుండి
యా చిన్నిబాలు హరియించి మాయావతి కొసంగిన హరి చేయు
నదిలేక చింతార్తుండై జగదంబ నిట్లు నుతించె. ౧౧౧౩

క. మును బదరికాశ్రమమ్మున
మనమునఁ దగ నిల్పి భక్తిమై నిన్నుం గొ
ల్చినవాఁడ గానె, నాపైఁ
గనికరమున్ మఱువఁ బాడిగా, జగదంబా! ౧౧౧౪

ఉ. ఏ నెటు నిల్వనేర్తు జగదీశ్వరి! యెవ్వఁడొ గానరాదు నా
సూనుని సూతికాగృహముచొచ్చి హరించె, మదీయమాన మి
ద్దాన నడంగదే జనని! దాసులదీనతఁ జూచి యోర్వఁ జ
న్నే! నగరే నినున్ జనులు! నీకు నొకింతయు లజ్జ పుట్టదే!

చ. నగరముచుట్టు కోటయఁట! నాగృహ మెన్నఁగ మధ్యమందు నొ
ప్పగునఁట! సూతికాగృహము నారయువార లనేకులుండ నె
వ్వగ హరియించె బాలకు నవారణలీల? మదీయపూర్వక
ర్మగతియు కాక వేఱొకటి గానఁగ రాదు నిమిత్త మియ్యెడన్.

గీ. ఏను బొరుగూరికింజన నెల్లయాద
వులును గాచుచు నున్నారు తెలివికలిమి
నెవఁడు హరియించె మత్పుత్రు నెంచి చూడ
నంబ ! నీమాయ యొక్కింత యమరదేని. ౧౬౧

గీ. మందమతులగు మాబోంట్లకుం దరంబె
జనని ! నీదుచరిత్రంబు చందమెఱుఁగ
బాలు గొనిపోవు చోరుండు పట్టువడక
యుండఁ గల్పించితివి మాయ యొరుల వశమె ? ౧౬౨

చ. పతి పరదేశవర్తియగు పట్టున రోహిణి నిక్కమా పతి
వ్రత బలరాము నెట్లుగనెఁ ? బాపవిదారిణి యన్యగర్భసం
గతు శిశువుం దగం దిగిచికాదె తదంగనయందుఁ గూర్చి పెం
చితివి జగత్ప్రసిద్ధము విశిష్టము నీమహిమం బొకింతయే ! ౧౬౩

చ. సకలము చేసి పెంచి పెలుచన్ హరియించెడితల్లి ! నాకుఁ బు
త్రకునిడి సంతసం బిడినదానవు తక్షణ మిట్టివేదనా
వికలమనస్కుఁ జేయఁ దగవే ? పగవాఁడనె ? కాక నీకు ని
ట్టి కృతులు బల్ముదంబును ఘటింపఁగఁబోలు నెవం డెఱింగెడిన్ !

క. దేవి ! తనూజుఁడు సుఖముల
తా వనియును సుతునిచావు తలిదండ్రులకున్
బ్రేవ్ వెడలుటయని చెప్పుదు
రే వెఱవున నిల్తు మొదలనే యిట్లైనన్. ౧౬౫

ఉ. ప్రీతిఁ ద్యజింప లేక కురరీగతి రోదన మాచరించు త
న్మాత గతిన్ దలంపు దయమాలినదానవు కాకుమమ్మ ! ప్ర
ఖ్యాతికిఁ జేటు దెచ్చుకొనఁగా మది నెంచకుమమ్మ ! నీవు గా
కీ తరుణిన్ భరింప నిఁక నెవ్వరు దిక్కు ? వచింపు మమ్మరో !

ఉ. జన్న మొనర్తునో? వ్రతముసల్పుదునో? భవదంఘ్రు లెంతయుం
దిన్ననిభక్తి సూనములు తెచ్చి యజించి ముదంబు గూర్తునో?
కన్నసుతుం డొకించుకయుఁ గందును జెందక యుండెనేని నీ
కు న్నిఖిలాంబ! యేమి యొడఁగూర్పఁగ నేర నశక్య మేనియున్.

చ. తనయునిఁ దెచ్చి నా కొసఁగి తద్దయు మోదము గూర్చు మమ్మ! నీ
పని యగుఁగాని వేఱొకరు పాల్పడ రింతటిసేఁత కంచు మ
న్ననమెయి గృష్ణుఁ డెంతయు ననాథగతిన్ విలపింప నజ్జగ
జ్జనని కృపానుషంగయయి చయ్యన దర్శన మిచ్చె శౌరికిన్.

వ. అట్లు ప్రత్యక్షంబై యభయం బొసంగి నీకొమరుండు శాపకారణంబున శంబరునిచే హరింపఁబడి తద్గృహమ్మున నున్నవాఁడు మదనుగ్రహమ్ముకతనఁ బడియాఱవయేట నవ్వానిం జంపి నీకడ కరుదెంచు నిఁక శోకింపకు మనవుడుఁ గృష్ణుండును రుక్మిణియు సంతసమ్మునఁ జెలంగిరని చెప్పిన వ్యాసునకు జనమేజయుం డిట్లనియె. ౧౬౯

క. నారాయణాంశమునఁ జె
న్నారెడి హరి కెఱుకపడని యనువున గుప్తా
గారముననున్న బాలుని
నేరీతి హరించె నిక్కమే నిది చెపుమా. ౧౭౦

వ. నావుడు వ్యాసుండిట్లను. ౧౭౧

గీ. మనుజులు సురాసురు లొకింత మాయఁ గడవఁ
జాల రది యెంతకేనియుఁ జాలు నెట్టి
బుద్ధిమంతునికైననుఁ బొరయ నొసంగఁ
జేయు శాంభవి యేరి కజేయ నిజము. ౧౭౨

—* శ్రీరామాదులు కించిద్‌జ్ఞులనుట *—

వ. క్షుత్తృణ్ణిందాతంద్రాభయశోకసంశయమోహాహర్షాభిమాన జరా మరణాజ్ఞానగ్లానీర్ష్యాప్రీతిమదశ్రమమ్ములను నియ్యవి దేహజమ్ము లగు భావమ్ములు. ౫౨౩

ఉ. రాముఁ డెఱుంగఁ జాలెనె యరణ్యమునం దన కగ్రవర్తియా
హేమమృగమ్ము రాకయు మహీసుతపోకయు నజ్జటాయు వా
లో మృతిఁ జెందు టాదిగ ; ఖలుండగు రావణుఁ జంపి రాజ్యసు
శ్రీ మితిమీఱునాఁడు మును చెందిన బాముల నెన్న నేర్చెనే.

గీ. మాయ బలవతి గాదేని మనుజనాథ!
యెఱుఁగఁజాలెనె తన తండ్రి మృతిని నాతఁ
డింతయేటికి సీత యున్నెడఁ దెలియఁగ
వనచరుల నలుదిక్కుల కనుపనేల ? ౫౨౫

గీ. నాగపాశమ్ములను బడి నవయనేల ?
సీత నిర్దోష యనక కార్చిచ్చు నందుఁ
బడుట కొప్పఁగ నేల ? యాపై జనాప
వాదకుఁ దలంకి తా విడువంగ నేల ? ౫౨౬

వ. పిమ్మటఁ దన పుత్త్రులగు కుశీలవులఁ గుశలవులని ముని చెప్పకున్న నెఱింగెనే ? ఇది యిట్లుండ జానకి పాతాళమ్మున కరుగుటయుఁ దమకుఁ గాలం బాసన్నం బగుటయుఁ దెలియ నేర్చెనే ? అట్లేని దమ్మునిం జంప నుంకించునే యని వెండియు, ౫౨౭

క. మానవదేహము గైకొని
మానవరీతులఁ జెలంగె మహిమ మెడలి యా
శ్రీనాథుఁడు సందేహం
బూనఁగఁ బనిలేదు దీని కుర్వీనాథా ! ౫౨౮

క. మొదలం గంసునిభయమున
యదుకులమణి యరిగె గోకులావాసంబుం
బదఁపడి ద్వారవతిని దా
నొదిగె జరాసంధుభీతి యొదవినకతనన్. ౧౭౯

గీ. ఎంత యన్యాయ మొనరించెఁ గృష్ణుఁ డకట!
యెఱిఁగి శిశుపాలుచే పరిణయింపఁబడిన
దాని రుక్మిణిఁ గైకొనె ధర్మవిదులు
మెచ్చికొందురె విని జనమేజయనృప! ౧౮౦

వ. మాయాయుక్తుండగు కతననకదా! శంబరుఁడు హరించిన పుత్త్రు
నెఱుంగఁజాలక దుఃఖించి పదంపడి దేవికతనఁ దెలిసి యానం
దించె నిదియునుంగాక, ౧౮౧

ఆ. వె. సత్య యాజ్ఞఁజేసి స్వర్గమ్మునకు నేగి
యింద్రుతోడఁ బోరి యెలమిఁగల్ప
వృక్ష మల్ల సత్యగృహమునఁ బెరటిచె
ట్టుగ నొనర్చె స్త్రీజితగతి నతఁడు. ౧౮౨

వ. సత్యభామయు నానందమ్మునఁ దద్వృక్షంబు తన తోఁట నాఁ
టించి పతియగు శ్రీకృష్ణుని నారదునకు దానం బొసంగి పిదపఁ
గనకమయం బగు కృష్ణ విగ్రహం బమ్మహామహున కిచ్చి విడిపించె.

గీ. అరసి ప్రద్యుమ్నుఁ డాదియైనట్టి సుతుల
జాంబవతి తన్నుఁ బుత్త్రలాభంబు కొఱకు
దైన్యగతి వేఁడఁ గృష్ణుఁడు తప మొనర్పఁ
జనియె నుపమన్యునాశ్రమమునకు నధిప! ౧౮౩

క. శివభక్తుండగు నమన్ముని వలనఁ బాశుపతదీక్ష నెఱిఁ గొని సన్న్యాస
సవిధిమెయిఁ దపము సలిపెఁ
బ్రవిమలుఁడై శివుని మదినిఁ బాదుకొలుపుచున్.

వ. ఇట్లు ప్రథమమాసమ్మున ఫలాశియు ద్వితీయమ్మున జలపాయియుఁ దృతీయమ్మున వాయుభక్షియునై పాదాంగుష్ఠాగ్రమ్మున నిలిచి పుత్రార్థియై తనుంగుఱిచి ఘోరతపం బొనర్చు నా హరికి హరుం డాఱవమాసమ్మునఁ జంద్రకళాధరుండై వృషభారూఢుండై యింద్రాదిసురలు పరివేష్టింపఁ బార్వతితోఁ బ్రత్యక్షుంబై, గి౮౬

ఆ. వె. "వాసుదేవ! నీతపమ్మున కెద మెచ్చి
వర మొసంగ నిటకు వచ్చినాఁడఁ
గోరుకొమ్ము వలయుకోరికలెల్ల నే
నిచ్చునప్డు కొదవ యొకింత కలదె." గి౮౭

వ. అనవుడు గృష్ణుండు భక్తినమ్రుండై యద్దేవు పాదమ్ముల కెఱఁగి మేఘ గంభీరభాషణమ్ముల నిట్లు నుతించె. గి౮౮

గీ. దేవదేవ! జగన్నాథ! దివ్యమూర్తి!
సర్వభూతార్తినాశన! సకలలోక
కారక! సురారి హర! నీలకంఠ! శైల
జామనోహర! యజ్ఞఘ్న! శరణు నీవు. గి౮౯

ఉ. ధన్యుఁడనైతిఁ బావనతఁ దాల్చితి జన్మము గణ్యమయ్యె సా
మాన్యముగాదె నీదుపదసారసముల్ గనుఁగొంటఁ జేసి; యే
నన్యముగోర స్త్రీమయము లైన మహత్తరపాశజాలముల్
దైన్యమునొందఁజేసె నివి దాఁటఁగఁ జేయఁగదే! కృపామతిన్.

క. మానవజన్మం బెత్తిన
దానికిఁ గా నాకుఁ గష్టదశ చేకూరెన్
దీనఁ గృశియించు నాదగు
దీనతఁ బాపంగఁ దగదె దీనశరణ్యా ! గీ-౧

ఆ. వె. మొదట గర్భదుఃఖమును బొంది కంసు భ
యమునఁ బిదప గోకులమున కరిగి
గొల్ల నగుచు నడవి గోవులఁగాచుట
కన్నఁగష్టమొండు గలదె గిరిశ ! గీ-౨

గీ. గోరజస్సంగతిం జేసి కొమరు దఱిగి
యాలఁగాచుచు బృందావనాంతరమున
నుండ భయపెట్టె మ్లేచ్ఛనాథుండు దానఁ
జేసి ద్వారవతీపురిఁ జేరినాఁడ. గీ-3

వ. పితార్జితంబగు మధురవిడిచి ద్వారవతి కేతెంచి యయాతి
శాపంబుకతన రాజ్యంబొల్లక యుగ్రసేనునియంద యునిచి
యతనికి దాసుండనైతి. గీ-౪

క. ఎన్నిటఁ జూచిన సంసృతి
కన్నన్ దుఃఖంబు, స్త్రీలకన్న నధర్మా
భ్యున్నతియుఁ, బారతంత్ర్యము
కన్నన్ బంధం బొకండు గలదే గిరిశా ! గీ-౫

గీ. జాంబవతి రుక్మిణీతనూజాతులఁ దగ
నరసి సంతాన మిమ్మనినంత నేను
దనయునికిఁగా నొనర్చితిఁ దపము లజ్జ
వొడమచున్నది దీనిఁ జెప్పుటకు నాకు. గీ-౬

గీ. ముక్తినిడఁజాలు నినుఁగాంచి మూఢబుద్ధి
నేఁడు గోరెడిఁ దుచ్ఛమా నిట్టి ఫలము
కామినీప్రేరితుండనై గళితలజ్జుఁ
డ నయి కోరెద సంతాన మనఘ ! నిన్ను. ౯౯౭

క. సంసార మెంత కేనియు
హింసాకర మంచు నెఱిఁగి యేను విరతి నా
శంసింపఁ జాల, గర్మ
ధ్వంసము భోగమునఁ గాని వఱలునె యెందుఁ ? ౯౯౮

వ. శాపమ్మునకతన మాయానియంత్రితుండనై నారాయణాంశమ్మునఁ
బుట్టిన నాకుఁ గర్మానుభవం బింతతోఁ దీఱునేయని వగచు మాధ
వున కుమాధవుం డిట్లనియె. ౯౯౯

క. పదియాఱువేలపైనేఁ
బదిమంది ముదితలు నీకు భార్య లగుదు ర
మ్ముదితల కొక్కొక్కరితకుఁ
బదిమంది కొమరులు గలిగి ప్రబలెదరు హరీ. ౧౦౦౦

వ. అని నుడివి శంకరుండు విరమించినఁ బార్వతి ప్రీతుండగు నమ్మ
ధుసూదనున కిట్లను. నీవు లోకమ్మున నున్న గృహస్థులకెల్ల
నొజ్జవై శతవత్సరమ్ములు సుఖమ్ముల ననుభవించి ద్విజశాపగాం
ధారీశాపమ్ములఁ గులక్షయం బగుడు దేహమ్ము పరిత్యజించి బల
రామసహితమ్ముగ దివమ్మునకు రాఁగలవు. ౧౦౦౧

క. శోకింపఁదగునె ? విధిపరి
పాకాగతమైన పనులపట్ల ; నవశ్యం
బే కార్యము గానున్నదో
యా కార్యం బడ్డుపెట్ట నగునే యెందుఁ ? ౧౦౦౨

వ. నీ వవతారమ్ము చాలించి త్రిదివమ్మున కరిగినమీఁద నష్టావక్ర
శాపమ్మునంజేసి నీభార్యలు చోరులచేఁ బీడింపఁబడుదురని
చెప్పి యదృశ్యులైరి. పిదపఁ గృష్ణుండును నుపమన్యునకు
నమస్కరించి ద్వారక కరిగి సుఖం బుండె. ౬౦౩

క. నరవర ! బ్రహ్మాదులకును
దర మని యెంచకుము మాయ దాఁటఁగఁ గర్మో
ద్ధురతఁ బురికొల్పుచుండుఁ
బరరూపిణి మాయ ; పక్షపాతము కలదే ? ౬౦౪

ఉ. ఇంతియకాని యాజగదధీశ్వరి కొక్కఁడఁ బక్షపాత మొ
క్కింతయు లేదు "జీవులకు నేగతిఁ గల్గునో ముక్తి" యంచుఁదాఁ
జింతిలుచుండు లోకము సృజించియు మాయకులోను జేయదే
నంతయునుఁ జడంబగుఁ దదర్థము యిట్లొనరించు భూవరా !

క. మాయాయత్తులు దివిజులు
మాయామయు లసురులెల్ల మాయాధీన
ప్రాయులు త్రిమూర్తులును స్వే
చ్ఛాయత్తత నొప్పు నొకఁ యంబికయ నృపా ! ౬౦౬

ఆ. వె. దేవికన్నఁ బరము దెలియంగరా దెందు
నామెపూజకతన నఖిలమొదవుఁ
దత్పదాబ్జభక్తి దవులని కులమునఁ
బొడమరాదు వినుము పుడమిఱేఁడ. ౬౦౭

శా. జ్ఞానాసక్తి గురుఁ భజించి నియతిం గావించి వేదాంత ని
ధ్యానం బొప్పఁగ సప్పరాంబిక మనమ్మందుఁ దగ న్నిల్పి సం
ధానంబుం బచరించి నిశ్చలవిధానజ్ఞానసంసక్తిమై
'నేనే దేవియునేన బ్రహ్మ' మను దా నెవ్వండు వాఁడల్పుఁడే!

వ. దీనికిం దక్కినఁవా డెన్ని కర్మంబు లొనర్చినను ముక్తుండుగాఁడు శ్వేతాశ్వతరమహర్షులందఱు నిట్ల భవబంధవిముక్తులైరి. బ్రహ్మ విష్ణుమహేశ్వరులును తత్కళత్రమ్ములును సచ్చిదానందరూపిణి యగు నద్దేవిన యెల్లప్పు డారాధింతు రని చెప్పి మఱియును,

క. నరవర ! ప్రశ్నంబుల కు
త్తరమిచ్చితి ; భవభయమునఁ దగ నెయ్యెది నీ
వరసి యడుగం దలంచెదొ
పురాణములు వినుట కన్నఁ బుణ్యము గలదే. ౬౧౦

ఆ. వె. సర్వపాపహారము సకల శుభప్రదం
బనఘ ముత్తమం బహర్నిశంబు
భక్తి వినెడివారి భవబంధములు వాపు
నిది పురాణములకు నెల్ల మిన్న. ౬౧౧

వ. అని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లకథకుండు శౌన కాదులకుఁ జెప్పుటయు, ౬౧౨

క. లోహితసగోత్రభవ ! వి
ద్యాహితసుమనోమనోజ్ఞతత్త్వజ్ఞ ! మృదు
వ్యాహార ! హారహారస
న్నిహారయశోవిహార ! నిరుపమసారా ! ౬౧౩

ఉ. కారుణికాగ్రగణ్య ! నృపకాంతశిరోమణికాంతిరంజిత
శ్రీరమణీయపాదయుగసేవనబంభరితాంతరంగ వి
స్ఫారయశోనుషంగపరిచారితసర్వదిగంతతుంగ వి
ద్యారతశిష్యసంగవితతాదర ! దుర్గయశాస్త్రి సోదరా ! ౬౧౪

విచిత్రవృత్తము. మహీయశ్చరిత్రా ! బహుస్తోత్రపాత్రా !
గృహస్థాత్మధన్యా ! బృహత్కీర్తిమాన్యా ! ౬౧౫

గద్య.

ఇదిశ్రీ—తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబయిన
దేవీభాగవతంబను మహాపురాణంబునందుఁ
జతుర్థస్కంధము.





శ్రీ మత్పరదేవతాయైనమః

# శ్రీ
# దేవీభాగవతము



## పంచమస్కంధము






సమానతేజ ! పాండీ
త్యసదృశనిరతాన్నదానతత్పర ! విద్యా
ర్థిసమేతపంక్తిభోజన !
కుసుమితసంతోష ! బ్రహ్మగురుదోషజ్ఞా ! ౧

—* శివకేశవతారతమ్యము. *—

వ. అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుం గాంచి, ౨

క. శ్రీ కృష్ణుని చరితమ్మును
మా కెఱుఁగం జెప్పితివి సమంజసముగ నే
మాకర్ణించితి మాసు
శ్లోకునికథయందు శంక చొప్పడు ననఘా ! 3

చ. హరి యవతారమైన జగదాద్యుఁడు కృష్ణుఁ డరణ్యమేగి శం
కరుని యజింప నాతఁ డెసకమ్మునఁ బార్వతితోడ వచ్చి మే
ల్వర మిడె నంటి శంకరుఁడు వారిజనేత్రునికన్న నెక్కుడే!
పరమవిరుద్ధ మియ్యది కృపన్ వచియింపుము మాకు నావుడున్.

చ. మునులు మహామహుల్! వినుఁడు మున్ను పరాశరపుత్రుఁడట్లు చె
ప్పిన చరితన్ గ్రహించి పృథివీపతి యాజనమేజయుండు వ్యా
సునిఁ గని పల్కె "నేల మధుసూదనునంశము కృష్ణుఁ డాచరిం
చెను దపమున్ శివుంగొలిచి చెప్పుము సంశయమయ్యె నమ్మునీ.

గీ. సృష్టిరక్షాప్రళయములు సేయఁజాలు
దేవదేవుండు సర్వసిద్ధిప్రదుండు
ప్రాకృతునిఁబోలెఁ గృష్ణుఁ డెప్పాటఁ జేసెఁ
దపము హరుఁగూర్చి యితని కతండు లొచ్చె? ౬

చ. అనవుడు వ్యాసుఁ డిట్లను జనాధిప! నీ వనినట్లు కృష్ణుఁ డెం
దును నధికుండు శక్తుఁడు ననూనమహామహిమానుభావుఁ డై
నను మనుజత్వ మందుకతనన్ దన కయ్యవి సంభవించె, నొ
ప్పునె మనుజత్వ మందియును బూర్వపురీతిని సంచరింపఁగన్?

మ. గురులం గొల్చుట, వృద్ధసేవనము, మ్రొక్కుల్ విప్రులం, దవ్వియ
చ్చరపూజారతి, హర్షశోకములు, స్త్రీసంసర్గము, న్నిత్యసం
సరణవ్యాప్తియు లోభమోహము లవశ్యమ్మున్ ఘటించున్ గుణో
ద్ధురమా దేహమునందు నిర్గుణత యొందుం జొప్పడంబోలునే.

వ. మఱియు శ్రీకృష్ణు నిధనమ్మునకును యాదవనాశనమ్మునకును నగ్రజగాంధారీ శాపమ్ములు కారణమ్ములు, చోరకృతలుంఠన హరణాదికంబును నయ్యెడ నర్జును నసమర్థతయుఁ బ్రద్యుమ్నా నిరుద్ధహరణం బెఱుంగమియు నివి మానవజన్మ సంభవమ్ములు.

క. హరి నారాయణముని య
ప్పరముని యంశంబు యాదవశిరోమణి సా
దరుఁడై యీతఁడు శివత
త్పరుఁ డగుటయు నబ్బురంబె ! పార్థివముఖ్యా. ౧౦

క. హరికి హరుఁడు కారణ మని
పరమామ్నాయమత మట్టి పరమాత్ము శివున్
హరియంశ మవతరించిన
పురుషుఁడు కృష్ణుండు గొలువఁబోలదె యధిపా ! ౧౧

శా. ఓంకారమ్మున నాద్యకారమున వాచ్యుం డౌ నజుం, డయ్యుకా
రాంకుం డాతనితండ్రి విష్ణువు, మకారాంకుండు శంభుండు, త
త్సంకేతమ్మున నుత్తరోత్తరము ప్రాశస్త్యంబు వాటిల్లు ని
ష్కంకన్ బైఁ దగు నర్ధమాత్ర చెలఁగున్ శక్తిస్వరూపమ్ముగన్.

వ. దానం జేసి శక్తికి సర్వోత్కృష్టతయు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల
కుత్తరోత్తరాధికతయుఁ గలుగు కతన హరికి హరపూజనం బావ
శ్యకంబ యని వెండియు, ౧౩

గీ. మూలరుద్రుని యంశంబు మూలముగను
బ్రహ్మవక్త్రంబునుండి సంభవము చెందె
నిచ్చమై నింక నొకరుద్రుఁ; డెల్లరకును
బూజ్యుఁ డీతఁడు వరములు పొందుపొంచె. ౧౪

క. ఈ రుద్రుఁడె త్రిజగమ్ముల
కారాధ్యుం డనిన మూలమగు రుద్రుఁడు కాఁ
డే ! రాజేంద్రా ! యితనికి
సారత దగు శక్తితత్త్వసాన్నిధ్యమునన్. ౧౫

క. హరి యోగమాయకతమునఁ
బరతంత్రుం డగుచు నెత్తె బహుజన్మము ల
ప్పరమాద్భుతమగు మాయకు
హరియు హరుఁడు నజుఁడు దాసు లఖిలామరులున్.

క. కనుఱెప్ప వేయునంతకు
జననము రక్షణము లయము సంధించెడి మో
హిని యోగమాయ యద్దా
నినిఁ గనుఁగొన నేర రెంత నేర్పరులు నృపా! ౧౭

క. హరి సూతికాగృహమ్మును
దఱలుట నందునిగృహంబు తనవాసముగాఁ
బొరయుట మధురాపురమున
కరుగుటయును యోగమాయ యలవరిచె నృపా. ౧౮

వ. పిదప భీతుండై మధురాపురమ్ము విడిచి ద్వారక కరుగుటయు
నయ్యోగమాయాబలంబని యెఱుంగునది. ౧౯

క. పదియాఱువేలపై యేఁ
బదిమంది లతాంగులకును పై భార్యల కె
న్మిదిమందికి దాసుండై
మధుసూదనుఁ డుంట యోగమాయకతమునన్. ౨౦

చ. నరవర! యొక్కకాంత తగునై పుణి గల్గినదయ్యె నేని య
బ్బురపువిలాసముల్ గొలిపి పూరుషు బద్ధునిఁ జేయఁ జాలు సుం
దరులు పదాఱువేలకును దక్కినపూరుషుఁ డెట్టిఁడేని ద
త్పరుఁ డయి తత్సతీనికరపంజరకీరముగాక తీరునే. ౨౧

చ. అరయఁగ సత్యభామకయి యాహరి యాహరిధామ మేగి యు
ద్ధురగతి యుద్ధరంగమునఁ దొయ్యలి మెచ్చఁగ దేవనాథు నో
సరిలగఁ జేసి కల్పకము చయ్యనఁ దెచ్చి ముదంబు గూర్చి సు
స్థిరముగ నాటునే పెరటిచెట్టుగ వశ్యుఁడు కాకయుండినన్. ౨౨

చ. అదియునుగాక చైద్యునకు నంగనగా గురుదత్తయైన య
మ్మదవతి రుక్మిణిన్ గలన మర్దితశాత్రవుఁడై హరించి యా
త్మదయితఁ జేసికోలు నొకధర్మమె ? యన్యకళత్ర మెంత ధ
ర్మదశకుఁ దప్పువాఁడును గ్రిమ మ్మోడఁ జేసి హరింపఁ బోలునే ?

గీ. ప్రకృతిజన్యంబు హరిహరబ్రహ్మమూల
మగు నహంకారమున జగ మవతరించెఁ
దద్వశుండయి మోహంబు దవిలి ప్రాణి
చేయుఁ దత్తత్కృతులు మంచి చెడ్డ యనక. ౨౪

గీ. బ్రహ్మమైన నహంకారవశుఁడు కాక
యున్నవేళ విముక్తుఁడై యుండు దానిఁ
దవులుచో సంసరణకృతితత్పరత్వ
మంది తత్తద్విశేషము లలవరించు. ౨౫

చ. అది విడువాఁడె ముక్తుఁడు, మహామహుఁడైనను నయ్యహంకృతిన్
బాదలెడివాఁడె బద్ధుఁడగుఁ బూరుషమాత్రున కంగనాదిసం
పదలును గేహముల్ సుతులు బంధము లందురు వీని కెక్కుడై
నది యని చెప్పఁగాఁదగు నహంకృతి నిక్కము పార్థివోత్తమా.

గీ. ఏ నొనర్చెడివాఁడ నాచే నొనర్పఁ
బడియె నింతటికార్యంబు బలియురందు
నధికుఁడను నేనటంచు నహంకృతిం ద
విలి నరుఁడు బంధనమునఁ బొరలు నరేంద్ర. ౨౬

వ. మృద్విహీనంబగు ఘటంబుపగిది నహంకారశూన్యంబగు వస్తువు దుర్లభంబు; కారణవిముక్తంబగు కార్యంబు లేమి శాస్త్రప్రసిద్ధంబకదా ! యని మఱియును. ౨౮

గీ. అయ్యహంకారసంపర్క మంది కాదె
యెల్ల జగములు పాలించు నిందిరేశుఁ
డట్లుకాకున్న నతఁడు దుఃఖాబ్ధిమగ్నుఁ
డగునె యవతారముల నెత్తి యవనినాథ ! ౨౯

వ. అహంకారనిర్ముక్తులకు మోహంబును సంసారమ్మును లేకుండు మఱియు బ్రహ్మాదులగుపురుషు లెల్లరును సాత్త్వికరాజసతామసభేదమ్ముల మూఁడు తెఱఁగులవారు, వీరియం దెల్లప్పుడును త్రివిధంబైన యహంకారంబు వర్తించుఁ దద్బద్ధుండై మాయామోహితుండై యనేకావతారమ్ములఁ దవిలి తత్తదనుగుణమ్ముగ హరి గ్రిమ్మరు నట్లు కాదేని యెట్టి మందుండును వాంఛింప నొల్లని పరమసంకటమ్మగు గర్భవాసమ్మున కతఁ డియ్యకొను టెట్లు ?

క. అతివిష్ఠాకులతాసం
గతి హేయంబైన దేవకసుతాగర్భ
స్థితికిన్ హరి యాత్మపద
చ్యుతుఁడై రానేల తాన యొడయం డైనన్ ? ౩౦

ఆ. వె. బ్రహ్మమొదలు స్తంబపర్యంతము జగంబు
యోగమాయవశత నొప్పు దాని
నుడిపి యుడుపలేక యూర్ణనాభియుఁబోలె
హరిహరాదులుండు రవనినాథ. ౩౧

క. అనవుడు జనమేజయుఁ డి
ట్లను యోగీశ్వరి మహామహాత్మత నాకున్

మునివర ! చెప్పితి వద్దా
నిన వెండియు వినఁగవలతు నీదగుకరుణన్. 33

ఆ. వె. మూఁడుమూర్తులకును మూలభూతంబయి
యఖిలజగము తానయై వెలుంగు
దేవదేవిమహిమఁ దివిరి వినకయుండు
చెనఁటి యొదుఁగలఁడె చెప్పు మనఘ. 34

వ. నావుడు వ్యాసుండిట్లను రాజేంద్రా! యియ్యది శ్రద్ధగలశాంతు నకు నుడువఁదగినది యని యెఱుంగుము. మున్ను మహిషుండను రాక్షసరాజు కాలమ్మున దేవదానవులకు ఘోరంబగు యుద్ధంబు జరిగె నది యెట్లంటేని. 35

క. కనకగిరి కేగి మహిషుం
డనిమిషులకు నెల్ల విస్మయము గదురఁగఁ జే
సెను వర్షాయుతము తపం
బును బరదేవతను హృదయమున నిల్పి నృపా. 36

—* మహిషాసురోత్పత్తి *—

క. ఆ తపమున కెద మెచ్చి కృ
పాతత్పరుఁడై విరించి వర మిడుటకునై
యేతెంచి కోరుకొ మ్మన
నాతని కమ్మహిషుఁ డిట్టు లనె భక్తిమెయిన్. 37

వ. మహాత్మా ! నాకుం గూర్తేని మృత్యువులేమిఁ బ్రసాదింపు మన వుడు నతం డిట్లనియె. 38

క. పుట్టినవారలు గిట్టుట
గిట్టి మరలఁ బుట్టుటయు నిఖిలజీవుల కె

ప్పట్టునఁ దప్పునియది నీ
కెట్టుగ నీవచ్చు మృత్యు వెడఁజేయంగన్. ౩౯

వ. భూభూధరసముద్రాదికంబులకైనను గాలవశమ్మున నాశమ్ము దప్ప దట్లుండ నీ కెట్లు మృత్యుభయంబు లేకుండ వరం బొసంగుదు ? నొక్క యుపాయమ్ము సెప్పెద మరణమ్మున కొకింతయేని యవకాశం బునిచి కోరుకొమ్మనవుడు వాఁ డిట్లనియె. ౪౦

క. సురదైత్యమానవులలోఁ
బురుషుఁడు ననుఁ జంపకుండఁ బూరింపుము-నా
వర మాఁడుది నను జంపం
దరమే యద్దాని నొక్కతెన్ విడువు మొగిన్. ౪౧

క. అనవుడు నీ కెప్పటికే
నిని మానినివలనఁ దొడరు నిధనం బిఁకఁ ద
క్కినవారివలన భీతిం
గొనకుము నీవంచు నేగెఁ గువలయనాథా ! ౪౨

వ. అంత నా రక్కసుండును సంప్రాప్తమనోరథుండై నిజనికేతనమ్మున కరిగె నావుడు "వాఁడన నెవ్వఁ డేకతమ్మున మహిషాకారంబు సంపాదిల్లె, నెవ్వనికొమరుం డెఱింగింపవే" యనుడు వ్యాసుం డిట్లను. ౪౩

క. రంభకరంభులు మహితా
రంభులు నిరువురును సుతులు ప్రబలుఁడు రతి సం
రంభునకు దనువునకు వా
రంభోజాప్తునికి నెక్కుడగుదురు దీప్తిన్. ౪౪

వ. అయ్యిరువురును సంతతిలేమిం జేసి బహువత్సరమ్ములు తపంబొనర్చి రందుఁ గరంభుండు పంచనదమ్మున జలమగ్నుండయ్యును రంభుం డొక్కభూరుహం బారోహించియు ఘోరంబగు తపం బొనర్చు చున్నంతఁ దత్తపోభీతుండగు నిందు్రిం డటకేతెంచి మొసలియై యప్పంచనదంబు సొచ్చి కరంభుని పాదమ్ములం బట్టి వధించిన రంభుండు భ్రాతృమరణదుఃఖితుండై, ౪౫

క. మన మెరియఁగఁ దన శీర్ష
మ్మును వహ్నికి నీఁగ నెంచి మొగిఁ దెగనఱుకం
గను దక్షిణకర మాయుధ
సనాథముగఁ జేయుదుర్కఁ గృశానుఁడు పేర్మిన్. ౪౬

చ. ఎదుటికి వచ్చి "శీర్ష మిటులేటికిఁ దు్రించెద వాత్మహత్య చే యఁదగునె? చేయుదుర్క బరమునౌదు సుఖం బెడయా భవత్తపం బెదకు ముదం బొసంగెఁ గొను మిచ్చెద నీకు వరంబు, వచ్చి యె య్యది గొనువాఁడ వీ" వనుడు నద్దనుజుండు విముక్తశీర్షుఁడై.

గీ. దేవ నాయెడ నీకు సంతృప్తియేని
కామరూపియు నఖిలలోకవిజయియును
అమరదానవమానవాద్యఖిలవీరు
లకు జయింపఁగరాని పుత్రకుని నిమ్ము. ౪౭

వ. నాపుడుఁ బావకుం డట్లగుంగాకేమి యింక మరణోద్యోగంబు విర మింపుము, నీ కెయ్యది గూర్చు నద్దానియంద యుట్టి పుత్రుండు వొడము ననుడు రంభుం డవ్విటిపహోతు్రిన కేఱంగి పీడొ్కని యరు దెంచువాఁడు మునుదట యక్షరక్షితంబగు నొక్క మనోహర ప్రదేశమ్మ్ననున్న మహిషి నతిమత్త నందంబగుదానిఁ జూచి కామించిన నయ్యదియు రంభుం గలయుట కియ్యకొనియె నంత

భావికార్యవశమ్మున రంభుండద్దానితో రమించి గర్భిణియగు దానిం గొని యితర మహిషంబులవలని భయము దొలఁగించుచుఁ బాతాళమ్మునకుఁ దోలికొని చనియె. ౮౯

క. ఒకనాఁడమ్మహిషిని వే
ఱొకమహిషము చూచి మోహయోగమ్మునఁ దా
భక పైకొన నుంకించినఁ
బ్రకోపనుఁడు దానిఁ గొట్టె రంభుఁడు కడఁకన్. ౯౦

వ. అంత మహిషంబును దనకు విఘ్నకారియగు నద్దనుజుని శృంగంబులం బొడిచిమొత్తి మృతునిం గావించిన నమ్మహిషియు భర్తృమరణమ్మునకు శోకించుచుఁ దనపూర్వనివాసమ్మునకుం జని యక్షుల శరణుఁజెందె; నవల దానిపిఱుందన యమ్మహిషంబును గామార్తంబగు కతన నరిగి యయ్యక్షులతోఁ బెనంగి తచ్ఛరతాడితంబయి ద్రెళ్లె. పిదప యక్షులు నమ్మృతదనుజకళేబరముం గొని తెచ్చి యమ్మహిషశవంబుతోఁ జితాసంస్కారంబు చేయనుంకించిన నమ్మహిషియు సహగమనపరాయణయై యక్షనివారితయయ్యు వెనుఁదీయక యయ్యనలమ్మునం బడియె. మీఁదఁ జితామధ్యంబునుండి మహిషుండును రక్తబీజుండు నను నిరువురు రక్కసు లుదయించి రందు మహిషుండు రాక్షసులచే రాజ్యాభిషిక్తుండయ్యె రక్తబీజుండును సురాసురుల కవధ్యుండై చరియించుచుండె నిట్లు చతుస్సముద్రముద్రితంబగు ధరామండలంబు నమ్మహిషుం డేకచ్ఛత్రమ్ముగ నేలుచుండి మహాబలుండగు చిక్షురుండును సేనాయుతసమావృతుం డగు తామ్రుండును నసిలోముండును నుదర్కుండును బిడాలుండును బాష్కలుండును ద్రిణేత్రుండును గాలబంధకుండును దనకు సేనానాయకులుగా

రాజవర్గంబు లరివెట్టి విప్రుల జన్నములు కలఁచుచు మదోద్ధ
రుండై యొక్కనాఁడు. ౧౧

మ. వరదానోద్ధతగర్వుఁడై యతఁడు స్వర్వాసంబు వశ్యంబుఁ జే
యురహిన్ సేవకుఁబంచె "నింద్రుఁడునన్ యుద్ధమ్మునన్ గెల్చునో
శరణాం బంది దివంబు నా కిడునో నిస్సందేహ మారీతి నా
సురనాథుం గని నిశ్చయింపఁ దగు " నంచున్ జెప్పి నిర్భీతిమై.

వ. అంత దూత దివమ్మున కరిగి యిందున కిట్లనియె. ౧౩

చ. విను సురనాథ ! నే మహిషవీరునిదూత నతండు పంప నిన్
గనుఁగొన వచ్చినాఁడ నీక గర్వము చెందక వీడు వీడి మా
జనపతి సేవకుండ వయి చక్కఁగ నుండెద వొండె యుద్ధముం
బనుపడి చేసె దొండె నొకపద్ధతి సేయుము నాఁగ నిందుఁడున్.

ఉ. వానికి నిట్లు పల్కె బలవద్విష " నోరి మదాంధ ! యిట్లు క
న్నానక నీవిభుం డనిపెఁ గా నిను ! మంచిది వానిరోగ మె
ట్లేని యడంతు నాయెదుట నిట్లనఁ జెల్లునె నీకు ? దూతయౌ
వానినిఁ జంప రామి విడువంబడి నీపతి కిట్లు సెప్పుమా. ౧౪

ఉ. ఓమహిషీకుమార ! నను యుద్ధమునందు జయించు నిచ్చ నీ
కేమెయిఁ బుట్టెనే ! తృణము లెంతయు మెక్కుటచేత మిక్కుటం
బై మద మెక్కెనే ! జడుఁడ వంచు నెఱుంగుదు నిన్ను నీకు ను
ద్దామత నిచ్చుశృంగములఁ ద్రివ్వి తగం బొనరింతుఁ జూపమున్ "

వ. అనవుడు దూత వైళంబ చని మహిషుం గాంచి నమస్కరించి
యిట్లు విన్నవించె. ౧౭

క. నిను గణియింపక సురపతి
పనిచిన పలుకులను జెప్ప భయమొదవెడి వా

నిని విడిచి నీకుఁ బ్రియమగు
నన్నృతము వచియింప నర్హమగునె తలంపన్. ౫౮

క. ప్రియమును సత్యముఁ బల్కుట
యయుచిత మగు భృత్యునకు నృపాగ్రమ్మున నేఁ
బ్రియముగ వినిచితి నేని య
దియు నీకార్యమ్మునకుఁ బ్రతిఘటించు నోగీ. ౫౯

చ. ఇఁక రిపుఁడెట్లు వల్కె నటులే వచియించెద నన్న నెందు సే
వకునకు శోభనార్హ కిది భావ్యము గాదు రిపుల్ వచించు ఫ
క్కిక యన మిత్తి పల్కులను గేలి యొనర్చు నెటుల్ వచింతు న
ట్టి కుటిలవాక్యముల్ గలన డీకొను మార్తురమాడ్కిఁ దెంపునన్.

క. అని హేతుగర్భముగఁ జె
ప్పిన పల్కుల యర్థమును సవిస్తరముగఁ గై
కొని పెచ్చు పెరుఁగు కోపం
బున మహిషాసురుఁడు గర్వమూర్ఛితుఁ డగుచున్. ౬౧

శా. లాంగూలమ్మును బృష్ఠదేశమున వాలాయమ్ముఁ గీలించి భ్రూ
భంగం బొప్పఁగ నెఱ్ఱనౌ కనులు కోపం బంతటన్ గుమ్మరిం
పం గై పెక్కుడు మూత్రమున్విడుచుచున్మత్తాత్ముఁడై యింద్రుఁడి
బ్భంగిం బల్కుట వింటిరే యిఁక వధింపం బోలదే దుష్టునిన్.

ఉ. వాఁడన నెంత, వానిబలవైభవ మెన్నఁగ శాంతులందు, మా
రాడనితాపసోత్తములయందుఁ బరాంగనలందుఁ జెల్లుఁ బో
రాడుట కప్సరోంగనల కౌనె తపమ్ము లడంచు భంగిఁ? దూ
టాడెదఁ గోటియిందుని లోకపైపై యని నన్నెదిరించిరేనియున్.

క. నముచిం జంపెను విశ్వా
సము చొప్పడ సంధిఁజేసి శపథమ్ములకుం
గ్రిమ మెడలి; యట్టి దుష్టుఁ
క్షమింప సజ్జనుల కెట్లు సంతసమెసఁగున్. ౬౪

వ. ఇదియిట్లుండఁ దత్సహాయుండగు హరియు నిట్టిఁడ యది
యెట్లంటేని, ౬౫

క. కపటాచార్యుఁడు కుహకుఁడు
శపథాకరుఁ డతఁడు మున్ను చంపఁడె కిటి య
న్నెపమునఁ గనకాక్షుని సిం
గపుమానిసియై హిరణ్యకశిపు బలాఢ్యున్. ౬౬

వ. కావున నిందొఱ్ఱేందు్రిలయెడ విశ్వాసం బెగ్గగు నా కీ దేవపతి
యన నెంత! మహాదేవుం డెవ్వరైనను ననికిఁ గడంగుదు.

ఉ. కావున నష్టదిక్పతుల గర్వమడంచి నిలింపసంతతుల్
చేవకుఁదక్కి దైన్యమునఁ జెంది కృశింపఁగ నాకలోకసు
శ్రీవిభవంబు గైకొని యశేషమఖమ్ముల నిచ్చుభాగముల్
కేవల రాక్షసార్థముగఁ గీల్కొనఁజేసి చరింతు నెంతయున్. ౬౭

క. సురనరకిన్నరు లాదిగఁ
బురుషులు ననుఁ జెనకఁ దగరు పూఁబోఁడికి నన్
బోరిఁగొనఁ దరమే! నాదగు
వర మెఱుఁగరె, యొకఁడు మనకు వశ్యుఁడు కాఁడే. ౬౮

వ. మీరు పాతాళమ్మునకును బర్వతమ్ములకును జని యచ్చటచ్చట
నున్న దానవులం బురికొల్పికొని యనికిఁ గడంగు నది యని
వెండియు, ౭౦

ఉ. ఏ నొకరుండనే సురలనెల్ల జయించెద మత్తురాహతిం
బూనియు నాదుశృంగములపోటులు నాటియు నెవ్వఁడేనియుం
బ్రాణములం ద్యజింపఁడె? దురమ్మున బాసట యేల! నిక్కమో
దానవులార! మీరలును దక్కటియోధులు నా కలంకృతుల్.

మ. నవమందారసుమస్రగావళులతో నాకాంగనాసౌఖ్యవై
భవలీలన్ మలఁదూఁగుచున్ నిరతసంపద్ధాత్రియౌ కామధే
నువృపాల్గొ ల్చుచు నాకలోకమునయందున్ మీరు క్రీడల్ పొన
ర్పవలెన్ రక్కసులార! సంగరసమారంభస్థితిన్ నిల్వఁడీ. ౭౨

చ. నిరతము నాటపాటలకు నేర్పరులై గడిఁదేటినట్టి సుం
దరులగు రంభ యూర్వశి ఘృతాచి తిలోత్తమ మేనకాప్రమ
ద్వరలును విప్రజిత్తియును దక్కటి యచ్చరలున్ బ్రమోదబం
ధురలయిమిమ్ముఁగొల్వఁదులఁదూఁగుఁడు నందనమందుదానవుల్!

వ. అని చెప్పి సేనాసంరక్షణార్థంబుగాఁ బురోహితుండగు భార్గవుం
బిలిచి పూజించి మహిషుండున్నంత, ౭౪

చ. దివిజవిభుండు సత్వరగతిన్ దిగధీశులఁ బిల్వఁ బంచి వా
రు వినఁగ నిట్లు పల్కె, మదరూక్షుఁడు రంభసుతుండు బ్రహ్మద
త్తవరమహోద్ధతుండు సురధామము గైకొన నెంచి సేవకుం
బవరముసేతకై పిలువఁబంచె వినుం డతఁడాడుమాటలన్. ౭౫

చ. పరిమద మెలర్ప మామహిషరాజునకున్ శరణాగతుండవై
యమరులతోఁ బనింగొనుచు నాతనిభృత్యుఁడవౌటయొండె యు
ద్ధమునకు వచ్చుటొండె నొకదానికిఁ బూనుము మావిభుండు కో
పమెఱుఁగఁడెప్డు భృత్యులను బాలనసేయు దయాంబుశాలియై.

—* ఇంద్రుఁడు విమర్శించుట. *—

వ. అని చెప్పి యమ్మహిషుదూత చనియె నియ్యెడ మనకుఁ గర్త
వ్యంబు నిర్ణయింపుఁడు శత్రుండు దుర్బలుండైనను క్షమింపఁ
దగదు. జయాజయమ్ములు దైవాధీనమ్ములయ్యును యత్నం
బవశ్యకర్తవ్యంబు ౭౭

గీ. సంధియోగంబు ముఖ్య మాసంధి యిట్టి
ఖలునియెడ విషమించు నిక్కముగ యాన
మైన యోజింపక యొనర్చు టనభిమతము
తన బలముఁ బరబలమును దలఁప వలయు. ౭౮

వ. కావున వాని సైన్యాదివివేచనం బొనర్ప నొక్కనిం బుచ్చి తెలి
సికొనుట యుచితంబని యొక్క ప్రణిధిం బంచిన వాఁడును సతి
త్వరితగమనమ్మునం జని మగుడవచ్చి యవ్వాని బలవిశేషమ్ములం
జెప్పిన వాసవుండు విస్మితుండై మంత్రవేదియగు పురోహితుం
బిలిచి యిట్లనియె. ౭౯

క. దానవుఁడు మహిషుఁ డున్నత
సేనావృతుఁ డగుచు మనకుఁ జెట్ట దలఁచి తా
రా నుండె నిట, కుపాయము
దీనికి యోజించి యొకటిఁ దెలుపుము దేవా! ౮౦

వ. దానవులకు శుక్రునట్ల మాకీవు సర్వకార్యప్రవర్తకుండవు విఘ్న
పరిహర్తవు ననుడు బృహస్పతి సురేంద్రా! వ్యసనంబు సంప్రా
ప్తంబగుడు బుద్ధిమంతులు ధైర్యంబు వీడ రట్లగుట నీవు ధైర్య
మవలంబింపుము. ౮౧

క. అగునది కాకుండదు దై
వగతికిఁ బ్రతిసేయఁగల్గు వారమె? చేయం

దగునైనను దోఁచిన య
ట్లగణితమగు యత్నమును సురాధిప వింటే. ౮౨

వ. దీని నెఱింగియేకదా మునులు ముక్త్యర్థంబు సంతతధ్యానయోగమ్ముల యత్నింతురు. పురుషకారంబు లేకున్నఁ గేవల దైవంబు కతనఁ గార్యంబు నెఱవేఱ దది యెట్లన్నఁ జీఁకును బిచ్చుకకుంటును నన్యోన్యసాహాయ్యంబు లేమి నకించిత్కరులయ్యు నది గల్గినఁ గృతకార్యులగుదు రొక్కెడఁ బురుషకారంబు గల్గియుఁ గార్యసిద్ధి యలవడకుండు నచ్చోట దూషింపఁదగ, దయ్యది రథసైన్య మంత్రాదికంబుల నుండక దైవాధీనంబై యుండు నెట్లంటేని, ౮౩

చ. బలియుఁడు క్లేశ మందుట యపాస్తబలుండు సుఖమ్ము చెందు టు
జ్జ్వలమతిగల్గుధీరునకు సంపద లేమియుఁ దెల్వి లేనివాఁ
డలఘుగతిన్ మహావిభవ మందుట శూరపరాభవంబు భీ
తులవిజయంబు నన్నది బుధుల్ పరికింతురు దైవికంబుగా. ౮౪

సీ. కాఁదగు దానికి గతి దైవ మని యత్న
మొనరింపు మవల నయ్యుద్యమమ్ము
ఫలియించు నొండె విఫలమగు నొండెఁ గా
కయ్యెడ హర్షశోకాప్తి గనఁగఁ
దగ దద్దైర్యంబు సంతాపకారణమగు
దుఃఖయోగం బాత్మఁ దొడరు నప్పు
డెయ్యది దుఃఖమే నెవ్వఁడ నిరువది
నాలుగు వీడిన నాకు నిర్గు

ఆ. వె. ణాత్మకునకు దీన నయ్యెడిదేమి ? యాఁ
కలియు దప్పి ప్రాణగతములు సుఖ

దుఃఖములు మనమ్మతో నుండు జరయు మృ
త్యువు శరీరమునకుఁ దొడరు మఱియు. ౮౬

వ. షడూర్మిరహితుండనగు నేను శరీరంబుం గాను దత్సంబంధి నేం గాను, చతుర్వింశతితత్త్వభిన్నుండనగు నేను సదానందుండఁ బ్రకృతివికృతిభిన్నుండ నని తలంచుకొని నిర్మమత్త్వంబునొందు మియ్యది దుఃఖనాశమ్మునకుఁ బ్రధమోపాయంబని వెండియు,

గీ. మమత దుఃఖమ్ములకు నెల్ల మనికిపట్టు
దాని విడిచినవాఁడె తద్దయు సుఖాత్ముఁ
డమరనాయక ! సంతోష మన్నిగతుల
సౌఖ్య మొసఁగూర్చు దానికి సవతు లేదు. ౮౭

ఉ. నీకు మమత్వము న్విడుచు నేరుపు చాలకయున్న భావికా
ర్యాకలనంబునం దగిన యత్న మొనర్పుము బుద్ధియుక్ సురా
నీకము తోడు గాఁగఁ బయి నీవొ రిపుండొ జయమ్ముగాంచి సౌ
ఖ్యాకరులై యొసంగఁగల రయ్యది దైవము సేఁత గాఁ దగుక్. ౮౮

వ. ఎవ్వరికిని సుఖంబు పుణ్యక్షయమ్మనియు దుఃఖమ్మ పాపక్షయమ్మనియు నెఱుంగు మింతయేల నీబుద్ధికిం దోఁచి నట్లొనర్పు మన వుడు సురేశ్వరుండు, మహాత్మా ! దుష్టుండగు నమ్మహిషు నశింపఁ జేయుటయ నాకుం దోఁచినవిధం బగుట యుద్ధోద్యోగం బొన రించెద నుద్యమ్మంబు లేకున్నఁ గార్యంబు సిద్ధింపదు. విజ్ఞానంబు యతులకును సంతోషంబు విప్రులకును శత్రుహాననంబు ప్రభు వులకును భూషణంబులు. ౮౯

క. మును త్వష్టకుమారుని నము
చినిఁ జంపితి నుద్యమంబు చేసి యటుల యి

ద్దనుజుఁ బరిమార్తు నీ మం
త్రినియోగముఁ బవియు విజయదాయకములుగా. ౯౦

వ. నాకు నెల్ల సంగరమ్ములను నీవును వజ్రాయుధమ్మును హరిహరులును సహాయులు. రక్షోఘ్నంబులగు మంత్రమ్ములం బఠించి దీనికి నీ వనుకూలుండవు గమ్మనవుడు స్మితపూర్వకంబుగ నతం డతని కిట్లనియె. ౯౧

క. సురనాథ ! నిన్ను యుద్ధా
దరుసిఁ గలదనియుఁ బోవఁదగు ననియును నే
నిరుదెఱఁగు చెప్పనోప నె
వరికిఁ జయము నజయంబు వక్తవ్యము లే. ౯౨

మ. భవితవ్యంపు విధంబు నాతరమె చెప్ప న్నాకలోకేశ ! యే
ది విధేయం బది యాచరింపు మెవఁడేఁ దీర్ఘ సమర్థుండె దై
వవిధిం బైఁ బడు మంచిచెడ్డల ; ననుం వంచింపఁడే మున్ను మ
ద్ధవళాక్షిం గొని చంద్రుఁ; డప్పు డతిచింతం జెందనే యేనొగిం. 

వ. నన్ను మీర లందఱును బుద్ధిమంతుండని కదా కొనియాడుచుం దు రయ్యెడ నాబుద్ధి యేమయ్యెఁ గావున నోపినకొలఁది నుపాయంబు చింతింపుఁడు. సిద్ధ్యసిద్ధలు దైవాధీనంబు లనవుడు బ్రహ్మ కడకుఁ జని శరణంబు వేఁడి యిట్లనియె. ౯౪

చ. మహిషుఁ డనంగ నొక్కరుఁ డమర్త్యవిరోధి మదోద్ధతుండు నా
కహితమొనర్చి నాకమున కాపద గూర్పఁగ దైత్యవాహినీ
సహితుఁడు సంగరమ్మునకు సన్నహనం బొనరించువాఁడు వా
ని హతికి భీతి చెందితి గణింపుము నాదురవస్థ నావుడుం. ౯౫

వ. పితామహుండును హరిహరులం బురస్కరించుకొని సంగరం బొన
ర్చుట కర్జంబగు మనమందఱ మిప్పుడ కైలాసమ్మున కరుగుద
మని చెప్పిన నింద్రుండు చతుర్ముఖపురస్సరంబుగాఁ గైలాస
మ్మున కరిగి వేదమంత్రమ్ములచే నతని సన్నుతించి ప్రసన్నుం
డగు నద్దేవుఁ బురస్కరించుకొని వైకుంఠమ్మున కరిగి యబ్జనాభు
శరణంబు వేఁడి మహిషాసురుం డొనర్చుదుర్నయమ్ములు సెప్పిన
నతం డింద్రపురోగముల కిట్లనియె. మనమెల్లఁ గలసి యద్దానవు
నిర్జించుట కర్జం బయ్యెడి నాహవసన్నద్ధులరగుఁ డనిన వారు
వారివారి వాహనమ్ముల నధిష్ఠించి సంగరాభిముఖులైరి. ౯౬

గీ. అంచ నెక్కె విరించి ఖగాధిపుపయి
హరి వెలిఁగె వృషవాహనుఁడయ్యె శూలి
నెమ్మిపై నుండె గుహుఁడు గజమ్ము దేవ
పతి యధిష్ఠించె సంగరప్రమద మొదవ. ౯౭

వ. ఇట్లు సన్నద్ధులై హరిహరవిరించిప్రముఖనిలింపులు వెడలిన
నమ్మహిషుండును దైత్యవాహినీసహితుఁడై యుక్కు మిగిలి
ధరణీతలంబు గ్రక్కదలఁ జనుదెంచె, నిట్లయ్యిరువాఁగును గలసి
యెదిరిన సంగరంబు బెట్టిదం బయ్యె. ౯౮

మ. గదలన్ బట్టసశూలతోమరములన్ గార్చిచ్చునుం బోని బె
ట్టిదమౌ శస్త్రపరంపరన్ విపులధాటిన్ మేటిగాఁ బోరి రు
న్మదులై యాజి సురాసురుల్ భువనసంపాతంబుగాఁ దారకల్
సెదరన్ దిక్తతి యేకమై పొదల నిస్సీమప్రతాపోన్నతిన్. ౯౯

ఉ. మానితశౌర్యధుర్యుఁ డసమానపరాక్రముఁ డైన వాని సే
నాని గజాధిరూఢుఁ డయి నాకపుఁ జిత్తురుఁ జేసె శస్త్రవి

ద్యానిపుణుండు బాణముల నైదిట; నిందు్రఁడు వానిబాణసం
తానముఁ ద్రుంచి వక్షమున నాటె నవంబగు నర్ధచంద్రముల్.

వ. చిక్షురుండును దదాశుగమ్మున మూర్ఛవోయి యేనుఁగుపై నొరు
గుడు సురపతి శతకోటిం గొని యక్కరికరంబు ద్రెళ్ల నేసిన
సంగరరంగంబు విడిచి పలాయనం బొనర్చె నంత మహిషుండు
క్రోధతామ్రాక్షుండై, ౧౦౧

శా. కాలాభీలు బిడాలనామకుని సంగ్రామైకవీరుల్ మరు
త్పాలాద్యష్టదిగీశులన్ క్షణములో భంజించి రమ్మంచు దు
ర్శీలుం బంచిన వాఁ "డిదెంత" యని జేజేరాజుపై నేగె నా
భీలోన్మత్తగజంబు నెక్కి సురలున్ బెంపేది యల్లాడఁగన్. ౧౦౨

ఉ. వచ్చెడివానిఁ గాంచి సురవల్లభుఁ డెక్కుడు శౌర్యమొప్ప మే
నుచ్చిచనంగ నేసె నురగోగ్రము లైన శరమ్ములన్ వడిన్
హెచ్చిన తీవ్రకోపమున నిందు్రశరమ్ములు ద్రుంచి వాఁడు పై
పెచ్చుగ నొక్క యేఁబది గభీరశరమ్ములు నించె నేర్పుతోన్.

చ. నడుమన వాని శస్త్రములు నాకవిభుండు మరల్చి క్రోధ మె
క్కుడుగను వాఁడియైన శరకోటి వెసన్ బరఁగింప వాఁడునుం
బొడిగ నొనర్చె దేవవిభుపూనిక వమ్ముగ శస్త్రసంతతిన్
దడయక యమ్మరుత్పతి గదంగొని యేసె గజమ్ము నక్కజన్.

గీ. ఆ గదాఘాతమునఁ గరి యాహావావ
నీతలము పాసె నార్తంపు నిస్వనంబు
చెలఁగ; నవ్వాఁడు క్రోధ మగ్గలము గాఁగఁ
డివిరి యనిసేసె నేర్పుతోఁ దేరి నెక్కి. ౧౦౫

చ. సురరిపు తేరు చూచి బలసూదనుఁ డాహవకోవిదుండు దాఁ
గురిసె నుదగ్రమార్గణపుఁగోటుల; దానికి వాఁడు నల్గి మే
దురముగ నస్త్రముల్ గడకతోఁ బరఁగించె ననంతసంఖ్యఁ; ద
చ్ఛరముల కజ్జమైషులకు సంగర మద్భుతమయ్యె నయ్యెడన్.

వ. పిదప నింద్రుం డవ్వానికోల్తలకు శంకించి జయంతుం దన కగ్రమ్మున నిడికొని బాసటమై తానును బోరుచుండె నట్టియెడ,

మ. కడఁకన్ మార్గణపంచకమ్మున మహోగ్రప్రక్రియాధుర్యుఁడై
వడిమై నేసె జయంతుఁ డయ్యసుర దుష్ప్రారంభు; వాడున్ మహో
బడబాగ్నిప్రభలైన తచ్ఛరతతుల్ వక్షమ్మున న్నాటి కీ
డ్వడి యత్తేరున మ్రొగ్గతిల్లఁబడె దుర్వారంపు మూర్ఛాగతిన్.

వ అంత సారథి రథంబు దోలికొని వేఱొక్కయిమ్మున కరిగిన జయ శబ్దంబు లొక్కపెట్టఁ జెలంగ సురలు తనుజసహితంబుగ సురపతి నగ్గించిరి. ౧౦౯

ఉ. ఆ జయశబ్దముల్ విని మహాగ్రహావిగ్రహుఁడై హయారి త
త్తేజము సైఁపలేక కడుఁ దెంపరి నస్త్రవిదున్ మహామహో
భాజనుఁ దామ్రి నంపె నతిపాటవ మొప్పఁగఁ దామ్రిఁడభ్రవి
భ్రాజన మొప్ప నస్త్రములు వర్షముగాఁగ నిగిడ్చె నింద్రుపై.

వ. అంత,

చ. వరుణుఁడు పాశముం గొని సవాహనుఁడై యెదిరించెఁ బాశికిం
దురమునఁ దోడుగా మిగుల దోర్బల మేర్పడ దండధారియై
యరిగె జముండు వెంటనె మహామహిషార్భటి మిన్నుముట్టఁ దా
నిరుపుర కొక్కఁడయ్యెఁ దనియించె సురారి శరాళి పెంపునన్.

శా. ఘోరంబై విలసిల్లు నారణమునన్ గోపమ్ముమై ధర్ముఁ "డో
రోరి! రాక్షస! పోకుపోకు" మని దండోద్యత్కరుండై బల
స్ఫారున్ దాముని వైచుడున్ జలమునన్ బాటింప కమ్మేటి యు
ద్ధారంభుండయి యింద్రుఁడొట్టి సురలాహా! నాఁగజృంభించినన్.

చ. నిలు నిలు పోకు మంచు సురనేతకుఁ దోడయి దేవతల్ సుని
శ్చలులయి మార్గణమ్ముల ససంఖ్యగతిన్ బరఁగించి రక్కసున్
బల మఱఁ జేసినన్ బడియె వాఁడును మూర్ఛ మునింగి సంగర
స్థలమున రక్కసుల్ మిగుల దైన్యమునొంది కలంగి పాఱఁగన్.

క. తాముఁడటు మూర్ఛఁ జెందిన
నా(మేడితకోపఘూర్ణితాక్షుల కాంతుల్
తామ్రప్రక్రియఁ బర్వఁగఁ
దా మిర్ంగెడి భాతి సురలఁదాఁకె మహిషుఁడున్. ౧౧౪

—* దేవదానవ యుద్ధము *—

వ. ఇట్లు గజారూఢుండై గదం గైకొని పోకుమని యదల్చి సుర
నాథునేసిన నతండును బిట్టలిగి వజ్రమ్మున నగ్గదం బొడిచేసె.

చ. తనుఁ దునుమంగ బెట్టిదపుదండడి మీఁదికి వచ్చు నింద్రు నో
య్యనగని యెక్కుడౌ నలుక నార్చి ఫణీడ్నిభమైన ఖడ్గముం
గొని మహిషుండు దా నెదురుకోలు ఘటించిన నంత నిర్వురున్
గనుఁగొనువారు మెచ్చఁగ నఖండముగా నని చేసి రుద్ధతిన్.

గీ. అంత దైత్యుండు శాంబరి నఖిలలోక
మోహకరి గాఁగ మాయఁ దామొనయఁ జేసె
నధిప! యెయ్యెడఁ జూచిన నాత్మసదృశు
లొప్పి రోకకోటి యమ్మాయఁ గుప్పలుగను. ౧౧౫

వ. ఇట్లు మాయాపరిభావమ్మున నెల్లెడఁ దానయై మహిషుండు విజృంభించి తమ సేనల రూపడంచుటకు నింద్రుం డత్యాశ్చర్యపర్యాప్తుండై చేయునది లేక పుల్లవడియె. ౧౧౮

ఆ. వె. వరుణుఁడును జముండు సరసిజాప్తుండు వ
హ్నియు శశాంకుఁదొట్టి యితరు లమరు
లధికభయము దొడర నందంద మాన్పడి
పాఱఁ జొచ్చి రసురబారి కెడలి ౧౧౯

ఉ. ఈగతి నార్తులై యమరులెల్లఁ ద్రిమూర్తుల నాత్మ నిల్పి మా
కాఁగఁగ రాదు వీని నని యంచు మొఱల్ బచరించుమాత్ర న
య్యాగమవేద్యు లయ్యెడకు హంసఖగేశవృషాధిరూఢులై
మూగురు నేగుదెంచిరి సముద్ధతులై మహిషున్ వధింపఁగన్.

వ. పదంపడి చక్రి చక్రంబు వైచినఁ దత్తేజమ్మున నవ్వాని మాయ పంచబంగాళంబై విరిసె. దానికి సహింపక మహిషుండును, జిక్షురుండును, నుగ్రాస్యుండును, నుగ్రవీరుండును, నసిలోముండును, ద్రిణేత్రుండును, బాష్కలుండును, నంధకుండును, దక్కుంగల రక్కసులును నొక్కటై పరిఘాద్యాయుధమ్ములు ధరించి ప్రతిఘటించినఁ బోరు ఘోరంబయ్యె నయ్యెడ. ౧౨౧

ఉ. రక్కసులెల్ల నుక్కఁ గరమ్ములఁ జాపము లొప్పు దిక్తతుల్
గ్రక్కదలంగఁ దాఁకి యమరప్రతతిన్ వృకముల్ గడంగి దా
మెక్కటి వత్ససంఘముల నేపునఁ దోలినభంగిఁ దోలి రి
ట్లుక్కఱియున్ సురల్ వాడిచి రోడక యోపినవట్టు పోరుచున్.

క. కడు నడరు బాణవర్షము
పుడమియు నాకసము గప్పఁ బోరు భరంబై

దొడరిన నయ్యెడ నంధకుఁ
డుడుసంఘము రాల నార్చి యోధులు తలఁకన్.

శా. ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ములన్ వీఁక నా
నీకాక్షుం గుఱిఁజేసి యేసిన విపాళీఢమ్ము లా వాని నా
లోకారాధ్యుఁడు బిట్టు దున్మి సుర లాలోకించి యగ్గింపఁ దీ
క్ష్ణాకారమ్ముల నైదు బాణముల దేవారాతిపై నించినన్. ౧౨౮

వ. దానఁబోరు ఘోరంబయ్యె నిట్లు హరితోఁ బెనంగి యంధకుండు హరుం దాఁకెఁ బదంపడి యిరువురకును నేఁబది దినమ్ములు సమస్తలోకలోమహర్షణంబగు నాహవంబు ప్రవర్తిల్లె నయ్యెడ బాష్కలుం డిందుఁ డిందాఁకియు మహిషుండు రుద్రు నదల్చియుఁ ద్రినేత్రుండు జము మార్కొనియు మహాహనుండు గుబేరునిపైఁ గవిసియు నసిలోముండు వరుణుపై నురువణించియు నతిదారుణంబుగఁ బిఱుసనక సంగరం బొనరించి రట్టియెడ నంధకుం డుక్కుమిగిలి, ౧౨౯

క. గదఁ గైకొని యమరులు గ్ర
క్కదలఁగ హరి నురువడించి కడు బెట్టిదమై
యదరిపడ గరుడు నేసిన
మదమతి యాతండు గొంత మార్కొనెడె నధిపా. ౧౩౦

ఉ. అంత జనార్దనుండు విహగాధిపుమేని నొకింత దువ్వి వి
క్రాంతిఁ దొరంగఁజేసి విశిఖమ్ముల నంధకుఁ గూర్చి యేయ వాఁ
డంతఁ దదీయమార్గణము లన్నియు నుగ్గుగఁ జేసి యబ్ధిజా
కాంతుని నేసె నేఁబది యఖండశరమ్ముల శౌరి పెల్చనన్.

ఆ. వె. వాని బాణములను వమ్ముగాఁ జేసి వే
యంచు లొప్పి దీప్తిమించు తన సు

దర్శనంబు వాని తల గుటిచేసి వై
చిన సురారి మిగులఁ జేవ దవిలి. ౧౨౮

మ. అనివార్యమ్మగు శౌరిచక్రమును వార్యమ్మా నటుల్ చేసెఁ గై
కొని చక్రంబొకఁడేసి; దాని కసురుల్ గోలాహలం బొప్పఁ బెం
పున నగ్గించిరి యంధకుల్; సురవరుల్ పొల్పేది 'యేమీ! సుద
ర్శన మిట్లాయె!' యటంచు నొక్కుమొగి నాక్రందించి రత్యార్తులై.

క. సుర లాక్రందించిన నా
హరి కనలి యమర్చి యేసె నయ్యంధకుపైఁ
ద్వరితగతిఁ గౌమోదకి
శిరమునకుం దాఁకునట్లు చేకోలఁది వెసన్. ౧౩౦

వ. పిమ్మట నగ్గద శిరమ్మునకుం దాఁకుడు దిమ్ముగదిరి యమ్మానవా
దుండు సొమ్మసిలిన మ్మహిషుం డమ్మధుసూదనుం దాఁకుటయు.

ఉ. చాపము కేలఁబూని పెలుచన్ గుణనాదము మ్రోయ నుజ్జ్వల
త్కోపపరీతుఁడై యెదురుకోలు ఘటించెడివానిపై మహా
టోపత బాణవర్షము గదున్ వెలయించిన వర్షధారలన్
జోపెడి దున్నపోల్కి మధుసూదనుఁడాఁకె హయారి ధీరుఁడై.

వ. ఇట్లు నిరంకుశుండై మహిషుండు హరికార్ముకనిర్ముక్తశరపరం
పరలఁ గ్రమ్మఱించుచుఁ గదిసిన నిరువురకును సంకులక్రమ్మునఁ
గొంతవడి ద్వంద్వయుద్ధంబు ప్రవర్తిల్లె. ౧౩౩

చ. హరి గద కేలఁ దాల్చి రయమారఁగ నమ్మహిషాసురున్ రణా
దరు మదమత్తు మొత్తినఁ బదంపడి శీర్షము వ్రయ్య మూర్ఛరా
ధరణిపయిం బడెన్ సురలు దైన్యము దక్కఁగ రక్కసుల్ పర
స్పరవదనమ్ములన్ గళలు జాఱఁగ వంచరి కందు నొందఁగన్,

శా. మాత్రన్ దైత్యుఁడు మూర్ఛఁదేరి హరిపై మాత్సర్యమొప్పారఁగా
నేత్రమ్ముల్ గడు నెఱ్ఱఁగాఁ బరిఘమున్ శీర్షమ్మునన్ నైవ దే
వత్రాణుండును దాని తాఁకునకుఁ దత్పక్షీంద్రుపై మూర్ఛిలెన్
సుత్రామాదులుఁసూడనొండెడకుఁగొంచుంబోయెఁబక్షీంద్రుఁడున్

చ. అమరుల దైన్యముం గని "భయంపడకుం"డని చెప్పుచున్ మహో
ద్యముఁడయి శంకరుండు మహిషాసురుపైఁ దనశూలము న్నిగు
డ్చ మహిషుఁడేత్తెఱన్ విడిచెఁ బ్రాకటమైతగు శక్తి వక్షమం
దు; మదనహారి తద్ధతికి నోవక హెచ్చినతామసమ్మునన్.

గీ. తన త్రిశూలమ్ముఁగొని వాని దాఁకి వేయఁ
దొడఁగె వాఁడును బోరాడఁ గడఁగె నిట్టు
లున్నయెడ హరి మూర్ఛఁదా నుడిగి శంక
రునకుఁ దోడ్పడెఁ జక్రమ్ము గొని కరమున. ౧౩౭

వ. ఇట్లు చక్రశూలమ్ములం గొని హరిహరులు సంగరసన్నద్ధులై
విజృంభించుటయు మహిషుండు పేఁచెత్తిన కోపమ్మున. ౧౩౮

మ. మహిషాకారము దాల్చి పుచ్ఛ మతిసంపాతమ్ముగాఁ ద్రిప్పుచున్
మహీభృచ్ఛృంగసమున్నతంబయి యసామాన్యంబునై భీతిధూ
ర్వహమై దేహమెసంగ శృంగముల భూధ్రమ్ముల్ వెసంగూల్చుచున్
విహృతిందాఁకె హరిన్ హరున్ విపులగంభీరధ్వనం బొప్పఁగన్.

ఉ. దానికి నల్గి యిర్వురును దారుణబాణపరంపరల్ ధను
ర్ధ్వానపురస్సరంబుగ నిదాఘరవిప్రభ లొప్ప నేయ న
మ్మానవఖాది బిట్టలుక మార్కొని భూధరశృంగ మాత్మపు
చ్ఛానుగతంబుగా విసరె నాహరిపై హరుపై రయమ్మునన్.

క. ఉరవడిఁ బఱతెంచెడి త
ద్గిరిశృంగము గాంచి హరి యొగిన్ దీక్ష్ణముతో
శరముల నుఱుముగఁ జేసి య
సురపైఁ దనచక్రమపుడు జొనిపెఁ జొనిపినన్. ౧౪౧

ఉ. ఆహరిచక్ర మద్దనుజు నయ్యెడఁ దాఁకిన మూర్ఛవోయి తా
నాహవరంగమందుఁ బడి యంతన లేచి మనుష్యదేహియై
బాహువు నప్పళించి గదఁ బాణి ధరించి నితాంతసంగరో
త్సాహమునన్ మహాభ్రనినదం బొనరించె గిరుల్ చలింపగన్.

వ. అమ్మహానాదమ్మునకు నమరులెల్లఁ దలంకి రట్టియెడఁ గమలా
క్షుండు పాంచజన్యంబు పూరించిన దానవులెల్లరును సురలంబలె
నిశ్చేష్టులైరి. ౧౪౩

—* దేవతలు పాఱిపోవుట. *—

గీ. పాంచజన్యారవమ్మున భయము చెంది
కుందునసురుల వీక్షించి కోపమడర
మానవాకార మెడలి యమ్మహిషుఁడంత
సింహరూపమ్ముదాల్చి గర్జించి మించి. ౧౪౪

చ. అమరులనెల్లఁ దీవ్రనఖరాగ్రములం బొడి చేయుచున్ గ్రమ
క్రమమున శ్రీహరిం గదిసి గ్రన్న ఖగేంద్రునిఁ బట్టి చీరి యు
గ్రముగ రమాధినాథుభుజకాండము వ్రయ్యఁగఁ జేయఁ గ్రోధవే
గమున సుదర్శనంబు గొని కంజదళాక్షుఁడు విక్రమించినన్.

క. ఆతనిచక్రము తనపై
కేతెంచిన నంతలోన మృగరాడ్రూప

స్ఫీతి విడనాడి శృంగా
ఘాతమ్ముల నతని నొంచెఁ గాఱెనుపోతై. ౧౪౬

వ. హరియును వానికోల్తలకుఁ దలఁకి సంగరరంగమ్ము విడిచి పలాయనం బొనర్చి నిజభువనమ్మున కరిగె. శంకరుండును వాని నవధ్యుఁగాఁ దలంచి పిఱుందన కైలాసమ్మున కేగె, బ్రహ్మయు నట్టు లొనరించె. ౧౪౭

చ. కరమున వజ్రముం గొని యొకండును నిల్చె బలారి ; శక్తి దా
వరుణుఁడు దాల్చి యొప్పె, బలవంతుఁడు దండసహాయుఁడై రణ
స్థిరత నెసంగె ధర్ముఁ ; డనిఁ జేయఁ గుబేరుఁడు నగ్నియుఁ బర
స్పరముగఁ దోడు వచ్చిరి వెసన్ బఱతెంచిరి సూర్యచంద్రులున్.

ఉ. వీరలకన్న నెక్కుడగు వీరులత్రోడ లులాయరూపియై
ధీరుఁడు దానవుం డరుగుదెంచెఁ బరస్పరము క్తమార్గణా
సారపరంపరల్ ప్రబలె జ్యానినదమ్ములు సింహనాదముల్
బోరన భూనభోంతరము బూరటిలంగఁ జెలంగి మించఁగన్.

గీ. శృంగములచేతఁ బర్వత శృంగములను
నుక్కుమైఁ జిమ్మికొంచుఁ గై పెక్కి మహిషుఁ
డెల్ల యమరులఁ దాడించె నిద్ధబలుఁడు
పుచ్ఛసంఘాతముల ఖురస్ఫోటనముల. ౧౫౦

శా. ఉగ్రుండై పఱతెంచు నమ్మహిషయుద్ధోద్యోగముం జూచి భీ
తిగ్రస్తుండయి పాఱె నిందుఁడు ; జవాధిక్యమ్మునన్ బాశియున్
వ్యగ్రుండై చనె ; ధర్ముఁడుం బరుగిడెన్ ; యక్షేశవహ్న్యర్కులా
శాగ్రంథిన్ విడనాడి యేగి ; రరిగెన్ జందుండు సాంద్రత్వరన్.

వ. ఇట్లు మహిషాసురుండు నూఱువత్సరమ్ములు పరమదారుణంబగు సంగ్రామం బొనరించి నిలింపులనెల్లఁ దఱిమి జయాధిక్యమ్మునం బొలిచి దైత్యసహితుండై స్వర్గం బాక్రమించుకొని వలయు దైత్యుల వలనగునెడల నియోగించి యమరపరిత్యక్తమ్ములగు ధనాగారమ్ములును నైరావతోచ్చైశ్శ్రవః కామధేను కల్పవృక్షమ్ములును నాత్మీయత్తంబులుగ నొనర్చి యింద్రాసనమ్మునధిష్ఠించి యథేష్టంబుగఁ బరిపాలనం బొనర్చుచుండె. ౧౫౨

గీ. వాని ధాటికిఁ దాళక వాఁడి దఱఁగి
యరిగి గిరిగహ్వరమ్ముల నాశ్రయించి
యచటఁ బెక్కులు వర్షమ్ము లార్తి గూర
నమరులు వసించి కృశియించి రవనినాథ. ౧౫౩

వ. పదంపడి యొక్కనాఁడు దేవతలందఱును బ్రహ్మలోకమ్మునకరిగి వేదవేదాంగపారంగతులగు మరీచిప్రభృతిమహామునులు సేవింపఁ బద్మాసనం బలంకరించియున్న వేదగర్భుఁ జతుర్ముఖు ననంతతేజోనిధి రజోమూర్తిం గాంచి సన్నుతించి యిట్లు చెప్పికొనిరి. ౧౫౪

చ. అమరుల మయ్యు నొక్క మహిషాధముచే నిటు లుక్కుదక్కి వి
క్రమ మొనరింప లేక గిరిగహ్వరముల్ గృహసీమలై పొసం
గ మహిమ మేది నట్టి మముఁగాంచఁగ రాదె మహాత్మ! తండ్రి యే
క్రమమున నున్నఁ బుత్రులఁ గరమ్ము ననుగ్రహబుద్ధిఁ జూడఁడే.

మ. అమరస్థానము వానిరాజ్యముగఁ గల్పాగప్రసూనమ్ము ల
య్యమరారాతి పరమ్ముగా మఖము లయ్యశ్వారి పాల్గాఁగ సం
ద్రమునం బుట్టినగోవు వానిదిగ నద్దైత్యుండు పెంపొంద దై
న్యమునన్ మున్గి సురేంద్రులిట్లగుటయున్ న్యాయంబె లోకేశ్వరా.

వ. సర్వజ్ఞుండవగు నీ కెఱుఁగ రాని దొండుండదు. మా పడెడి యవస్థ యే మని చెప్పికొందు మట్లు స్వర్గంబు వాని పాలొనర్చి యద్రిగహ్వరమ్ముల నచ్చటచ్చట వసియించు మమ్ముల నెద్దియే నొక నిమిత్తంబు గల్పించి పీడించుచున్నవాఁ డట్లగుటంజేసి రక్షకుండవని నీ పాదమ్ములం బడితిమి. మా కెద్దియేని గతి గలుగం జేయు మని మాటికిం బ్రార్థించు నమరులకుఁ గృతాంజలులకుఁ బితామహుండు ప్రేమార్ద్రుండై యిట్లనియె. ౧౫౨

ఉ. చేసెడిదేమి! దానవుఁ డశేషసురాసురమర్త్యులందుఁ ద
న్నోసరిలంగఁ జేయ నొరుఁ డుండమి మత్తత నిట్లొనర్చు వాఁ
డీసరణిన్ వరమ్ము గొనె నెవ్వఁడునుం బురుషుండు తన్ను నిం
జేసి వధింపకుండ నిఁకఁ జేడియ వాని వధింపఁగావలెన్. ౧౫౩

వ. కావున మనమందఱమును గైలాసమ్మున కరిగి కార్యవిశారదుండగు శంకరుతో యోజించి తత్సహితులమై మాధవునొద్ద కేగి కర్తవ్యాకర్తవ్యమ్ములు నిర్ణయింత మని చెప్పి హంసారూఢుండై దేవతలం గలిసి కైలాసమ్మునకుఁ జనిన నంత నద్దేవదేవుండు ప్రసన్నుండై యెల్లర నుచితసత్కారమ్ముల గారవించి కుశలప్రశ్నపూర్వకముగ నాగమనకారణం బడిగినఁ జతురాననుం డిట్లనియె. ౧౫౪

చ. తెలియనికార్యమే యిదియు దేవరకున్! మహిషాసురుండు వీ
రల నిరసించి స్వర్గము కరంబు తిరంబుగ నేలుచున్నవాఁ
డలఘుఁడు యజ్ఞభాగముల నన్నిటి దైత్యులతోడ వాఁడ యి
మ్ములఁ గొనుచున్నవాఁడు వనముల్ గతియయ్యె నిలింపపాళికిన్.

వ. వాసవుఁ దొట్టి యీ గీర్వాణులెల్ల నన్ను శరణంబు వేఁడిన నిన్నుం గన వచ్చితి, నీ కార్యభారంబు నీయంద నిలిచినది నావుడు మందహాసకందళితముఖారవిందుండై శంకరుండు విరించి కిట్లనియె.

ఉ. తెచ్చితి వీయనర్థమును దేవతలందఱకున్, వరంబు ము
న్నిచ్చి, యిఁకేమి సేయనగు నెవ్వని కేనియు వాఁ డవధ్యుఁ డా
నచ్చుపలుకు వధింపఁదగు నంగన లెవ్వరు ? నీ సతీమణిం
బుచ్చెదొ ? మత్తలోదరినిఁబుత్తునొ ? పుత్తుమొ వాసవాంగనన్ ?

క. మనభార్యలందు నొక్కతె
యును యుద్ధమునందు నేరు పొప్పెడి సతి లే
దనఘా ! కర్తవ్యం బ
ప్పనజాతునివలన వినఁగ వలయుఁ గడంకన్. ౧౽౩

వ. అతండు బుద్ధిమదగ్రేసరుం డగుట నిప్పట్ల వలనగు నుపాయం బెఱిఁగించు నయ్యెడ కరుగుద మని శంకరుఁడు తత్సహితుండై విష్ణు లోకమ్మున కరుగునెడ ననుకూలవాతమ్ములు వీతెంచె మార్గమ్మున నెల్లెడఁ బక్షులు శుభసూచకములయ్యె నాకాశంబు నిర్మలంబుగాఁ దోఁచె దిక్కులు తెలివొందె నిట్లు శుభోదర్కమ్ముగా వెడలి యమ్మహాదేవుండు ముందట, ౧౽౪

సీ. హంససారసచక్రసంసేవితములైన
కమలాకరమ్ములు గలుగుదాని
మందారవకుళచంపకమల్లికాశోక
వనము లెల్లెడ నొప్ప వఱలుదాని
నవరత్నఖచితసుందరసౌధభాసుర
వీధీశతమ్ములు వెలయుదాని

నిగమముల్ సెప్పు మునివరేణ్యులును గాయ
కులు నచ్చరలు గల్గి కులుకుదాని

గీ. సలఘులు సునందనందనాదులు నితాంత
భక్తిశీలురు నలుగడఁ బరఁగుదాని
విష్ణుభువనంబు గని యందు వెలయుఁ నమ్మ
హాత్ముభవనంబు గనిరి యనంతరంబు. ౧౬౫

వ. ఇట్లు దేవత లందఱు నయ్యెడ కరిగి ద్వారపాలకుం గాంచి మే
మేతెంచితి మని మధుసూదనున కెఱిఁగింపవలయు ననిన నందో
క్కరుఁడగు విజయుం డరిగి యమ్మధువైరికిం జెప్పె నంత విష్ణుండు
సదనంబు వెలువడి వార లున్నయెడ కేతెంచిన నందఱును నమ
స్కరించి వేదవాక్యమ్ముల సన్నుతించిరి యద్దేవుండును గరుణా
ర్ద్రచిత్తుండై యెల్లరఁ గుశలం బడిగి యాసనమ్ముల నుండ నియో
గించి యాగమనకారణం బేమన వార లిట్లనిరి. ౧౬౬

మ. వరదానమ్మున దృప్తుఁడై మహిషుఁ డాపద్ధేతువై మాకు న
ధ్వరభాగమ్ములు ముట్టకుండ దివముం దా నేలుచున్ మమ్ము భూ
ధరదుర్గమ్ములపాలు చేసెఁ బ్రమవధ్యప్రక్రియం బొల్చునా
సురవైరిం బరిమార్పఁగా వలను సంశోధింపు మేదేనియున్.

వ. మహాత్మా! యవ్వాని వధించు పాటి సామర్థ్యం బుమారమా
సరస్వతీశచ్యాదులం దే యంగనకుం గల్గు నయ్యది విచారింపుము
శరణాగతుల మమ్ము దరిచేర్పు మనవుడు విష్ణుం డవ్వారల
కిట్లనియె. ౧౬౭

గీ. అమ్మహిషుతోడ మనము ముష్న్నాహవం బొ
నర్చితిమి కాదె వాఁడు మనకు నవధ్యుఁ

డెల్ల సురల యంశమ్ములు నేకముగఁ బొ
సంగు నట్లోకకాంతఁ జేయంగవలయు. ౧౬౯

క. మనమనయంశమ్ములఁ బు
ట్టిన యవ్వామాక్షి వాని డీకొని పోరన్
దనుము నసంశయముగ న
వ్వనితకు మన మాయుధములు వలయు నొసంగన్.

—* దేవీప్రాదుర్భావము *—

వ. అని యతండు వలుక నయ్యెడఁ జతురాననుని మొగమ్ము నుండి యొక్క తేజమ్ము రక్తవర్ణమ్మును గించిచ్ఛ్వేతంబును గించిత్కృష్ణమ్మును శుభాకారమ్మును మరీచిజాలకీలితంబును నై పొడమె నద్దాని నీక్షించి శివకేశవులు పరమాశ్చర్యపర్యాప్తులైరి. ౧౭౦

గీ. రౌప్యవర్ణంబు మిగుల దుర్దర్శ మధిక
తీవ్రము భయంకరంబునై దేవతలకు
విస్మయం బిచ్చు తేజంబు వెలికి వచ్చె
నద్రిసమమయి రుద్రదేహంబునుండి. ౧౭౧

వ. పిదప విష్ణుశరీరంబు నుండి సత్త్వగుణోపేతంబై శ్వేతవర్ణంబైన తేజమ్మును పురందరుకాయమ్మునుండి సర్వగుణాత్మకంబై చిత్రవర్ణంబగు తేజమ్మును వహ్నియమకుబేరవరుణాదులగు తక్కటి సురల శరీరమ్ములనుండి భిన్నభిన్నమ్ములగు తేజమ్ములునుం బొడమి మహాతేజోరాశియై హిమవత్పర్వతసన్నిభంబగు నద్దానిం గాంచి యెల్లరును విస్మయం బందుచుండి రంత నత్తేజఃపుంజ మ్మొక్క దివ్యసుందరియై పదునెనిమిది భుజమ్ములును దెల్లనగు మొగమ్మును నల్లని నేత్రమ్ములును నరుణంబగు నోష్ఠమ్మును నెఱ్ఱని పాణితల

లమ్ములును గలిగి నానావిధ భూషణమ్ములు దాల్చి సన్నద్ధమై యమ్మహిషాసురుఁ జంప నుంకించె ననుడు జనమేజయుండు మహాత్మా! యమ్మహాదేవిస్వరూపమ్ము సంక్షేపమ్మున వచించుట గాదు విస్తరించి యేయే దేవతలయంశమ్ము లేయే యంగమ్ములుగాఁ బరిణమించె వినవలతు నావుడుఁ బారాశర్యుం డమ్మహాలక్ష్మీస్వరూపం బిట్లు వక్కాణించె. ౧౭౩

శా. ఆరూపం బిదమిద్ధ మంచు మునులున్ హార్యాదులున్ జెప్పఁగా
లే రూహింపఁగ నాకు శక్యమగునే! లేశంబుగాఁ జెప్పి వా
చారంభం బొనరించితిన్ శుభదమై యజ్ఞానవిధ్వంసనై
సారంబై సతమై చెలంగు నది విశ్వం బెల్లెడన్ వ్యాప్తమై.

వ. నరేంద్రా! యద్దేవి యేకరూపిణియయ్యుఁ దత్తత్కార్యమ్ముల కనుగుణమ్ముగ నటునివడువున నానారూపమ్ముల నెసంగుచుండు నయ్యయిరూపమ్ములకుఁ గార్యకర్మానుసారమ్ముగ నామంబులు దనరు, నయ్యవి సగుణమ్ములును నిర్గుణమ్ములునై యనంతమ్ములుగా నుండు నైనను నా యోపిన తెఱంగున వివరింతు నాకర్ణింపుము. ౧౭౫

క. హరుతేజమ్మున వక్త్రం
బురుహాము కడు వెల్లనగుచుఁ బొలిచెన్, గురు ల
భ్రరుచిం జెలువారెఁ బరే
తరాజతేజమ్ము పొలుపు దవిలిన కతనన్. ౧౭౬

వ. ఆజగన్మాతృక నేత్రత్రయంబు పావకాంశంబగు కతనఁ గృష్ణరక్త శ్వేతవర్ణమ్ములం బొలిచెఁ గనుబొమ లుభయసంధ్యలవలన నగుటం జేసి వక్రమ్ములును గృష్ణవర్ణమ్ములును స్నిగ్ధమ్ములునునై

రెయొప్పె. నాతిదీర్ఘమ్ములును నాతిహ్రస్వమ్ములుం గాక యుల్లాస మమ్ములగు శ్రవణమ్ములు వాయుతేజస్సముద్భూతమ్ములు.

సీ. తిలపుష్పముం బోలి యలరెడునాసిక
ధనదుని తేజంబు, మొనలు గల్గి
తనరారు తళ్కు-దంతములు ప్రాజాపత్య
తేజంబు, కావివాతెఱ దినేంద్రు
తేజంబు, మీఁదివాతెఱ కార్తికేయుని
తేజంబు పోల్పారు, దీప్తినలరు
పదియును నెన్మిదిబాహులు విష్ణుతే
జం, బంగుళులు వసుసంభవములు,

గీ. స్తనయుగళ మంబుజారి తేజంబు, త్రివళి
సంయుతము మధ్య మింద్రు తేజంబు, జంఘ
లూరువులు వరుణుఁడు, కటి యుర్వి, యిట్లు
పుట్టె నద్దేవి శుభరూపమున నరేంద్ర! ౧౭౮

క. ఆయమఁగాంచి సురలు మో
దాయత్తత మించి "మహిషు నడఁచు మనకుఁ దా
నై యిచ్చు స్వర్గరాజ్యం
బీయంబిక" యంచు భయము నెడలిరి తమలోన్. ౧౭౯

వ. అంత విష్ణుండు సురలం గాంచి యీ యంబికకు మీ మీ భూష ణంబు లొసంగి మీమీ యాయుధమ్ముల తేజమ్ములవలన నాయుధమ్ము లుత్పాదించి యొసంగునది, యనిన నిర్జరులు సంతు ష్టులై యట్లొనరించిరి. ౧౮౦

సీ. పాలసంద్రము మేల్మిచేలమ్ములును మంచి
దైనరత్నపుహారమంబ కొసఁగె

నాపాదమస్తకం బమరఁదాల్పఁగ విశ్వ
కర్మ రత్నపుమేల్ నగల నొసంగె
నుతమున శిరమున ధరియింపఁ దగుమాలి
కలు రెండు వరుణుండు కానుకిచ్చెఁ
దనరారు వివిధరత్నమ్ము లిచ్చుటె కాక
హిమవంతుఁ డర్పించె నేన్గు గొంగ

తే. గీ. హరియు హరుఁడును వరుణుండు నాత్మచక్రి
శూలశంఖమ్ములవలన నొలి సృష్టిఁ
జేసి యొసఁగి రయ్యంబకు శ్రీకరములు
చక్రశూలశంఖమ్ములు జనవరేణ్యా. ౧౮౧

వ. మఱియుఁ బావకుండు మనోజవమ్మును శతఘ్నియునగు నొక శక్తియు, వాయువు బాణపూర్ణంబగు నంబులపొదియును జాపంబును, నింద్రుండు దనవజ్రమ్మునుండి యుదయించిన వేఱొక వజ్రమ్మును, నైరావతమున కలంకరించెడి గంటయును, యముండు దనదండమ్మునఁ బొడమిన దండంబును, బ్రహ్మ దివ్యగంగాజల పూరితంబగు నొక్కకమండలువును, గాలంబు ఖడ్గమ్మును పలకయును, విశ్వకర్మ తీక్ష్ణంబగు పరశువును, గుబేరుండు సురాపూర్ణంబగు కనక పాత్రంబును, వరుణుండు దివ్యపంకజమ్మును ఘంటాశతనినాదితంబగు కౌమోదకి యను నొకగదయుఁ ద్వష్ట యభేద్యకవచంబును నానావిధాస్త్రమ్ములును దివాకరుండు స్వకిరణములును నొసంగిన నవి దాల్చి వెలుంగు నజ్జగన్మాతృకం గాంచి వార లందఱు నిట్లు నుతించిరి. ౧౮౨

మ. శివవై శాంతివి పుష్టివై సుఖదవై సిద్ధిస్వరూపంబవై
భవసంహారిణి ! కాళరాత్రి వయి యంబాదేవివై వృద్ధివై

యవనిం బోల్చియు దానిచే నెఱుఁగ రా కంతస్థితిం బోల్చి మా
య వెలింగించుచు దానికిం దెలియ రా వత్యంత గోప్యస్థితిన్.

వ. అట్టి వైష్ణవీరుద్రాణీంద్రాణ్యాత్మికవగు నీకు నమస్కరించెద మెల్లని మమ్ముం బీడించు నీమహాయోరిని రయమ్మునం దునిమి కళ్యాణము లొసంగు మని మాటిమాటికి నుతించి చరణంబులం బడు నయ్యమరుల కయ్యంబిక యిట్లనియె.

చ. వినుడు సురల్ ! సురారి నొకవేళ్ళిమ్మడిఁ దుంచెద దీని కింత భీ
తినిఁ గొనువారె బ్రహ్మముఖదేవత లందఱు ? కాలపర్యయ
మ్మును గడవంగ నేరికినిఁ బోలునె ? యొంతటి వింత యంచు నా
ననము సమంచహాసముగ నాద మొనర్చె రిపుల్ భయంపడన్.

ఉ. మేరువు సంచలించె వడి మిన్నదరెన్ జలధుల్ గలంగె దు
ర్వారతరంబుగా ధరణి గ్రక్కదలెన్ దశదిక్కు లొక్కటై
బోరన మ్రోసె నా రవ మపూర్వగతిన్ విని యామహాయోరియున్
ధీరతఁ దక్కి రక్కసుల దిక్కు మొగం బయి యల్కపెంపునన్

వ. ఇయ్యది కడుఁగ్రొత్తమై యున్నయది దీనికిం గత మేమొకో !
యని శంకించి వెండియు, ౧౮౭

ఉ. ఈరవ మాచరించు రిపుఁ డెవ్వఁడో ! గన్గొని వానిఁ గట్టి దు
ర్వారత నాదుసన్నిధిఁ గరంబు తిరంబుగఁ బొందఁజేయుఁ డ
ద్దారుణు మందబుద్ధి గతదర్పు నొనర్చి యమాలయాతిథిం
గా రచియింతు నెవ్వనికిఁ గాలము చేరువయయ్యె నియ్యెడన్.

క. సుర లిట్లొనరించిరొకో
పరమాపద డస్సి నాదుభయమున గిరిగ

హ్వారములపాలై నిర్భీ
తి రవం బొనరింప నింత తెగువ గలుగునే! ౧౮౯

వ. అని పనిచిన దూతలు సని సర్వాంగసుందరియు నష్టాదశభుజయు సర్వాభరణభూషితయు నాయుధసంపన్నయు హస్తమ్మునఁ జషకమ్ము గొని సారెసారెకు మధుపానం బొనర్చుచున్నదియునగు నప్పురాంబ నీక్షించి భయత్రస్తులై మహిషుపాలికిఁ జని యిట్లనిరి.

ఉ. సింగము నెక్కి యెక్కుడగు చెల్వునఁ బొల్చెడి యొక్కకాంత స
ర్వాంగసముజ్జ్వలన్మణిమయస్ఫుటభూషణ నిస్తులాయుధా
భంగురహస్త నిత్యమధుపానమదాలస చారుచంచలా
పాంగ గనంగ నయ్యెఁ గనినంతన భీతి యొసంగె మాకొగిన్.

వ. అత్తలోదరి సురకాంతయు నసురకాంతయు నని నిరూపింప రాకయపూర్వప్రక్రియ నొప్పుచున్నయది. తత్తేజంబు దుర్దర్శంబగుకతన నిలువ నోడి యిట కరుదెంచితి మంతరిక్షమ్మున నుండి నిలింపు లాయంగనామణి నెక్కుడుగ సన్నుతించుచుండి రవ్వారోహ యేమి కతమున నిట కేతెంచెనో తెలియుట మాకసాధ్యంబు, తద్దర్శనమాత్రపలాయమానులమై దేవరకు విన్నవింప వచ్చితిమి. ౧౯౨

క. శృంగారాదిరసమ్ముల
పాంగాధీనములు గాఁగ నంగజశత మా
రంగ సృజియించు చెల్వున
నంగన రంగారు నేమి యనఁదగు నధిపా. ౧౯౩

వ. ఇంక నెయ్యది కర్తవ్యం బానతిమ్ము నావుడు మహిషుండు మంత్రి దిక్కు మొగంబై సాభిలాషమ్ముగ నిట్లను, ౧౯౪

మ. అనురాగిల్లితి నత్తలోదరికి నే, నయ్యంగనారత్నముం
గాని రమ్మేక్రియనైన సామమున నాకోర్కుల్ ఫలింపంగ నే
నొనరింతున్ బ్రియమారఁ బట్టమహిషీయోగంబు, తత్కన్యకా
జనచూడామణి కింతకన్నఁ గలదే! సంతోష మొందేనియున్.

గీ. సామదానభేదమ్ముల సమ్మతించి
వచ్చెఁగాకేమి రాకున్న మచ్చెకంటి
నిటకు రప్పింపుమీ బలాత్కృతిగ, నొప్ప
నేని రసభంగ మొనరింతువేమొ మొదల. ౧౯౬

ఉ. ఆసరసీరుహాక్షి జలజానన యాతనుమధ్య లేని యీ
వాసవలోకసౌఖ్యములు వ్యర్థము; లచ్చెలిమిన్న విన్న నా
కాస జనించె వైళమ తడంగన నియ్యెడఁ దేవలెన్ రసా
భాసము గాకయుండ నొకపక్కిక నీదగు నేర్పుకూర్పునన్.

వ. అని యనిపిన నమ్మంత్రివరుం డఱిగి దాదవ్వల నిలిచి వినయా
వనతుండై యిట్లను. ౧౯౭

ఉ. ఎందులదాన! నియ్యెడకు నేమికతమ్మున వచ్చియుంటి! నీ
యందముఁ జందమున్ విని స్మరాతురుఁడై ననుఁబంపె మావిభుం
డందుల కేగుదెంచెదో! రయమ్మున నాతనిఁ దోడి తెచ్చి నీ
కిందు నొసంగువాఁడనో, మృగేక్షణ! యీ తడవేల చెప్పుమా.

మ. సరసీజాసనదత్తమౌ వరమునన్ స్వర్గమ్ము నిర్జించి యె
వ్వరికిన్ వధ్యుఁడు గాక యిచ్చ కనురూపంబైన రూపమ్ము దా
ల్చి రసజ్ఞత్వము గల్గి మావిభుఁడు నిస్సీమప్రతాపాదిభా
స్వరుఁడై వర్తిలు వేఱొకండు మహిమస్వామిస్థితిన్ బోలునే.

చ. అనవుడు లేఁతనవ్వు నగి యజ్జగదంబిక పల్కె " దేవతా
జననిగ న న్నెఱుంగుము ప్రశంస యొనర్చితి కాన నంతయుఁ
విని చెద మీావిభుం డిడెడివేదన కోపక నన్ను వేఁడినఁ
బనిఁ గొని వచ్చితిఁ మహిషుఁ బట్టి వధించి సురాళిఁబ్రోవఁగఁ.

వ. ఇంతవట్టును నీయందలి వినయవిధేయతలకు మెచ్చి వచించితి
వేఱొక్క తెఱఁగేని యిప్పుడ నిన్ను వధింతు నింకఁ జాగు
సేయక పోయి మీా రాజునకు నారాక యెఱింగించి యిటు వచి
యింపుము. ౨౦౨

—* దేవీ మహిషదూత సంవాదము *—

శా. జీవింపఁ వలతేనిఁ దత్‌క్షణమ స్వశ్శ్రీ వీడి పాతాళముం
బోవం జూడు మనుగ్రహించి విడుతుఁ, బో నేరకున్న న్నినఁ
దేవప్రీతిగ యుద్ధరంగమున మద్దివ్యాస్త్రపాతమ్ములం
గావింతుఁ మృతుఁగా మదగ్రమున నీగర్వంబు దుర్వారమే.

చ. ప్రతియుగమందు దుర్మదులు పల్వురు నీవలె దేవపీడ సం
తతగతిఁ జేసి మచ్ఛరశతమ్ముల రూపఱి పోయి రింక నీ
గతియును నట్లకాఁ దలఁచి గర్వము వీడుము ధాత నీకు మె
చ్చి లివిరి యిచ్చునవ్వరము చెల్లదు పొల్లగు మచ్ఛరమ్ములఁ.

ఉ. కావున దేవసద్మమును గర్వముతోడన వీడి పొమ్ము లే
దా, వెఱపేది శస్త్రములు దాల్చి రణమ్మున కేగుదెమ్ము నీ
కావర మింతలో నడఁచి కాలునిపోలికిఁ బంపి స్వర్గ మా
దేవతలందు నిల్పెద విధేయులఁ బ్రోచుట నాకుఁ జెల్లదే ".

వ. అని మహిషునకుం జెప్పుము పొమ్ము నావుడు మంత్రి యయ్యం
బిక కిట్లను, ౨౦౬

ఉ. ఎక్కడిమాట లియ్యవి ! మృగేక్షణ ! యౌవనగర్వసంపదన్
మిక్కిలి మీఱి పల్కెదు సమిద్ధపరాక్రమశాలి మావిభుం
డెక్కడ ! బాల ! నీ పతిని నెక్కటిపోరున నిగ్రహించు లా
వెక్కడ ! నమ్మ శక్యమగునే ! విను మాతని శౌర్యసంపదల్.

ఉ. ఆతని సైన్య మొక్కవిధమైనది కాదు రథాశ్వనాగము
ఖ్యాతతమై పదాతినిచయాకులమై తగుఁ గామరూప వి
ఖ్యాతుఁ డతండు నిన్నడఁచు టబ్బురమే ! లలితాంగి ! దుర్మద
స్ఫీతగజంబు మాలతి నశింపఁగఁ జేయుటయుఁ భరంబొకో.

ఉ. నీయెడ మావిభుండు గడు నెయ్యము గల్గి చరించునప్డ దే
మో యువతీలలామ ! కఠినోక్తులు పల్కి రసంబు భంగముం
జేయఁగ రామి నీకిటులు సెప్పుచునుంటి మఱింత యేల నీ
ప్రాయము సార్థకమ్ముగఁ గృపన్ గనుఁగొమ్ము వరింపు మాతనిన్

గీ. అతనిరాజ్యము ధనమును నఖిలమునుఁ ద్వ
దీయమగు, భృత్యుఁడై సేవఁజేయుఁ బట్ట
రాజ్ఞివై మమ్ముఁబాలింప రాదె ! భక్తి
భావమున నీకు మ్రొక్కెదఁ బంకజాక్షి. ౨౧౦

వ. అని బహుభంగుల సామపూర్వకమ్ముగాఁ బోధించు వానికి
నయ్యంబ యిట్లను, ౨౧౧

ఉ. నీదగు తెల్విఁ దేటలును నేర్పును నింతియ నిన్ను మంత్రిగా
నూఁదినవానికిం దెలివి యొప్పునె ! యోపశుబుద్ధి ! యిద్ద ఱు
న్మాదులు నిద్దఱుం హతమనస్కులు నిద్దఱు నిద్దతే వృథా
వాద మిదేల ! ధాత తగువారిని గూర్చె జగమ్ము నవ్వఁగన్.

వ. ఏను స్త్రీస్వభావమ్మునం జేసి వాని బలపరాక్రమంబు లెఱుంగ
నని కదా ప్రేలితి వయ్యది నిక్కంబ. ఏను బురుషుండ నొండెఁ
దదనుగుణస్వభావ నగు స్త్రీ నొండెఁ గాకుందునని వెండియు.

మ. అతిమూఢుండయి మున్ను మాప్రభువు తానాసించె స్త్రీచేతఁ బం
చత నద్ధాతకతమ్మునన్, వినుము తచ్చాతుర్య, "మెంతే జుగు
ప్సితమౌ నంగనచేతఁ జచ్చు" టని తాఁ జిత్తమ్మునన్ రోయఁడ
మ్మతిహీనుం డిపు డవ్వరం బెదిరెఁ దామైమైఁ జనం బోలునే.

చ. "పురుషుని నన్ను నివ్వనిత పోర నెదిర్చి వధించునే" యటం
చరయక మృత్యువీ నెపము నందినదంచు నెఱుంగునట్లు మా
నరపతితోడఁ జెప్పు మొకనాతియ కాదు, తృణంబు వజ్రమై
పొరిఁగొనుఁ గాలపర్యయము మూఁడిన నెంతటివానికేనియున్.

వ. కాలంబు సమంజసం బగునప్పుడు వజ్రంబేనియుఁ దూలంబగు
నట్లగుటఁ దనకుంగల సైన్యమ్ములును నాయుధమ్ములునుఁ దక్కటి
సాధనమ్ములును వమ్మగు నిక్కువంబని మఱియును. ౨౧౬

ఉ. కాయము దాల్చువారలకుఁ గాదొకొ మృత్యువు! నిక్కమేరికే
నాయువు నిశ్చలంబె! జలజాసనుఁ డాదిగ నొక్కఁడేని ని
త్యాయుతుఁ డున్నె! చావు లరయన్ బలురీతులు, దైవనిర్మితం
బై యిటు తన్ను మృత్యువు రయమ్మున మ్రింగఁగవచ్చె దుర్మతీ.

వ. ఎవ్వని కెవ్విధమ్మున విధించి యుండు వాఁ డవ్విధమునఁ
బొలియు, నిట్లుండఁ గొందఱు మూఢులు 'మాకు వరమ్ము గలదు
మే మెవ్వరికేని నవధ్యుల' మని విఱ్ఱవీఁగుదు, రట్లు గర్వించినవా
రెవ్వరేని శాశ్వతులై యుండిరే! యింతవట్టు నీ ప్రభువునకు
బోధించి జీవింపఁగలఁడేని హవిర్భాగమ్ములును దివమును దేవా

ధీనం బొనర్చి తన వారితోఁ బాతాళమ్మున కరిగి యుంతు సుఖ
మ్మగ నుండునట్లొనరింపుము నావుడు మంత్రి నిజాంతర్గతంబున.

ఉ. ఎక్కువ తక్కువల్ తెలియ కియ్యబలామణి పేరుచున్న దీ
చక్కరబొమ్మయుక్కడఁపఁ జాలియుఁ జాలకపోతి రాజు పె
న్మక్కువఁజేసి దీనిఁ దన మానినిఁగాఁ గొన నెంచి పంపిన
ప్డెక్కమలాక్షి యేమనిన నెల్లిదమై చన దింత నిక్కమా. ౨౧౯

వ. కాదని యిత్తరుణితో ననికి సంతనకట్టితినేని రసాభాసంబగు నట్లు
విరసంబొనర్చి ప్రభుసన్నిధి కేగుటెట్లు సమంజసంబగు! అదియు
నుంగాక కామాతురుం డగుకతన నతండు నారాక కెదురు
చూచుచుండు, నట్టియెడ నే నిద్దాని జయించినను నిద్దాని సమ
రమ్మున నోడినను నిరుదెఱంగు నతని కప్రియంబ యగుంగావున నే
యాతనికడ కేగి చక్కఁగా బోధించి పిదప నతని యభిప్రాయాను
సరణమ్మునఁ గార్యంబు నిర్వహించెద నిదియ లగ్గని యతండు
మహిషుపాలికిం జని కృతాంజలియై యిట్లనియె. ౨౨౦

శా. నీ యాజ్ఞం గొని యేగి కంటి నచటన్ నీరేజపత్రాక్షిఁ దే
జో యుక్తిన్ వెలుఁగొందు దాని శరసంస్ఫూర్త్యంచితాష్టాదశ
స్ఫాయద్బాహువిలాస సింహగత నబ్బాలాశిరోమాళితో
నీ యందమ్మునుఁ జందముం దెలుపుచు న్నే నిట్లు బోధించితిన్.

ఉ. మావిభుఁ డీత్రిలోకముల మన్నన కెక్కినవాఁడు నిన్ను సు
శ్రీ వెలయంగఁ బట్టమహిషీపదముం దొగి నిల్పి సేవకుం
డై వశవర్తియై మెలఁగు నాతనిఁ బొందుము మూఁడులోకముల్
నీ వయి యేలుకొమ్ము రమణీ! యెలప్రాయము సార్థకమ్ముగన్.

వ. అను నా పలుకుల కక్కామిని కనలి స్మితం బొనర్చి యిట్లనియె.

మ. మహిషీగర్భసముద్భవుం డులువ నమ్మందున్ సురప్రీతిభూ
ర్వహనై యే బలియిత్తు శక్తి కకటా! పాపాత్మ! నాబోఁటికిన్
మహిషుండా పతి! యెంత హీన యయినన్ మానంబు పెంపేది త
త్సహవాసం బొనరించునే? మహిషియాఁదద్యోగ్య తుల్యాకృతిన్

చ. సురలకు వైరియై మిగుల సోలుచు మత్తిలి దుష్టుఁడై యహం
కరణమునన్ జరించు జనకంటకు నమ్మహిషాధమున్ వధిం
తు రయము మీఱ దైత్యతతితోడ రసాతల మేగనేనియున్,
గరుణ దలిర్పఁగాతు" నని కావర మెత్తి వచించెఁ బెల్చనన్

వ. అంత సేనాదుర్భాషణమ్ములకు సైఁపక యుద్ధమ్మునకు నుంకింప నెంచి రసభంగం బగు నని యోజించి దేవరకు విన్నవింప నిట కరుదెంచితి. ౨౨౬

ఉ. అంగనయయ్యు నెక్కుడు మదాలసయై బలమున్ జలంబు ను
ప్పొంగ నిరంకుశంబుగ రణోత్సుకయై చెలువారు దానితో
సంగర మాచరించుట యసాధ్యమ కా వగతున్ జయంబుఁ ద
ద్భంగము నన్న వెయ్యెడల దైవవిధేయము లెంతవారికిన్. ౨౨౭

వ. నావుడు మహిషుం డితికర్తవ్యతామూఢుండై వృద్ధులగు మంత్రుల రావించి యీయంగన దేవప్రేరితయై చనుదెంచిన శాంబరి యగుమాయ యగుం గాకేమి మీర లుపాయజ్ఞుల రెందు సామాదుల యం దెయ్యది ప్రయోజ్యంబగు విశ్వాసార్హంబుగా వచియింపుఁ డనిన వార లిట్లనిరి. ౨౨౮

గీ. సత్యమై ప్రియమైనవచనము పతికిఁ
దెలుపు టుచితంబు రెంటికిఁ దొలఁగకుండు
మాటదొరకదు రుచ్యమై మందు రోగ
హారి యగు టెందు దుర్లభం బండ్రు బుధులు. ౨౨౯

గీ. అనృతమునఁ బ్రీతి పుట్టించు నతికపటులు
వేనవే లుంద్రు సత్యమ్ము వినుచువాఁడు
వినెడివాఁడును దానిని మననచేయు
వాఁడు మూఁగురు దుర్లభుల్ పార్థివేంద్ర. ౨౩౦

వ. కావున నెడతెగని యిమ్మహాకార్యమ్మునందు నీ కెట్లు ప్రీతికరుల మయ్యెద మదియునుం గాక రాఁబోవు శుభాశుభమ్ము లెవనికి వేద్యమ్ము లనవుడు మహిషుండు మంత్రుల కిట్లను. ౨౩౧

క. తప్పేమి మీరుఁ దోఁచిన
యొప్పున వచియింపుఁ డింద యుక్తియుతంబై
చొప్పడువానివచనముఁ
గొప్పఁగఁ జేసి కయికొందుఁ గోర్కె దలిర్పన్. ౨౩౨

—* మహిషుండు దేవికడకుఁ దూతముం బంపుట *—

వ. నావుడు విరూపాక్షుం డను మంత్రిశ్రేష్ఠుం డతని కిట్లనియె.

చ. అనృతము సాహసమ్మును మృగాత్ములసొమ్మని నీ వెఱింగి యి
వ్వనిత ప్రగల్భవాక్యములఁ బ్రోధిమ గొల్పెడఁ జెల్లునే? యొకం
డనక ననుఁ వెసం బనుపు మవ్వనితన్ వధియింతు నొండెఁ గా
దనినను నాగపాశముల నంటఁగఁ గట్టెద, నిన్నుఁ జేర్చెదన్.

వ. పిదపఁ జేయునది లేక వశవర్తినియై నీకోరినయట్ల వివిధ భోగ మ్ములం దేల్చి నీయం దనురక్తయై యుండు నిది నాకుం దోఁచిన తెఱంగు, త్రిలోకవిజయం బొనర్చిన నీబోఁటి కొక్క బోటికై యింత తలంక వలయునే? యిది బిభీషికామాత్రంబ కాని వేఱొండు గాదు నావుడు దుర్ధరుం డనుమంత్రి యిట్లనియె. ౨౩౪

మ. అనుమానమ్మునఁ జూడ నవ్వనిత కామాసక్తగాఁ దోఁచె నం
గనలం దిట్టి బిభీషికల్ గలవు వక్రిప్రక్రియం బూరుషుం
గని లోఁగొందురు హావభావవిదు లాకర్షింతు రీచెయ్వు, లి
వ్వనజాక్షీమణి నిన్నుఁ గోరి యిటు పై పై వక్రతల్ సూపెడున్.

చ. "శరముల నిన్ జయింతు" నను సారసగంధి, తదర్థ మన్యగో
చర మగు టెట్టు! లమ్మదనశాస్త్ర మెఱింగిననాకుఁ దక్క, భూ
వర! శరముల్ కటాక్షములు, వ్యంగ్యవిధిన్ గ్రహియింపు తత్పరం
పరలు నిగిడ్చి నిన్ను వశవర్తిగఁ జేయుతలంపు గాఁ దగున్.

వ. అమ్మగువ వచియించిన వాక్యమ్ముల కెల్ల నర్థం బిట్లన యో
జింపవలయు నట్లు గాకేనిఁ ద్రిలోకమ్ములం జయించి హరిహరా
దులఁ జీరికిం గొనక నిష్కంటకమ్ముగ రాజ్యంబు శాసించు
నీవయి నొక్క యబల బాణపాతం బొనరించు టది యేటిమాట!
ఇఁక నొక్కటి యవధరింపుము, "బాణప్రయోగం బొనరించి
నిన్నుం బడవైచెద" నని కదా, యత్తలోదరి వలికె! "పడ
వైచెద" ననుటకు వ్యాఖ్యానం బవధరింపుము. ౨౩౮

చ. మొదలఁ గటాక్షపాతమున మోహితుఁగా నొనరించి మీఁద దు
ర్మదమున యుద్ధరంగమను మంజులశయ్య బలాత్కరించి నిన్
జదురుగఁ బండబెట్టి పురుషాయితబంధమునన్ గరంతు నం
తదనుకఁ దాళు" మంట యది తత్త్వము దూతకెఱుంగఁబోలునే.

వ. మఱియు నిన్ను విగతప్రాణుఁగా నొనరింతుననుటకు నర్థంబు
వినుము, ప్రాణం బనఁ దేజంబు దాని నపహరింతు
ననుట, యుత్తమాంగనలు వ్యంగ్యప్రధానమ్ముగాఁ గాముకు వరి
యించుట గామశాస్త్రసమ్మతంబు. నీ వజ్ఞుండగువానిం బంచిన
వాని కీ యర్థంబు గోచరం బగునే యని వెండియు. ౨౪౦

ఉ. సామము దానముం గొలిపి చందనగంధినిఁ బొందు మొందు లే
దీమెయి నీ కుపాయ, మది యెంతటిగర్వము నేనిఁ దాల్చఁగా
కేమి మఱెంత కోపవతియే నగుఁగా కిటు చేసినన్ వశం
బై మరగున్ గ్రమమ్మున, మృగాక్షులభంగులు వక్రవక్రముల్.

క. పలుమాట లేల యచ్చిలు
కలకొలికిం దెచ్చి నీకుఁ గానుక సేయం
గల నన్నుఁ బనుపు మావలఁ
గలపని నేఁ జూచికొనెదఁ గా కసురేంద్రా. ౨౮౨

వ. అని పలుకునతని కడ్డంబై తామ్రుం డిట్లను, "మహాత్మా
యియ్యది కామాతురయు వ్యంగ్యార్థచతురయు నీయందనురక్త
యుంగామి నిశ్చయంబు. ౨౮౩

ఉ. ఆదర మూఁది నా పలుకులందలి యర్థము సంగ్రహింపు మ
ష్టాదశబాహువుల్ నిశితసాయకముల్ గల దీనివంటి బల్
గాదిలివన్నెలాఁడి నొకకాలమునందును నెందుఁ జూడఁగా
రా దిది యెగ్గెయో కడు భరంబుగఁ దోఁచు సరిష్టహేతువై.

వ. దీని కనుగుణమ్ముగ నాకుఁ బెక్కులు దుస్స్వప్నమ్ము లింతకు
మున్న ప్రతిదినమ్మును బొడముచున్నయవి, నేఁటి యుషఃకాల
మ్మున నొక కాంత కృష్ణాంబర ధారిణియై యేడ్చుచు గృహాంగ
నమ్మునఁ బొడకట్టె నిది యిట్లుండ. ౨౮౪

క. ప్రతిదినము ను వికృతములగు
రుతు లడర విలక్షణంపు రూపునఁ దగు ప
క్షితతులు గృహములపై రా
త్రితటిన్ గూయంగఁ దొడఁగె దేవర! వింటే. ౨౮౫

వ. ఈదుర్నిమిత్తమ్ముల కేద్దియేని నొకకారణం బేర్పడవలయు, నిమ్మెడ యుద్ధరంగమ్మున సన్నద్ధమై యున్నయంగన గంధర్వియు మానుషియు నాసురియుఁ దదన్యయుంగామి తెల్లంబు, దేవప్రేరిత మైన యొకమాయ గావలయు నెట్లైన నగుఁగాక సంగరమ్మునకు సంతనకట్టి వెడలుట కర్జంబు జయాజయమ్ములు దైవాధీనమ్ము లగుట బుధుండప్పట్ల నిర్భయుండు గావలయు శుభాశుభమ్ము లేరికిని వార్యంబులుగావు" నావుడు మహిషుం డతని కిట్లనియె.

ఉ. నీ వచనమ్ము లింత దగునే చను మిప్పుడ యుద్ధమందు బల్
చేవ యెలర్ప నవ్వనిత లీలమెయిన్ వశఁగా నొనర్చియుం
దే వెర వయ్యెనేని యిటు తె మ్మటు దక్కినఁ దీవ్రబాణముల్
ప్రోవులు గా నిగిడ్చి జము ప్రోలికి దాసి నొనర్పు మేత్తెరన్.

ఉ. వీరుఁడవై స్మరాగమవివేకివి నాఁ గర మొప్పు నీదుగం
భీరత నేఁడు చూడవలె వే చని వేగిరపాటు దక్కి యం
భోరుహనేత్ర యిమ్మెడకుఁ బోరఁగ వచ్చెనో, పొందవచ్చెనో!
నేరుపుమైఁ గనుంగొనుము నిక్క మెఱింగి దొడంగు మాజికిన్.

గీ. కేవలము నిర్దయుండవై కినియ కత్త
లోదరీమణి నెమ్మది నున్న తెఱఁగు
నరసి యప్పటి కనుకూలమైన వలని
ననుసరింపుము పొమ్ము జయమ్ముఁగొమ్ము. ౨౫౦

వ. అని యానతిచ్చినఁ దామ్రుండు కాలవశుండై సైన్యమ్ములు గొలువ మహిషునకు నమస్కరించి వెడలి యెడనెడఁ బొడము దుర్నిమిత్తములు గణింపక చని ముందట. ౨౫౧

క. హార్యక్షముపై నెక్కి య
వార్యాయుధహస్త యగుచు వచ్చిన యుద్య

ధైర్యఁ గనె లోకనాయిక
నార్యన్ దివిజావళీసమారాధ్యపదన్. ౨౧౨

వ. ఇట్లు కాంచి దొరవ్వల నిలిచి సయుక్తికమ్ముగ వినయపూర్వక
మ్ముగ నిట్లనియె. ౨౧౩

ఉ. శృంగి నెఱుంగుదే ! యతఁ డజేయపరాక్రముఁ డెల్లరూపు లా
రంగొన నేర్చువాఁ డబల ! రాక్షసశేఖరుఁ డావిభుండు నీ
కుం గడు లోఁగి నీదుగుణకోటి గుణించుచు రూపమెంచి పా
ణిం గ్రహియింపఁ గోరెడు గణింపఁ దరంబె భవద్విశేషముల్.

—* తామ్రుండు దేవితో సంభాషించుట *—

క. మాయేలిక కేలికవై
నీ యిచ్చకు వచ్చినట్లు నిర్జరభువన
స్థాయినివై నందనమునఁ
బాయక విహరించుకంటె భాగ్యము కలదే. ౨౧౫

ఉ. సుందరమైన దేహ మిటు చొప్పడె నీకుఁ బురాకృతంబు మే
లందినదాన వౌట నకటా యిది యెట్లు ఫలించు మావిభుం
బొంది సుఖింపవేనిఁ బువుఁబోఁణిరో ! కల్పకసూనవిస్ఫుర
త్కందుకముల్ ధరింప కిటు కత్తులఁ బూనఁగ నేల పాణులన్.

ఉ. మానిని ! యేలొకో, తెలివి మాలి ధరించితి చాప మస్త్రసం
తానముతోడ ? భ్రూలతలు నాణెపుఁజూపులుఁ దత్తదర్థ సం
ధాన మొనర్పఁ జాలవొకొ ! తన్వి ! సుమమ్ములఁ బూని యైన నే
వ్వానికిఁ బ్రీతి గాని యవి పల్లవపాణికి నీకుఁ జెల్లునే. ౨౧౭

వ. అదియునుంగాక నింకొక్కఁడు వచియించెద యుద్ధమ్మునకన్న సంసారికి వేఱొండు దుఃఖమ్ము లే దైనను లోభాదృతులై యుద్ధానికి మదాంధులు సమకట్టుదురు, నీబోఁటిబోటి కియ్యది యేల? అనుగ్రహించి దేవదానవపూజితుండై లోకమ్ములెల్లఁ దానయై యతిశయించు నస్మదధిపతి మహిషాసురు వరియించి పట్టమహిషివై యిష్టోపభోగమ్ము లనుభవింపుము సంగరమ్మున నేరికేని జయంబు సంశయగ్రస్తం బింతయు నీతివేదిని వగు నీకుఁ దెల్లంబ యని వెండియు. ౨౯౮

చ. అతని వరించి యౌవనమునందు సుఖమ్ములు గూడఁ బెట్టి ని
ర్జితసురనాథుఁడై మహిషు చేవకు మించెడివాని లోకసం
స్తుతు సుతుఁగాంచె దీవు కడు సుందరుఁ డత్తనుజుండు మీఁద దై
త్యతతికి రా జగుం దనదు ధాటి సురాసురులెల్ల మెచ్చఁగన్

వ. అను తామ్రునివచనమ్మును విని మేఘగంభీరభాషణమ్ముల నయ్యంబిక యిట్లనియె.

శా. ఓరీ తామ్రి, కటుప్రలాప! విను మీ యుక్తుల్ సహింప న్ననుం
దేరం బంచినవానిశక్తిపలె గేడె న్నేను గా, నట్టి దు
ష్ప్రారంభున్ యవసాశి న మ్మహిషుఁ గామార్తున్ వరింపంగ నా
కేరీతిం దగుఁ బుచ్ఛయుక్తుఁ డురుదరం బేలీల నేఁ దాల్చెదన్.

చ. హరిహరనీరజాసనుల నష్టదిగీశులఁ గోర కక్కటా!
సురుచిరమూర్తి యంచుఁ దను సూనశరార్తుఁ దృణాశి శృంగి నే
వరునిఁగఁ బొంది లోకమున వారని దుర్యశ మంద వెట్రిసుం
దరినె! పశున్ వరింపఁదగు తన్వియుఁ గల్గెనె యేయుగమ్మునన్.

వ. అదియునుంగాక నిర్గుణుండును నిర్మముండును సర్వసాక్షియు సర్వకర్తయు నకర్తయు సర్వజ్ఞుఁడును సర్వగుఁడునుఁ బూర్ణుండునుఁ

బూర్ణాశయుండును శివుండును శాంతుండును సర్వభావనుండు నగు పురుషుండు మద్భర్త, అతనిఁ ద్యజించి హేయతాభాజనమ్మగు దేహమ్ముననం బొల్చుమందాత్ము నధముఁ దన్నే మని వరియింప నుంకింతు నని వెండియు. ౨౬౩

ఉ. శాతశరాళిఁ గాలుమహిషంబుగఁ జేసెద మీవిభుఁ మరు
ద్భ్యాతికిఁ దక్కి భీతిమెయిఁ బోయి రసాతల మంటియున్న స
త్కాతరుఁగాతు నింతయును గ్రక్కునఁబోయి వచించి యుద్ధపుం
జేఁతకుఁ బిల్వు మత్తులువఁ జెచ్చెర వచ్చినఁ ద్రుంతు వ్రేల్మిడిన్.

శా. భగ్నాశుండు ననుఁ వరించునె ! మదపాగ్భారమద్వారధీ
మగ్నాత్మున్ మహిషాధముం దను నికామప్రోజ్జ్వలన్మామకా
స్త్రాగ్నిజ్వాలలవ్రేల్తు నంచెఱుఁగఁజా రా!తామ్రి!యంచున్ రిపుల్
భుగ్నప్రాభవులై కలంగ రవముం బూరించె ఘోరమ్ముగన్.

శా. స్వర్యాభదుర్భర మైనయారవమునన్ సప్తాంబుధుల్ దూలె నం
తర్భారంబు సహింప కద్రులు ప్రతిధ్వానమ్ము లిచ్చెన్ భయా
విర్భావమ్మున దైత్యసంఘములు కంపించెన్ దదీయాంగనా
గర్భమ్ముల్ పగిలెన్ దిశావలయ మేకంబాయె నొక్కమ్మడిన్.

ఉ. ఆ రవ మాలకించి భయమంది పలాయనశాలి తామ్రిఁడెం
దే రయ మార నమ్మహిషధీరుని సన్నిధి కేగె, మున్న త
త్పౌరులకర్ణముల్ బధిరభావము దాల్చె ననంతరంబు నా
గారియు గర్జిలెన్ ద్విగుణ మయ్యె భయమ్ము సురారికోటికిన్.

వ. పిమ్మట మహిషుండు భయత్రస్తుండై తన కడ కరుదెంచిన తామ్రిం గాంచి సచివులదిక్కు మొగంబై చింతాదంతురం బగు చిత్తమ్మున నుత్తలపాటుగదుర నిట్లనియె. ౨౬౪

మ. గరువం బేది రసాతలమ్మునకుఁ బోఁగా నెంతుమో దుర్గ మె
వ్వరికిం భేద్యము గానిరీతి నొనరింపం జూతుమో లేక సం
గరరంగమ్మున నత్తలోదరిఁ గడుఁ గారింతుమో యెంచి మీ
ర్వరబుద్ధుల్ వచియింపుఁ డియ్యెడల శాస్త్రప్రక్రియాధుర్యులై.

గీ. మంత్రమూలంబు రాజ్యంబు మహిపతులకు
నదియు గుప్తమ్ము గావలె నట్లు గాని
చో వినాశమ్ము గలుగు నిచ్చో ననుగుణ
మైనవలను విచారింపుఁ డయ్య మీరు. ౨౭౦

ఉ. వచ్చినకాంత గా దబల, వైళమ పోయి జయింప రాదు తా
నచ్చపలాక్షి యెక్కటిగ నాహవకేళికి నిర్భయమ్ముగా
వచ్చుట కొంత చింత్యమగు వారక పోరితి మేని మీఁద మే
ల్వచ్చునొ ! కీడు వచ్చునొ ! శుభం బశుభం బెవఁడోపుఁ జెప్పఁగన్.

వ. ఉపాయవాదులు కొందఱు దైవం బన నెద్ది యెవ్వఁ డెఱుఁగు
నోపినవట్టు యత్నం బొనరించుట కర్జం బండ్రు. కొందఱు దైవ
మ్మును నుద్యమంబును గార్యసిద్ధిప్రదంబు లని చెప్పుదురు. మీ
మీ బుద్ధిబలమ్మున నిం దెయ్యది శ్రేయమో వివరింపుఁ డనుడు
బిడాలుండను మంత్రి యతని కిట్లనియె. ౨౭౨

సీ. మహిషేంద్ర వింటె ! యిమ్మహిళ సురప్రేర
ణంబున నిటకు యుద్ధంబొనర్ప
నేతెంచె నిక్కాంత యెల్లసురలయంశ
ములఁ బుట్టుటయు నిక్కముగ నెఱుంగ
నయ్యె, స్త్రీభీతు ని న్నమరులు వంచింప
నిప్పాట యోజించి రిక్కతమునఁ

గాదె పౌదవ్వ్రలఁ గదిసి యెల్లరు సహా
యులు గాఁగ నుంకించు చున్నవారు

గీ. మనము రణమున కేగిన వనజనేత్రిఁ
దొట్టి సురలెల్ల నసురుల గిట్టఁ జేయఁ
గడఁగుదురు నిన్నుమాత్రి మక్కాంత చంపు
నెఱేఁగి తగుయత్న మొనరింపు మింత నిజము. ౨౭౩

వ. నా బుద్ధికిఁ దోఁచిన విధమ్మునఁ జెప్పితి భవితవ్యం బెఱుంగ నంత సమర్థుండనే! నీ కెయ్యది సులభంబగు నట్లు పచరించునది యేకాకినియై కామిని యుద్ధార్థిని యగుట యెంత కేనియు నక్కజం బగు నను నంత దుర్ముఖుండను సచివుం డిట్లనియె. ౨౭౪

చ. జయ మిఁక నీకు లే దనుట సత్యము నావచనంబు తప్ప ద ట్లయినఁ "బలాయనంబు వర" మన్న సురావళినెల్ల నోర్చి యొ క్కయువతి కిట్లొనర్చుటయుఁ గాదు, రణం బొనరించి చచ్చినన్ బయి నెగడున్ యశంబు జయపక్షమునన్ సుఖ మప్రిమేయమౌ.

వ. అనిన బాష్కలుం డిట్లనియె. ౨౭౬

ఉ. ఏ నొకరుండనే చని జయించి యమాలయ మేగునట్టు ల మ్మానినిఁ జేయు వాఁడ ధృతిమంతుఁడ వయ్యు నధీరుభంగి నీ కౌనె భయమ్ము చెంద; నమరాధిపుఁ దొట్టి దిగీశులెల్ల రన్ దీనులఁజేసి యిక్కరణిఁ దేఁకువ దక్కుదురయ్య! కాంతకున్.

గీ. ఈవు సంగ్రామమునకు రానేల! నన్నుఁ
బంపు మొక్కింతమాత్రి నప్పడఁతిఁ జంపి
మగుడ నీకడ కరుదెంతు మహిషరాజ!
మామకీనబలంబు సామాన్యమయ్య? ౨౭౮

వ. అంత దుర్ధరుండు వినతుండై యిట్లనియె. ౨౭౯

ఉ. నీ కయి దేవతల్ మిగుల నేర్పునఁ బన్నినయాలతోంగి మా
యాకృతి నొక్కఁ వెల్మిడి శితాస్త్రపరంపరలన్ వధింతు నా
నాకుల కాకులత్వము రయమ్మునఁ గూర్తు బిభీషికార్థ మీ
రాక యెఱుంగు, మింతయుఁ గరంబు తిరంబుగ నిర్వహించెదన్.

వ. అంతియకాని రాజనీతివిరుద్ధంబగు తెరువునఁ బోవలదు. మఱి
యొక్కటి వినుము లోకమ్మున సేవకులు సాత్త్వికరాజసతామస
భేదమ్మున మూఁడు తెఱంగులవా, రందు సాత్త్వికులు స్వామి
కార్యమ్ములు సాధించుచుఁ దదవిరోధమ్మునం దమ కార్యమ్ములు
నిర్వహించుదురు రాజసులు స్వకార్యతత్పరులై యొకొక్కతఱిని
స్వామికార్యంబులును యదృచ్ఛగా నిర్వహించుదురు, తామ
సులు స్వామికార్యంబు దిగఁద్రొక్కి స్వకార్యతత్పరత్వమ్మున వల
నగునెడ మార్తురం గలసి ప్రభుచ్ఛిద్రమ్ములు వెలిఁజేయుచుఁ
గోశగుప్తంబగు నసివడువున భీతిం గొలుపుదురు. ౨౮౧

క. కావునఁ దాదృశులగు దు
ర్భావుల నమ్మంగఁజనదు ప్రభువులు, మంత్రం
బా! వెలికిఁ బోవు కార్యం
బా! విపరీతించు నట్టి యదయుల కతనన్. ౨౮౨

—* బాష్కలదుర్ముఖులు దేవితోఁ బోరుట. *—

వ. అట్లగుట నీవు నిశ్చింతమ్ముగ నుండు మేమును బాష్కలుండునుం
గలసి యరిగి యక్కామినిం జయించి నీకడకుం దోడితెత్తుమని
యిరువురును గృతనమస్కారులై దిక్కులు గ్రిక్కిదలఁ బురమ్ము
వెలువడి దేవింగాంచి యిట్లనిరి. ౨౮౩

ఉ. ఓ నళినాయతాక్షి ! విను మొక్కఁడు పంచెద మేము నిన్ను, మా
దానవనాయకుల్ మహిషుఁ దత్పరతన్ వరియింపు మాతఁడున్
మానవరూపమంది నిను మన్ననఁ జేయు రహస్యమందు ; దు
ర్మానసమునై ననిం గడఁగి మానముఁ బ్రాణముఁ గోలుపోదురే.

వ. కామరూపుఁడగు మారాజుతో సకలభోగమ్ము లనుభవించుచుఁ
ద్రిలోకమ్ముల కేలికవై యేలికొమ్మ నావుడు దేవి యిట్లనియె.

గీ. ఎంత కామినియయ్యుఁ దా నేలతాంగి
యధముఁ బశువు వరింపఁగ నాత్మ నెంచుఁ
గులము శీలమ్ము గుణమును గలుగు తగిన
వరుని వరియించుఁ దన కంత వలయునేని. ౨౫౬

చ. వెడవెడ మాటలాడుచు బిభీషిక లియ్యెడఁ జూప కింక మీ
యొడయని యొద్ద కేగి సమరోన్ముఖుఁడై చనుదెంచునో, రయం
బడర రసాతలమ్మునకునై చనునో తెలియంగఁబల్కు యి
య్యెడ కరుదెంచి నోడ్పుఁ డిఁక నే సహియింప దురుక్తు లాడినన్.

ఉ. ఆ కఠినోక్తులన్ విని దురాత్ములు దైత్యులు బాణవృష్టి పెం
జీఁకటి గ్రమ్మఁగాఁ గురియఁ జెచ్చెర నజ్జగదంబ సింహనా
దాకులులై రిపుల్ బెదర నంపగముల్ నిగిడించె నంత దు
ర్ధీకుఁడు బాష్కలుండు చనుదెంచెఁ జమూతతి కగ్రగామియై.

క. ధట్టుండై యస్త్రమ్ముల
నెట్టన నద్దేవిమీఁద నిగిడించిన న
ప్పట్టున నయ్యంబయుఁ దా
బిట్టేసె శరములు వేనవేలు గడంకన్. ౨౫౭

వ. ఇట్లు బాణపరిఘాసిఘాతమ్ములఁ నిరువురుం దుములమ్ముగాఁ బోరుతఱి, ౨౯౦

శా. ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ము లద్దేవి య
స్తోకాహంకృతి వానిపై విడువ నా సోఁ కన్నిటిం ద్రుంచి ని
ర్భీకుండై యొకయేడు బాణముల దేవిం గొట్టి బిట్టార్చె రా
డ్రాకారమ్మున నంబయున్ దశశితాస్త్రావిద్ధుఁ జేసెన్ రిపున్.

ఉ. వానిశరమ్ములం దునిమి వాఁడిశరమ్ముల నోవ నేసి య
మ్మానవఖాదిచాప మసమానరయమ్మునఁ ద్రుంచి సింహనా
దానుగతిం జెలంగె జగదంబ, సురారి గదాత్తహస్తుఁడై
పూనిక నేగుదెంచె నలపుష్పసుగంధినిఁ బిల్కుమార్పఁగన్.

మ. అటు లేతెంచెడి బాష్కలుంగని గదన్ హస్తమ్మునంబూని మొ
క్కటి కయ్యమ్మున మూర్ఛవోనడఁచె నక్కంజాక్షి;వాఁడంతలోఁ
బటువేగమ్మున మూర్ఛఁ దేఱి గదవైవన్ దాని వారించి మి
క్కుటమౌ శూలమునన్నిలింపరిపునక్కుంజించె నయ్యంబయున్.

ఉ. శూలముదాఁకి బాష్కలుఁడు సోలి యమాలయగామియై మరు
జ్జాలమువంత దీర్చె నది సైఁపక దుర్ముఖుఁ డాగ్రహమ్మునం
దూలుచుఁ దేరి నెక్కి 'నిలు తొయ్యలి! యెక్కడ కేగ వచ్చు ని
న్నాలములోఁ బొరింగొనెద' నంచు శరమ్ముల ముంచి యొత్తినన్.

ఉ. వక్త్రము జేవురింప సురవైరులు భీతిల శంఖనాద సం
సక్తములై దిశల్ గలఁగ శక్తి గుణారవ మాచరించి త
న్ముక్తములైన మార్గణసమూహములన్ బొడిచేసి వానిపై
శక్తిముఖాయుధమ్ముల నసంఖ్యముగాఁ బరఁగించె నుద్ధతిన్.

వ. అంత దుర్ముఖుండు తత్తదాయుధమ్ముల నాత్మసాధనమ్ముల మర
లించుచు నుక్కు మిగిలి యంబికపై ననేక శరమ్ముల నిగిడిం
చుచుఁ బోరాడు నవసరమ్మున సంగరమ్ము దుర్భరంబయ్యె. ౨౯౬

గీ. అంబచే ననిఁ జచ్చిన యమరశత్రు
నికరముల గాత్రముల నుండి నెగసి రక్త
మేఱు గట్టె శివాకాకగృధ్రసార
మేయముల కెల్ల సంతోషమాయతముగ. ౨౯౭

ఉ. దుర్ముఖుఁడున్ బ్రకోపగతి దోఁపఁగ హస్తము నెత్తి పల్కు దు
ష్కర్ముఁడు "వింటె యోజలజచారువిలోచన! మానృపాలు నం
తర్మద మేది పొంపు మటు దక్కిన నిన్ బరిమార్తు నుజ్జ్వల
ద్ధర్మవిముక్తతీవ్రనిశితప్రదరమ్ముల పాలు సేయుచున్". ౨౯౮

ఉ. దుష్కరమైన కోపమునఁ దోఁగుచు నంబయు వానిఁబల్కు 'మీ
బాష్కలుఁ డేమియయ్యెర యపాత్ర! యపత్రపఁదక్కి దుర్మదా
విష్కరణంబు సేయఁగలవే యిఁకఁ గాలము డగ్గఱయ్యె నీ
శుష్కవచఃప్రసంగములు చూచెదఁ జక్కఁగ నిల్వు మాజికిన్'.

ఉ. శాత్రవుఁ డంబ పల్కులకు సైఁపక కోపకరాళవక్త్రుఁడై
మాత్రిన నించె నెక్కుడగు మార్గణముల్ ధృతిఁబూని యా జగ
న్నేత్రి శరమ్ముల న్నఱకి నీఱుగఁజేసి యొకంట వాని దు
ర్గాత్రము గ్రుచ్చె నిక్కరణిఁ గర్కశ మయ్యె రణమ్ము వారికిన్.

ఉ. శూరులు మెచ్చఁ గాతరులు సోలి భయంపడ నొక్కట న్నిలిం
పారి శరాసనమ్ము దునుమాడి శరమ్ముల నేనిటన్ వెసన్
దేరు బడల్పడ న్నఱకి దేవి భయంకరమూర్తి గాఁగ దే
వారి గదన్ గ్రహించి రయమారఁగ సింగముఁ గొట్టె బిట్టుగన్.

శా. తత్త్వాదృక్షగదాభిఘాతహతమూర్ధంబయ్యు హర్యక్షము
న్మత్తప్రక్రియ నీడఁ బోక నిలువ న్మార్త్యారి కోపించి యు
ద్యత్తీవ్రస్థితిఁ బైకి రాఁ గని కనత్ఖడ్గంబు చేఁ బూని సం
కృత్తస్ఫీతకిరీటమస్తకునిఁ గా నేసెన్ సురల్ మెచ్చఁగన్. ౩౦౨

వ. ఇట్లు దుర్ముఖుండు సమసిన హతశేషులైన రక్కసులు పలాయ
మానులై యఱిగిన మహిషుండు వారలం గాంచి "యేమి
యయ్యె" నని యడిగి కలతెలం గెఱింగి క్రోధమ్మును సంతాప
మ్మును బెనంగొనఁ దక్కటిమంత్రులం గాంచి, ౩౦౩

గీ. అక్కటా! బలవంతులై యమరవరుల
నోర్చి పెం పెక్కినట్టి యీయోధు లిట్లు
సత్తురే యీఁడుదానిచే! శక్యమగునె
కాలయోగమ్ముదాఁట నొక్కనికినేని? ౩౦౪

—* చక్షురతామ్రుల యుద్ధము *—

వ. అని వనటం గుందు రాజు నాలోకించి చక్షురుండు దేవా! యింత
వగవ నేల నే నేగి యీ క్షణంబ యమ్మానినిం బోరిగొందు నని
యాజ్ఞం గొని తామ్రుండు దనకు బాసటగా దిక్కులు పిక్క
టిల్ల సింహనాదమ్ము లొనర్చి పేర్చు దైత్యచమూసమూహమ్ము
లతోఁ గదలి చను దెంచుచుండె; నవ్వాని దాదవ్వులం గని,

ఉ. అంబిక ఘంటికానినద మారఁగ శంఖరవం బొనర్చి మౌర్వి
యం బిగలాఁగ శింజినియు నద్భుతరావ మొనర్చె దాన భీ
తిం బడి పాఱు దైత్యులఁగతింగని చక్షురుఁ డాఁగి పల్కె వై
శంబ వధింతు నియ్యబల లా వఱ నేటికి నిల్వఁ దుద్ధతిన్. ౩౦౬

మ. అని చాపమ్మును గేలఁ బూని జనితాహంకారదుర్వారుఁ డ
య్యును సద్దేవినిగాంచియిట్లను మహోద్యోగమ్మునన్ బ్రేమయు నిం
గని భీతిల్లెడి వాఁడఁ గాను వినుమీ కంజాక్షి ! నిం జంప నె
మ్మన మెంతే వెనుదీయుచున్నయది సంభావించి దోషస్థితిన్.

ఉ. అక్కట ! చారునేత్రిలు గటాక్షములన్ గురిపించి సంగరం
బెక్కటిఁ జేయుటల్ గలుగునెమ్మెయి నో సరసీరుహాక్షి! నీ
వెక్కడ ! కర్కశాస్త్రముల నేయుట లెక్కడ! పుష్పమేనిఁ బై
మిక్కిలి దెచ్చు నీకు నునుమేనిపయిం బడె నేని యుగ్మలీ.

గీ. క్షాత్రధర్మానుజీవుల జన్మ మెంత
నిర్దయాత్మక మెమ్మెయి నెమ్మి గలిగి
పెంచుకొను దేహమును గడుఁ బేశలమ్ము
గాఁ దలంపక ఖండింతు ఖడ్గతతుల. ౩౦౯

గీ. ధనలోభమ్మునఁ గత్తులు
గొని పరులం బొడిచి తృప్తి గొందురు లోకం
బున మూర్ఖు, లెంత కేనియుఁ
జొనుపుం దంధనము ధనము సుందరి ! యెందున్. ౩౧౦

చ. తెలిసినదాన వయ్యు నిటు తేఁకువఁ దక్కి లతాంగి ! భోగజ
మ్ములగు సుఖమ్ములన్ విడిచి పోరొనరింపఁగ నేల పేర్మి నా
పలుకులు సమ్మతించి సురపాలుర నొంచి దివంబు గొన్న ధీ
రలలితు మావిభుం గొని కరంబు సుఖింపుము నీకు మ్రొక్కెదన్.

ఉ. కత్తులు హత్తి శస్త్రములు గాఁడి శరీరము భిన్నభిన్నమై
మిత్తికిఁ బాలుగాఁగఁ బయి మిక్కిలి నక్కలు కంకగృధ్రముల్
నెత్తురు గ్రోలి మాంసమును నెమ్మెయిం దిని యీడ్చు నక్కటా!
మెత్తురు సత్కవీంద్రు లని మేటిగ నేమిగుణంబు చూచిరో !

క. అనిఁ దెగినవారలకు నా
కనివాసము గలుగునంచు గాకే మది యెం
త నిజము తెలియదు నా బు
ద్ధిని విని మారాజు నెనయఁ దివురు మృగాక్షీ. 313

చ. అన జగదంబ వల్కెఁ గడు నాఙడికూఁతలు గూయఁబోకు శా
స్త్రనిధివి వోలె నీల్గెదవు రాజులనీతి యెఱుంగుదే? మహా
జనసహవాస మెయ్యెడల సల్పక కాఁతెనుపోతు నేస్త మం
దిన నినుబోఁటికిం దెలియునే! శ్రుతిగమ్యములైన ధర్మముల్.

చ. సురలకుఁ జెట్టచేసి కడుశూరుఁడువోలె మదించినట్టి ము
ష్కరు మహిషాధముఁ జమునిసద్మము చేరఁగఁజేసి శాసనా
క్షరములతో జయార్థమగు కంబము నియ్యెడ నిల్పుదాన సు
స్థిరత యెలర్ప నిల్చి యని సేయుము నీ మొదలఁ వధించెదఁ.

వ. జీవితేచ్ఛాగ్రంథిగ్రస్తుండ వయ్యేదేని నీ రాజునకు బుద్ధి సెప్పి హతశేషులతోఁ బాతాళమ్మునకుం బోవునట్లు సేయు మనవుడు దానవుండుఁ గ్రోధమూర్ఛితుండై ఘనాఘనాసారమ్ములు వోని శరంబులు గురిసిన, 316

ఉ. ఆ జగదంబ వానిప్రబలాస్త్రములన్నియు నుగ్గుచేసి స్వా
రాజముఖామరుల్ వొగడ రక్కసుపై గదవైచె దానఁ దా
రోఁజుచు మూర్ఛవోయెఁ గడురోషము గల్గియుఁ జక్షురుండు;ప్రో
త్తేజితశౌర్యుఁడంత నరుదెంచెను దామ్రుఁడు చాపధారియై. 317

ఉఁ వచ్చిన తామ్రుఁగాంచి రిపుభంజని యజ్జగదంబ "రమ్ము నీ
మచ్చర మేడ నజ్జముని మందిరముం జొరఁజేసి పుత్తు మీా

వచ్చినవార్త దా విని వేసం జనుదెంచెడిఁ గాక దుర్మనం
డచ్చపలుండు మీకుఁ బ్రభువైన హయారి రణంబుసేఁతకున్.

క. మీరెందఱు వచ్చిన నా
కూరుఁడు మహిషుండు చావు గూరకయున్నన్
గోరిక తీరదు సురలకు
రా రమ్మను మద్దురాత్ము రణమొనరింపన్. 320

శా. మా యన్యోన్య పరాక్రమమ్ములపసల్ మా యుద్ధచాతుర్యతే
జోయుక్తుల్ గనుఁగొందుగాక చని తుచ్ఛున్ బుచ్ఛవిభ్రాజితున్
డాయంబంపుము మీ విభున్ జమునిఁగూడం జేసెద న్నాఁగ 'నో
హో' యంచున్ వడినార్చియే సెశరముల్ యుద్ధార్థితామ్రుండోగిన్

మ. శరవృష్టిన్ శరవృష్టి నేర్చి కడఁకన్ శౌర్యం బవార్యంబుగా
నిరుగేల న్నిగిడించె భల్లములు దేవేంద్రాదు లగ్గింప న
య్యరవిందానన, మూర్ఛదేటి తగఁ దా నయ్యంబికం జక్షురుం
డురుఁడై మార్గాన నిర్వ్యరంజదిపెఁగోద్ధోత్సాహమైయంబయున్.

వ. దానికిం గసలి రక్కసులెల్ల నొక్కపెట్టన చుట్టుకొని పరశుపట్టిస
ఖడ్గముసలభిండివాలాద్యనేకాయుధమ్ము లయ్యంబ పయిం
గీలించినఁ బోరు ఘోరంబయ్యె. 322

ఉ. తాళసమంబు లోహజము దారుణమై విలసన్మణీఘృణుల్
గ్రాల నెసంగు నొక్కముసలంబు కరంబునఁ బూని తామ్రుఁ డ
భీలత దోఁప సింగమును బిట్టుగఁ గొట్టె శిరమ్ము రక్తధా
రాళము గాఁగ దానికిఁ గరమ్మును నంబిక తీక్ష్ణమూర్తియై. 323

క. అసివేటికి వానిశిరమున్
వెస నఱికిన మొండె మొక్క వ్రేల్మిడిఁ గేలన్

ముసలంబడర నటించి ర
ణసరణి నంతంతఁ బడియె నాకు లలరఁగన్. 3౨౮

వ. అంతఁ జక్షురుండు తామ్రమరణమ్మునకు నవుడుగలచికొని ఖడ్గమ్ము కేలం బూని సింహనాదం బొనర్చి యురువడించిన జగదంబ కోపాకులయై,

మ. ఒకబాణమ్మున ఖడ్గము న్నలకి వేఱొక్కంట హస్తంబు భూ
మికి పాత్రించి మఱొక్కటన్ శిరము పేర్మిన్ డొల్లఁగా నేసి ది
క్చక్రరాభీలముగాఁగ గర్జిలిన భగ్నీభూతమై దైత్యసై
న్యకదంబం బుడివోయె నొల్కిరి ప్రసూనంబుల్ సురల్ దేవిపై

వ. అట్లు చక్షురతామ్రు లిరువురుం జచ్చుట విని శోకించి మహిషుఁడు దురాగ్రహాగ్రస్తుండై యసిలోమబిడాలాదుల ననేకుల ననేకసేనలతోడం జతఁజేసి పనిచిన వార లరుదెంచి యష్టాదశ భుజాగ్రజాగ్రదాయుధమండలయగు చండికం గాంచి విస్మయాకులులగు నెడ నసిలోముండు వారలకుఁ గన్నాకై సేనాముఖమ్మున నిలిచి వినయమ్మున నయ్యంబ కిట్లనియె. 3౨౭

శా. దేవీ కొండొక చెట్ట నీయెడల నెందేఁ జేయఁగారాని స
ద్భావుల్ దైత్యులు వీరలిట్లు పొలియం దార్కొలు నీకేల ? వీ
రావేశమ్మున దుఃఖదం బగురణం బాసింతురే ! సంధిమై
నావెంటం జనుదెమ్ము నీవలయు నానావస్తువుల్ గైకొనన్.

సారము లేని సంసరణసాగరమందు సుఖంబు గ్రాహ్య మె
వ్వారికి, శాంతిమై నదియుఁ బొల్పడు, దానికిఁ దక్క మార్దవ
శ్రీ రుచిరంబు కాయము కృశించి నశింపఁగ నేల చెప్పుమా
ఘోరరణమ్మునం దిటులు గోరిక చెందితి దుష్కరమ్ముగన్.

—* అసిలోమ బిడాలాదులనికి వెడలుట *—

క. ఆసుఖము రెండు తెఱంగుల.
భాసిలు నిత్యం బనిత్యపదవియు నా, వి
ద్యాసంగతిఁ బరు నెఱుఁగుట
యే సుఖమగు నిత్య మది, తదితర మితరమౌ. 330

వ. ఇందు నాశాత్మకంబగు భోగసంభూతసుఖంబు తత్త్వజ్ఞులు త్యజించి నిత్యంబగు నాత్మజ్ఞానంబు వడయనుంకింతు రదియట్లుండె.

ఉ. సౌగతధర్మ మూనుటయు సమ్మతమేని మృగాక్షి! శస్త్ర సం
త్యాగము చేసి జవ్వనము సార్థకమై తగ నిచ్చ కైన సం
భోగములన్ మెలంగు విరిబోఁడిరో! ప్రాయము రేపు నిల్చునే
వేగఁగనిట్టి తాపమున వేతురె పువ్వుముఁ బోనిదేహముల్!

చ. అదియునుఁ గాక యొల్లను నిరాగసులన్ బరితాపపెట్టి యి
ట్లదయతమైఁ జరించు టది హాని యగున్, దయకన్న ధర్మము
న్నదియె? తదీయరక్షణమునందు మనం బిడి సత్య మిప్డు చె
ప్పఁ దగదె దైత్యవర్గములఁ బట్టి వధింపఁగ నేమి వచ్చునో.

వ. సత్యంబువలనన కదా ప్రాణమ్ములు నిలుచుట దానికిం దప్పుట కొప్పమియ ధర్మం బనఁబడు నట్టి ధర్మమునకుం గట్టువడి కల తెఱంగు చెప్పు మని ప్రాంజలియై యడిగిన నసిలోమునకు నంబ కరుణించి యిట్లనియె. 334

ఉ. నీమవినీతి యింత దగునే! కరుణించి వచింతు నాదు యు
ద్ధాదరకారణంబు; జగమంతయుఁ ద్రిమ్మరుదాన దుష్టులం
గాదని చంపి సజ్జనులఁ గావఁగ; నొండు ప్రయోజనంబు నా
కేదియు లేదు దీనికయి యెత్తుదు నే నవతారముల్ మహిన్.

మ. భయభక్తుల్ విడనాడి దేవతల నొంపం బూనె మీరాజు దు
ర్జయుఁడై ; వాని నడంప వచ్చితి యథార్థం బింత ; నీ వేగి దు
ర్నయునిం దన్మహిషీతనూజు నిట నే రమ్మన్న చందంబు దె
ల్పి యనింజేయఁగఁ బంపు మన్యుల వృథా పేరేపఁగా నేటికిన్.

ఆ. వె. జీవితేచ్ఛఁ దనదు చేతమ్ము సోలసిన
బంధుజనులతోడ బయలు వెడలి
యీఁగ కాలియంత యేనియు ద్రవ్యంబు
గొన కధోభువనము జనుట యొప్పు. 33౭

వ. ఆరసాతలమ్మునందు మీకులవృద్ధగు ప్రహ్లాదుండు వసించు వాఁ
డాతనిం గొలిచి యట నుండునది యని చెప్పు మట్లయిన మీర
లందఱును బ్రతికి పోవుదు రనవుడు నసిలోముండు బిడాలు
దిక్కు మొగంబై ప్రీతిపూర్వకమ్ముగ ని ట్లనియె. 33౮

ఆ. వె. వింటివే భవాని వినిచినవిధము ద
యార్ద్రహృదయ సంధి కనుమతించె
ని ట్లొనర్చి బ్రతికి యేగిన నేమగు
నా రసాతలమ్మునందయుండ. 33౯

వ. నావుడు బిడాలుం డిట్లనియె. 34౦

ఉ. అంబిక చెప్పినట్టి విధ మందఱకున్ సుఖదంబ రాజు సం
ధిం బడయంగనొల్లఁ డెటు దెల్పఁగ వచ్చు నెఱింగి మూర్ఖ రీ
తిం బడువాని ? మృత్యువది దెప్పర మాఁగఁ దరంబె యుద్ధరం
గంబునఁ జచ్చువారిఁ బొడఁగాంచియుఁ దక్కటివారి నంపఁడే.

గీ. కడఁగి పాంచాలికలరీతిగా నతనికి
వశులమై యాజ్ఞఁ దప్పఁగ వశమె సత్య

ముగ వచించిన పల్కు లెవ్వగఁ బ్రియంబు
గలుగఁజేయు నృశంసులౌ కావరులకు. 383

చ. "ధనమును రాజ్యముం విడిచి దర్పము నేదియుఁ గట్టుగుడ్డతో
ననికిఁ దొలంగి యేగుము భయమ్మున నీవు రసాతలమ్ము" నా
విని యతఁడాదరించెడి వివేకము గల్గినవాఁడె! కోపముం
గని మనలం 'వధింతు' ననుఁగాక దురాత్ములు కీడు నెంతురే.

ఉ. కావున స్వామికార్య మెసకమ్మునఁ బూని చరింత మెమ్మెయిం
జావది సిద్ధమౌ టెఱిఁగి చావఁగనేల దురాత్మ చేతిలో
నా విని యాతఁడియ్యకొనినం జెలరేఁగి బిడాలుఁ డేడ్తెఱం
దేవిని నొంచె సప్తపటు తీవ్రశరమ్ముల నేసి యాసునం. 384

వ. అసిలోముండును ధనుఃపాణియై యంతంత నిలిచి చూచుచుండెఁ
బదంపడి యంబిక తన్ముక్తమ్ములగు బాణమ్ముల నడనడుఁ బొడి
చేసి, 385

గీ. మూఁడు భల్లమ్ములను జాపమున నమర్చి
సింహనాదమ్ము చేసి పేర్చిన రయమునఁ
బఱపె; వాఁడును దద్బాణపాతమునకుఁ
దొడరి మూర్ఛిల్లి పెద్ద నిష్ఠురయుఁ జెందె. 386

వ. ఇట్లు బిడాలుండు సమసిన నసిలోముండు సన్నద్ధుండై రణరం
గమ్మునకు వచ్చి కరంబెత్తి యయ్యంబిక కిట్లను, 387

చ. ఎఱుఁగుదు దేవి! నీకతన మృత్యువు నా కగునంచు; బుద్ధులం
గఱపిన నొల్లనట్టి విభుఁ గాదన లేక రణంబుసేత కే
డ్తెఱ నిటు లియ్యకొంటిఁ గడుఁదెంపరినై మరణంబు భీతిమైఁ
బఱచుటకన్న లగ్గగు శుభం బశుభంబును దైవలభ్యముల్. 388

ఉ. ఇందఱు దానవుల్ చదిసి యేగిరి కాలునిప్రోలి కింకనే
నెందఱఁబోలువాఁడ ! విధియెవ్వఁడు దాఁటఁగనేర్చుఁ ! బౌరుషం
బెందును దైవముం గడచి యాచుకయుం బనిసేయ దంచు మి
న్నందఁగ నార్చి యేసె నిశితాస్త్రము లజ్జగదంబ దిక్కుఁగన్.

శా. ఆ బాణమ్ముల నంతరాళమున శాతాస్త్రమ్ములం ద్రుంచి పై
పై బాణమ్ములు గొన్నిటిన్ వేస నిగుడ్పన్ వాఁడు తచ్ఛస్త్రధా
రాబాహుళ్యముచే స్రవద్రుధిరుఁడై రాజిల్లెఁ బుష్పావళీ
లాబాభాసురకింశుకాగమము హేలన్ జూప నగ్గింపఁగన్. 3౧౦

ఉ. పిమ్మటఁ గోప మెక్కుడుగఁ బేర్చి గదంగొని యార్చి సింహమూ
ర్ధమ్మున మొత్త నయ్యది కరమ్ము భరమ్ముగ ఘోరభంగి నా
దమ్మొనరించి శస్త్రములు దాఁటెడి తీవ్రనఖమ్ములన్ దదీ
యమ్మగువక్షముం దివిజులందఱు మెచ్చఁగఁ జీల్చె నుక్కునన్.

ఉ. దానికి లోఁగ కయ్యసుర దారుణభంగి నెదిర్చి యార్చి యా
త్మానుచరుల్ నుతింప రయమారఁగ నాహరిశీర్షమందుఁ గా
లూని పరాక్రమించి గద నుద్ధతుఁడై జగదంబ నొంచె న
మ్మానిని ఖడ్గధార దునుమన్ దల యూడిపడెన్ సురారికిన్.

ఉ. రక్కసుఁ డిట్లు లుక్కఱ సురల్ గుసుమమ్ములు గ్రుమ్మరింపుచున్
దిక్కులు పిక్కటిల్ల "జయ దేవి" యటంచు నుతించి మించి తా
రొక్కట దుందుభిధ్వనుల నుర్వియు నాకసముం గలంచి రిం
పెక్కఁగ నప్సరోయువతులెల్లరు నాడిరి దేవి మెచ్చఁగన్. 3౧3

క. హతశేషమైన దైత్య
ప్రతతిన్ సింగమ్ము పట్టి భక్షించె సము

స్నుతవేగ మడరఁ గొండఱు
సతికీగతి దెలియఁ బఱుపఁ బఱచిరి కడఁకన్. ౩౯౮

వ. ఇట్లరిగి రోదనపూర్వకమ్ముగఁ గల తెఱఁగు చెప్పిన నమ్మహి
షుండు ప్రళయకాల రుద్రుని చందమ్మున మండిపడి దారుకుం
డను సారథింజూచి సహస్రఖరసంయుతంబును నానాయుధ
సమన్వితంబును బతాకాధ్వజవిరాజితంబును నగు తన రథంబు
దోడికొని రమ్మనవుడు వాఁడట్లొనరింపఁ గామార్తుండగు కతన
నద్దేవి తన్ను వరించునకాఁ దలంచి హేయంబగు నీ మహిష
దేహంబు కా దని త్యజించి స్త్రీలు రూపచాతుర్యమ్ములం జూచి
మోహింతురని కృతనిశ్చయుఁడై, ౩౯౯

—* దేవీ మహిష సంవాదము *—

ఉ. మానవరూపముం గొని సమంచితభూషణభూషితాంగుఁడై
దానవసైన్యముల్ గొలువ ధారుణి గ్రిక్కిఱఁదలఁగ రథస్థుఁడై
మానినులెల్ల మెచ్చఁదగు మంజులమౌ చెలువొప్ప నేగె న
వ్వానిని దవ్వులం గని రవం బొనరించెఁ బరాంబ డంబుగన్.

వ. ఇట్లు శంఖంబు పూరించిన దైత్యవాహిని కనుకనిం బఱచె వారల
నిలువరించి మహిషాసురుం డామె కభిముఖుండై చిఱునగవు
మొగమ్మునం దనర నిట్లను, ౩౯౭

గీ. దేవి! సంసారమున యందుఁ దిరుగు పురుషుఁ
డేనిఁ గామినియేని సుఖానుభవము
నొందఁగోరుదు రదియు సంయోగజంబు
గా నెఱుంగు మదియు భిన్నగతి నెసంగు. ౩౯౬

వ. ఎట్లంటేని మాతృపితృలకుఁ బుత్త్రునితో నగునది యుత్తమం, బన్నదమ్ముల సంయోగంబు మధ్యమంబు, వివిధావృతచిత్తులును బరిసంగపరివర్తులును నగు నావికుల సంయోగంబు సహజంబై యత్యల్ప సుఖదం బగుట నధమంబు. 3౫౯

ఆ. వె. సమవయస్కులైన జంపతులకుఁ దుల్య
రూపశీలగుణనిరూఢిఁ బొరపు
మిగులు యోగ మది యమేయసుఖోదయం
బొసఁగుకతన నుత్తమోత్తమంబు. 3౬౦

వ. ఇట్లు సంయోగమ్ములు పరస్పరం బుత్కర్షాతిశయమ్మునం బొల్చు కతన, 3౬౧

ఉ. వీరుఁడనైన నాయెడ వివేకము గల్గిన దానవై సుధా
సారము వోనిచూడ్కులఁ బొసంగఁగఁ జేసి కరంచితేని దు
ర్వారసుఖంబు దాననగు బాలరో! యిర్వుర కీసుఖంబుతో
నారయ నేసుఖమ్ములును నంద వనుత్తమ మా కతమ్మునన్.

చ. సురపతిఁ దొట్టి నిర్జరుల సొంపఱఁ జేసితిఁ గామరూపచా
తురి గలవాఁడ నిట్టి ననుఁ దొయ్యలి! దాసునిఁ గాఁగ నేలి యా
దరముగఁ బట్టరాజ్ఞివయి దానవులెల్ల విధేయులై మెలం
గ రమణ నాదు వైభవము గైకొని పొందఁగరాదె భోగముల్.

ఉ. ఆనతి యిచ్చితేని విను మ య్యమరావళితోడ వైరమ్మున్
మానెద నెద్ది పంచినను మానక చేసెదఁ బ్రేముడించు మె
ల్లేని భవత్పదాంబుజములే శరణమ్ములు సేవకుండ ధ
ర్మానుగతుల్ వచింత్రు శరణాగత రక్షణ మొప్పదే చెలీ. 3౬౪

ఉ. పుట్టినకోలె దైన్యమునఁ బోవ నొకప్పుడు నాజి నెంతయుఁ
దట్టుఁడ నా విశేషములు తామరచూలి మొదల్ సురోత్తముల్
గట్టిగఁ దామెఱుంగుదురు కామశరమ్ముల దాడి కోర్వ కి
ప్పట్టున దైన్యమూనితిఁ గృపన్ గను మాయుధముల్ త్యజించితిన్.

క. మరణావధి నెన్నఁడు ద
త్పరత న్నీకెదురుసెప్పఁ దన్వంగిరో! నీ
గురుకుచము లాన మన్మథ
మరయుము శృంగారభంగితాపాంగములన్. 366

చ. అనవుడు దేవి వల్కె మొగ మంకురితస్మితకందళంబుగా
దనుజవరేణ్య! నాకుఁ బతి తత్పరమాత్ముఁడు; వాని యిచ్ఛనై
యొనరుతు సృష్టి; యప్పురుషయోగమునన్ జడనైన నాకుఁ జే
తనము ఘటిల్లుఁ గాంతశిల దాఁకిన యినుమునకుం బలెన్ లలిన్.

వ. ఇట్టి నాకు గ్రామ్యసుఖవాంఛ యెన్నండును లేదు నీవు మూర్ఖుండవై నన్నొక సామాన్యాంగనగాఁ దలంచి మత్సంగం బపేక్షించుచున్నవాఁడ వదియునుం గాక, 367

చ. నరునకు బాధనార్థముగ నాతి సృజింపఁ బడెన్ దురాత్మ! య
ప్పరమరహస్యముం దెలిసి భంగురమై కడు హేయమైన సౌ
ఖ్యరసమునం జరింపకుము గల్గు నొకప్పుడు ముక్తి శృంఖలా
స్థిరులకునేని; వీరలకుఁ దీరదు ముక్తికినేగ నెన్నఁడున్. 368

మ. శమ మిచ్చున్ స్థిరసౌఖ్య; మద్ది హృదయస్థానమ్మునం జేర్చి యీ
యమరావాసము వీడి జీవమును నీ వాసింతువేనిన్ నివా
స మొనర్పంగ రసాతల మ్మరుగు; మీచందమ్ముగా కొండు చం
దమ యేనిన్ రణమాచరింపుము నినున్ దర్పాంధునిన్ జూస్తాడెదన్.

ఉ. నీ వినయమ్ము నిక్కముగ నెమ్మది కెక్కఁగఁజేసి యింత నీ
కై వచియించితిం గడు దయాపరతన్; వలతేని విన్ము లే
దా! వెనుదీయ కాజి ననుఁ దాఁకుము నన్ బురికొల్పినట్టి దే
వావళి యప్పుదీర్తు నిను నాత్మశరమ్ములపాలు సేయుచున్.

వ. నావుడు మదనమోహితుం డద్దురాత్ముండు మరల నిట్లను.

ఉ. పూలకు మించి యెక్కుడగు పొల్పునఁ బొల్చెడి మేనిదాన! నే
నాలము సేసి నిన్నడఁచునంతటి సాహస మూన నిస్సిరో!
బేలనె! నీకృపం బడసి పెండిలిఁ జేసికొనంగ నుంటి ని
న్నోలలితాంగి! యిట్టి కఠినోక్తులు నన్నన నీకు న్యాయమే?

చ. హరిహర నీరజాసనుల నాహవభీరులఁజేసి పుచ్చి సుం
దరిపయిఁ జూపువాఁడనె ప్రతాపము లోకులు నవ్వ? నీయెడం
గర మనురక్తి కల్మి భయకంపిత మయ్యెఁ గరంబు పోల్తు! యి
ర్వైరమును మిత్రభావమును బొందితి మేటికిఁ దక్కు సంగతుల్.

క. ననుఁబేర్మిఁ జూచి పెండిలి
యొనరించికొన నొప్పదేని యొప్పెదఁ గాదే
నిని వలసినయెడ కరుగుము
నిను నేఁ బ్రహరింపఁ జాల నిశితాస్త్రములన్. 327

గీ. సప్తపది మైత్రి యని బుధజనులమతము
గాన నాచెల్మికత్తె వీవగసిమసంగి
పై ననుభవింపఁగల్గు నైశ్వర్య మొక్కఁ
డున్నె యింతటి పాపంబు నోపఁగలనె. 328

గీ. బాలహత్యయు స్త్రీహత్య బ్రహ్మహత్య
పాతకము లందు నెక్కుడు పాతకములు

గాన నెట్లేని నీదయ గాంచి జన్మ
మునకు సాఫల్యమొనరింతు వనరుహాక్షి. 322

గీ. నిను బలాత్కృతిఁగొనియేగ నేర్తుఁగాని
దాన నేమి సుఖంబగుఁ దలిరుబోఁడి
స్త్రీపురుషులు పరస్పరస్నేహ మడరఁ
గూటమికి నియ్యకొన దానఁ గుతుక మెసఁగు. 323

చ. తెలియవుగాక పూరుషుని ధీరునిఁ బొందని కాంతకున్ సుఖం
బులు వెలిఁగావె తాఁ దగిన పొత్తికిఁ దక్కనిపూరుషుండునున్
వెలియగు, నెవ్వఁ డిక్కరణి వేడుబు పుట్టఁగఁజేసె నీకు ; ని
స్తులమగు జవ్వనమ్ము గడుసుందన మక్కట ! వమ్మొనర్తురే.

ఉ. వైరి యెవండొ నిన్నిటులు వంచనఁజేసి మరల్చెఁ గాక సం
సారసుఖమ్ము లిక్కరణిఁ జాగము సేయుదె తత్త్రిమూర్తు లం
భోరుహనేత్రలన్ విడిచి పోయిరె యెంతటిబేలవైతి వే
చారుముఖీలలామ పతిసంగతిఁ బాసి సుఖించుఁ జెప్పుమా.

చ. ననుఁ బువుఁగోలలం బఱపి నాఁచికొనం గమకించు చండశా
సనుఁడు మరుండు నీయెడలఁ జాలఁ గృపం గలఁడేమొ, కాక యు
న్నను నిటు నిల్వ నిచ్చునె ! కనంబడె హేతువు వైరులైన దు
ర్మనసులు దేవతల్ మరు మరల్చిరి నీదరిఁ జేరకుండఁగన్.

ఉ. ఆదర మేది నన్నిపు డహంకృతి పీడిలివేని మున్ను మం
దోదరి సుందరున్ నృపుని ద్రోచి పదంపడి ధూర్తు నాధుఁగా
నూఁది స్మరార్తయై వగల నొందిన చందమునం గృశింతు సు
మ్మీ ! దరిలేని తాపమున, మీఁదటిబాధ గణింప విమ్మొయిన్.

## —* మందోదరీ వృత్తాంతము *—

వ. అనవుడు నమ్మందోదరీవృత్తాంతమ్ము వినవలతుసన దేవికి మహిషుం డిట్లనియె,

శా. దేవీ! సింహళ దేశ మెల్లగతులన్ దేజమ్మునం బొల్చు స
ద్భావుం డయ్యెడఁ జంద్రసేనుఁ డను భూపాలుండు పాలించుఁ బా
రావారావృత మైన మేదిని కొకండై యేలు నవ్వాని కిం
పై వర్తించుఁ బతివ్రతామణి యొక ర్ధాంగియై యిమ్ములన్.

గీ. ఆమె గుణవతి యనుపేర నలరుఁ దద్గు
ణములు వర్ణింప నలవి యెవ్వ్రిటికిఁ గాదు
కనియె నొక యుత్పలాక్షి నక్కాంత మొదటి
చూలుగాఁ బతి సుఖవార్ధి నోలలాడ. ౩౮౫

వ. పిదప నమ్మనుజపతి యక్కన్నెకు మందోదరి యని నామకరణమ్ము చేసి తోరంబగుగారమ్మునఁ బెంచుచుండ నబ్బాలికాజన చూళికా రత్నంబు శశికల తెఱంగునన్ దినదినప్రవర్ధమానయై పదియేండ్ల ప్రాయమ్మునం బొలుచుటయు నరేంద్రుండు వివాహం బొనరింప నెంచి యనుకూల వరాన్వేషణపరాయణంబగు చిత్తమ్మున నున్న యెడఁ గొందఱు బ్రాహ్మణు లరుదెంచి. ౩౮౬

గీ. తనరు మద్రదేశమున సుధన్వుఁడనెడి
రాజవర్యుం డతని కుమారకుఁడు నీదు
కొమరె కీ డగువాఁడు సద్గుణవిశేష
రూపరేఖావిలాసనిరూఢి నెంచు. ౩౮౭

శా. కంబుగ్రీవుఁడు వాని పేరనుడు భూకాంతుండు పుత్రిం దదీ
యంబౌ సామ్ముగ నిశ్చయించి తన భార్యం జూచి యిక్కన్నె లో

కం బెల్లం గొనియాడ శీలమున నాకారమ్మునఁ మేటి యఁగా
కంబుగ్రీవున కిచ్చి పుత్త్రమె యనంగా నాపె సంతుష్టయై. 3౮౮

వ. పుత్రి యున్నెడకరిగి యాదరమ్మున నమ్మా! నిన్ను నీ జన
కుండు మద్రదేశాధీశ్వరుండగు సుధన్వు తనయునకు సమస్త
లక్షణలక్షితునకుఁ గంబుగ్రీవునకిచ్చి పెండిలియొనర్ప నున్నవాఁ
డనవుడు మందోదరి యిట్లనియె.

శా. కౌమారవ్రత మూని స్వేచ్ఛగఁదపఃకాంక్షఁ బ్రవర్తింప నే
నామోదింతుఁ జిరమ్మునుండి, యిఁక నాకన్యుఁ వరింపంగ నే
లా! మేలా యొకమానవుం దవిలి వాలాయమ్ము నవ్వానితో
గామాసక్తిని బారతంత్ర్యమున మోక్షప్రాప్తిఁ బోఁ గొట్టుటల్.

క. స్వాతంత్ర్యమ్మున నెప్పుడుఁ
జేతోమోదమునఁ దిరుగఁ జేకూరుట వి
ద్యాతత్త్వజ్ఞులు మోక్షక
లాతాదాత్మ్యమునఁ జూచి లలిఁ బొగడరొకో. 3౯౧

సీ. అత్తమామలయెడ నడఁకువ గొలుపుట
బావలయెడ భక్తిపరతగనుట
మఱఁదులయెడఁ దగు మన్ననఁ జూపుట
తోడికోడండ్రఁ బొత్తున మెలఁగుట
యాఁడుబిడ్డల చిత్త మరసి వర్తించుట
సవతి గల్గిన దాని చన వెనయుట
పతికి నెవ్వేళలఁ బరిచర్య సలుపుట
సంతతి గని పెనువంతఁ బడుట

గీ. అకట ! భానిస యగుటకు నతిశయించుఁ
గాదె యొక్కనివశమునఁ గాలమెల్లఁ
గడపు నిల్లాలి బ్రతుకు నిక్కముగ, నాడు
జన్మ మధమాధమము కాదె జననియెందు. 3౯౨

వ. మున్నుత్తానపాదాత్మజుండును ధ్రువుని తమ్ముండును నుత్తముం డును సర్వధర్మజ్ఞుండును నగు నృపాలుం డొకండు పతిభక్తిపరా యణయగు తనభార్య ననపరాధ నరణ్యమ్మున విడిచెనని వినమె కావున, 3౯3

చ. తరుణికి భర్త పొందిదు ముదమ్మున కంటెను గష్టమెక్కడ
ప్పురుషుఁడు కాలధర్మమును బొందినచో విధవాత్వ మెంతయున్
భరమగు నారి కేగిన నపారమగున్ విరహాగ్ని యిట్లు వం
దురుటయు నొక్క సౌఖ్యమె మనోగతి చిక్కఁగఁ బట్టుటొప్పదే.

వ. అను నామె నిశ్చయంబు మరల్ప నేరక జనని చిన్నవోయినమన మ్మున నృపాలునికడ కరిగి యంతయుం దెలిపిన నతండును నొఁగా దనక సమ్మతించినవాఁడునుం బోలె మిన్నకుండె నంత నక్కన్నె మిన్నకుఁ గొండొకకాలమ్మునకు జవ్వనం బంకురించినఁ జెలికత్తి యలెల్ల మెల్ల మెల్లన వివాహమ్మునంగల సుఖమ్ములు బోధించి యొప్పింప నుంకింపుడు నప్పడఁతి యెప్పాట నొప్పదయ్యెఁ బదం పడి యొక్కనాఁడు, 3౯౫

చ. కుసుమిత కుంజపుంజములకు న్నెలవై తగు పూలతోఁట కే
గి సఖులుఁదాను నుయ్యెలలఁ గ్రీడలొనర్చుచుఁబూలుగోయుచున్
గిసలయజాలముల్ పుణికి గీటునఁ బుచ్చుచుఁ గేళికూళులన్
బిసరుహకాండముల్ చిదిమి వేయుచు నిట్లు చెలంగుచున్నెడన్.

క. కోసల దేశాధీశుం
డా సరణికి నొక్కఁడగుచు నరుదెంచెఁ గళా
భాసురుఁడు వీరసేనుఁడు
దాసజనులు కొందఱు తన దాపున మెలఁగన్. ౩౯౭

వ. రథారూఢుండై దవుదవ్వుల నరుదెంచువాని మదనసుందరు నా
రాజును దూరదూరమ్మున నరుదెంచు సైన్యముం గాంచి చెలి
కత్తెలయం దొక్కరిత యమ్మందోదరి కిట్లనియె. ౩౯౮

క. కనుఁగొంటివె యల్లదె దై
వనియతి నొకరాజసుతుఁ డపరమన్మథుఁడీ
మనయున్న తెరువునకు రా
గ నున్నవాఁ డతని చెలువు గా దనవశమే. ౩౯౯

వ. అని వచించునంతన యంతంత నరుగుదెంచి యన్నృపాలుండు
పుత్త్రడిబొమ్మం బోనిదాని నమ్మందోదరి వీక్షించి విస్మయా
విష్టుండై రథంబు డిగ్గి దగ్గఱకుం జని యొక్కరిత కయ్యంగనం
గేలఁ జూపి యిట్లనియె. ౪౦౦

క. ఈలలితగాత్రి యీమధు
రాలాపిని యెవతె, యెవ్వఁ డగు నొకో ధరణీ
పాలుం డీచెలి జనకుఁడు
వాలాయము నాకుఁ దెలుప వలయు మృగాక్షీ. ౪౦౧

వ. అనవుడు సైరంధ్రి 'నరేంద్రా! నీ వడిగినదెల్లఁ జెప్పెదం గాని
మునుమున్న నీవృత్తాంతంబు విన వలతు' నావుడు 'లతాంగీ!
కోసలంబను దేశం బొండు గల దద్దానికి నే నాయకుండ నా
పేరు వీరసేనుండు మార్గ వశమ్మున నరుదెంచుచుఁ దోవ దప్పి

యిమ్యోడ కరుదెంచితి దాదవ్వుల సైన్యంబును రాఁగల' దన
వుడు సైరంధ్రి యిట్లనియె. ౪౦౨

క. మందోదరి యనఁదగు నీ
సుందరియుం జంద్రసేనసుత యీయెడ కా
నందమునఁ గ్రీడసల్పెడి
దందడిఁ జనుదెంచె నాఁగ ధరణిపుఁడనియెన్. ౪౦౩

క. సైరంధ్రి! నాకు మీచెలి
పై రాగము పుట్టె ధర్మపత్నిగఁ జేయం
గోరెద నీచాతుర్యో
దారత కిది పెద్ద గాదు తలఁపు వోడమినన్. ౪౦౪

వ. నా కింతకుమున్ను వేఱొకభార్య లేకుంటం జేసి మీచెలియ
పట్టమహిషిగాఁదగుఁ జిరమ్మునసుండి యే ననురూపశీలవయో
గుణభాసురయగు కన్నియ నన్వేషించుచున్నవాఁడ నేటికి
దైవమ్ము సమకూర్చె నని వెండియు, ౪౦౫

గీ. ఏఁ గకుత్థ్సకులోద్భూతి నింపు గన్న
రాచకొమరుఁడ నిట్టి నా రాణ నెఱిఁగి
తండ్రియైనను నాకిడఁ దక్కువాఁడె
వల నెఱిఁగి చేయు మిందు నుపాయ మనుడు. ౪౦౬

శా. ఆసైరంధ్రి లతాంగి కిట్లనుఁ జెలీ! యీరాజుఁ గన్గొంటె! నీ
కౌ సౌందర్యము పేర్మిఁ బ్రాయమున విద్యాబుద్ధులం దెల్ల నా
రాసూనుండు కరంబు నీయెడలఁ దా రాగిల్లె నవ్వాని వి
శ్వాసార్హుం బతిఁ జేసికో లుచిత మీ చందంబు నీ కొప్పదే.

క. నీవైరాగ్యపుఁ జందం
బేవము పుట్టింప జనకుఁ డెంతయు వగకుం
దావలమై వందురు నా
భూవిభు నిప్పాటఁ దేల్పఁ బోలదె నీకున్. ౪౦౮

వ. అతఁ డెల్లవేళల మమ్ముం గాంచి మీచెలికత్తియకుఁ గఱదలు
కలిపి పరిణయమ్మున కియ్యకొలుపుఁ డని విసువక వచియింపు
చుండు నింతదనుక నిన్నుం బ్రబోధింప నేర మైతి మియ్యది తగు
వల నగుటంజేసి చెప్ప వలసి వచ్చె నని మఱియును, ౪౦౯

గీ. వ్రతము లెన్నేని భర్తృపరతఁ దవిలి
చేరి శుశ్రూష యెడపక చేయుదానిఁ
బోలఁజాలవు విను మట్టి పూవుఁబోఁడి
యరుగు స్వర్గమ్మునకు నిక్క మందు బుధులు. ౪౧౦

వ. నావుడుఁ గోపించి యామందోదరి సైరంధ్రి కిట్లనియె. ౪౧౧

ఆ. వె. సిగ్గు లేక నన్నుఁ జెనఁటిచందమ్మున
నరయ నంతఁ జులుక నైతి నోక్కొ!
తపము చేసికొనెడి తన్వికి నా కేటి
భర్త! పొ మ్మటంచుఁ బలుకు మతని. ౪౧౨

వ. నావుడు సైరంధ్రి మెల్లన నిట్లను నమ్మా! కాలం బెప్పుడు
నొక్క చందమ్మున నుండదు, మన్మథుండు దుర్జయుండు, నా
పలుకు లంగీకరింపనినాఁడు నీకు నాపద ఘటిల్లక తీర దనవుడు
రాజపుత్రి యిట్లను,

ఆ. వె. ఎంతయేనిఁ జెప్పు మేను వివాహ మం
గీకరింప వచ్చుకీడు తొలఁగఁ

జేయ నెవరితరము చెలియరో ! దైవ వ
శంబు తప్పఁ జేయఁ జనునె నీకు. ४०४

వ. ఇట్లు వైరాగ్యమ్మున నీడంబోక పుయిలోట దక్కి యాసడిం
చిన సైరంధ్రి వీరసేనుం జూచి, ४०५

గీ. ఎన్ని చెప్పిన వినసేర దీ లతాంగి
గుణగణాఢ్యుండు కాకుత్థ్సకులుఁడు మిగుల
రూపసి యటంచు నొక్కి నీయాశ దెలిపి
విసివితి నిఁ కేమి సేయుదు వెడలు మధిప. ४०६

వ. నాఁడు నృపాలుండు విమనస్కుండై తనయంత నరిగెఁ బిమ్మటఁ
గొంతకాలమ్మున కమ్మందోదరి చెలియ లిందుమతి యనుదానికిఁ
దండ్రి స్వయంవరమ్మునఁ బెండ్లి సేయం దలంచి చాటం బంచిన
నప్పురంబున కఖిలధరాకాంతు లరుదెంచి మంటపమ్మున వలయు
నెడల వసియించి రం దొక్కరునిఁ దనకనుగుణుఁడగు రాసూను
నయ్యిందుమతి వరియించి కృతకృత్య యయ్యె. ४०७

క. మందోదరి యాపెండిలి
చందము వీక్షించి యందెసఁగు నృపతులయం
దందమునఁబొల్చు విటు శఠు
నిం దగఁగని కలఁగి దైవనియతి వరించెన్ ४०८

వ. ఇట్లు కలంగి మదనవేదనాదోధూయమానయై తండ్రికిఁ దన కోరిక
తెలుపం గెఱింగించిన నతండును సంతసించి తగుఁదగదనక యతనిని
గారవించి యథావిధిగ నక్కూఁతు నిచ్చి పెండ్లి యొనర్చి పారి
బర్హంబొసంగి వీడ్కొల్పె ; నాచారుదేష్ణుండును మందోదరీసహి
తుండై సంతసమ్మునఁ దనపురి కరిగి యవ్విలాసినితో వివిధోప
భోగమ్ములం బొద్దుపుచ్చుచు నొక్కనాఁడు, ४०९

క. తనదాసితోడఁ గామ
ముననఁ గ్రీడాగోష్ఠి నున్నపోంకము తదా్ర
డ్త్రనయకు సైరంధ్రిఁ గనుం
గొనిచెప్పెన్ దాన మిగులఁ గోపన యగుచున్. ౪౨౦

వ. వా రిరువురం బట్టికొనఁదలంచి రంధ్రిం బరయుచు నంత నొక్కెడ నేకాంతమ్మునఁ గ్రీడించువారి వారిం గాంచి యిట్లు చింతించె.

గీ. అక్కటా ! శఠుఁడంచు మున్నరయనేర
నైతిఁ గడుఁ జెట్ట చేసి యీాయధము వంచ
నం బడితి నిట్టి నిర్లజ్జునిం బతిగ గ్ర
హించి జన్మమ్మునకు హాని నించుకొంటి. ౪౨౨

క. అని యుమ్మలిక మనమ్మునఁ
బెనఁగొన నిఁక నిట్టివానిఁ బెంపేది హృదీ
శునిఁగాఁ గొని ప్రేముడి నిం
చిన కంటె నఘంబు చెట్ట సేఁతయుఁ గలదే. ౪౨౩

మ. పతిసంగంబు పరిత్యజించి మృతికై పాటింతునో ! దాన సం
గతపాపా నాత్మవధోద్ధితం బయినబల్ కాలుష్య మల్లాట మ
త్పితృగేహమ్మున కేగుదెంతునో ! సఖుల్ పీడింతు రెగ్గించి దు
ర్మతినై యింతటిచేటు దెచ్చుకొని మైమైఁ బోవఁగా దీటునే.

క. పొరిఁబొరి సంతాపము పొం
పిరిపోవఁగ నిట్లు వగలపెల్లునఁ గడు వం
దురి తుదకు నచట నుంటయ
పరమోత్తమ మంచు నెంచి పతిసంసర్గన్. ౪౨౫

వ. విడిచి వ్రతపరాయణవై పశ్చాత్తాపమ్మునం గుందుచుండె నట్లు
గావున, ౮౨౬

—* దేవీ మహిషాసుర యుద్ధము *—

ఆ. వె. ఇపుడు నన్ను నిట్లు లెడఁజేసి పిదపఁ గా
మార్తి దొడరెనేని నధమునొక్క-
శఠు వరించి వాని సంసర్గమునఁ బ్రోపుఁ
దక్క-నేల వినుము తలిరుఁబోఁడి. ౮౨౭

చ. అనవుడు దేవి కోపమున నమ్మహిషాధముఁ జూచి పల్కు-దు
ర్నయ! వివేక మేది పలవింపక సంగర మాచరింపు లే
కునికి రసాతలం బరుగు మొండొక రీతి పొసంగ దెంత చె
ప్పిన విననేర కూరకయ పేరెదు వీటఁడివే తలంపఁగన్. ౮౨౮

గీ. జన్మమెఱుఁగని నా కిట్లు జన్మలబ్ధి
రూపమెఱుఁగని నా కిట్లు రూపలబ్ధి
గలుగు దుష్టుల వధియించు కారణమున
నిక్క- మమరహితమ్ముగ ని న్నడంతు. ౮౨౯

వ. కావునఁ బాతాళమ్మున కరుగు మొండె ధనుర్ధరుండవై సంగరం
బాచరింపు మనవుడు మహిషుం డక్షీణక్రోధరూపాత్ముండై,

ఉ. కర్ణముదాఁకఁ జాపమును గాఁడఁగ లాగి శరమ్ములన్ రయో
దీర్ణత నేయ నంబ వెనుదీయక యంతరమంద యన్నిటిన్
జూర్ణము చేసె నిర్వురకుఁ జూపఱు భీతి మునుంగ నిట్లు సం
పూర్ణరణంబు వాటిలె నపూర్వము ఘోరమునై పొరింబొరిన్.

వ. ఇట్లిరువురుం బోరాడుచుండ నంతరమ్మున దుర్ధరుం డరుదెంచి
యుంబం దలపడి, ౮౩౨

క. కొన్ని శరమ్ములు నించినఁ
దన్నించుని మెడలఁ గనలి దారుణ శరపా
ళి న్నిగిడించిన వాఁడును
దన్నికొనుచుఁ జచ్చి పడియె ధర శృంగ మనన్. ౪౩౩

ఆ. వె. వానిచావుఁ జూచి వగ గూరఁగఁ ద్రిణేత్రుఁ
డరుగుదెంచి దేవి నస్త్రసప్త
కంబుఁ జొనిపి నొంపఁగా వాని నయ్యంబ
యంతరాళమునన యడఁచివైచి, ౪౩౪

వ. త్రిశూలమ్మున వానిం బిల్కుమార్చ నద్దానికి సైఁపక యంధ
కుండు గోపమ్ము పిరిగొనం దాఁకి, ౪౩౫

మ. గద చేఁబూని గజారిమస్తకముపై గాఁడంగ నేయంగ న
య్యది క్రోధాకులమై వెసం గడఁగి తీవ్రాస్త్రమ్ములం బోని బె
ట్టిదపుం గోరులఁబట్టి చీల్చి కడు గోండ్రింపంగఁ దన్మాంస ము
గ్రిదశం దాఁ దినియెన్ సురారులకు భీకంపంబు సంధిల్లఁగన్.

మ. అటు లయ్యంధకుఁ డీల్గఁ గిన్కమెయి నయ్యశ్వారి తీక్ష్ణాశుగా
ర్భటి రోదోంతరమెల్లఁ గప్పుచు రణప్రారంభుఁడై మించు న
ప్పటి యత్యాహిత మాఁగ నజ్జనని యప్పాపాత్ముపై నొక్క మి
క్కుటమౌ పెన్గద వైవ దానఁ బడె సోఁకు న్మూర్ఛమై వ్రేల్మిడిన్.

క. అంతంత లేచి దానవుఁ
డంతకుఁడై గదనుఁ బూని హార్యక్షుం బొ
క్కింత గువలువడ నేసిన
దంతిపయిం గవియునవ్విధం బడరంగన్. ౪౩౮

చ. ఖరనఖరావళిం బొదివి గ్రక్కదలన్ బడఁ జీల్చె నంత నా
హరిరిపుఁ డార్చి తాను హరియై సరియైన పరాక్రమక్రమో
ద్ధురనఖరాళి నుక్కఱఁగఁ దోడన వ్రచ్చిన దాని కల్గి శాం
కరి ఫణిరాణ్ణిభంబులగు కాండపరంపర నిండఁ జెండినన్. ౪౩౯

మ. హరిరూపంబుఁ ద్యజించి యమ్మహిషుఁ డేనై వేగఁ దానొక్క భూ
ధరశృంగంబు కరంబునం బొదివి క్రోధం బెక్క బిట్టార్చి శాం
కరిపై నేయ శిలాశితమ్ములఁ గనత్కాండమ్ములం ద్రుంచె న
గ్గిరిశృంగం బొకయింత యింతగ సురల్ గీర్తించి యగ్గింపఁగన్.

ఉ. తోడన యార్చి సింగ మెదఁ దోప మెలర్పఁగఁ గుంభపాళి నా
రూఢిగ మించి కీడ్వటిచి రూక్షనఖంబుల వ్రచ్చివ్రచ్చి వేఁ
టాడఁగ రక్కసుండు శరభాకృతిఁ దాల్చి మరల్చినన్ సురల్
పోడిమిఁ దక్కి రంబికయుఁ బ్రోవఁ జేసె శితాస్త్ర సంహతిన్.

వ. అంత నా శరభాకారుండగు మహిషుండును, ౪౪౧

ఉ. తుండమునం గడుం బొడిచి తోడన పుచ్ఛముఁ జట్టి భూమిభృ
న్మండలముం బెకల్చి యొకమాత్రన బంతులు ఱువ్వపోల్కి న
చ్చండిపయి న్నిగుడ్చుచు హసన్ముఖుఁడై యెలుఁగెత్తి విక్రమో
ద్దండత మిన్ను ముట్టఁగ మదమ్మున నజ్జగదంబ కిట్లనున్. ౪౪౩

మ. మదముం ద్రిప్పఁగలేక నా పలుకుల న్మన్నింప కీరీతి బె
ట్టిదపున్ సంగర మియ్యకొంటివి ననున్ డీకొంట నీబోఁటి యాఁ
డుదియు న్నేర్చునె! యిందుఁదొట్టి సురలాటోపంబు వాటిల్ల ర
య్యది నీకుం దెలియంగ లేదొ, వినవో యస్మత్ప్రతాపస్థితుల్!

చ. నినుఁ బురికొల్పినట్టి సురనేతృముఖామరులెల్లఁ, మేల్మిఁ ద
క్కనని వధించి నాదు భుజగర్వము దుర్వహమై జగమ్ములం
దనుకఁగఁ జేయుదున్ వెనుకఁదారక నిల్వుము నాఁగ వానిక
జ్జనని వచించుఁ గోప మొకచొప్పు మెయిన్ గనుపట్ట నవ్వుచున్.

ఉ. తత్తఱపాటు మాని తగు దర్పమునన్నిలుమిష్ట మాధవిన్
హత్తిన వేడ్కఁ ద్రావి సురలందఱునుం గొనియాడ దుర్మదో
న్మత్తుని నిన్నుఁ జంపెద రణమ్మున నంచు సువర్ణపాత్రి మా
యత్తము చేసి త్రావెఁ దగ నాసవముం జల ముప్పతిల్లఁగన్.

క. ద్రాక్షాసవపానం బిటు
లక్షీణగతిం బొనర్చి యయ్యంబిక బల్
దక్షత మెఱయఁగఁ దా హా
ర్యక్షారావం బొనర్చె నసురులు బెగడన్. ౨౨౭

క. జయ పెట్టుచు నమరులు పే
ర్మి మెలర్పఁగఁ బూలు గురియ మేకొని జగదం
బయు మహిషు నెదిరి పోరెన్
హయారియు ననేకమూర్తు లందుచుఁగడఁకన్. ౨౨౮

చ. కపటపుఁబొండ్లిలిన్ మెఱసి కావలుఁడై పలుమైల నంబణో
నపగతభీతిమై నని నహంకృతిఁ జూపఁగ వాని కల్గి చం
డి పెలుచ శూలముం గొని కడిందిగ వక్షము నందు నాట మూ
ర్ఛపడి హయారి యంతట వెసన్ బునరుద్గతుఁడై మహోద్ధతిన్.

శా. చాముండం దన పాదఘాతముల నుచ్చైర్నాదపూర్వమ్ముగా
నామైఁ దన్ని హాసన్ముఖుం డగుచు శంఖారావముం జేయ ను

ద్ధామకోద్ధపరీతయై జనని హస్తంబందుఁ జక్రంబు ని
స్సీమారంబు ధరించి యుద్ధతిమెయిన్ సింహారవంబొప్పఁగన్.

ఉ. ఓరిమదాంధ ! చక్రి మిది యోడక నీదు శిరంబు దీసి దు
ర్వారత నయ్యమాలయనివాసము నీకొనరించు నెమ్మెయిన్
బోర నొకింత నిల్వు మని భోరన నెత్తురు మీఁది కొల్కఁ న
వైరిశిరమ్ముఁ ద్రుంచినఁ గబంధము భూధ్రము నా భువింబడెన్.

మ. సురలెల్లన్ జయవెట్ట నమ్మహిషుఁ డచ్చోఁ గూల సింగంబు దు
ర్భరవేగమ్మునఁ బాఱుసేనల వెసన్ భక్షించి నిశ్శేషతం
బొరయం జేసెను గొంద ఱందుఁ జని రేపుం దక్కఁ బాతాళ మి
క్కరణిన్ దేవి యొనర్ప దేవతలు వేడ్కం జేతులన్ మోడ్చుచున్.

—* ఇంద్రాదులు దేవిని నుతించుట *—

వ. అయ్యంబికం గని యిట్లు సన్నుతించి " రో యంబా ! సృష్టి
స్థితిలయకారిణివై కీర్తిమతి స్మృతిగతికరుణాదయాశ్రద్ధాధృతి
వసుధాకమలాజయాపుష్టికలావిజయాగిరిజాతుష్టిప్రమా విద్యా
క్షమాదికంబులు నీవయై మెలంగుదు వీ యీ శక్తుల సాహా
య్యమ్మునం జేసి వారువారు తత్తత్కార్యమ్ములకు సమర్థు
లగుచుందు రది యెట్లనిన, నీవు ధారణవై యుండవేని నాగ
కూర్మమ్ము లిద్ధారుణి ధరించుటయు నీవు పృథివివై చెలఁగ
కున్న నంబరంబు నిలుచుటయుం బొసంగ దిట్లుండఁ గొందఱు
హరిహరప్రముఖులమగు మమ్మెంతయు నారాధింతురు. వారు
మూఢు లనుట కేమి సందియంబు ? జన్నం బొనర్చువారు చేయు
హోమమ్ములెల్ల నీవు స్వాహవై యుంటం జేసియకదా మాకు
ముట్టుచున్నయవి. కావునఁ జరాచరాత్మకంబగు ప్రపంచంబున
కెల్ల భుక్తిముక్తిప్రదాయినివగు కతన నితరులట్ల మమ్మునుం

బాలించుచుండు విధి యిట్టిదయేని రక్కసులిట్లుక్కు మిగులు చూడ వారల మూలచ్ఛేదం బొనరింపకుంట లోకమ్మున మహారణ్యంబులం బుట్టిన కటువృక్షమ్ములఁ బలాశరహితమ్ముల నేనియు నుత్తములగు వారు ఖండింపక మిన్నకుండుట వంటిది. కరుణారసనియతవగు నీ వొక్కొక్కయెడ రణాంగనంబుల శితశర పరంపరలం జేసి యొరుల శిక్షించుటకుఁ గతంబు వారలకు దేహాంతరప్రాప్తిం జేసి యందు సురాంగనాకేళీముఖసౌఖ్యం బొడగూర్చుట కని యూహింపనయ్యెడి. దేహరహిత వయ్యును రక్కసుల నుక్కడంప నయ్యాయికాలమ్ముల దేహంబు గైకొంట క్రీడామాత్రంబయగు నిట్టి యమేయప్రభావవగు నీవుండ ధూర్తులును బురాణచతురులును నగు కొందఱు హరిహరాదుల సేవింప వలయునని విధించుట యసమంజసంబు గాకుండు నొక్కొ! జగజ్జననివగు నీకు వశులమై యిట్లు రాక్షస బాధల నీఁగుచునుండు మమ్మెవ్వరు పూజింప నెంతురు వారు కరమ్మున దీపంబు గలిగియుఁ గూపమ్మునఁ బడువారిలో నొక్కరు గాఁదగుదురు. నీవు విద్యావిద్యాస్వరూపిణి వగు కతన మోక్షార్థులకు గతివై యుండుదు గావునఁ ద్రిమూర్తులును భవత్పాదపంకేరుహంబు భజింతు రిట్టి నిన్నుఁ గొందఱు మూర్ఖులు భజింపనేరక భవసాగరమ్మున బ్రుంగుడువడి నవయుచుందురు. తల్లీ! యింతేల? నీవు వాగ్దేవతా స్వరూపిణివై వక్త్రమ్ముల వసియింపవేని హరిహరాదులగు సురలు గాని మానవులు గాని యెట్లు ముఖరితవక్త్రులగుదురు? ౧౫౩

మ॥ భృగుశాపమ్మున మీనమై కమఠమై పెంపేది కోలాకృతిం
దగి సింగంబయి వంతలంబడి యశక్తప్రక్రియం బొల్చి ధు

ర్భగుఁడై యుక్కివపుంగతిఁ మెలఁగు నప్పద్మాక్షు సేవింప మృ
త్యుగతంబైన భయంబు రూపఱునె, సంతోషంబు వాటిల్లునే ?

క. ఎవఁడు భృగుశాపమున వన
సవిధమ్మునఁ దనకు లింగసంపాతముగా
నవసెనొ తాదృశుఁ డగు నా
శివునిఁ సేవింప సౌఖ్యసిద్ధులు కలవే ? ౪౫౫

గీ. అట్టి హరునకుఁ గొమరుఁడై నట్టి గజము
ఖుని గణాధిపు సేవించి కోర్కివడయ
నెంతు రతిమూర్ఖు లంబ ! నిన్నెఱిఁగి కొలువ
రాదొకో, కార్యసిద్ధిసంప్రాప్తిహేంబె. ౪౫౬

వ. అని వెండియు,

చ. అరిజనతఁ వధించుట కృపాకులతన్ నిరయంబు మాన్పి ని
ర్జరభువనం బొసంగుటయ సమ్మత మంచు వచించుఁ నంబ ! నీ
చరిత మెఱుంగ లేరు హరసారసలోచనముఖ్యులైన ; నొం
డొరువు లెఱుఁగువారె భవదుజ్జ్వల మోహవశంవదాత్ములై.

గీ. వేదముల నెన్నియేని భావింత్రుగాక
కొంద ఱజ్ఞులు మునులు నీచంద మెఱుఁగఁ
జాలమిని సూర్యుఁ గొల్తు రా జ్వలనుఁ దలతుఁ
రాగమమ్ముల సారంబు నరయఁ దరమె. ౪౫౭

చ. స్వరచితముల్ శ్రుతుల్ గఱపి సారససంభవముఖ్యదేవతా
వరుల కనుత్తమత్వము నవారణ బోధ యొనర్చి వ్యాజదు
ర్భరత మెలఁగుచున్ జగము వంచనచేసెడి వారి నీవు పే
ర్మురసమునం గనుంగొనెదు మాయికులంచుఁ బ్రసిద్ధిదెచ్చుచున్

క. రాఁదగు కలియుగమున జగ
దాదిశ నిను డాఁచి సుకవు లంబరో ! నీ వా
పాదించిన సురగణముఁల
నాదరముమెయి న్నుతింతు రయ్యాయి విధులన్.

క. మును లెవ్వరు పరవిద్యన్
జనని న్నినుఁ దలఁతు రట్టి జ్ఞానులు గర్భ
మ్మునఁబడక నిన్నుఁ జెంది సు
ఖనియతి వర్తింతు రెల్లకాలము తల్లీ. ౧౯౧

క. కేవల పరమాత్మయు నీ
తో విరహితుఁడై యొకింత దొడరఁగఁ జాలం
డావిభుఁడు నీదు చిచ్ఛ
క్త్యావిర్భావమునఁగాదె యట్టిందగుటల్. ౧౯౨

వ. అట్లు కాదేని జడమ్ములగు తత్త్వమ్ములును గుణకర్మయుతమ్ము
లగు నింద్రియమ్ములును జిద్విరహితమ్ములై తత్తత్కృతుల కెట్లు
సమర్థమ్ములగు ? సర్వమ్మును సృజించి సమయమ్మునఁ బాలిం
చుచు హరించుచుండు నీ మహామహిమంబు మాక కాదు హరి
హరాదులకు సయిత మగమ్యంబై యుండు. ౧౯౩

శా. లోలాత్ముండయి దుష్టుఁడై త్రిజగతీలుంటాకుఁడై యొప్పు దు
శ్శీలుం గాసరరూపు నీ తులువ నిర్జీవుం బొనంగించి మ
మ్మేలంజొచ్చిన నీ మహామహిమ మింకేమంచు వాకుత్తు మం
బా ! లీలాజితదుష్టదానవకదంబా ! సత్కదంబాలయా. ౧౯౪

క. మాకార్యము సేతయ కా
కాకల్పంబైన కీర్తి యలవడ నీ కీ

లోకాపకారిదానవుఁ
బోకార్చినకతన విపులముగ జగదంబా. ౪౬౫

వ. అంబా! మమ్మెల్లవేళలఁ గృపాకలితవై యిట్లు పాలించుచు నేడు గడవై యుండం బ్రార్థింతు" మనవుడు మహిషాసురమర్దని వారల కిట్లనియె. ౪౬౬

క. సురలార! కార్య మొం డిపు
డరయంబడెనే నిఁ దెల్పుఁ డది తీర్చెద దు
ష్కరమేని మీకు నాపద
వారసినయపు డెల్ల నన్నుఁ బోలుఁదలంపన్. ౪౬౭

చ. అనవుడు దేవతల్ ప్రణిహితాంజలులై జగదంబఁ గాంచి యి
ట్లనిరి భవత్పదాబ్జ మనయమ్మును గొల్చెడియిచ్చ మాకు ని
చ్చినఁ బదివేలు వేఁబోకటి చేయఁ గొలంతయు గల్గనే రసా
యన మగు నీదుపల్కు మహిషాసురమర్దని! లోకవర్ధనీ. ౪౬౮

వ. ద్విసువర్ణ సంవృతంబగు నీ దేహమ్మున నపరాధసహిష్ణుండు తృతీయుండు లేఁడు గావున సఖీభూత వగునిన్ను విడిచి జీవుం డొన ర్చెడి దించుకయు లేదు. పాపాత్ములు దుష్ప్రాపంబులగు సురాసురమనుజయోనులం బుట్టియును నిన్నెఱుంగఁ జాలరు సుఖమ్మున నొండె దుఃఖమ్మున నొండె నీ చరణంబులు దక్కఁదక్కటి శరణము లే దని మనోవాక్కాయ కర్మమ్ములం ద్రిశుద్ధిగ వచియించు మమ్ముం దయాంతరంగవై పాలించుభారమ్ము నీదై యున్నయది యను నమరులందఱుగతి వీడ్కొలిపి యంతర్ధానంబు చేసె ననుసాత్యవతేయునకు జనమేజయుం డిట్లనియె. ౪౬౯

సీ. దురితంపు సంసృతిఁ దొలగించు సదుపాధి
సజ్జనకర్ణరసాయనంబు
పటుతరామయభారపాషాణటంకంబు
భక్తలోకైకకల్పద్రుమంబు
సుఖకరశ్రీలోకసోపాననిశ్రేణి
సంపత్కదంబపర్జన్యఋతువు
కాతరీకృతభూతబేతాళనిచయంబు
సకలరక్షస్సముచ్చాటనంబు

గీ. చారులీలాకదంబసంచారభూమి
తనుతరేతరమోదసంధాయకంబు
హరిహరవిరించిముఖ్యదేవావధృత్య
ధీయమానంబుగాదె! శ్రీదేవిచరిత. ౪౭౦

వ. ఇట్టి చరిత్రంబు కృతజ్ఞుం డెవ్వండు విననోపండని వెండియు,

ఉ. ముందటి జన్మమందెవఁడు మోదవిధాయిని యైన దేవి కిం
పొందెడి భక్తిఁ బూజలిడునో కృతకృత్యుఁ డతండు భోగి యా
నందియునై ధరాతలము నాల్గుచెఱంగులు నేలఁ జాలు న
స్పందితకీర్తిశాలియగు పార్థివుఁడై జనియించు మీఁదటన్.

ఉ. అంబ నెఱుంగఁజాలువినయంబు వివేకము లేని పెక్కులూ
యఁబులు వచ్చునట్టి జననాంతరమందు రుజాభిభూతిమైఁ
బంబిన దుఃఖవేదనలఁ బొల్పడి రిక్తతఁ గాంచి కట్ట వ
స్త్రంబు భుజింపఁ గూడు గొనఁజాలక సంతతి లేక కుందదే.

క. కావున నిఖిలార్థదమై
పావనమై ముక్తిదమయి భద్రప్రదమై

కోవిదమాన్యం బగున
ద్దేవీచరితంబు నాకుఁ దెలుపంగదవే. ౪౭౪

గీ. అమరరిపుఁడైన మహిషుఁ దునిమినమీఁద
నంబ యెచ్చటి కేగె, నే మాచరించె ?
నేవిధమ్మున వర్తించె ? నిదియు విస్త
రించి వలతు నెఱుంగ నా కెంచిచెప్పుము. ౪౭౫

—* దేవ్యంతర్ధానోత్తరవృత్తాంతము *—

క. అనవుడు సాత్యవతేయుం
డను జనవర ! మున్ను హరిహరాదులు స్త్రీత్వం
బును గొని రెయ్యెడఁ నయ్యెడఁ
జనియె మణిద్వీపమునకు జగదంబ వెసన్. ౪౭౬

వ. పిమ్మట నమరులు జగదంబ వీడ్కొలిపి యమ్మహిషురాజ్యమ్మున రవివంశసముద్భూతుండును నయోధ్యాపతియునగు శత్రుఘ్నుం డనురాజు నభిషిక్తుం జేసి తమతమ పొందుపట్లకుఁ జనిరి. శత్రుఘ్నుండును యథోక్తంబుగ రాజ్యంబు శాసించుచుండు నెడ,

సీ. నెల మూఁడువానలు నియతిమైఁగురియుచు
ధనధాన్యములకల్మి తఱుగకుండు
ఫలపుష్ప సంపత్తిఁ దులదూఁగువృక్షముల్
వట్టనిజలముల వఱలునదులు
కుండలకొలఁదిగా గోవులు పాలిచ్చు
ద్విజులు శ్రుతిస్మృత్యుక్తవిధినిఁ జరింతుర్
నృపు లస్త్రవిద్యల నేర్పువాటింతురు
పొరపొచ్చెములు లేవు భూతములకు

గీ. అంకుబొంకులు లేక నిరంకుశగతిఁ
బ్రజలు ధర్మానువర్తులై పార్థివాజ్ఞ
మెలఁగుచుందు రతని భూమితలమునందు
నెల్లరు సుమాళముఁనఁ బొల్తురెల్లవేళ. ౪౭౮

ఉ. అన్నరనాథుదేశమున నారసి యెచ్చటఁ జూచెనేనియున్
జన్నపుశాలలా! మఱియు సత్రములా! శుభమంటపమ్ములా!
కన్నులపండువై యెసఁగఁగాఁ దగుచక్కని దేవళమ్ములా!
యెన్నిటఁ జూచినం దనివి యెన్నటికిం గనఁ బోల దేరికిన్.

సీ. పాషండమతము స్వప్నమ్మునఁగనరా ద
ధర్మంబు మొట్టమొదటికి లేదు
మిత్రవియుక్తి యమిత్రవృద్ధియు నప
మృత్యుభయంబు దుర్భిక్షబాధ
మారిమసంగుట మరియాద దప్పుట
రోగంబు దైన్యంబు భోగవిరతి
దాంపత్యవిరహంబు దాంభికత్వంబు చౌ
ర్యంబు పైశున్యంబు రాజకలహ
గీ. మాగమద్వేష మనునవి యరయ మందు
నకును గానంగ రావు తన్నరవరేణ్యుఁ!
డాడితప్పనివాఁడు మహానుభావుఁ
డప్రమత్తుం డతండాఢ్యుఁ డనఁగఁ దగఁడె! ౪౮౦

ఉ. ఆనగరిన్ ద్విజుల్ త్రివిధులై పొలుపొందుదు రందు సాత్త్వికుల్
దానములన్ గ్రహింప రపధర్మములన్ జరియింప రధ్వరం
బేనియు జీవహింసకు సహింపక పిష్టపశుం బొనర్తు ర
మ్మానధనుల్ త్రికర్మముల మన్ననఁ జేయుచు నుందు రాజిటన్.

క. నృపపౌరోహిత్యము క
ర్మపరత విధివిహితమైన మాంసాదనముర్
గృపణతలేమియు నైశ్వ
ర్యపటుత్వము గలిగి యుండ్రు రాజసులందుర్. ౪౮౨

గీ. కించిదధ్యయనము నృపకింకరత్వ
మధికకోపము ద్వేషరాగాభియుక్తి
గలిగి యొకభంగి వర్తింత్రు కర్మబాహ్యు
లగుచుఁ దామసులైన బ్రాహ్మణజనములు. ౪౮౩

గీ. మహిపతులు దానపరులు బ్రాహ్మణనిరతులు
యాగసంసక్తులవనిరతానురక్తు
లస్త్రశస్త్రవిశేషజ్ఞు లనఘమతులు
తెలివిగలవారు కలిమియు బలిమి గలరు. ౪౮౪

క. విడుమరదొడరని సిరియును
నుడుకువ కెడలేనికృషియు నొగి గోరక్షర్
మడపక చేయుట యనునివి
యెడపక చరియింతురందు నెందును వైశ్యుల్. ౪౮౫

వ. ఇట్లుమహిషవధానంతరమ్మున రామరాజ్యంబై ప్రపంచంబు సుమాళమ్మగాఁ గొంతకాలం బుండఁ బిమ్మట జగద్ద్రోహం బొనర్ప సమకట్టిన శుంభనిశుంభులను జండముండులను రక్తబీజ ధూమ్రలోచనులను బరిమార్చి సురపక్షపాతినియై జగదంబ జగమ్ములకు మేలువాటించెనన, వార లెవ్వరేవిధమ్మున వారే కతమ్మున వధించె నుడువుమనుడు రాజునకు ముని యిట్లనియె.

క. మును శుంభ నిశుంభులు నాఁ
జనుదాయవ్వు లిరువురుర్ రసాతలవాసుల్

జనవర ! తపముండి కళన
మున కుదకమునకునుఁ గాక మొరడులభంగిన్. ౪౮౭

మ. పదివేలేం డ్లిటు లాచరించుటయు నప్పద్మాసనుం డేగుదెం
చి దయాంతఃకరణుండు వేడుఁ డన నీచే నొడ్లచే నేరిచేఁ
దుదిలేకుండ నొసంగుదే యనుడు నా దుష్టాత్ములంగాంచి యొ
ప్పుదు వేఁడొండువరంబు గోరుఁడన నవ్వా రంజలిన్ మోడ్చుచున్.

మ. జననం బందినవారికిన్ మృతి యవశ్యంబేని మా కొక్క యం
గనచేఁ దక్క నపాయ మొుండొరులచేఁ గాకుండఁ గానిమ్ము మ
మ్మునెమర్పంగల కాంతయుం గలుగునేఁ హో ! చూతమట్లైన నా
గ నొసంగెన్ వర మట్లుకాక యనుచుం గంజోద్భవుం డొప్పుగన్.

వ. అన్నదమ్ము లిట్లు వరమ్ములం బడసి తమకు భృగువుం బురో
హితుఁగాఁ గైకొని రందు జ్యేష్ఠుండగు శుంభుండు శుభదినమ్మున
సుముహూర్తమ్మున సింహాసనాభిషిక్తుండుగా నిశుంభుండు మంత్రి
యై సకల తంత్రమ్ములు నడుపుచుండె. మహావీరులగు చండ
ముండు లిరువురును సేనాధిపతులై వారిం గొలుచు చుండిరి.
ధూమ్రలోచనరక్తబీజు లనువారు పాతాళమ్మున నుండి వచ్చి
రెం డక్షౌహిణులతో నాశుంభుఁ గొలుచుచుఁ దదనుమతులై
రందు, ౪౮౦

గీ. రక్తబీజుం డసాధ్యసంగ్రామఁ డతఁడు
పోరు నెడ నస్త్రహతిఁ జేసి పొడమునల్ల
పుడమిఁ బడి నంతలో వానిఁ బోలఁజాలు
వీరులుదయింతు రొక్కట వేనవేలు. ౪౮౧

వ. కావుననవ్వానికి రక్తబీజుం డనిపేరు సార్థకంబు మరియు ననే
కులు రక్కసులు చతురంగబలసమన్వితులై యా శుంభుం
గొలువ వచ్చిన శుంభుండును వారల నెల్లర లోఁగొని రాజ్యం
బేలుచుండె నంత నిశుంభుం డొక్కనాఁడు, ౪౯౩

చ. అమరపతిన్ జయింప నమరాలయ మేగిన వజ్రి నిర్జరుల్,
గుమిగొని తోడురా నెదురుకోల్పచరించి దురంబు చేయ లో
కము బెగడొందె నంత లయకాలుఁడు వోలె సురేశ్వరుండు వ
జ్రముగొని యేసె నయ్యసుర వ్రాలెఁ బడల్పడుమూర్ఛ పెంపునన్.

క. చారులు తమ్ముఁడు మూర్ఛం
గూరిన విధమెఱుఁగఁజెప్పఁ గ్రోధాకులుఁడై
ధీరుఁడు శుంభుఁడు సంగ్రా
మారంభుండయ్యె నమరు లటునిటుచెదరన్. ౪౯౪

వ. ఇట్లు శుంభుండు విక్రమించి యింద్రాదుల జయించి, ౪౯౫

చ. అమరపదంబు చేకొని సురారిమయమ్ముగ నేలుచున్ గ్రమ
క్రమమున నష్టదిక్పతులగద్దియలం దనపాలుచేసి వి
క్రమమున మూఁడులోకములు రాజ్యము సేయుచు నందనమ్మునం
దు ముదముమీఱ నచ్చరలతో విహరించె నవార్యచర్యుఁడై.

చ. అనవరతంబు కల్పకసుమాంచితుఁడై, సుధ గ్రోలుచున్ సురాం
గనలఁజెలిన్ దవిల్చి కడుఁ గంటకుఁడై మఖభాగముల్ హరిం
చి నిఖిలదేవతల్ తనదు సేనయకాఁ బచరించి తత్కృతుల్
పొనరుపఁజేయుచు న్నెగడెఁ బొంపిరివోయిన మేటిసంపదన్.

చ. ఒకఁడు జముండు శ్రీదుఁ డింకనొక్కఁడు వహ్నిమఱొక్కఁడింక వే
ఱొకఁడు దినేశ్వరుండు శశియున్ మఱియొక్కఁడు వాయుదేవుఁడిం

కొకఁడు నొకండుపాశి యిటులొక్కొకఁడొక్కొకరుండుగాఁ దదీ
యకృతులు సేయ నేర్పఱిచె నాత్మకు నచ్చిన దానవేంద్రులన్.

వ. అంత నమరులు నిరాలంబులై దానవుల ధాటికి నోడి యర
ణ్యంబు శరణ్యంబుగా గుహలు గృహమ్ములుగా నలందురుచు
నక్కడక్కడఁ బంచబంగాళమ్ముగాఁ జరించుచు సుఖం బెఱుం
గక విమనస్కులైయుండి రని వెండియు, ౪౯౯

చ. నరవర ! కాలపర్యయమనం గడు దుర్భర ; మెంతవారు త
త్పరత సుఖంబు దుఃఖమును దాల్తురు భిక్షుకు రాజుఁజేయు భూ
వరు నతిథిం బొనర్చు బలవంతుని దుర్బలుఁ జేయు దుర్బలున్
స్థిరబలుఁజేయు నయ్యది యజేయము దాఁటగరాదు బ్రహ్మకున్.

ఉ. శూరు లశూరులున్ మిగుల సూరు లసూరులనం గలారె ? యె
వ్వారికి నెన్నియేఁ గతు లవారణఁ గాలముగూర్చుఁ గాక యెం
తే రహి నూఱుజన్మముల నిష్ఠమెయిన్ బచరించి యింద్రుఁడై
పారములేని దుఃఖముల బొల్పడునే ? యటు గానిచో నృపా !

క. హరుఁడు కపాలం బూనుట
హరి నానాతుచ్ఛయోనులందుఁ బుట్టయు
న్నరనాథ ! కాలగతి దు
ర్భర మియ్యది యిట్టి దనుచుఁ బలుకం గలదే. ౫౦౨

ఉ. ఈగతి దేవతల్ వనములే శరణమ్ముగ నేగ శుంభుఁడు
ద్యోగము చేయుచుండె నటు లొక్కసహస్రము నిండె వర్షముల్
భోగములేమి నెంతయును బొల్పఱి యింద్రముఖామరుల్ దివం
బేగతిఁ గొందు మెట్లు వధియింతుము వీని నటంచు నెంచుచున్.

వ. ఒక్కనాఁడు బృహస్పతిం గని మహాత్మా! నీవు సర్వజ్ఞుండ వీ సంకటమ్మున నోనర్పం దగునుపాయమ్మొండు యోజించి సురలం బార మేదింప ననుగ్రహింపుము. మంత్రమ్ములు ప్రభావమ్ము లప్రమేయంబులు తద్బలమ్మున నభిచారహోమం బొండె నిష్టుల నొండెఁ జేయించి మాపదంబు మాకుం జేకూర్పుము నావుడు బృహస్పతి యిట్లనియె. ౫౦౪

ఉ. నల్లవా! మంత్రతంత్రము లనన్ విధిచోదిత రీతిఁ గార్యముల్
చెల్లఁగఁ జేయు నెక్కటిగఁ జేయఁగ నేరవు తత్త్వదాధిప
త్యోల్లసితుల్ సురేశ్వరు లహో! యిటుమీరలు దుర్దశాహతుల్
పెల్లుగ నున్నవార లెటు పెంపిదు నయ్యవి కేవలస్థితిన్. ౫౦౫

వ. అదియునుం గాక యవశ్యభావ్యంబులగు కార్యంబులకుఁ బ్రతీకారంబు లేకుండు నైనను దనకొలఁది నుపాయం బొనర్చుట శిష్టానుమతంబు దైవంబు ప్రధానం బని కొందఱు చెప్పినను దాని నుపాయవాదు లంగీకరింపరు కొంద ఱుభయమ్మునను గార్యసిద్ధి యని నుడువుదురు గావున సర్వంబు నేకం బొనర్చి, ౫౦౬

క. కేవలము దైవము యనక
కేవలము నుపాయమన కొగిన్ బ్రతికారం
బేవెంట నెచటఁ దగు నది
యేవచియించెద నొనర్పుఁ డీరు కడంకన్. ౫౦౭

క. మును మహిషాసురునిం జం
పిననాఁ డయ్యంబ సురలఁ బ్రేముడిఁ గని చె
ప్పిన విధము మఱచితిరె చ
య్యన నజ్జననిం దలంపుఁ డాపదఁ దొలఁగన్. ౫౦౮

—* ఇంద్రాదులు హిమాలయమ్మున కరుగుట. *—

వ. కావున హిమాచలమ్మునకుం జని మనోహరంబగు నప్పర్వతమ్మున నప్పరాంబ మాయాబీజపురశ్చరణం బ్రవర్తించినఁ గార్యసిద్ధియగు నయ్యెడ నప్పరశక్తి యెల్లప్పుడు వసియించు ననియుఁ వింటి నావుడు నిలింపులు తద్గిరిశిఖరమ్మునకుం జని మాయాబీజమ్ము జపియించుచు నిట్లు నుతించిరి. ౫౦౯

—* దండకము. *—

శ్రీమన్మహాదేవి! విశ్వేశ్వరప్రాణనాథే! సదానందరూపే! సురానందదే! తే! నమో, దానవాంతప్రదే! మానవానా మనేకార్థదే! భక్తిగమ్యస్వరూపే! న తే నామసంఖ్యాం న తేరూప మీదృక్తథాకోపివేదాదిదేవాదిరూపే! త్వమేవాసి సర్వేషు శక్తిస్వరూపా, ప్రజాసృష్టి సంహారకాలే సదైవ స్మృతి స్త్వం ధృతి స్త్వం త్వమేవాసి బుద్ధి ర్జరాపుష్టితుష్టీ ధృతిః కాంతిశాంతీ సువిద్యా సులక్ష్మీ ర్గతిః కీర్తిమేధే త్వమేవాసి విశ్వస్య బీజం పురాణం యదా యై స్స్వరూపైః కరోషీహ కార్యాం సురాణాం చ తేభ్యో నమామోఽద్యశాంత్యై క్షమా యోగనిద్రా దయా త్వం వివక్షా స్థితా సర్వభూతేషు శస్తై స్స్వరూపైః కృతం కార్య మాదా త్వయా య త్సురాణాం హతోఽసౌ మహారి ర్మదాంధో హయారి ర్దయా. తే సదా సర్వదేవేషు దేవి! ప్రసిద్ధాపురాణేషు వేదేషు గీతా కి మత్రాస్తి చిత్రం యదంబా సుతం స్వం ముదా పోషయే త్తోషయే త్సమ్యగేవ ప్రసూస్త్వం యతోఽనిర్జరాణాం సహాయాకురు ష్వైకచిత్తేన కార్యం సమగ్రం నవా తే గుణానా మియత్తాస్వరూపం వయం దేవి జానీమహే విశ్వవంద్యే కృపాపాత్ర మిత్యేవ మత్వా తథాఽస్మాన్ భయేభ్య స్సదా పాహిపాతుం సమర్థే! వినా బాణపాతై ర్వినాముష్టిఘా

త్రై ర్వినాశూలఖడ్గై ర్వినాశక్తి దండై రిపూర్ హన్తు మేవాసి శక్తా
వినోదా త్తథా పీహ లోకోపకారాయ లీలా ఇమా శ్శాశ్వతం నైవ
జానంతి మూఢా నకార్యం వినా కారణం సంభవే ద్వా వయం
తర్క-యామోఽనుమానం ప్రమాణం త్వమేవాసి కర్తా స్య
విశ్వస్యధాతా భవే త్సృష్టికర్తా ముకుందోఽవితాయం హరో
నాశకృద్దై ౹ పురాణప్రసిద్ధా నకిం త్వత్ప్రసూతా స్త్రయ స్తే
యుగాదా త్వ మేవాసి సర్వస్య తేనైవ మాతా త్రిభిస్త్వం పురా
నాధితా దేవి దత్తా త్వయా శక్తి రుగ్రాచ తేభ్య స్సమగ్రా
త్వయా సంయుతా స్తే ప్రకుర్వంతి కామం జగత్పాలనోత్పత్తి
సంహారకార్యం త్వదీయాంఘ్రి యుగ్మాశ్రియాః శుంభ దైత్యా
ద్దితాః నిర్జరాః దేవి పాయా స్త్వదన్య న్న తే జానతే దేవి
దుర్గే! నమస్తే నమస్తే నమస్తే నమః. ౧౦

వ. అని వినుతించి వెండియు, ౧౧

గీ. విబుధబృందమ్ములెల్ల నీ వెంట నంటి
యెల్లవేళ నినుం గొల్తు రెఱుకకలిమి
నట్టి త్వత్పదపద్మమ్ము లరసి భక్తి
మననెఱుంగని యతు లతిమందమతులు. ౧౨

గీ. కమలవై కీర్తివయ్యును గాంతివయ్యు
లజ్జవై స్థితివైన జగజ్జనని ని
ను మది భజియింప కకట దంభమున నుందు
వైష్ణవులు సౌరులును బాశుపతులు దేవి! ౧౩

క. హరిహరు లేదుగడగ నీ
బరమాదరమున యజింప వల నెఱుఁగమి నీ

చరణములు విడుచు దుర్మతు
లరయఁగ విధివంచితాత్ము లనఁదగు నంబా. ౨౧౪

క. హరి చతురసముం గొని సా
గరజాపదరంజనమ్ము గావించఁగ శం
కరుఁ డగజాపదపంకజ
పరాగరతుఁ డింక నొరుల వాకొనఁగలదే. ౨౧౫

క. సారవిహీనంబని సం
సారము వర్జించి జన్మసాఫల్యంబుఁ
గోరి నిను యతులు దలఁతు రు
దారంబగు భక్తి కలిమి దాంతహృదయులై. ౨౧౬

గీ. పలుపలుకులేల నీ పదభక్తి లేని
చెనఁటులెల్లను రోగులై శ్రీ దొలంగి
సంసరణకూపమునఁ బడి సౌఖ్యలేశ
మెఱుఁగక నశింతు రఖిలలోకైకజనని ! ౨౧౭

గీ. కట్టియలు మోచికొని గడ్డికట్ట లమ్ము
కొనుచు సేవపు గతిని జీవనము చేయు
హీను లందఱుఁ దొల్లి ని న్నెఱుకకలిమి
గొలువని తులువ లింత నికృష్టమ్ము తల్లి. ౨౧౮

వ. అని పలువిధమ్ముల సన్నుతించు నమరులఁ గరుణించి జగదంబ
ప్రత్యక్షంబుగా నుంకించి, ౨౧౯

ఉ. చక్కనిచీరఁ గట్టి విలసన్మణిభూషణభూషితాంగియై
యెక్కటి నేగుదెంచె సురలెల్లరుఁ జూచి "యిదేమొ, యిప్పు డీ

చక్కెరబొమ్మ గంగ కిటు చయ్యన నాడఁగ నేగుదెంచు నం
చొక్కమొగి న్నమస్కృతుల నొయ్యనఁజేసి తను న్నుతింపఁగన్.

వ. గిరిగహ్వరమ్మునుండి గంగ కేగునెపమ్మున వచ్చి సురలంగాంచి
యిట్లనియె. ౧౭౧

క. ఏమీ దేవతలా! యిం
దేమి పనికివచ్చిరొక్కొ! యీగతిఁ గడుఁ జిం
తామగ్నులగుటకుం గత
మేమొకొ! నా, సురలు జగదధీశ్వరి కెలమిన్. ౧౭౨

ఉ. కేలు మొగిడ్చి యంబ! మముఁ గీడ్వడకుండఁగఁ బ్రోవనెంచు మే
మాలములో సురారులకు నడ్డముగా నిలుపోపలేక మా
చాలమి విన్నవింప నిటు చయ్యన వచ్చితి మేపుదక్కి మా
పాలన నీదికాదె! మును పల్కినపల్కు స్మరింపకుందువే. ౧౭౩

మ. జననీ! శుంభనిశుంభలన్ దనుజు లిచ్ఛామాత్రి మమ్మెల్లఁదా
మనిలో గీటడఁగించి యేలుదురు స్వర్గావాస మాదుష్టు లె
వ్వనికిన్ వధ్యులుగారు బ్రహ్మవర మప్పాటన్ బొసంగించె నం
గనచేఁ జచ్చెద రా హయారిబలె, నేకంజాక్షికిన్ శక్యమా.

క. మాపా టిట్టిది యని నీ
కేపాటం జెప్పనేర్తు మేడుగడయు లే
కాపదలకుఁ బ్రాపై దు
ష్ప్రాపంబగు నడవి నిడుమ పడఁగావలసెన్. ౧౭౫

క. మును మహిషుఁ జంపి పిమ్మట
"ననయులు మిము బాధ పెట్టునప్పుడు నన్నున్

మనమునఁ దలఁపుఁడు కార్యం
బును దీర్చెద " నన్నమాట పొల్లగు నంబా! గీ౨౬

వ. శుంభనిశుంభు లట్లుండ రక్తబీజచండముండు లను వారు గడు మొఱకులై వారికి బాసటగా నున్నవారలు. వేయేల నష్టదిక్పాల కులును నిప్పుడు రక్కసులకా నెఱుంగుము. గీ౨౭

క. అనదలమై నీపాదం
బునఁ బడు మముఁ గరుణఁజూచి పొగరుమిగులు న
ద్దనుజులఁ బరిమార్చక యు
న్నను నిటు లెన్నాళ్లు వనమునం బడుదు మిఁకన్. గీ౨౮

—* దేవి శుంభ నిశుంభుల పురమ్మున కరుగుట *—

వ. ఇట్లు మాటిమాటికి సన్నుతించి వనటంబడు నమరులయెడఁ గరుణ గలిగి యప్పార్వతి తన శరీరమ్మునుండి యిచ్ఛామాత్రమ్మునఁ గౌశికి యను నొక శక్తిం బుట్టించిన నయ్యంబిక నీలవర్ణ యగు కతనఁ గాళిక యనియుఁ గాళరాత్రి యనియుం బరఁగి మహాఘోరాకారంబు గలిగి సర్వకామప్రదయై చెలువారె; నప్పరాంబయు సర్వభూషణభూషితంబగు రూపమ్మునఁ బరిఢవిల్లుచు నమరుల కానంద సంధాయినియై యిట్లనియె. గీ౨౯

ఉ. శుంభనిశుంభులన్ దివిజసూదనులం బరిమార్చి సంపదా
రంభము మీ కొనర్తుఁ దలరం బని లేదిఁక నాకులార! దు
ర్దంభమునన్ జగమ్ముల నదల్చెడి దుష్టులయార్తిఁ జేసి వి
శ్వంభర కింత పుట్టెనె యపాయము బ్రహ్మవరంబు పెంపునన్.

వ. అని యభయంబిచ్చి జగదంబ స్వాంశసంభవయగు కాళిక దనకుఁ బార్శ్వవర్తినిఁగా సింగంబు నధిష్ఠించి శత్రుపురంబున కుద్ద విడిఁ జని యుపాంతోపవనమ్మున విడిసి, ౬౩౧

చ. అమరులు మోదమందఁగ మృగావళి మత్తిలఁ బక్షిబృందముల్
గుమిగొని యాలకింపఁగఁ జిగుళ్ళిగురింప జగంబు మోహవా
ర్ధి మునిఁగి దొప్పదోఁగఁ గడుఁ దియ్యదనమ్మును సొంపు పెంపు నొ
క్కమొగిన యంకురింప మృదుగాన మెలువర్చె ననేకభంగులన్.

వ. పదంపడి యెడనెడ నుపవనమ్ములఁ గ్రీడార్థంబు గ్రుమ్మరు చండ ముండు లిరువురును దద్గానరసంబు కర్ణపేయం బగుటఁ గొంతవడి నాలించి దాదవ్వుల నిలిచి త్రిజగన్మనోహారిణి యగు నంబికను దత్సమీపవర్తిని యగు కాళికను గాంచి పెచ్చుపెరిఁగెడి యచ్చెరువునఁ బురి కరిగి శుంభుంగాంచి మ్రొక్కి యిట్లనిరి.

ఉ. ఎక్కడనుండియో యొక మృగేక్షణ సింగము నెక్కివచ్చె న
మ్మక్క యనన్ వశం బగునె యచ్చెలువంబు వచింప నట్టి ఖల్
చక్కరబొమ్మ ముజ్జగములన్ గనఁగా వినఁగా నెఱుంగ మా
టక్కరి గానవిద్య నొకటందగుఁ దక్కిన వట్టె యుండఁగన్.

క. మన యుద్యానమ్మున న
వ్వనితారత్నమ్ము గాన వైఖరుల దనం
తన మృగముల మెచ్చించుచుఁ
దన కొక చెలి తోడుగాఁగఁ దనరెడివింటే. ౫౩౫

వ. వెయ్యేల భువబ్బాలికారత్నం బెవ్వతెయైనా కల దెఱం గెఱింగి తోడికొని వచ్చి భార్యగాఁ గైకొని సుఖింపు మింతకన్న నీ సంసారమ్మున సౌఖ్యం బొం డుండునే యని వెండియు, ౫౩౬

మ. సరసైరావత పారిజాతములునున్ సప్తాస్యమౌ నశ్వ ముం
బరయానోచితమౌ విమానము సురస్వామిన్ విచ్ఛిన్నించి నీ

పరముం జేసితి వట్టిబల్మిగల సంపత్కామతఁ మేల్మి పొం
పిరివోవం జనునీకు నీయబల నేవేరిం గొనం బోలదే. ౫౩౭

చ. వరుణునిఛత్రి మీవు గొని పాశము తమ్మునికిచ్చి తద్ధనే
శ్వరునిధి చూఱకొల్లగొలిపి సాగర మిచ్చిన నిత్యకాంతివి
స్ఫురదురుపుష్పమాలయు నపూర్వపురత్నములఁ గ్రహించి ని
త్యరుచి వెలుంగు నీకిదిగదా! తగు నెచ్చెలి యెన్నిభంగులఁ.

గీ. డంబు మీఱెడి యమునిదండంబు మృత్యు
శక్తియుఁ బరాక్రమమ్మున సంగ్రహించి
కామధేనువుపాల్గొల్లఁగల యదృష్ట
వంతునకు నిట్టి కాంతతో వలదె పొందు. ౫౩౮

గీ. స్వర్గ మర్త్యాది నిఖిలభువనములందుఁ
గలుగు నిఖిలరత్నమ్ముల బలిమిఁగొనిన
యుప్సరఃకాముకునకు నీ కమర వలదె
యట్టి రత్నముతోడి పొం దెట్టులేని. ౫౪౦

క. నీగృహమునఁ గలరత్నము
లీగజగామినికిఁ దక్కనేనియు రత్న
శ్రీ గొఱఁత చెందు నీతరు
ణీగణరత్నంబు వాని నెగడించుఁజుమీ. ౫౪౧

వ. అని కైపెక్కించిన నమ్మదోన్మత్తుండు సమ్మతించి కెలననున్న
సుగ్రీవుం డనువానిం బిలిచి యిట్లనియె. ౫౪౨

గీ. దూతవై వేగమిప్పు డత్తొయ్యలికడ
కేగి కార్యంబు పొసఁగించి రాఁగఁదగుదు

వాద్యుపాయద్వయంబ యర్థ్యంబు దీని
కండ్రు శృంగారరసవిదు లగు రసికులు. ౧౮౩

ఉ. సామము దానముల్ విడిచి చయ్యనఁ గొందఱు భేద మిట్టిచోఁ
గాముకు లాచరింతు రది కర్జముగాదు రసంబు భంగరూ
పామయదూషితంబగు నహంకృతి దండమయేనిఁ దద్రసం
బేమియుఁ గానరాక మొదలే చెడుఁగాన ద్వయంబు నింద్యమా.

క. రా నిచ్ఛ గలుగు కామిని
యే నది నేరుపున మదికి నింపు గొలిపినన్
దానమున సామమున నొగి
దానై చనుదేరకున్న తక్కినవేలా. ౧౮౪

వ. అని యనిపిన సుగ్రీవుండు సని సింగంబు నెక్కి సర్వశృంగారం
బుగ నొప్పు నజ్జగదంబం గని మ్రొక్కి వినయమ్మున నిట్లనియె.

చ. త్రిదశుల జీరికిం గొనక దేవపదమ్మును గొన్న శత్రుదు
ర్మదపరిహారి శుంభుని స్మరప్రతిమాను నెఱింగి యుండుదే
మదవతి! దూత నే నతని మన్ననకుం దగువాఁడ; నీదు మే
ల్విధమును విన్కిఁజేసి స్మరపీడితుఁడై ననుఁ బంపె నియ్యెడన్.

వ. అతండు నీయెడల మోహమ్ముకతన వినతుండై పలికినపలుకులు
వినుము. ౧౮౫

చ. అమలినగాత్రి! దేవతల నందఱ గెల్చితి సర్వయజ్ఞభా
గములుమదీయముల్ త్రిదశఘస్మరుఁ డన్ బిరు దొంది నాకలో
కమునఁ గలట్టి రత్నములఁ గైకొని ముజ్జగమెల్లఁ జేతిలో
నమరఁగ రాజ్యముల్ వలయునట్లొనరించుచు నుంటి నుద్ధతిన్.

గీ. ఇట్టి ధట్టుఁడనైన నాకిగురుఁబోఁడి
నీదుచెలువంబు వీనుల నిండి కాము
బారి కోర్చుట పెద్దయు భార మయ్యె
నెరవుచేయక పేర్మి నీవరయ వలయు. ౧౧౦

ఉ. దాసుఁడ నైతి నీమది ముదం బెటులొందు నటుల్ చరింతు నా
సాసలఁ జిక్కుచున్ననను నాఱిడి పెట్టక యేలుకొమ్ము నా
వాసి యెఱుంగు మెవ్వరికి వధ్యుఁడగాను ననుర్ వరించి నీ
కేసతు లీడులేక చరియింపుము నిత్యసువాసినీగతిన్. ౧౧౧

వ. అతని పల్కుల చందంబియ్యది దీనంగల సారం బరసి ప్రత్యుత్త
రం బొసంగి త్రిలోకీరాజ్యంబు నీవయై యెల్లదానవుల నేలికొనం
దగదే! నావుడు జగదంబ మందహాసం బిగురొత్త నిట్లనియె.

ఉ. జేతగ దాతగా సుగుణసింధునిఁ గాఁగ నఖండలక్షణో
పేతునిఁగాఁగ సుందరుఁగ నే వినియుంటిని శుంభునిన్ యశ
స్ఫీతుఁ దదీయసోదరు నశేష జగమ్ములయందు; వానిపైఁ
బ్రీతి జనించియే యిటకుఁ బేర్మిమెయిన్ జనుదెంచితింజుమీ. ౧౧౨

మ. సురయక్షాసురమానవప్రముఖులం జూడంగఁ జూడంగ నె
ల్లరు మీరాజున కోడియుంటి మని రల్పప్రజ్ఞులం బొందరా
మి రసజ్ఞోత్తరుఁడైన మీ విభునిపై మేల్పట్టి నారాక; బం
గరు రంగారెడి రత్న మెవ్విధమునం గాంక్షింపదే మేల్మికై. ౧౧౩

క. అదిగాన మీవిభుని బలె
మదినను మన్నించి నాదుమాట లతని నె
మ్మది కెక్క నొంటిపాటునఁ
గదిసి వచింపు మిటులైనఁ గార్యము పొసఁగున్. ౧౧౪

ఉ. సుందరు లందు మేల్మిగల సుందరుఁ డంచు వదాన్యుఁ డంచు మ
ధ్యందిననీరజాప్తకిరణావళిఁ గాదనఁ జాలుతేజ మిం
పొందెడివాఁ డటంచు నిను నోపినవట్టను బూని వింటి నీ
యందు మనమ్ము పుట్టి వశనై చనుదెంచితి నేమి చేసెదో.

వ. ఇంక నొక్కకొఱంత గలదు వినుమది యెట్లంటేని మున్ను కొం
డికనాఁడు సఖీజనసమక్షమ్మున నొకవ్రతంబు పూనితి. ౫౫౭

క. బలమున నాతో నెవ్వఁడు
గలనం గాలూఁది నాదుగర్వ ముడుపు న
య్యలఘునిఁ బతిగాఁ గైకొన
దలఁతు నన౯ సఖులు నగిరి తద్దయు నన్నూ౯. ౫౫౮

క. అది మొదలు నేఁడు తుద నా
మద మడఁచెడి వీరవరుఁ డమరముఖ్యులయం
దొడవఁడు నీ విఁక నిది ప
న్నిదముగ ననుఁ గొనుము ధైర్యనిధి వగుకతన౯. ౫౫౯

వ. ఇట్లంటేనని మీ ప్రభువుతో నేకాంతమ్మునఁ బలికి యెత్తెఱంగున
నైనఁ గార్యసిద్ధిం బొనర్పు మనవుడు సుగ్రీవుండు విస్మయా
విష్టుండై యయ్యంబ కిట్లనియె. ౫౬౦

ఉ. చందనగంధి ! యిట్లనుట సాహసమాత్రము స్త్రీస్వభావ మీ
చందము గాక, యెల్ల దివిషద్గణ మెవ్వనిపేరు విన్న నా
క్రందన మాచరించుఁ గడుఁ గావలుఁ డట్టి యఖండు శుంభు నీ
వెందు జయింపనేర్తు ! చటులేక్షణపాతము చేతఁ దక్క౯.

వ. కావున స్త్రీస్వభావమ్మునం దొడరు మూర్ఖత డిందుపఱచి
శుంభు నొండె నిశుంభునొండెఁ బతిగాఁగొని సుఖం బుండు మది

యునుంగాక శృంగారం బెల్లరకును మెత్తదనమ్మున ననుభావ్య మ్మగాని వేఱొండు విధమ్మునఁ బదనుపడదు. నావచనమ్ము లనా దరించి గర్వించితేని యతండు క్రుద్ధుండై దుర్మదులగు భృత్యు లం బిలిచి నిన్నుం బలాత్కారమ్మునఁ దన సన్నిధికి రప్పించికొన నేర్చు నట్లు కేశాకర్షణాదికమ్మునకు లోనై సిగ్గఱ నుంకించు టది నీబోంటి బోటికిం దగు పాడియే ! విను మదియునుంగాక,

క. రతిసుఖ మెక్కడ, యుద్ధా
దృతి యెక్కడ, మిగులదవ్వు ! తెలిసి యిరువురం
దతివరో ! యొక్కనిఁ గైకొని
మితిమీఱు సుఖములఁ దవిలి మెలఁగుట తగదే. ౫౬౩

వ. నావుడు జగదంబ యిట్లను, ౫౬౪

క. శుంభనిశుంభులు బలియురు
నంభోధిగభీరులంచు నరయుదు నీవుం
దంభ మెఱుంగక తెలిపెడి
గంభీరత గలవు వ్రతము గాదన దగునే. ౫౬౫

ఉ. సంగరరంగమందు ననుఁ జక్క నెదిర్చి జయించి నాదు పా
ణిం గొను టొప్పు నా ప్రతిన నిక్కము కాక యలంతిఁబోవ ది
బ్బంగి వచించి యొప్పమిని బంధుసమేతముగా రసాతలం
బుం గయికోలు మే లనుచుఁ బూనికఁ దెల్పుము మీ యధీశుతో.

వ. మచ్ఛ్లాఘాతమ్మునకుం బెగడొందు కాతరునిం గొన నేనంత బేలనే ! సంగరమ్మున కియ్యకొనని నాఁడు స్వర్గమ్మును మర్త్యమ్మును ద్యజియించు టొప్పు నీవు భరంబని యెంచక నాపలికిన చందంబు సత్యంబుగా వచియింపుము. ౫౬౭

క. తనరాజు నెడల శాత్రవ
జనులయెడల సత్యరీతి జనదాఁటక యుం
డినదియ దూతల ధర్మం
బని యెఱిఁగి యథార్థ తత్పరాత్ముఁడ వగుమీ. గ౧౮

వ. అని యిట్లు నీతియుక్తమ్మును బ్రిగల్భమ్మును సహేతుకమ్మును గా నుపన్యసించిన నయ్యంబిక వచనమ్ముల కుత్తరం బీ నేరక సుగ్రీవుండు విస్మయం బంది తన రాజుసన్నిధి కరిగి నమస్కరించి యిట్లనియె. గ౧౯

గీ. సత్యము ప్రియంబు నైనవచనము దొరకద
దని యసత్యంపుఁ బలుకు నా కనభిమతము
గావునఁ బ్రియంబు గాకుండుఁగాక నిజము
పల్కెదఁ గృపానుగతి విన వలయు నధిప. గ౨౦

వ. అక్కన్నియ నివాసం బెద్దియో యెయ్యెడ నుండి యియ్యెడ కరుదెంచెనో నిక్కమ్ముగఁ దెలియదు; తెలిసినంతవట్టును వివరించెద. గ౨౧

క. మదమున సంగరమున ని
న్నెదిరింపఁ దలంచియున్న దెంతయు గర్వా
స్పద మక్కమలానన నె
మ్మది యాపె వచించినట్టి మాటలు వినుమీ. గ౨౨

వ. బాల్యమ్మున సఖీసమక్షమ్మున సంగరరంగమ్మున నెవ్వఁడు నా కెదురై పోర జయించు నవ్వానిం బతిగాఁ గైకొందుఁగాక యని వ్రతంబు పూనినదఁట! అయ్యది యవంధ్యమ్ముగాఁ దుదముట్టింప నేమకట్టి యున్నదాన ననియు మీరాజు లందులకు సమ్మతించి

యట్లొనరింప వరింతుననియు వచించి నన్నుఁ బుత్తెంచె దేవర
కెయ్యది హితం బట్లొనరింపఁ దగునని వెండియు, ౫౭౩

క. సింగంబు వాహనం బొక
యంగన బాసటయుఁ గాఁ దనంతన కడు ను
ప్పొంగుచు నెంతయు నీతో
సంగర మాసించి యుండె సఖ రాజేంద్రా! ౫౭౪

వ. నావుడు శుంభుం డనుజుని దిక్కు మొగంబై, ౫౭౫

గీ. అబల యొక్కతె తోడఁట! యతివయంట
పోరుటకు వచ్చెనఁట! నీవు పోయి వత్తొ,
యేఁ జనుట యొప్పొ, వచియింపు మేది మేలొ?
నావుడు నిశుంభుఁ డిట్లను నయము మెఱయ. ౫౭౬

గీ. ఈవు చన నేల నే నట కేగ నేల
ధూమ్రలోచనుఁ బంపు మత్తోయజాక్షి
నిటకు నిర్జించి తెచ్చు నొక్కింతతడవు
కాకమున్న వరించు నక్కాంత నిన్నుఁ. ౫౭౭

వ. పిదప వివాహం బొనరించుకొని సుఖం బుండు మనుడు శుంభుండు
వల్లె యని ధూమ్రలోచనుం బిలిచి యిట్లనియె. ౫౭౮

గీ. ఎవ్వఁ డడ్డంబు సొచ్చిన నీడఁ బొక
పట్టి కలఁగించి తత్పార్శ్వవర్తిని యగు
నంగనం జంపి చంచలాపాంగి నత్త
లోదరిని దెమ్ము నాకు నామోద మిమ్ము. ౫౭౯

క. మృదుమార్గణములు నీపై
నది విడిచినఁ గనలి సునిశితాస్త్రమ్ములఁ గొ

ట్టెదుసూ! యొడ లెఱుఁగక య
మ్మదవతి నా కెంతయేని మాన్యయగుఁ జుమీ. ౫౦

క. దానికిఁ దోడగువారల
పై నెన రించుకయు లేక పరిమార్పుము నా
ప్రాణంబు ప్రాణమగు న
మ్మానినిఁ గాపాడి యిట కమరఁ దేరనగున్. ౫౧

వ. నాఁవుడు సేనాసహితుండై ధూమ్రలోచనుం డరిగి దాదవ్వుల నయ్యంబం గాంచి వినయపురస్సరంబుగా నమస్కరించి మృదు మధురములగు వచనమ్ముల నిట్లనియె. ౫౨

చ. వినుము మృగాక్షి! కామశరవేదన కోర్వక మావిభుండు దూ త ననిపె వాఁడునున్ సరసతన్ గడు సామవిధంబు నీయెడం జొనిపిన నీవు వానియెడఁ జొక్కపు వ్యంగ్యపు రంగులీనఁ జె ప్పినవచనంబులెల్ల మది వేఱుగ నెంచె రసం బెఱుంగమిన్.

వ. పిమ్మట వాఁడు మారాజునకుఁ దనయెఱింగిన విధమ్మునఁ జెప్పిన నతండు చింతాతురుండై ననుం బనిచె నీయందుఁ బ్రేమం బగ్గలం బగుకతన నీ వట్లాడుటకు సహింపక విరహాతురుండై హృద యమొక్కంత చేసికొని వందురుచున్నవాఁడు "నన్నెవ్వాఁడు సంగ్రామమ్మున జయించు నవ్వాని వరియించెద" ననునీపలుకుల కర్థం బిట్లుగా యోజించె నెట్లం టేని, ౫౩

గీ. సంగరం బన రెండు దెఱంగు లందొ
కండు రతిజంబు తక్కనొకండు బవర
మొకటి సుఖమిచ్చుఁ దక్కిన దొకటి దుఃఖ
దాయి శత్రుపురస్కృతత్వంబు కలిమి. ౫౪

వ. అందనంగసంగరంబున నన్నెవ్వాఁడు జయించు నవ్వాని వరియింతు నను టగా కేమి యని కృతనిశ్చయుండై సకలార్థవేది నగు నన్ను మరల ననిపె. ౫౮౬

క. నీ చాతుర్యమ్మును విని
నీ చనవుం గోరు శుంభునిం బొందుము నీ
ధీచాకచక్యమునకుఁ
వాచాన్నైపుణికి సార్థవైభవ మొదవఁ. ౫౮౭

వ. కామశాస్త్రవేత్తయగు మారాజు నీ హావమ్ములకుం దగు భావమ్ము లాచరించి ని న్నెక్కటి జయింప నేర్చు నియ్యెడ నిక్కాళికయ సాక్షిణి యగు నని వెండియు, ౫౮౮

చ. నిను సుఖశయ్యపై శ్రమ జనింపఁ గరంచి నఖక్షతమ్ములఁ
దనువున రక్తిమఁ గొలిపి దంతముల న్ననుమోవి నొక్కి గా
సి నొనరఁ జేసి చెమ్మటలు చిమ్మఁగ బిర్మిఁ గలంచుమావిభుం
గనుఁగొన నేఁగుదె మ్మతఁడు గాంచినతోడన నీకు దాసుఁడౌ.

ఆ. వె. సురతయోగ్యమైన సొలపును మెలపును
బొలుపు గలిగి చెలఁగు పూవుఁబోఁడి
కకట! నీకు సునిశితాస్త్రపరంపర
నైపుఁ బాడియగునె చంచలాక్షి. ౫౯౦

—* కాళిక ధూమ్రలోచనునితో యుద్ధముచేయుట. *—

వ. కావున హితంబును రుచ్యంబునునగు నాపలుకు విశ్వసింపు మెవ్విధంబునను సుఖం బీఁజాలని పెనఁకువకుం జొరకుము నావు డుఁ గోపాటోపంబు దీపింపఁ గాళిక వాని కిట్లనియె. ౫౯౧

క. రోషం బుడిగి వృథా శై
లూషునిగతి బెట్టిదమ్ములుం గొఱగాముల్
భాషింతు వేర, మత్త ! వి
దూషక ! పోరిత మొనర్పఁ దొడరుము కడఁకన్. గీ-౨

క. విను నిన్నుం బంపిన శుం
భనిశుంభులఁ దునిమి యమునిభవనమ్మునకుం
బనుపఁగ నున్నది మాదే
వి నెదిరిపోరాడు మింత వేరము లేదే. గీ-3

చ. అనుచితరీతి మాజనని కాకలుషాత్ముల కేటిపెండ్లి ! న
వ్వనగునుగాక, నక్కపయి వాంఛ జనించునె సింహి కక్కటా !
యను వగునేమొకో, కరిణి కారయ గర్దభసంగ ! మెందు నే
విని గవయంబు నొందఁ జనునే ! మొద వంగజతాపసంగతిన్.

వ. కావున దురాత్మా ! నీ దురాలాపమ్ముల కంబిక సైఁచినను నేను సహించెడిదానఁగాను జీవింప వలతేని వైళంబ చని యాదుర్మదులం గలసి పాతాళమ్మున కరుగుము వేఱొండు బ్రతుకుతెఱవు నీకుం జొప్పడదనవ్వుడు ధూమ్రలోచనుండు తామ్రలోచనుండై.

మ. కలహంబన్నను గాలుఁ ద్రివ్వెదవె ! నీ గర్వం బడంపంగ నే
వలఁతిం గాకయ యింతవట్టు నిటు సంభాషింతునే ! కాళి ! కే
వలము న్నిన్ను వధించి సింగమును జావన్మొత్తి యిబ్బాలికన్
బలిమిం గైకొని యేగి మా విభునకుం బట్టంబు గట్టించెదన్.

క. రసభంగభయమ్మునఁ గా
దె సహించితి నింతవట్టుఁ దెలియక నాతో

డ సమర మొనరింపఁగఁ దా
మస మూనెద విపుడ నిన్ను మాయింతుఁ దగన్.

క. నావుడుఁ గాళిక కోపం
బావిర్భవ మంద నిట్టు " లనదపగిది నే
లా, వెఱపుమాలుకూఁతలు ?
కావల మడఁగింతుఁ బోరఁగాఁ దొడరు" మనన్. శ్రీగౌ

ఉ. ఆ పలుకుల్ శితాస్త్రములయట్టులు కర్ణములం బగుల్ప న
ప్పాపపురక్కసుం డడరి బాణపరంపరల న్నిగుడ్ప ను
ద్దీపితకోప కాళికయుఁ దీవ్రశరమ్ముల వానిఁ ద్రుంచి దు
ర్లేపుని ధూమ్రలోచను ' బలే ' యని మెచ్చఁగఁగొట్టె నిర్జరుల్.

ఆ. వె. అంతఁ బోక వాని యరదమ్ము నుగ్గుగాఁ
జేసె సింహనాదభాసురముగ
నసుర వేఱుతేరి నాయిత మొనరించి
కాండవృష్టి గురిసెఁ గాళిమీఁద. ౬౦౦

ఉ. ఆశినితాస్త్రసంతతుల నన్నిటి నంతరమంద త్రుంచి బి
ట్టూనిన కోపవేగమున నొక్కటఁ బెక్కులు గాఁగ నస్త్రసం
తానము గ్రమ్మరింప నొకతండముగాఁ బడి రెల్ల రక్కసుల్
వాని రథంబు రథ్యములు వమ్ముగ సూతునిఁ ద్రున్మి వ్రీల్చెడిన్.

మ. ధనువున్ భగ్నముఁజేసి దేవతలు మోదంబంద శంఖంబుఁ బ
ట్టినఁ దన్నాదమునం దిశల్ పగులుమార్ద్రిన్ మాఱుఘోషించె న
ద్దనుజుండున్ బరిఘుంబు దాల్చి పటువాగ్దంభమ్మునన్ ' బింగలో
చన ! మోకత్సితరూప ! నిన్నిపుడ పంచత్వంబు నొందించెదన్'

శా. హుంకారమ్మున నిట్లు ప్రేలుచు జగం బల్లాడ నుంకించి యే
కొంకుఁ లేక తటాలునన్ విడువ దిక్కుల్ వ్రయ్య నక్కాళి దా
హుంకారారవమాత్ర భగ్నముగ నుద్యోగించినన్ దైత్యు లే
వంక న్నిల్వక పాఱిరంత సుమముల్ వర్షించి రాదిత్యులున్.

చ. నరవర ! ధూమ్రలోచనుఁ డనాథగతి న్నిజసైన్యదానవో
త్కరసహితమ్ముగాఁ బడె నఖండగతిం జెలరేఁగి మాంస మా
దరమున నాహరింప వడిఁ దద్దయు మూఁగిన కాకగృధ్రజా
తిరవములున్ శివారవము దెప్పరమయ్యె రణాంగనమ్మునన్.

వ. తత్సైన్యమ్ము నందలి యశ్వమ్ములయు ఖరమ్ములయు వారణమ్ము
లయుఁ బలలంబు మెక్కి కైపెక్కి భూతప్రేతంబులు నాట్యంబు
లొనర్ప దొడంగె నంత నయ్యవమునకు సైఁపక యంబిక దొద
వ్వగాఁజని. ౬౦౫

ఉ. బిట్టుగఁ జిందమున్ దిశలు బీఁటలు వాఱఁగ నొత్త శుంభుఁ డ
బ్బెట్టిద మారవమ్ము విని వేర్చినశంక గృహమ్మువీడి యే
మిట్టి విరుద్ధ మంచు నెద నెంచెడిలోనన యేగి సైన్యముల్
గిట్టినవార్త కొంతవడికిన్ హతశేషులు మ్రొక్కి చెప్పినన్.

చ. తెగిన కరమ్ములున్ సగముద్రెళ్ళిన మేనులు నింతలింతలై
పగిలిన మూర్ధముల్ వడిన పార్శ్వము లొక్కెడి నల్ల వట్టులై
మగఁటిమి కోహటించి తనమానము దూలఁగ నేడ్చు సేన నె
వ్వగఁగని శుంభుఁ డిట్టులను వక్త్రమునన్ వెనుఁబాటు దోఁచిలన్.

గీ. ధూమ్రలోచనుఁడేమాయెఁ దోయజాక్షి
యేల రాదొక్కొ మన సైన్యమేష కేగ

భగ్నులై మీర లీగతి బడల నేల
మందమతులార ! వివరించి మాకుఁ జెపుఁడ. ౬౦౮

క. కడు బెట్టిదముగ గిరులును
బుడమియు నాకసము సంద్రములు గ్రిక్కదలన్
దొడరఁగ శంఖరవ మ్మొ
క్కఁడు వినఁబడు దాని కేమి కతము నుడువుఁడా !

వ. నావుడు రక్కసులు "చెప్పెడి దేమి ? యకాలిక ధూళిగా మన
సైన్యమ్ముల తుత్రెళ్ళడంచి ధూమ్రలోచను గిట్టించె. ౬౧౦

క. సురహర్షదాయకంబు న
సురశోకవిధాయి యగుచుఁ జొప్పడు నాభీ
కరశంఖరావ మెఱుఁగుము
పరదేవీరచిత మనుచు భవ్యవిచారా. ౬౧౧

క. మనధూమ్రలోచనుఁడుఁ సై
న్యనికాయముతోడఁ ద్రెళ్ళ నమరులు మోద
మ్మునఁ బుష్పవృష్టి గురిసిరి
మనమున భయ మంది మేము మగిడితి మిటకున్.

క. ఏకాకినియై రూక్షా
లోకమ్ముల నాల్గు దిక్కులున్ బిట్టుగ నా
లోకించుచు సింగముపై
నాకామిని వెలయుచున్న దాహవకాంక్షన్. ౬౧౩

వ. ఇంక సంగరంబొండె సంధియొండెఁ గర్తవ్యంపు తెఱంగెఱింగి
వర్తింపు మయ్యంగనకుఁ దోడుగా నెవ్వరును లేకున్నను సురలు
బార్షిగ్రాహులగుదురో కో ! యని శంకింతు నయ్యాహవసమయ

మ్మున హరిహరులును, లోకపాలురును, దక్కినయమరులును, గంధర్వులును, దాదవ్వల నంబరంబునుండి సుమాళమ్ముగ నీక్షించుచున్నవారని వెండియు. ౬౧౪

గీ. అత్తలోదరిసాహసం బమ్మృగాక్షి
యుక్కు నగ్గజగమన మహోద్యమంబు
గనఁగ సురలను గిరలను గొనక తాన
మనలఁ బరిమార్చ్పనని తోఁచె మాకు నధిప. ౬౧౫

చ. మనమొకలెక్కయే ? వినుమ మానుషశక్తి నెసంగు నజ్జగ
జ్జనని చరాచరమ్ములు వెసం బొడి చేసి యొకింతలోన స
ల్పనయినఁ జాలు నీకెటులు పాల్పడు నట్లొనరింపు మింత వ
ట్టును నిజ మింక నీమతిపటుత్వము,దైవము,మాయదృష్టముల్."

వ. నావుడు శుంభుఁడు నిశుంభునికు మొగంబై. ౬౧౭

క. మనధూమ్రిలోచనుని సై
న్యనికాయముతోడ యమపురాతిథిగాఁజె
ల్చనఁ గాళి చేసె నాశం
ఖనినాదం బప్పరాంబ గావించెఁజుమీ. ౬౧౮

గీ. తృణము వజ్రమ్ము వజ్రమ్ము తృణము బలవి
హీనుఁడు బలాఢ్యుఁ డిట్టిండు నట్టిఁడగుట
కాలగతి కారణమ్మునఁ గలుగు నకట !
జ్ఞానులకును దుర్జ్ఞేయముల్ కాలగతులు. ౬౧౯

గీ. ఎట్టులైనను నయ్యంబ నెనయుటొప్పొ ?
కాక యానెప మూని రక్కసులఁ జక్కఁ

జేయవచ్చెనో ? మన మేమి చేయఁదగునో ?
యెల్లవిధముల యోజించి యె...

క. కొండికవయ్యును మతి నా
ఖండలగురు సన్నిభుఁడవు కాల్కొలఁదిగ నీ
మండలము విడిచి పాఱుట
భండనమునకన్న లగ్గ పరికింపు తగన్. ౬౨౧

వ. ఇట్టియెడ తెగని సంకటమ్ముల నీకుమిక్కిలి బుద్ధిమంతులు లేరు
చక్కఁగ నొకదిక్కు విచారించి గ్రక్కున నుడువు మనుడు
నిశుంభుం డన్న కిట్లను. ౬౨౨

క. మన కేటి పలాయన మేఁ
బనివినియెద నిపుడ దైత్యబలములతో న
వ్వనజాక్షి గెల్చి తెచ్చెద
ననఘా ! దైవంబుకతన నట్టిట్లైనన్. ౬౨౩

వ. మన్మరణమ్మునకు శోకింపక తగుగతి యోజించి యప్పుడు నీబుద్ధి
కొలఁది నొనరింపు మనవుడు శుంభుం డియ్యకొనక పలాయనంబు
కన్న భండనంబ వరం బయ్యెనేని, ౬౨౪

క. భండనకోవిదుల మహో
ద్దండులఁ బంపెదను బెక్కుదళములు వేగఁగై
గండు మిగిలి కొలువఁగ మన
చండుని ముండునిని నీవు చనఁబోకు మొగిన్. ౬౨౫

గీ. చండముండులు మిగులఁ బ్రచండు లుద్ద
విడి నరిగి యత్తలోదరి నొడిచితెత్తు

రింత నిక్కము నీకుఁ బోనేల యుడుగు
మెవఁడు శశమునకై కరి నిచ్చునయ్య! ౬౨౬

వ, అని శుంభు నరికట్టి చండముండులం గాంచి, ౬౨౭

ఆ. వె. సిగ్గు లేక యొక్క సింగపుఁగోదమపై
నెక్కి యుక్కు మిగిలి యొక్కటిగ ర
ణంబొనర్ప నున్న యంబికాసహచరిఁ
గాళిఁ ద్రుంపఁ జనుఁడు కడఁక మీరు. ౬౨౮

వ. పింగళాక్షి యగు నవ్వెంగలి కాళి ముంగలనై బిభీషికల్ చూపినఁ దలరక చెలరేఁగి తల దఱిగి పిదప నయ్యంబికం గొని వచ్చునది, యొడంబడక బెడిదమ్ముగ లాడినఁ గడుకొని యుడిగించు నది, యని యానతిచ్చినఁ జండముండులును, ౬౨౯

క. బడబాగ్ని పిడికిలింతుమొ
పుడమియు నాకసము దెసలు భూధ్రమ్ములు స
జ్జడనిధు లొక్కమ్మడి స
ట్టడవిం గల్పుదుమొ యనుచు నార్పులు సెలఁగన్.

వ. సైన్యసమేతమ్ముగాఁ గట్టాయితంబై యరిగి ముంగల దేవహితకారిణి యగు నజ్జగదంబం గాంచి సామపూర్వకమ్ముగా నిట్లనిరి.

—* చండముండాసురుల యుద్ధము *—

చ. సురవిజయమ్మునం బొదలు శుంభనిశుంభుల బాహుగర్వదు
ర్భరత నెఱుంగవే యబల! పైకొన నెంచెద వేరికేనియుఁ
దరమె, దురమ్ములో నెదిరి దర్ప మొనర్పఁగ వెట్టివాక్కు? యి
త్తరుణి సహాయఁగాఁగొని వృథాగతిఁ బోరికి మీఱఁబోలునే.

క. తగుఁ దగ దని మతి చెప్పఁగ
నగుపురుషుం డేని యొక్కయుంగన యేనిన్
మగువరో! లేరొకో నిను దే
వగణము పురికొల్పు, దైవవశ మట్లుండెన్. ౬౩౩

మ. విను మష్టాదశబాహువుల్ గలవు న న్వేధింతురే యొద్దలం
చును మిత్త్రైకకు శుంభు నేడ్తులకు నీసుఁడో, సురేంద్రుండో! నీ
ఘనగర్వమ్మును బాహుసంపదయు నీకాండమ్ములు న్నిహిత
మ్మునకు న్నొక్కి వచించు నాపలుకు లంభోజాక్షి! పాటింపుమా.

ఉ. ఓ వనజాక్షి! శుంభుఁ డన నొక్కనిపాటియె యెవ్వఁ డేని నై
రావణపుష్కరమ్మును దురమ్మునఁ ద్రుంచుట వింటిమే! వృథా
కావలులై సురల్ తనకు గర్వనివర్తకుఁడైన శుంభుపై
నీ వెడఁగుందనంబు గని నిం బురికొల్పిరి యీసుపెంపునన్. ౬౩౪

క. నీవేమియైననుర్ భర,
మేవారికి? స్వార్థపరుల కెంపనుఁ బరకా
ర్యావేక్షణ ముండునె? యిక
నావాక్యము లిచ్ఛగించి నడువుము పురికిన్. ౬౩౫

ఉ. సుందరులందు సుందరుఁడు శూరులయందును శూరుఁ డెంతకే
నిందగువాఁడు నేర్పరి మనీషి స్మరాగమవేది మావిభుం
డందలవంటివాఁడె? జగదాఢ్యుఁడు నీకుఁ దదీయసంగమా
నందముకన్న వేఱొకటి నాకుఁ గనంబడ దెన్ని భంగులన్.

గీ. హిత మిచ్ఛగించి దుఃఖ
స్థితికిం జొరఁబడక నీ వశేషజగము లు

స్నతి నేలఁగ మా శుంభునిఁ
బతిగాఁ గొను మింతకన్న భాగ్యము కలదే. ౬౩౭

ఉ. గండున నిట్లు పేలుదు జగత్పరిమాత్రి యజాండమెల్లయు
న్నిండఁగ నార్చి యోరి యవినీత! నయస్థితి దెల్పెదేమి! యా
ఖండలమంత్రివే మొ! కడికండలు చేసెదఁ జక్కనిల్వు నీ
చండత వాని ముండతయు సంగరరంగమునం గనంబడున్.

చ. హరిహరులం దృజించి దితిజాధము శుంభు వరింతునేఁటి? నా
కొరుఁడు ధవుండె? యీ జగము లొక్కట నేలుదు నే ననాదినై
హరిహరులెంద, రెందఱు సురారులు, శుంభనిశుంభు లెంద త్రే
గిరి మునుమున్న నాయెదురఁ, గేవలమూర్ఖత మీఁదెఱుంగునే.

క. ప్రతియుగమున నీగతిఁ బం
చత భూతమ్ములకుఁ దొడరు సంరక్షింపం
గతి గలదె మీ కిపుడు సం
హృతికాలము వచ్చె యత్నమే లొనరింపన్. ౬౪౧

చ. మరణము నిక్క, మెట్లయిన మానముఁ గీర్తియు రక్షణీయ తా
శరణము లంచు నన్నుఁ బక సంగరరంగమునం దెదుర్పఁ డి
ప్పురుసున శుంభుఁడే కొలఁది! బ్రాంతియుఁగాఁదగునే నిశుంభుఁ! డె
వ్వరితర! మాజి నీలిగి దివమ్మున కేగుఁడు వీరపద్ధతిన్. ౬౪౨

ఉ. వచ్చినవట్టు రక్కసు లవారణఁ బోరుఁడు నాక మేగుఁ డు
ద్యచ్చతురంగసైన్యములదండడి శుంభనిశుంభు లంతలో
వచ్చియెదిర్చి చచ్చి సురవర్త్మమునన్ మిముఁ గూడికొందు రీ
మచ్చికమాటలేల శరమండలి నింపుఁడు పోద్దు వోయెడిన్.

చ. తొలితొలి నిన్ను నీయనుజుతో మడియించి సురారిసంఘని
స్తులులయి వచ్చినట్టి యలశుంభనిశుంభుల రక్తబీజు ని
మ్ములఁ గడతేర్చి వ్రేల్మిడిన మూఁడుజగమ్ముల దైత్యులన్న వే
రొలయక యుండఁ జేయవలె నోపినవట్టునుఁ బోరుఁడేడ్తెఱన్.

వ. ఇంక వృథాలాపమ్ములాడ వలవదని పురికొల్పి ప్రేరేపిన నా
చండముండు లఖండచండిములై, ౬౨౫

శా. జ్యాటంకారము దిగ్గజశ్రుతిభిదాసంపాదకంబై నిరా
ఘాటాటోపము మిన్నుముట్ట నెదురై కాలూఁద నయ్యంబ స్వ
ర్వాటీవాసులు మెచ్చ నొత్తె దరమప్పాటన్ రిపుల్ గుండియల్
బీఁటల్ వాఱి బడల్పడన్ హరియు నాభీలధ్వనిన్ గర్జిలెన్.

ఉ. కాతరభీతిదంబును నకాతరభూతరసోత్తరంగసం
పాతము గాఁగ సంగరమభంగురమై తగెఁ జండచండికా
శాతమహాస్త్రపాతముల సంకులమయ్యె నభోంతరంబు నీ
రీతిగ బీఱువోక యెదిరించిరి రక్కసు లొక్కపెట్టునన్. ౬౨౭

శా. అన్యోన్యప్రవిముక్తశస్త్రతతు లన్యోన్యమ్ము ఖండించుచున్
మన్యుప్రేరితులై పెనంగునెడ సామర్థ్యుండు ముందుం డసా
మాన్యుండై తనయన్న వెన్నడి పరాంబం దొప్పదోఁగించె "వీ
రన్యాయంబు బలే" యటంచు సమరారంభాతిసంరంభయై.

మ. కదళీపుష్పవిడంబినేత్రరుచి వక్త్రం బెట్టుగాఁజేయ వై
రిదవాగ్న్యాకృతియై లలాటమును నిర్భేదించి యావిర్భవిం
చె దయాదూరయు వ్యాఘ్రచర్మధర దుస్తేజస్క నాగాజినా
స్పదయై కాళిక ముండమాల్యధరయై పాశాదికోపేతయై.

వ. ఇట్లు ఖట్వాంగధారిణియు నతిభీషణయు శుష్కవాపీసమోద రయు భ్రుకుటీకుటిలేక్షణయు విస్తారజఘనయు విస్తీర్ణవక్త్రయు ఖడ్గాది సంశోభినియునై కాళరాత్ర్యపరావతారమ్మనం బోని ఘోరరూపమ్మున నావిర్భవించి జిహ్వాచాలనమ్మునం బెచ్చు పెరిఁగి, ౬౯౦

ఉ. ఓమారిసాహారిం బెనఁగుచున్న సురారులఁ బట్టి బిట్టు పూ
ర్ణాహుతిఁ జేసి వక్త్రమను నగ్నిముఖమ్మున, నందఁ గొందఱన్
బాహులఁ బిప్పి జేసి యిటుపల్వుర భక్షణఁ జేసి కాళి య
య్యాహవరంగ మొక్కమొగి నాహ్కృతిఁ జేసి పరాక్రమించుచున్.

గీ. అట్టహాసంబొనర్చి ఘంటాన్వితముల
గజఘటలఁ గేలఁ గొని వక్త్రగహ్వరమునఁ
బెట్టికొని పిండిపిండిగా బిట్టునమలు
నుష్ట్రతురగాదులకు గతి యొండు గలదె. ౬౯౧

ఉ. ఉర్వియు నాకసంబు కడియొక్కటికై యిటు లెల్ల సైన్యముం
జర్వణ మాచరింపుడును జండుఁడు ముండుఁడు నీడఁ బోక దు
ర్గర్వమదాంధులై శరపరంపరలన్ బరఁగించి యెంతయున్
ధూర్వహులై యెదిర్చి రని "దుండగు లింతటివారు లే" రనన్.

మ. ఇటు లక్కాళిక నేసియేసి యొకఁడం "దిద్దానఁబో" మ్మంచు బల్
పటువౌ విష్ణుచక్రముం గరమునం బాటించి బిట్టార్చి యే
యుటయున్ బాణమొకంటఁదున్మి హతకాయుం జేసె నచ్చండుఁ డం
తట ముండుండు శితాస్త్రముల్ గురిసెఁ దద్దం గాళిపైఁ గేళిమై.

వ. ఇట్లు మూర్ఛితుండగు నన్నపాటున కోర్వక ముండుండు దలకడ చుటయు, ౬౯౨

ఉ. చండిక ముండము క్తశరజాలము లోలిన త్రుంచివైచి బ్ర
హ్మాండము వ్రియ్యనార్చి యొకయర్ధశిలీముఖ మేసి వాని బల్
గండడగింప మూర్ఛవడి గ్రక్కున వ్రాలెఁ దదంతరమ్మునన్
జండుఁడు లేచి కాండములఁ జండిమఁ జూపుట మాని యుద్ధతిన్.

మ. గద కేలం గొని యొంటిమై నడరి యక్కాళీభుజాగ్రంబు బి
ట్టదరం గొట్టిన బాణపాశమున నయ్యంబా మహాదేవి మం
త్రిదశన్ వానిని బద్ధుఁజేసె, మరలం దా లేచి ముండుండు వా
ని దశన్ సైఁప కెదిర్చి శక్తిఁగొని, వానింబోలెఁ గట్టం బడెన్.

గీ. బద్ధులగు చండముండులఁ బట్టి బిట్టు
దిట్టయై యట్టహాసంబు దీటుకొనఁగ
నంబ కట్టెదుటకు వచ్చి 'యరయుమమ్మ
యాజి యజ్ఞపుఁ బశువుల నమరరిపుల'. ౬౫

వ. అనుచు నిట్లు వృకములం బోలె ననాయాసమ్మునఁ గట్టి తెచ్చిన
సంతసించి పరాంబ యిట్లను, ౬౬

క. ఇంపలరు నీదు శక్తి ని
లింపారులఁ దెచ్చి తింక లీలన్ జంపి
చంపక వేణోక భంగి ని
లింపులకున్ మెచ్చొసఁగవె లేవె చతురవై. ౬౭

వ. నావుడుఁ గాళిక యిట్లను, నీ దానవపశుద్వితయంబును బ్రసిద్ధం
బగు యుద్ధయజ్ఞమ్మున ఖడ్గయూపమ్మునం గట్టి యాలంభించి
నచో నయ్యది హింసయయ్యు నహింసాప్రాయంబగు నని
పలుకుచు, ౬౮

క. కరమునఁ గరవాలముఁ గొని
యిరువురి శిరములను నఱకి యీశ్వరి మోదో
ద్ధురత రుధిరమును ద్రావి య
మరవరులన్ మోదవార్ధిమగ్నులఁ జేసెన్. ౬౬౨

వ. ఇట్లతిఘోరంబుగఁ జండముండుల వధియించినకతమున నాయంబికకుఁ జాముండ యను బిరుదనామంబు పరాంబవలనఁ గలిగెనని చెప్పి వ్యాసుండు మరల నిట్లనియె. ౬౬౩

ఉ. పిమ్మట భిన్నకాయములఁ బెల్లుదొరంగెడి రక్తమై గుబుల్
గ్రమ్మి రణావనిన్ విడిచి కాల్కొలఁదిం జని శుంభుఁగాంచి 'మా
యమ్మలికంబు దీర్పుము మహోదయ! పెందయ' నంచుఁగాళికా
స్త్రమ్ములు చండముండులకుఁ జావుఘటించుట విస్తరించుచున్.

వ. హతశేషు లిట్లనిరి, రాజేంద్రా! యాహవరంగమ్మున నక్కాళి విక్రమించిన తెఱంగు దలంచుటకును భీతి యేతెంచెడి. రౌద్రాకారమ్మున నడరి కొందఱ భక్షించియుఁ గొందఱఁ బిడికిలించియు గొందఱఁ గాలఁ జమరియు నిట్లు సైన్యంబుల రూపుమాపినఁ దద్రంగస్థలంబు నెత్తురువఱ్ఱుగా మాంసంబు కర్దమంబుగాఁ గేశమ్ములు నాఁచుగా భగ్నరథచక్రమ్ములు చక్రమ్ములుగాఁ దెల్లిన బాహువులు మత్స్యమ్ములుగా శీర్షంబులు తుంబీఫలమ్ములుగా నొక మహానదిచందమ్మునం బొల్చె. ౬౬౫

ఉ. కాళిక చంపఁగా మిగులఁగాఁగల రక్కసులం గడంగి యా
భీలరవమ్మునర్చి యొకపెట్టున సింగము మ్రింగుచున్న దీ
యాలము మాను మయ్యతివ యల్ప యటంచు దలంతువక్కటా,
కాలము చేరువయ్యె నొకో! కావలమున్ విడజాల వెమ్మెయిన్

క. ఏ లలనఁగోరి నీ విపు
డాలమ్మునఁ గులవినాశ మందించెద వా
లోలాక్షి కాలరూపిణి
గా లోనఁదలంపు మెఱుకగలఁడగు మధిపా. ౬౬౭

గీ. జయపరాజయములు దైవసంగతములు
గాన నల్పార్థమునకు నిష్కారణముగ
నెల్లబంధుల సమయింపఁ జెల్లునయ్య
వెనుక ముందును దెలియుట చనదె యింక. ౬౬౮

వ. రక్కసులకెల్ల నొక్క కాంతచే మృతిగలుగుటకన్నఁ జిత్రం బొం
డెద్ది ! లోకపాలుర జయించిన నీబోఁటి నాబోటి యాహవమ్ము
నకుఁ బిలుచుట కెంతకేనియుం జాలక తూలిపోయెడిదే ! యది
యునుంగాక మున్ను పుష్కరమ్మున నీవు తపం బొనరించి యమ
రత్వంబు ప్రార్థించిన విధాత యీ నోడుటయు నీవు క్రిమ్మఱ
దేవమనుష్యసర్పకిన్నరయక్షప్రముఖులగు పురుషులచే మృతి
గలుగకుండ ననుగ్రహింపు మన నన్నలువ యట్లొసంగె నది
కారణంబుగ దేవప్రేరితమై, ౬౬౯

క. జననావన మరణమ్ముల
నొనరించెడి మాయ సంగరోల్లాసినియై
దనుజులతో నినుఁ బోరిగొనఁ
గ నేగుదెంచుట నిజమ్ముగావలె నధిపా. ౬౭౦

వ. మఱియుఁ ద్రిగుణయుఁ దామసయు సర్వశక్తి సమన్వితయు నక్ష
యయు సర్వజ్ఞయు సదోదితయు వేదమాతయు గాయత్రియు
సంధ్యయు సర్వసురాలయయు సగుణయు నిర్గుణయు సిద్ధయు
సర్వసిద్ధియు ప్రదయు నవ్యయయు నానందప్రదాయినియు నగు

పార్వతి దేవహితార్థినియై నిన్ను నిక్కవం బడఁపగ నేతెంచినదని యెఱింగి జీవింపవలతేని వైరంబుడిగి పాలివోక శరణంబు గొను మయ్యంబిక కరుణార్ద్రయై హతశేషులగు రక్కసులతో నిన్నుఁ జిరాయుష్మంతుఁగా ననుగ్రహింపఁ గలయది నావుడు శుంభుండు క్రోధాకులుండై వీరోచితంబగుగతి ననుకరించి, ౬౭౧

ఉ. మానము మాని పేరిలకుఁడు మందులరై యని కోపటించి నా
పై నెనరున్నభంగి నిటు, ప్రాణము తీపగునేని వేగ మీ
మీ నెఱిచుట్టలన్ సుతుల మిత్రులఁ గూడి రసాతలంబుఁ బో
నానతి యిచ్చెదన్ వెడలుఁ డాహవభీతులతోడ నేమగున్.

చ. జయముఁ బరాజయమ్ము మనశక్యమె దైవము కర్తగాక ని
శ్చయముగ బ్రహ్మవిష్ణుగిరిశప్రముఖుల్ తదధీను లన్నచో
బయిఁ బడు మంచిచెడ్డలకుఁ బాల్పడ కొడ్ల వశంబె దీనికిం
త యళుక నన్ను బోఁటి కొకదర్పమె, యెట్లగు నట్ల యయ్యెడిన్.

క. భవితవ్యానుగుణం బగు
వ్యవసాయ మొనర్పు జ్ఞానవంతులు తెల్వొం
దవిలి యొకప్పుడుఁ జింతా
వివశులుగాకుందు రేను వెఱతునె మృతికిన్. ౬౭౪

వ. మానవంతు లగువారలు మరణభయమ్మువలని యాత్మధర్మపరి త్యాగమ్మున కోపటింతురు. సుఖదుఃఖాయుర్జీవితమరణాది కమ్ము లెల్లరకునుఁ గాలచోదితమ్ములయి యనివార్యమ్ములై పైకొనుచుండు. హరిహరవిరించులును దక్కటివేల్పులును దమ తమ యాయురవసానమ్మునం గిట్టువార కాని యుట్టిగట్టికొని యుండువారుకారు. ౬౭౫

శా. దైవాధీనతఁ జేసి యేను జయమో దైన్యంబో వేఱొండో నేఁ
డీ వామాక్షికతమ్మునం గొనుదుఁగా కేలింత చింతింప, ని
స్సీ! వీరుల్ గడునవ్వఁ బాఱి యెటులే జీవింతునే? యింతకుం
జావే యెక్కుడు, వీరధర్మ మగునే సంగ్రామభీరుత్వముల్.

వ. అది యట్లుండె విద్వాంసులు దైవంబు మిథ్యయనియు నుద్యమంబు కర్తవ్యం బనియు దానఁ గార్యసిద్ధి యవశ్యంబగు ననియుం జెప్పుదురు. యుక్తియుక్తం బగుకతన నిత్తెఱంగు బుద్ధిమంతులకు గ్రాహ్యం, బదృష్టంబ బలవంతంబను కాతరులవచనమ్ములు గ్రాహ్యమ్ము లయ్యెనేని యదృష్టసత్త్వమ్మునకుఁ బ్రమాణంబేమి ? యదృశ్యంబెన్నఁ డేని దృశ్యం బగునే యని వెండియు, ౬౭౭

గీ. లే దదృష్టపదార్థంబు లేశమేని
బుద్ధిమంతులు దుఃఖసముద్రమగ్ను
లైనవారల నూరార్ప దీనిఁ గల్పి
తంబుగాఁ జేసి రిది సిద్ధదంబుగాదు. ౬౭౮

వ. ఇష్టకారిణియగు *చక్రిసమీపముననున్నను నుద్యమంబు లేకున్న నిష్టసిద్ధి గాని తెఱంగున నుద్యమశూన్యులు సిద్ధిమంతులు గాకుంట ప్రత్యక్షంబ యని మఱియును, ౬౭౯

క. తనబలము నెదిరిబలమును
గని కాలాదిక మెఱింగి కార్య మొనర్పఁ
మునుకొను సిద్ధియనుచుఁ దా
ననఁడె బృహస్పతి ప్రయత్న మన్నిట ఘనమా. ౬౮౦

* చక్రియన పిండిమాఱిటొను సాధనము.

వ. ప్రయత్నం బొనర్చినను గార్యసిద్ధిగాకుండినచోఁ దన్మూన్యనత యుద్యమంబున నిడుట యుక్తి యుక్తంబై యుండునని కృతనిశ్చ యుండై రక్తబీజుం గని నీబలమ్ములతోఁ గట్టాయితంబై సంగర మ్మునకు వెడలు మనుడుఁ వాఁడిట్లను, ౬౮౧

ఉ. ఏఁ గలుగంగఁ జింత మది నించుకయుఁ వల దిష్ట యేగి నీ రాగము చెప్పి యుత్తరుణి రా గమకించెదఁ దక్క నేని బెఱ వేఁగగు నాజిలోనఁ దలరించి జయించి వశఁ బొనర్చి దా సీగతి నీకు నెల్లపుడు సేవ యొనర్పఁగఁ జేయ నేర్చెదన్. ౬౮౨

వ. అని కృతనమస్కారుండై యాజ్ఞఁగొని హాస్త్యశ్వరథసంకులం బగుబలంబు పరివేష్టింప రథారూఢుండై సంగరమ్మునకు వెడలు టయు, ౬౮౩

క. దాదాదవ్వుల నంబిక
యాదానవుఁ గాంచి శంఖ మతిభీషణరా
వోదారమ్ముగ నొత్తిన
భేదిల్లిరి రిపులు మది దివిజు లలరంగన్. ౬౮౪

—* రక్తబీజయుద్ధము. *—

వ. అంత నద్దరరవంబునకుఁ దలరక రక్తబీజుండు సమీపమ్మున కరిగి మృదుభాషణమ్ముల నిట్లను, ౬౮౫

గీ. శంఖనాదమ్ములకు నేను జంక భూమ్మి
లోచనుఁడఁ గాను వినుము నీపేఁచ మడఁతు
నరయవోకొ నన్ను రక్తబీజాభిధానుఁ
బఱచు వారల మంక్తినేఁ బడితినొక్కొ? ౬౮౬

వ. మున్ను నీబిభీషికలకు ఝెంకి కాందిశీకులగు రక్కసులలో నొక్క నిఁగా నన్ను విచారింపక సుస్థిరత్వమ్మున రణస్థలమ్మున నిలువు మని. వెండియు, ౬౮౭

గీ. వృద్ధసేవ యొనర్చితి విద్యలెల్ల
నేర్చితి వటంచు వింటి నీనేర్పు చూత
మొక్కమాట వచించెద నువిద ! దాని
తెలుఁ గెఱుంగుమ యదికదా తెలివికలిమి. ౬౮౮

క. ఋతమై పథ్యంబై సా
హితిగల మానినుల కెల్ల హితమగు ననినేఁ
బ్రీతినం జేసి వచించెద
మతి గలవేని విను మిన్నిమాటలు కలవే. ౬౮౯

గీ. నవరసమ్ముల విద్వజ్జనముల మెచ్చు
గనురసమ్ముల వినుము శృంగారశాంత
రసము ; లందును శృంగార మసమ మగుట
రసములకు నెల్ల నయ్యది రాజుసుమ్ము. ౬౯౦

మ. సిరితో విష్ణువు గౌరితో శివుఁడు జేజేపెద్ద యవ్వాణితో
సురనాథుండు పులోమజాతరుణితో సూనాంకు సేవింతు సుం
దరి ! వృక్షంబు లతన్ గపోతిని గపోతంబున్ మృగం బమ్మృగిన్
గర మాసించుఁ జరాచరమ్ములకు శృంగారాప్తి నేఁడబ్బెనే.

గీ. ఎవ రసంప్రాప్త భోగులై దివులు దవులు
వారలో వారలే దైవవంచితులు య
తీశ్వరులు ; సంసరణసుఖ మొఱుఁగ లేక
వంచకుల వంచనలకు లోఁబడిన నరులు. ౬౯౧

క. మనమునఁ గామక్రోధము
లనయము గిటికొనుచునుండ నంగజుఁడును లోఁ
గొని యేచుచుండ శాంతం
బును వైరాగ్యమును జ్ఞానమును గలుగునొకో. ౬౯౩

వ. కావున నీయౌవనసంభావనకై శుంభునొండె నిశుంభునొండెఁ బతిగా వరించి సమస్తసుఖమ్ము లనుభవింపు మని బోధించు రక్తబీజప్రలాపమ్ములకు నంబికయుఁ గాళికయు నగిరి. పదంపడి దేవి హాసం బొనరించి మేఘగంభీర భాషణంబుల నిట్లను.

క. మును చెప్పితి రూపాదిక
మున నాకుం దుల్యుఁడేని మోహించెద నం
చును మాటిమాటి కీగతిఁ
జనునే వెడమాటలాడఁ జతురునిపగిదిన్. ౬౯౪

వ. నాప్రతిజ్ఞ యిట్టిది యని శుంభనిశుంభులకడ కేగి చెప్పుమొండె నొండె సంగరం బొనరించి నన్నుం జయించి విధిచోదితంబుగ వివాహం బొనరింపుము. ౬౯౫

క. భయ మొదవెనేని నిప్పుడ
రయముగఁ జని పతికిఁ జెప్పి రక్కసులెల్లన్
బయలు వెడలి వెంబడి రాఁ
బయనం బొనరించు టొప్పుఁ బాతాళమ్మున్. ౬౯౬

వ. అనవుడు రక్తబీజుండు క్రోధతామ్రాక్షుండై.

శా. ఎట్టెట్టూ ! యని యార్చి యంపగము లెన్నేనిం బ్రయోగించి బల్
ధట్టుండై మృగరాజు నొంచినఁ గనత్తామ్రాక్షియై దేవి పె

న్గట్టంబోని తదస్త్ర శస్త్రచయముం గూల్చెన్ శితాస్త్రమ్ములన్
రెట్టింపం దగునల్క రక్కసుని మర్దించెన్ వెసన్ మూర్ఛిలన్.

వ. ఇట్లు రక్తబీజుండు రథమ్మునుపయిం బడిన దైత్యసైన్యమ్ముల హాహాకారంబు విస్తరించె. ౯౯

క. బుంభారవమున సేన ల
హంభావం బుడుగు టెఱిఁగి యసురులఁ గని యా
శుంభుండు దైత్యులను సం
రంభమ్మునఁ బనిచెఁ బోండు రణమున కనుచున్. ౨౦౦

వ. ఇట్లు కాంభోజకాలకేయాదిదానవప్రపంచమ్ము నొక్కటనెస కొల్పిన భీషణాకారభాషణాడంబరమ్ముల నుద్దవిడి నద్దనుజులు రణాభిముఖులగుటయు నంతంత నేతెంచు వారలం గని కాళి ఘంటానాదంబొనరించెఁ బరాంబికయు శంఖంబు పూరించి జ్యాటంకారం బొనరించి యక్కాళి కుక్కెక్కింప మింటికి మంటికిఁ దానయై యాపె ప్రబలి సింహారావం బొనర్చిన నంత సింగం బును గర్జిల్లె. ౨౦౧

ఉ. ఆనినదమ్ములన్ విని మహానినదమ్ములు నింగిముట్ట న
ద్దానవులెల్ల శస్త్రములతండములం బరఁగించి ముంపఁ బో
రీనియతిం దనర్చెనని యెన్న నవర్తముగా నిలింపు లం
బానుచరత్వ మందఁ దమయందలి శక్తుల నంపి రంపినన్.

గీ. బ్రహ్మ మొదలుగలట్టి దేవతలశక్తు
లాత్మ దేహోచితమ్ముగ నస్త్రశస్త్ర
భూషణంబులు ధరియించి ఘోరొనర్ప
నరుగుదెంచిరి జగదంబ ననుసరించి. ౨౦౩

వ. అట్టియెడ వరటారూఢయు శంఖచక్రగదాధరయుఁ బీతాంబర భూషితయుఁ బద్మహస్తయునై వైష్ణవియు నర్ధచంద్రధరయు నహివలయయు శక్తిహస్తయు శిఖివాహనయునై కౌమారియు, శ్వేతగజవాహనయు వజ్రహస్తయునై యింద్రాణియుఁ, బ్రౌఢ ప్రేతాసనయు సూకరాకారయునై వారాహియు,నృసింహసదృశా కారిణియై నారసింహియు, దండహస్తయు భయప్రదయు మహి షారూఢయునై యామ్యయు, వారుణియుఁ గౌబేరియు లోనుగాఁ గలయనేకశక్తులు స్వస్వబలసహితమ్ముగ నరుదెంచిన దేవి యత్యానందభరిత యయ్యె. ౨౦౪

శా. తత్తచ్ఛక్తిపరీతుఁడై హరుఁడు తత్సంగ్రామరంగమ్ము ద
ళ్ళోత్త న్నిల్చి పరాంబఁ గాంచి యను "లోకోద్రేకసంపాదనా
యత్తుల్ శుంభనిశుంభు లాదిగల దైత్యానీకముం దుంపు మీ
సత్తుల్ తోడుగ నెల్లలోకములకుఁ సంతోష మెంతేఁగగఁ.

సీ. యజ్ఞభాగమ్ముల నమరులు మునువోలె
గతభీతులై పొందఁగాంతు్రగాక
స్థావరమ్ములకును జంగమమ్ములకును
సంతోషమెంతే నెసంగుఁగాక
ఉడుగక వెడలెడి యుత్పాతములు నీతి
బాధలు నేటితోఁ బాయుఁగాక
యయ్యయికాలమ్ములం దనుగుణముగ
మంచి మేఘములు వర్షించుఁగాక
గీ. కృషి బహుఫలప్రదంబయి కెరలుఁగాక
గోద్విజాంగన లభయమ్ము గొంద్రుగాక

పిదప శక్తులు తమతమ వెడలుచోట్ల
కేగ జగదంబ నీ యాజ్ఞ నొసఁగుఁగాక." ౨౦౬

వ. అని శంకరుండు వచియించునాలోనన చండికాశరీరమ్ము నుండి ప్రచండయు నద్భుతశక్తియు శివాశతనినాదినియు భీషణయు ఘోరరూపయు నగు నొకశక్తి యుద్భవించి సస్మితాననయై శంకరుంగాంచి యిట్లనియె. ౨౦౭

ఆ. వె. దేవదేవ! యీవు దితిజులకడ కేగి
దూతవై వచింపు తొలఁగి యమర
పదము వీడి యిపుడు పాతాళమున కరు
గుండు బ్రతుకుదెలవు గోర్కెయేని. ౨౦౮

వ. పిదప సురేంద్రుండు తనపదమ్ము నందికొని సుఖంబుండ నమరులెల్ల యజ్ఞభాగమ్ము లనుభవించువారు. ౨౦౯

క. మరణంబు గోర్కెయేని బ
వరమునకుం బలము గొలువవచ్చునది పరం
పరలై మాంసక్కలు పిశి
తరసాస్వాదనముచేసి తనియనొనర్తుర్. ౨౧౦

వ. ఇట్లు మద్వచనమ్ములుగా నుడువు మనుడు హరుఁడును శూలపాణి యగుచు శుంభనిశుంభులకడ కరిగి యిట్లనియె. ౨౧౧

ఉ. ఏను బురాంతకుండ జగదీశ్వరి మీకడ కంపె నాపె మీ
దానవులం దనుగ్రహముదాల్చి వచించినచొప్పు చెప్పెదన్
మానము ప్రాణము న్నిలుప మానసమేని దివంబు వీడి మీ
మీనెఱిచుట్టలం గలిసి మేకొనుఁడేగి రసాతలమ్మునన్. ౨౧౨

క. కాదేని(ం బోరితమునకు
రాఁదగునని చెప్పెననుడు రక్కసులు మహో
న్మాదులు మీఁదు నెఱుంగక
యాదేవి నెదుర్చ వచ్చి రనిమొనకు వడిన్. ౭౦౩

వ. రక్కసులకడకు శివు నంపినకతన నయ్యంబ శివదూతినాఁబరఁగె నిట్లుక్కు మిగిలి రక్కసు లొక్కుమ్మడి సంగ్రామరంగమ్మునకుఁ దెగి నిశితమ్ములగు శరశతమ్ములు వఱపిన నక్కాళిక శూలపాతమ్ముల నేలం గలిపియు, బ్రహ్మాణి కమండలుజలసేకమ్మున రూపుమాపియు, వైష్ణవి చక్రగదాపాతమ్ముల నుగ్గుచేసియు, మాహేశ్వరి శూలమ్మునఁ దూలించియు, నైంద్రి వజ్రప్రహారమ్మునఁ గసిమసంగియు, వారాహి తుండఘాతమ్ములఁ జెండియు, నారసింహి నఖనికరమ్ముల వ్రచ్చియుఁ బరాక్రమించునెడ నా శివదూతి బవరమ్మునకుం దవిలి యట్టహాసం బొనరించి భంజించు దానవులం బట్టి కాళికయుఁ జాముండయు భక్షించుచుండఁ దద్బలార్ణవమ్మున నతిఘోరంబగు బుంభారవమ్ము సంభూతంబయ్యెఁ; దదారవంబు విని రక్తబీజుండు తక్కటి దానవులం గలసి సంగరమ్మున కభిముఖుండై జ్యాటంకారం బొనర్చెనని వెండియు. ౭౦౪

గీ. రక్తబిందువు లెన్ని యా రక్కసుని శ
రీరముననుండి వెడలు నారీతి నంద
ఱుద్భవింతురు రక్కసు లొక్కమొగి న
టంచు వరమిచ్చె వానికి నభవుఁ డధిప. ౭౦౫

క. తాదృశవరదానాయా
తోదారబలంబు కలిమి నుక్కుమిగిలి మాం

సాదనుఁడు వేగమునఁ గా
ళీ దేవులఁ గవిసె వీర్యలీల చెలంగన్. ౨౧౬

మ. గొరటామంతునిపై జగద్విలయభంగిన్ బేర్చు నవ్వైష్ణవిం
బరశక్తిం గని దైత్యుఁడల్క మెయిఁ దామ్రింబైన నేత్రద్వయిన్
బారిఁ జూపట్టు కృశానుకీలలు జగమ్ముల్ మండఁగాఁ జేయు రీ
తి రవుల్వం బొలుపారు నొక్క పటుశక్తిం బైఁ బ్రయోగించినన్.

క. శక్తియు నొకగద గొని యా
శక్తిం దునుమాడి మఱియుఁ జక్రము గొని యా
నక్తంచరుపై విసరిన
రక్తమయశరీరుఁ జేసె రక్కసు నదియున్. ౨౧౭

వ. ఇట్లు చక్రాభిహతంబగు తదీయశరీరమ్మునుండి గిరిశిఖరమ్ము
నుండి సెలయేఱుల వడువున నల్లకాలువలు తండోపతండమ్ములై
వెడలినకతమున ననేకరక్తబీజు లుద్భవించి యొక్కపెట్ట దేవిం
బొదువుడు నైంద్రి వజ్రప్రయోగమ్మునను బ్రహ్మాణి బ్రహ్మ
దండంబునను మాహేశ్వరి త్రిశూలంబునను నారసింహి నఖాఘా
తమ్ములను వారాహి తుండఘాతమ్మునను గౌమారి శక్తిప్రయో
గమ్మునను నద్దానవులఁ దఱిమినఁ దదాయుధాపాతజనితరక్త
బిందుపాతమ్మునంజేసి రక్కసులు వేనవే లావిర్భవించి పిఱుస
నక పోరిన నప్పోరు ఘోరంబై దివి వైమానికులగు సురలకు
ఖేదంబు నొనఁగూర్ప వార లిట్లు వితర్కించిరి. ౨౧౮

క. ఇది యేమి వింత! నూఱ్లుకొ
లఁది దైత్యులు వొడమి రకట! లావున వీరిం
బొదువుట కష్టం బేవెఱ
వు దలంచునొ దేవి, యేమి పోలునొ చేయన్? ౨౨౦

క. అని కిది సమయం బని శుం
భనిశుంభులు గూడ వచ్చి మార్కొందురు వా
రును బలియు రనుచుఁ జింతా
మనస్కులయి భీతి వడి రమర్త్యులు పెలుచన్ 219

వ. దేవియు సంగరరంగం బంతయు రక్తబీజమయం బగుట యెఱింగి
కాళికం బిలిచి యిట్లనియె. 220

ఉ. మార్తురనెల్లరం బిలుకుమార్చు నుపాయము చూడు మిట్టు లీ
ధూర్తులు నెత్తు రుర్విఁ బడఁ దోరముగా జనియించుచుండ్రి నీ
నోర్తగ విచ్చి రక్తమదనుం గని వేల్మిడిఁ ద్రావు మేను ని
మ్మాత్తుర నింతలోనఁ బరిమార్చెద నుగ్రరణాంతరమ్మునన్

క. ఇదియ యుపాయం బీరీ
తి దనుజులన్ గసిమసంగి దేవేంద్రుని న
య్యదితిజులం బ్రోచి మదిం
బదిలముగాఁ జేసి సుఖముఁ బడయుట తగదే. 221

వ. అని యానతిచ్చిన నక్కాళికయు నట్ల వదనంబు తెఱచి రుధిర
మ్మొక్క చుక్కైన నేలంబడనీక త్రావుచున్నంత నంబికయుఁ
దదాపాతజాతులగు కృత్రిమ రక్తబీజుల నందఱ నొక్క నిముస
మ్మునఁ జక్కడంచి 222

మ. అసి చేతంగొని " రక్తబీజ ! నిలురా " యంచున్ బలప్రాభవం
బు సురల్ సన్నుతిచేయుచుండ రుధిరంపుం బిందు వొండైనఁద
ద్రిసపైనిన్ బడకుండఁ గాళికయుఁ దత్పార్శ్వమ్మునందుండి త్రా
వ సుధాకీశ్వరు కంఠముం దునిమె రంభాస్తంభ మట్టుల్ వడిన్.

వ॥ హతశేషులగు రక్కసు లొక్కమొగి రణాంగనంబు విడిచి శుంభుపాలికింజని, దేవా! రక్తబీజుం డక్కాంతచే నిహతుండయ్యె. తదీయంబగు శోణితంబెల్లఁ దత్సహచారిణి చాముండ యనునది త్రావె నింత యక్కజంపుఁ బరాక్రమంబుగల కామిని నెయ్యెడం గాన మింతయేల తదీయ వాహనంబగు సింగంబును ననేకుల రక్కసుల నుక్కడంచె నింక దేవర ప్రమాణంబని చెప్పి మఱియు నిట్లనిరి. 228

ఉ॥ కొందఱు కాంతలామెకు సఖుల్ రణసీమ సహాయులైరి వా
రందఱు లావుఁ జేవ గలయట్టిరు చక్కనివారు వారి గె
ల్వందర మౌనె! యోదనుజవల్లభ! యంతటి రక్తబీజు చా
వుందలపోయఁ గొందలము వొందదె నెమ్మది నేరికేనియున్. 229

ఉ. ఆలము మాని పౌరుషము లాయమ కప్పనఁజేసి మీఁదఁబా
తాళమువంకఁ బోవు టుచితం బని తోఁచెడి మాకుఁ జూడ న
బ్బాలికరూపుఁ గన్గొనఁగఁ బ్రాకృతమాత్రము గామి దోఁచు, దే
వాళినిఁ బ్రోవ మాయ యిటు లాకృతి దాలిచె రాక్షసాధిపా.

చ. అను మొనవారిపల్కులు సురారికులేశ్వరుఁ డాలకించి చ
య్యనఁ గనుదోయి కెంపు జిగి యానన మంతయుఁ బర్వఁ జేసి వె
చ్చ నిగుడఁ బల్కు "భీతిలి రసాతల మేగిన నేగుఁ డీరు కా
మినికిఁ దలంకె యేఁ జనిన మీఁద యశంబు నశింపకుండునే!

గీ. దేవనాయకు నోడించి దేవలోక
మేన పాలించినాఁడ నీ మేనితోడ
నొక్క కాంతకు రణమున నోహటించి
పాఱిపోదునె యింతటి బ్రతుకు బ్రతికి! 230

ఉ. నాదు బహిర్గతాసువులు నాయెడ భక్తి గలారు రక్తబీ
జాదులు నానిమిత్త మొక యంగనచేత రణావనిఁ బలం
బేది గతాసులైన నది యెంచక యయ్యబలన్ జయింపఁగా
రా దని భీతిమైఁ జెనఁటిప్రాణము డాఁచిన నుర్వి మెచ్చునే.

మ. జననం బందినవారి కేరి కయినం జావున్న, దెప్పాటఁ బో
యిన రా నున్నది రాక తీఱదు, భయం బేలా వివేకంబు క
ల్గిన వానిం బెగడొందఁ జేయుఁ? దగు భంగిన్ దెచ్చుకొన్నట్టి కీ
ర్తినిఁ బ్రాణానకు జంకి వ్యర్థముగ వార్ధిం గల్పఁగా వచ్చునే.

చ. బవరమునన్ జయమ్ము లిరువాఁగునకుం గలుగంగఁ బోవు నే
దివి భువియున్ బలమ్మున నెదిర్చి జయమ్మును గొన్న నాఁడు రెం
డవయెడవారునుం జయము నందిరె! కాన మనుష్యయత్నసా
ధ్యవిధి యొనర్పఁగావలయు నావల దైవము చేయు చేఁతకున్."

గీ. అని నిశుంభునివంకఁ గన్గొనుచుఁ బలికె
నీవు సేనానివై వెంట నేగుదెమ్ము
సురనికాయము మనములు క్షోభమంద
నిపుడ యానాతిమిన్న జయించి తెత్తు. 231

వ. అని విక్రమించుచున్న యన్నం గని యనుజుం డింతేల, గడలో
నే నా వనితన్ జయించి తెచ్చెద ననుమానమ్ము విడిచి
సుఖమ్ము లందు మని వెండియు, 23౮

గీ. సకలజగముల నొకసారి జయముగొన్న
మద్భుజాదండబల మేడ మార్దవంపు
ముద్దయగు ముద్దరాలితో మొనసి పోరు
చేయుటేడఁ గటా! యెంత చేసె నజుఁడు. 232

ఆ. వె. ఇట్టినీచకృతికి నేనుండ దేవర
గమన మనుచితంబు గడియలోన
మానినిని జయించి మగిడివచ్చెద నన్నుఁ
బనుపు మయ్య పెక్కుభాషలేల. ౨౩౮

క. అనుచుఁ గృతనిశ్చయుండై
యనికిం గాల్ దువ్వుచున్న యనుజునిఁ గని నె
మ్మనమున ననుమానించుచుఁ
జను మని సెలవిచ్చె దనుజచంద్రుఁడు పేర్మిన్. ౨౩౯

—* నిశుంభ యుద్ధము *—

వ. నిశుంభుండు జయం బొందెడి మరణంబొందెడిఁ గానిమ్మని సేనా సమేతమ్ముగా నయ్యంబికం జుట్టుముట్టుడు శుంభుండు సహోదర సంగరసమాలోకనకుతూహలమ్మునఁ దన బలమ్ములతోడ వెను వెంటం జని యంతంతఁ జూచుచుండె నట్లు నిశుంభుం డయ్యంబి కం గదిసి శార్ఙ్గమ్మగు చాపమ్మున నారిం బూరించి ప్రలయకాల కాలాంబుదమ్మువడువున శరాసారమ్ములు గురిసె నంత. ౨౪౦

క. దేవియుఁ గాళినిఁ గని యీ
దేవారులమాద్య మింతదెప్పర మగునే
చావునకుఁ దలఁకరు జయా
శావలమానాంతరంగసంభ్రము లగుచున్. ౨౪౧

క. ఆశాపాశముకన్నను
బాశంబు జగానఁ గలదె ! బలియురు తనవా
రాశమనపురికిఁ జనిన జ
యాశాభూతంబు వదల దారా ! వీరిన్. ౨౪౨

వ. అని ప్రశంసించుచుఁ గాలమ్ము సమీపించినవారు యుక్తా
యుక్తమ్ము లెఱుంగుదురే యని శరాసనంబు సారించి నిశితంబు
లగు శరమ్ములు దొడిగి యన్నిశుంభు మేనెల్లం గప్పిన నప్పిశితాశ
నుండును బదియాఱు వాఁడితూపుల నమ్మానవతి లలాటంబు
గాఁడ నేసె; నిల్లు పరస్పరంబును సమాలోకమానాలోకభీకరం
బగుసంగరంబు కరంబు ప్రవర్తిల్లుచుండఁ దద్వాహనం బగు
సింగంబును దనయోపినకొలఁదిఁ గేసరమ్ముల విదుర్చుచు నఖా
ఘాతమ్ముల గ్రుచ్చియు దంతమ్ములఁ గఱచియు సైన్యసాగరమ్ము
నల్లకల్లోలంబుగాఁ బిలుకుమార్చె. ౭౮౩

క. శుంభుండును దేవీసం
రంభము గని యోర్వలేక రణభూమికి సై
న్యాంభోధి గొలువవచ్చి ని
శుంభునకుం దోడువడియె శుంభల్లీలన్. ౭౮౪

వ. ఇట్లువచ్చి, ౭౮౫

సీ. రౌద్రరసమ్మును బ్రిథమరసమ్మును
నిరుదెసఁ గాన్పింపఁ, గరుణ యొక్క-
వైపున నలు కొక్క-వంకను దైవారఁ
జూడ్కు-లు కనుదోయి సొగసు దెలుప
జగదతీతంబైన సౌందర్యగరిమఁ గ్రొ
మ్మించు చాడ్పున మిఱుమిట్లు గొలుప
బవరంబు సేయునప్పరశక్తిఁ గన్గొని
విస్మయమ్మున నాపెవిధమునెల్లఁ
తే. గీ. జూచుచును మిన్నకుండ నాసుదతి మోహ
నందుఁజిఱునవ్వు వొలయ దైత్యద్వయంబు

గాంచి, పామరులార ! నిక్కముగ నెచటి
కేని యేగుఁడు జయకాంక్ష లింక విడుఁడు. ౨౮౮

క. అభయం బిచ్చెదఁ; గాదే
ని భయము విడనాడి యీయనికి బ్రాణము వా
సి భటస్వర్గముఁ గైకొనుఁ
డుభయులు నన శుంభుఁ డల్క యుదయించి వెసన్.

మ. కని ఖడ్గంబున సింహశీర్షమును మొక్కల్ వోవఁగా నేయఁ ద
ద్ఘనపాతంబు సహింప కద్ది నఖపాతచ్ఛిన్నకాయుం బొన
ర్చిన నాలో గదఁ బూని దేవియును గాసిం జెందఁగా నేసె దై
త్యుని బాహాంతరమందు, మింట సుర లోహో యంచు నగ్గింపఁగన్

వ. అంతం బోక బాహుమూలమ్మును ఖడ్గతాడితమ్ము చేసి
యయ్యంబ విజృంభించిన. ౨౮౯

క. వ్రేటువడి వాఁడు వేదన
నూటాడక మాటుపఱచి యొకబాణమునన్
గాటముగ నేసెఁ బవిలి ల
లాటము పాలాశసుమవిలాసము దాల్పన్. ౨౯౦

వ. పిదప నయ్యంబిక నిశుంభవధారంభసంరంభయై పునఃపునః
పానంబునం బొదలి ఘంటానాదం బొనర్చుచు నెదిర్చె; నిట్లు
ఘోరంబుగ సంగరంబు చెల్లునంత. ౨౯౧

క. కుక్క లొకపెట్టఁ గూసెన్
నక్కలఱచెఁ గాకి గ్రద్ద నాఁజను పక్కుల్
దిక్కులద్రువఁ బఱతెంచెన్
రక్కసుల యొడలిపలము గరంబు భుజింపన్. ౨౯౨

వ. అంత నిశుంభుండు దైత్యమారణంబునకు సైంహిక గదం గొని భీషణాకారమ్మున నడరి హరింగొట్టి యట్టహాసం బొనరించి యయ్యంబం దాడించిన. ౭౫౩

ఉ. ఆపెయు వల్గితభ్రుకుటియై మొగమంతయు జేవురింప 'దై త్యాపశదా! చలింపకు' మటంచుఁ గరాళతరాసి పూని య ప్పాపుని కంధరంబు తెగవైచెఁ దటాలున, మింటిపైఁ దదీ ప్సాపరులైన దైవతనికాయము శోకముతోడ వేర్మిడిన్ ౭౫౪

ఉ. నెత్తురు కాల్వలై పరఁగె నింగి వియచ్చరసంచయంబు పూ లొత్తిరి సోఁకుమూఁకలు నమోనమ యంచును గాళ్ళ-లంది ప ర్వెత్తిరి కొంద ఱాదు బలహీనతఁ బాటుమొన స్మరల్చుచున్ రిత్తకు రిత్త సేయు రజనీచరవల్లభుఁ గాంచి యీసునన్ ౭౫౫

క. దేవా నీయనుజన్ముని
చా వాలోకింతె మెట్టచాడ్పునఁ బడె! గృ
ధ్రావళి మాంసముఁ బొడువగ
నేవారిఁక ననికిఁ గడఁగి యిటు కారొక్కో ? ౭౫౬

క. అనిలోన నీకు జయము మ
బ్బు ననుట గడు సందియంబు బుధకార్యము సే
యను వచ్చినమాయయ కా
మిని గా దది నిజము చావమికి మనతరమే. ౭౫౭

క. కలకాల మొక్క-విధమున
నిలఁగాలము చనునె తనక హితముగ నొకచో
బలవంతుని దుర్బలు దు
ర్బలునిన్ బలవంతుఁ జేయు రాక్షసనాథా. ౭౫౮

క. ఇంద్రాదినిర్జరులును ను
పేంద్రుఁడుశంభుఁడు విరించి యినుఁడు జముండుఀ
జంద్రుఁడు మొదలగువా రీ
సంద్రము కాలమ్ము దాఁటఁజాలరు తలఁపఀ. ౭౫౯

చ. మును పృథివీశు లందరు సమున్నతిమై నరివెట్ట సర్వమే
దినియు నిరంకుశం బగుగతిఀ బరిపాలన చేసినట్టి నీ
వని నొక కాంత కోడుదె! కటా! యిది కాలమురీతిగాక; త
క్కిన వొనరింపఁ జాలునొకో! కీడును మేలును బ్రాణికోటికిఀ.

క. కావునఁ బాతాళమునకుఁ
బోవుదమిప్పటికి; బ్రతుకఁబోలదె! రాజ్యం
బేవారికి శాశ్వతమగు,
నే! విధిచోదితము గడవ నేర్తురె యేరుఀ. ౭౬౧

క. అను సేనానులపల్కులు
విని దైత్యవిభుండు కోపవిపులీకృతలో
చనుఁడగుచుఁ గటములదరఁగ
ననలజ్వాలాకరాళ మగుగతిదోఁపఀ. ౭౬౨

చ. చెవు లవియంగ నిర్భయతఁ జెన్నటిపల్కులు పల్కువారె! యీ
రవమున జాల్మలార! యని భ్రాతృసుహృద్గణమంత్రిరాజబాం
ధవతతి నొక్కయోఁడుది మదమ్మమెయిం దెగటార్పఁజూచి యే
బవరము మాని యీకటికిప్రాణము దాఁచికొనంగ నవ్వరే.

వ. శుభాశుభమ్ములు చక్రనేమిక్రమమ్మునం దిరుగు నీ సంసార
మ్మున భవితవ్యాభవితవ్యమ్ములకుఁ దజ్జ్ఞులు చింతింపరు పర్జ
న్యుం డప్పటప్పట యోగ్యకాలంబగు శ్రావణమ్మునఁగురియక

తదితరంబగు మార్గశీర్ష పౌషమాసమ్ములం గురియుట గనుఁగొన్నఁ
గాలం బెద్దానికిని గారణంబుగామి తెల్లంబగు, దైవనిర్మితంబగు
గతికెన్నండు నన్యథాత్వమ్ము గలుగదని మఱియును. ౭౬౪

గీ. జగములెల్ల జయించి యశంబు గొన్న
శూరవర్యులు రక్తబీజుఁడు నిశుంభుఁ
డోహటించిరి రణమున నొక్క యబల
కకట ! దైవమ కారణమనుట తగదె. ౭౬౫

వ. పదార్థద్వయసమ్మితం బగుకాలంబు సంప్రాప్తం బగుడు విరిం
చియుఁ తద్ద్విగుణితం బగుకాలమ్మునకు హరియుఁ తద్ద్విగుణిత
మగు కాలమ్మునకు శంకరుండును నశింతురు. బ్రహ్మ కొక్క
దివసం బగు నంతకుఁ బదునాల్గురింద్రులు చెల్లుదురు ; సూర్య
చంద్ర మహీమహీధరసముద్రాది సకలచరాచరములకును దైవ
నిర్మితం బగునాశంబు తప్పదు కావున మృతికిఁ జింతింపక రణ
మ్మునకుం బోదుఁగాకేమి విధిచోదితంబై జయంబైన నయ్యెడి
నని తేరాయితంబు చేయించి చతురంగబలమ్ములు పరివేష్టింపం
జని. ౭౬౬

సీ. జగదతీతం బగుసౌందర్య మొప్పార
నఖిలభూషణభూషితాంగియగుచు
దివినుండి ముదమున దేవతల్ మందార
కుసుమవర్షమ్ములు గురియుచుండ
కిన్నరీబృందంబు కిన్నెరల్ మీటుచుఁ
జిన్నారిగానముల్ సేయుచుండ
శంఖనినాదంబు సల్పుచు ఘంట వా
యించుచు సింగార మెసకమెసఁగ

గీ. సింహవాహనయై యున్న చెలువ చెలువ
మారఁ గన్గొని దైత్యుండు మారబాణ
తాడితాంతరుఁడగుచు యుద్ధప్రసక్తి
తిగిచి మనమున నిట్లు చింతింపఁదొడఁగె. ౭౬౭

క. ఒయ్యారం బయ్యారే
తియ్యందన మౌర! రూపుతేట బళీ! యీ
యొయ్యారి పంచబాణుని
కయ్యానకుఁ గాక పోరఁగాఁ దగినదియే. ౭౬౮

ఉ. చక్కనిచన్నుదోయి యెడఁ జీమకుఁదూఱఁగ రాదు మేనినుం
జక్కని జవ్వనంపురుచి చంచలకుం బయిపెచ్చు వచ్చు న
మ్మక్క గదే! మనోభవునిమానినికన్నను జక్క దీని నా
యక్కునఁ జేర్చుకోలున కుపాయము సేయుదు నేయదేనియున్

వ. మంత్రాది ప్రభావమ్ములు సర్వమంత్రస్వరూపిణి యగు నీ
జగన్మోహినియందు విఫలమ్ములు సామదానభేదమ్ములు వమ్ము
లట్లు గాదేని. ౭౭౦

ఆ. వె. వెలఁదిచేతఁ జచ్చె విశ్వైకవీరుండు
వితతకీర్తి శుంభుఁ డతులుఁ డనుచు
గేలి సేయ కుండునే లోక! మకట, దం
డమున మనముఁ జొన్పిన నిది నిజము. ౭౭౧

వ. తన కెనయగు యోధవరు నెదిరించి చచ్చియుఁ బుణ్యలోకమ్ము
దెస కరుగుదు రని పెద్దలు వచింప విందుము గాని యబలా
కర్తృకం బగుమరణం బుత్తమలోకావహంబు గానేరదు. వేయేల
యస్మత్కులనాశమ్మున కివ్వెలఁది యేతెంచె నని యెఱుంగుదు

నైనను మరణంబ యుత్తమంబు కాని పలాయనంబు కర్తవ్యంబు
గా దని నిశ్చయించుకొని యమ్మేటి యద్దేవి కభిముఖమ్ముగ
నరిగి యిట్లనియె. 222

క. అని సేయఁగ మదియే నో
ననబోఁడి ! కడంగు, పోరు నాతికిఁ దగునా !
యనియును నీ యత్నము విత
యనియును మదిఁ గొంకుచుంటి నంతియ తరుణీ. 223

సీ. కనుబొమల్ విల్లు లోచనములె శరములు
హావభావాదులె యాయుధములు
సరసచర్యందు విచక్షణుఁ డగుపురు
షుండె లక్ష్యము మనోజుండె తేరు
గడపు నేర్పరి, భేరికానినాదమె మధు
రంపుఁబల్కులు మనోరథమె రథము
మదనాగమమ్ములె మంత్రతంత్రమ్ములు
వీణానినాదంబె వింటిమోఁత

గీ. మదనయుద్ధంబె యుద్ధంబు మానవతుల
కెదిరి మగసేత సేయుట యేజయంబు
గాని వాలును బలకయుఁ బూని కడఁగి
బవర మొనరించు టది విడంబనము కాదె. 224

క. మందగమనంబు గలనీ
కుం దలమే కేల గదను గొని తెఱుముట ! చ
న్నుందోయికి నానందం
బొందించునె ! వింటితాఁటియొఱపులు తరుణీ 225

సీ. అని సేయు తలఁపేని మనమున నోనన
బోణి ! లంబోష్ఠంబు పుష్పిగోళ్లు
లంబపాదంబులు లంబస్తనంబులు
కాకిరూపును బిల్లికనులు గార్ధ
భారావమును గర్కశాలాపములుఁ గీర్తి
ముఖమున కెనయగు మొగముగలుగు
చెలువవై యుద్ధంబు సేయుము గాకున్న
నీతోడఁ గడఁగి యనిని బోసంగఁ

గీ. జేయఁగాఁ జేతులాడవు కాయజాత
కామినీతులితాకృతి గలవు నాఁగ,
నగుచు శ్రీదేవి వానియాననమువంకఁ
జూచి యిట్లనెఁ దీయని సూక్తు లలర. ౭౭౬

గీ. పంచబాణహతుండవై వనఁటఁ గుందు,
మందబుద్ధివి నాతో సమరము సేయఁ
గలవె చాముండతోఁ నొండెఁ గాళితోడ
నొండెఁ బోరుము నేను బైనుండు దాన. ౭౭౭

వ. అని కాళివంక గనుంగొని యిద్దురాచారు సంహారింపుమని యాన
తిచ్చిన నావెయు గదాదండంబు కేలం గొని గిరగిరం ద్రిప్పి
వైచిన వాఁడు తదాఘాతంబు దప్పించుకొని తద్భుజాంతరంబు
గుఱిగా గదాదండంబు వైచిన నసిచేతం దునిమి. ౭౭౮

క. కుడిచేయి నఱికి వానిం
బొడిచిన వెన్నిక రుధిరపుంగాల్వలు మైఁ
దుడిచికొనుచు నావంతయు
జడియక యొకకేలఁ గడఁగి సాహసలీలన్ ౭౭౯

చ. గద గొని యామె వక్షమున గాడఁగ నేయఁగఁజూచి యల్కమై
గ్రుదురునఁ దన్భుజాంతరముగూడఁ దటాలున దు్రించెఁ గాళి; దు
ర్మదుఁడయి వాఁడునుఁ రయముమైఁ దల దన్నఁగవచ్చినంతఁ ద
త్పదయుగ ముర్విపైఁ బడఁగ వైచెఁ గరాళతరాసిఁ బెల్చునఁ.

క. కాళులు జేతులు దెగియుం
జాలింపక వాఁడు కాయజం బగుగతి న
క్కాళికపై కుఱికిన నవ
లీలం దచ్ఛిరము దూఁటలీలం దఱిగెఁ. ౬౮౧

క. మించుగతి సురలు దివి వా
యించిరి దుందుభులు పేర్మి యింపారఁగ న
ర్గించిరి విరిసోనలు వ
ర్షించిరి భయ ముడిగి సంతసించిరి మఱియుఁ. ౭౮౨

వ. హతశేషులగు రక్కసు లద్దేవికిఁ బ్రణమిల్లి యభయంబు వడసి
పాతాళమ్మునకుఁ జనిరి. ౭౮౩

క. ఇది శుంభవధ యనం జనుఁ
జదివిన వ్రాసినను విన్న జనులకు సౌఖ్య
ప్రదము సుతప్రదము జయ
ప్రదము ధనప్రదము కడుశుభప్రదము నగుఁ. ౭౮౪

వ. అన విని జనమేజయుండు మహాత్మా! మహామహిమ యగు
నప్పరశక్తి నారాధించి మఱియు ము న్నెవ్వరు వరంబులం బడసి
రనవుడు సాత్యవతేయుం డిట్లనియె. ౭౮౫

—* సురథోపాఖ్యానము *—

సీ. పుడమివేల్పులయెడఁ బున్నెంపుసేఁతయు
యజనంబు నిత్యసత్యవ్రతంబు
గంభీరభావంబు కరుణాపరత్వంబు
నీతియు నేకపత్నీవ్రతంబు
చాపకౌశలమాది సర్వశాస్త్రప్రవీ
ణత్వ మాశ్రితరక్షణంబు శుచియు
గురుభక్తి మొదలగు గుణములు గల్గు సు
రథుఁడను నొకమహారాజు మున్ను

గీ. నేల నాల్గు చెఱంగులు నేలుచుండ
నద్రివాసులుమ్లేచ్ఛు లత్యధికబలులు
కొంద ఱతనికిఁ బగతురై కొండగుహాల
నుండి తమదండుతోడ నుద్దండు లగుచు. ౭౮౬

క. తాఁకిన నాతండును దన
మూఁకలతో నెదిరి కదనమున నాయవనా
నీకమున కోడి దుర్గ
ప్రాకారముఁ జేరి మదికి వగ వాటిల్లన్. ౭౮౭

క. పగతురకుం బ్రిగడలు లో
నగుటయు దైవమ్ము తనసహాయము గామిన్
మగతనము వృథా యగుటయుఁ
దగ నాలోచించి యిట్లు దలపోసె వెసన్ ౭౮౮

శా. పాపాచారులు మంత్రు లక్కట! ననున్ వంచించి యేనాటికే
నాపాపాత్ముల బారిఁ ద్రోయుదురు సత్యం బింత యువ్వారిఁ బైఁ

గాపుం జేసి మెలంగ రాదు పిశునక్రౌర్యంబు సంబంధికృ
త్యాపాతమ్మునకుం దలంకునె ! శుచివ్యాపార మగ్గించునే !

క. తాతలుఁ దల్లులుఁ దండ్రులు
భ్రాతలు స్నేహితులుఁ చుట్టపక్కాలని తా
మేతాదృశసంబంధము
చూతురె యెందేని లోభశూరులు పుడమిన్. ౭౯౦

చ. పగతురఁ జేరి వారి సదుపాయమె చూచు ప్రధాను లెందు న
మ్మగఁ దగువారె ? యంచు గతిమత్తురగంబు నొకండు నెక్కి యొం
టిగఁ వనసీమకుం జనెఁ గడిందిగ ధైర్యముపూని యక్కటా,
జగతిఁ గుటుంబవైరము పొసంగిన నెవ్వనికార్తి గూరదే ! ౭౯౧

వ. ఇట్లు చని చిమ్మచీఁకటిఁ జీమకుం జొరరాని యయ్యరణ్యానిం
ద్రియుగగవ్యూతిమాత్రంబగు పథంబు గడచి. ౭౯౨

సీ. వలిగాడ్పు విసరు తీవల నల్లిబిల్లిగాం
చిన చెట్లు తటముల జెలఁగు నదుల
నానందముగ రజతాద్రులువోని సై
కతములఁ దిరుగు సింగములఁ బులులు
హరిణంబు లేన్గులు నాదిగ మృగములు
చదువుసంతల బ్రహ్మచారులనెడి
ప్రాఁబల్కులును హోమపక్వసీవారాన్న
గంధంబు పతితపక్వఫలములును

గీ. నింద్రియమ్ముల కెంతయు నింపునింపఁ
దగిన యొకముని యాశ్రమస్థలము గాంచి

సైంధవము నొక్క భూరుహచ్ఛాయ నునిచి
వినయమునఁ జనె నమ్మునివిభుని యెడకు. ౨౯౩

సీ. చని తపఃకృశు మృగాజిననిషణ్ణుని శాంతు
దాంతు నిర్మత్సరు ద్వంద్వరహితు
నఖిలాగమాంతరహస్య మర్మమ్ముల
నొగి శిష్యులకుఁ దెల్పుచున్నవాని
గని కుండజలవోలెఁ గన్నీరు కాల్వలై
పాఱ నమ్ముని పురోభాగమందు
సాష్టాంగ మెఱఁగి దండాకృతి నొందిన
లెమ్ము లెమ్మని ముని లేవ నెత్తి

గీ. శిష్యునొక్కరుఁ దగుమృగాజినము దేరఁ
బనిచి పఱిపించి కూర్చుండఁ బనిచి యతని
నుచితవిధిఁ బూజ సేయించి వచనరచన
శాంతి యిగురొత్త నిటు తమదంత మడిగె. ౨౯౪

క. ఎటనుండి వచ్చి తిటకుం
గటకటపడ నేమివచ్చెఁ గలతెఱఁ గెల్లన్
దటుకునఁ దెల్పుము నాచెం
గటి కరుదెంచియును వగవఁగా నీకనేలా? ౨౯౫

వ. నీ మనోవాంఛితంబు దుస్సాధంబైనను సాధింతు ననవుఁడు గద్గది
కతో నతని కతండిట్లనియె. ౨౯౬

క. సురథుఁ డనుపేరి ధరణీ
వరుఁడను శత్రులకు నోటువడి వారల దు

ష్పరిభావము కతమున మీ
చరణద్వంద్వమ్ము గొంటి శరణు మహాత్మా! ౭౯౭

క. ఇల్లా లిల్లును రాజ్యం
బెల్లరఁ దనయులను విడిచి యీ వనమున మీ
కాళ్ళఁబడి శరణుఁజెందితిఁ
దల్లియుఁ దండ్రియును నీవదైవము దేవా. ౭౯౮

వ. మీకు దాసుండనై మీ పనిచిన కార్యంబెల్లఁ జేయుచుండు నసద నగు నన్నుం గరుణించి శత్రుభయంబు వాపి నాకూర్పు వారిం గూర్పవే యని కటకటంబడు నన్నరపతి కభయం బొసంగి ముని యిట్లనియె. ౭౯౯

క. వనవృత్తిని నీవారా
శనమున శుచివగుచు హింస సలుపక నీయం
తన యాశ్రమమున విహరిం
పు నృపాల! లభించు సౌఖ్యములు నీకు నొగిఁ. ౮౦౦

వ, అను మునివచనమ్ములకు సంతసిల్లి మునివృత్తి నట వసించుచుఁ గొండొకకాలమ్మున కొక శీతలతరుచ్ఛాయ నాశ్రయించి దైవికం బగు నాపదకు వందురుచు రాజ్యపరిత్యాగమ్మును దారపుత్రవియోగంబును వైరికృత పరాభవమ్మును దలపోయుచున్నంత దీనుం డగునొక బచ్చుచోటికి వచ్చినం గని యుపవిష్టుం జేసి నీ వెవ్వండ? వేకతమ్మున నిటరాక? శోకకారణం బేమి? నావుడు నతం డతని కిట్లనియె. ౮౦౧

ఆ. వె. బచ్చుకొలమువాఁడ బహుధనవంతుఁడ
సత్యరతుఁడఁ గడుయశంబు నీసు

లేమి యీఁగి దుఃఖగామియు గల్గిన
వాఁడు నాఁగవినుతి వడయువాఁడ.

వ. ఏను ధనలుబ్ధులును నసాధులును నగు పుత్రదారాదులచే నిర
స్తుండనై యివ్వనమ్మున కేతెంచితి నా పేరు సమాధి యందురు
భవదీయోదంతంబు వినవలయు దేవర యాననంబు గాంచిన
భాగ్యవ_త్త ప్రకటం బగుచున్నయది యని వినయవినమితుం డగు
నక్కోమటికి సురథుం డిట్లనియె. ౮౦౩

క. సురథుఁ డనుపేరి ధరణీ
వరుఁడను బగతురకుఁ జిక్కువడి నీవలె దు
ర్మరణభయమ్మున నిటఁ గ్రు
మ్మరు నిర్భాగ్యుండ నిరభిమానుఁడ జడుఁడన్ ౮౦౪

వ. దైవయోగమ్మునం జేసి మన కిరువురకుం బరిచయంబు వాటిల్లె
నిఁక శోకంబు విడిచి యిట సుఖమ్ముగ వసింత మనవుడు సుర
థున కక్కోమటుం డిట్లనియె. ౮౦౫

సీ. భార్య మేన సుఖంబు వాటిల్ల దనియుఁ గు
టుంబంబు గడునిరాలంబ మనియు
నప్రయోజకులయి యాత్మజు లే నున్న
లేని యవాగువునైనఁ ద్రావి
కూడఁబెట్టిన సొమ్ము కొల్లపెట్టి దరిద్రు
లై యాపదలకుఁ బాలగుదు రనియు
మనము శాంతింపదు మానవనాథ భా
ర్యను బిల్లలను నేమరల బ్రతికియుఁ

గీ. గాంతునో లేదో యంచు దుఃఖమ్ము వార్ధి
భంగిఁ దరఁగలు గట్టి లోపల నిముడక
పొంగుచున్నది నే నేల పొలియ నంచుఁ
గడవల కొలంది కన్నీరుగాఁగ నేడ్చె. ౮౦౬

క. అని యేడ్చుకోమటిం గనుఁ
గొని సీ! ని న్నిల్లువెడలఁ గొట్టినవారిం
దనుజుల దనుజాకారులఁ
గనుఁగొనినను సుఖము నీకుఁ గల్గునె చెప్పుమా. ౮౦౭

వ. అని యేనును రాజ్యవిహీనుండఁగదా యని చింతింతు. దైవి
కమ్ము లగునాపద లనుభవమ్మునంగాని తీఱ వైనను మనమిరు
వురము నేగి యిటనున్న మునినాథుం గాంచి సవినయమ్ముగా
శోకనాశోపాయం బడిగి తెలిసికొంద మను రాజు మాటల
కక్కోమటియు వల్లెయని యతనిఁ గలిసి యమ్మునికడ కేగి
మ్రొక్కి నిలువం బడి యున్నంత సురథుండు ముని కిట్లనియె.

ఉ. బ చ్చొకఁ డీతఁ డివ్వనముపజ్జనె నాకును మిత్రుఁ డయ్యె నీ
సచ్చరితుండు దారతనుజాతులచేత నిరస్తుఁడై గడుఁ
హెచ్చినశోకవారినిధి నీఁదుచు నిమ్మభయంబు వేఁడఁగా
వచ్చినవాఁ డనాథుఁ డగువాఁడు ననుంబలెఁ గావవే మునీ.

వ. ఏనును భవదీయపాదసేవాసమాసాదితసుఖాతిశయమ్మునంజేసి
కాలంబు గడప నుంకింతు నైనను నాపద్దయిదుమలు తలం
పునకువచ్చి నిద్రాసుఖమ్ములు దూరమ్ము లగుచుండు మహాత్మా!
మ మ్మనుగ్రహించి శోకనాశోపాయం బానతీవే యను సురథు
నకు మునివరుం డిట్లనియె. ౮౧౦

గీ. హరిహరబ్రహ్మలైన మాయకుఁ దలంకి
మోహవారాశిలోపల మున్గుచుందు
మనుజమాత్రులు మీర లామాయఁ గడచి
యుండనేర్తురె మోహంబు గం డడంచి. ౮౧౧

వ. ఇందుల కొక్క యితిహాసంబు దెల్పెద నాలకింపుఁడు ; కృత యుగమ్మున నారాయణుండు సితద్వీపమ్మున ననేక దివ్యవత్సర మ్ములు దపం బొనరించుచున్నంత నచ్చోటన విరించియు మోహ నివృత్తికై తపంబు సేయుచుండె నిట్లు కొంతకాలమ్ము కడచిన పిదప నిరువురు నత్తావు వదలి చనుదెంచుచు నొక్కయెడఁ దార సిల్లి పరస్పర జిజ్ఞాసంజేసి యీవెవ్వం డీవెవ్వండ వని యడిగి కొని రందు విరించి చరాచరాత్మకం బగు జగమ్మంతయు నిర్వ ర్తించినవాఁడ ననుడు నారాయణుం డతని కిట్లనియె. ౮౧౨

—* భువనసుందరీ మాహాత్మ్యము *—

శా. ఏనాఁటం జగమెల్లఁ జేసితిని నేనే యంచు నాయొద్ద నీ
వీనాఁ పుణ్యము గట్టిపెట్టుము బలే! యీవెంత! యీసర్వముల్
నానిర్మించినవిశ్వ మచ్యుతుఁడ నే; నాఁ డామధుల్ గైటభుల్
ప్రాణాపేతులఁ జేసి నిన్నరసి సంరక్షించుటల్ వోయెనే!

గీ. రాజసుఁడ వేల యింతగర్వమ్ము నీకు
నిన్నుఁ గని పెంచి దానవానీక మనికిఁ
గడఁగిపోదువంగ వారిధాకలకుఁ గొంకు
లైనఁ దలఁపక యిటుపల్క నగునె మూర్ఖ. ౭౧౪

చ. అనిన విరించి యిట్లనియె సౌర! సుఖాతులతోడఁ బోరునాఁ
డెనసి పరాంబ తోడ్పడగుట యింపుకథుం దెలియుంగ రాదె! యీ

యనువునఁబల్క నీకు నెటులాడెడి నాలుక, యిట్టులిద్దఱుం
బనిఁగొని వాదుసల్పఁ గనవచ్చెను లింగ మొకండు వారికిన్.

క. ఓనారాయణ ! యోచతు
రానన ! మీరిరువురుఁ గలహము మాని వినుం
డేనొకపల్కు వచించెదఁ
బూనికమైఁ పక్షపాతమును గనకుండన్. ౨౧౬

వ. ఈ ద్వీపమ్మున నిపు డుద్భవించిన యీ మహాలింగమ్మున కగ్ర
మ్మొక్కండును నాదియొక్కండును జూచి రయమ్మున నెవ్వఁ
డరుదెంచు వాఁడు మీ యిరువురం దధికుండు నావుడు వల్లె యని
హరి పాతాళమ్మునకును విరించి యాకాశమ్మునకును జని రందు,

మ. హరి పాతాళము నేగియేగియును లింగాదిన్ విలోకింప శ
క్యరణిం గాంతునటంచుఁ జింత గొనె ; నక్కంజాసనుండుం దదం
బరవీథిం బడి యేగి లింగమునకుం బారంబుఁ బోరామి ను
ద్ధురలజ్జాధికశోక దైన్యముల లోఁతుం గాంచి యత్రాడుచున్.

వ. ఒక్కచో నుపవిష్టుండై దైవికమ్ముగాఁ దదీయశిరమ్మునుండి
భూమిపయిం బడు నొక్క మొగలిపూవుం గాంచి దానిం బరిగ్ర
హించి సంతసమ్మున నయ్యసురాంతకుపాలికిం జని యేను లింగా
గ్రంబు గాంచి యచ్చట నున్న మొగలిదళంబు గొనివచ్చితినని
చూపిన హరి యక్కేతకి కిట్లనియె. ౨౧౯

క. నిజముగ లింగశిరం బీ
యజుఁడు గనుంగొనెనె ? నీవు నచ్చోట సుర
వ్రజపూజితమవె ? నావుడు
నిజ మని యమ్మొగలిపూ వనృతము వచించెన్. ౨౨౦

వ. హరియును దానిపలుకు విశ్వసింపక లోకంబునం గొందఱు ధనా శం జేసి కూటసాక్ష్యం బిత్తురని పలికి యివ్విషయమ్మున నాకు మహా దేవుండ ప్రమాణం బనినఁ దిరోహితుం డగుచు శివుం డతని కిట్లనియె.

గీ. అనృతవాదిని కేతకి యకట ! నాదు
మ స్తకమునుండి పడుచు నమ్మార్గమధ్య
మందుఁ గంటఁ బడఁగఁ జతురాననుండు
చేతఁ గొనివచ్చెఁగాని మచ్చిరముఁ గనఁడు. ౮౨౨

వ. అని పలికి కోపమ్మునఁ గేతకిం గాంచి యనృతం బాడితివిగాన నిది మొదలు నాకుఁ బూజింపఁదగవని శపించెఁ బిదప వారిరు వురును యథేచ్ఛఁ జనిరి. ౮౨౩

క. కావున మోహము జగమున
నేవారును దాఁటలేరు నృపవర ! మిగులన్
బ్రావీణ్యము కలవారి మ
నోవృత్తులనైన మాయ నూల్కొనఁజేయున్. ౮౨౪

గీ. అట్టిమాయకు లోనుగా కంబ యొకతె
సర్వమును సృష్టిఁజేసి రక్షణ మొనర్చి
లయము గావించు నాయంబ లక్షణములు
తెలిసికొన్నను మోహవార్ధినిఁ దరించు. ౮౨౫

వ. నావుడు సురథుండు తల్లక్షణంబు నెఱింగింపు మనుడు.

సీ. రాజేంద్ర ! విను శుభప్రదమును గామద
మును నగు నంబికాపూజ చొప్ప

నియతేంద్రియుఁడయి మునీఁగి తెల్లనిమడుంగు
గట్టి వార్చియు శుభాగారమందు
గోమయలిప్తమై గోముఖాలంకృత
మై యొప్పుగను మంటపాంతరమునఁ
దనశక్తి కొలఁది నెంతయుఁ బూజకై తగు
ద్రవ్యమ్ములను గొని భవ్యరీతి

గీ. ధరణి నాత్మను గాలంబుదగ విశుద్ధి
చేసి చిత్తంబు శుద్ధంబు చేసి పిదపఁ
దామ్రమయ మగు నొక్కపాత్రమ్మునందు
ద్విజులతోఁ గూడ వేదచోదితముగాఁగ. ౮౨౬

వ. షట్కోణం బగుయంత్రమ్ము లిఖయించి దాని కెలన నష్టకోణ యంత్రమ్ము నాసాదించి పదంపడి నవాక్షరమంత్రబీజమ్ములు యథాన్యాసమ్ముగా వ్రాసి ప్రాణప్రతిష్ఠ యొనర్చి షోడశోప చారమ్ములం బూజించి శక్త్యనుసారమ్మునఁ దన్మంత్రజపం బొనర్చి తజ్జపసంఖ్యాదశాంశమ్మున హోమమ్మును దద్దశాంశ మ్మున దర్పణమ్మును దద్దశాంశమ్మున బ్రాహ్మణభోజనమ్మును గావించి చరిత్రత్రయపాఠం బొనరించి విసర్జింప వలయునని చెప్పి వెండియు. ౮౨౭

క. సువ్రతు లగువారికి ని
త్యవ్రత మాశ్వయుజమాసమందు న్నవరా
త్రవ్రత మది సెప్పద విబు
ధవ్రజమతముగ నిది విని తనియుఁడు మీరల్. ౮౨౮

వ. ఆశ్వయుజ చైత్రమాసమ్ము లను నీరెంట నాది యాదిగ నవ రాత్రమ్ములు జితాహారుండై జప్యమంత్రమ్ములచే శర్కరామధు

ఘృతయుతమ్మగు పాయసమ్ముననొండె ఛాగమాంసమ్ముననొండె బిల్వపత్రమ్ములనొండె హోమంబు గావించి ద్విజభోజనం బొనర్చిన వారికి నొకండన నేల సమస్త కామమ్ములును గరతలామలకమ్ములగు నిందుజాతిభేదంబును స్త్రీపుంసభేదమ్మును నకించిత్కరమ్ములు విధిచోదితంబుగ నెవ్వండేని మండలం బొనరించి పుష్పమాలాలంకృతం బగువితానంబు సంధించి కలశస్థాపనం బొనర్చి యంత్రప్రతిష్ఠిత యగునద్దేవిని త్రికాలమ్ములయందు ధూపదీపాదికమ్మున నర్చించుచు గీతాదికమ్ములును వేదపారాయణంబులును విస్తరింపఁ జేయుచు యదామతి యథాశక్తిగ విత్తశాఠ్యంబొనరింపక సుగంధతైలచందనభూషణాదులచేఁ గన్యకల నర్చించుచు నవరాత్రమ్ములు గడపి ద్విజభోజనపురస్కారమ్ముగా దశమీదినమ్మునఁ బారణం బొనర్చి క్రతుసమాప్తి గాంచిన వాఁ డుత్తమలోకమ్మున కేగి దేవిసాయుజ్యమ్ము గాంచు నని వెండియు, ౮౨౯

క. నవరాత్రవ్రతమున కెన
యవువ్రతము మఱొండు గాన మవనీశ్వర ! యీ
యవనిఁ బంధుల నందఱ
నవశ్య మందెదవు దేవి నర్చింపు మిటుల్. ౮౩౦

వ. అని సమాధిం గాంచి. ౮౩౧

క. ఓ వైశ్యోత్తమ ! నీవును
గావింపుము దేవిపూజ, క్రమముగ నీదుః
ఖావేశమడంగుచు ధని
వై వర్ధిల్లెద వటంచు నానతి యీఁగన్ ౮౩౨

వ. వారలిరువురును హర్షోత్ఫుల్ల లోచనులై మొక్కి దేవరదర్శనంబునఁజేసి యస్మత్తాపంబు వాసె ధన్యుల మయ్యెద మమ్మం

త్రరాజం బుపదేశింపవే యనుఁడు ధ్యానబీజపురస్సరమ్ముగా నవాక్షర మంత్రమ్ముపదేశించిన మునిపతి కెఱఁగి చని యొక్కనదీతీరమ్మున విజనప్రదేశంబు నాశ్రయించి శుష్కపర్ణాశను లగుచు రెండు వత్సరమ్ములు జపించి నంత నొక్కనాఁడు స్వప్నమ్మున రక్తాంబరధారిణియైదేవి పొడగట్టినం గాంచియుఁ దపంబు చాలింపక తృతీయవత్సరం బంతయు జలాహారంబుగఁ గడపి పదంపడి దేవీసాక్షాద్దర్శనంబు గానక. ౨౩౩

మ. ఒకకుండమ్మును ద్రవ్వి పావకుని నందూర్ధ్వాత్ముఁ గావించి పాయక దేహంబు త్యజింపఁగాఁ దెగువ సేయంబూని మాంసంబు పావకునందుం దెగఁ గోసి హోమమొనరింపన్ దాన శ్రీదేవి యయ్యకలంకాత్ములకుం గనంబడియె ధ్యేయాకార మేపారఁగన్.

వ. ఇట్లు చూపట్టి మీసాహసంబువలన నేను బ్రసన్ననైతి వరంబు గోరుఁ డనవుడు సురథుం డి ట్లనియె. ౨౩౫

మ. జననీ! మార్తురచేతఁ జిక్కువడి రాజ్యం బేది యీకాననంబున నిన్నాళ్లు వసించి నాదు వితతంపుంబుణ్యముంజేసి నీ మనురాజంబు జపించి నీకరుణ సమ్మానంబు గైకొంటిఁ గావున నాతొల్లిటిరాజ్య మిచ్చి యశుభంబుల్ వాపుమా నావుడున్

సీ. పగతురు నీచేతఁ బడుదురు బల మేది
నీమంత్రులెల్లరు నిన్నుఁగొల్వ
నేతెంతు రీవు నీయిల వేయి సంవత్స
రములు మహాప్రభవమున నేలఁ
గల వింటి కేగుము కళ్యాణములు సమ
కూరుకాలము నీకుఁ జేరువయ్యె

నని యంబ సెలవీఁగ నవనీపతియు ముద
మంది తొల్లింటిహాయమ్ము నెక్కి

గీ. పగతురను గొట్టి పృథివి చేపట్టి మంత్రి
వరులతోఁ గూడ రాజ్య మవార్యలీలఁ
బాలనమొనర్చి వేయిసంవత్సరమ్ము
లుండి తుది దేవదేవిసాయుజ్య మందె. ౮౩౭

వ. కోమటియు నాపె కెఱఁగి యిట్లనియె. ౮౩౮

క. తల్లీ! ధనధాన్యమ్ముల
నొల్లక వేఱొండునొల్ల నుల్లాసములం
దెల్లను నశింప నేరని
యుల్లాసము గోరువాఁడ నుల్లము దనియన్

వ. అనిన దేవియు నతనికి దివ్యజ్ఞానం బొసంగి యంతర్ధానంబు చేసెఁ బదంపడి వాఁడును తీర్థాటనాదిపుణ్యకార్యమ్ములచేఁ గాలయాపనం బొనర్చి ముక్తసంగుఁడై తుదకు దత్సాయుజ్యంబు వడసె నియ్యది భూపవైశ్యుల చరితంబు దేవ్యారాధనఫల ప్రాప్తిదృష్టాంతంబు దీనిం జదివినను విన్నను బురుషార్థమ్ములు గలుగు నని వ్యాసుండు జనమేజయునకుం జెప్పిన ట్లకథకుండు మునులకుం జెప్పుటయు.

క. కడిమెద్దపురవిరాజిత!
మృడపాదాంభోజచంచరీకహృదయ! ద్రా
విడశాఖాభూషాయిత!
జడవిజ్ఞానప్రదాన! శాస్త్రనిదానా! ౮౪౧

క. నానాతీర్థాటనసం
ధానాపారాన్న దానతతవిద్యాదా
నానూనపుణ్యసంభృత
మానాతీతోరుకీర్తి ! మద్గురుమూర్తీ ! ౨౪౨

—* భుజంగప్రయాతము *—

సదానందచిత్తా ! పరిశస్త్రార్థవేత్తా !
వదాన్యాగ్రివర్తీ ! శుభఖ్యాతకీర్తీ !
పదాలంబిభూపా ! కృపాధూతపాపా !
నిదాఘార్కకాంతీ ! మునిశ్లాఘ్యశాంతీ ! ౨౪౩

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం బయిన దేవీభాగవతం
బను మహాపురాణమ్మునందుఁ బంచమ స్కంధము
సంపూర్ణము. శ్రీ శ్రీ శ్రీ





శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ

# దేవీభాగవతము



## షష్ఠస్కంధము





విమలతరహృదయ సర్వో
త్తమచిత్రచరిత్ర శాస్త్రతత్త్వజ్ఞ కలా
ర్థి మహిత సుమహిత సతత
భ్రమరహిత మనోజ్ఞమూర్తి బ్రహ్మయశాస్త్రీ.

వ. అవధరింపు మనంతరంబ శౌనకాదులు సూతుంగాంచి. ౧

గీ. పరమవిజ్ఞానియైన ద్వైపాయనమునిఁ
గొలిచి శ్రమచేసి విద్యలఁ గొంటి వనఘ

